# భాషా చారిత్రక



తూమాటి దొణ
ఆంధ్ర విశ్వవిద్యాలయం :





ఆంధ్ర సారస్వత
తిలక్ రోడ్ :: హైద

# ారిత్రక వ్యాసావళి







మా టి దొ ఱ ప్ప
విశ్వవిద్యాలయం : వాల్తేరు





సారస్వత పరిషత్తు
డ్ : : హైదరాబాదు.

# భాషా చారిత్రక వ్యాసావళి





తూమాటి దోణప్ప
ఆంధ్ర విశ్వవిద్యాలయం : వాల్తేరు



ఆంధ్ర సారస్వత పరిషత్తు
తిలక్ రోడ్ : : హైదరాబాదు.



# అంకితము

ఆంధ్ర సారస్వత పరిష దుపాధ్యక్షులు,
ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ ప్రధాన కార్యదర్శి,
ఉస్మానియా విశ్వవిద్యాలయ సిండికేట్ సభ్యులు,
ఉత్తమ సాహిత్య సత్యవ్రతులు,
దీక్షా దక్షతలు,
సౌహార్ద మార్దవములు
రూపెత్తిన
మాన్య మిత్రులు

## శ్రీ దేవులపల్లి రామానుజరావు గారికి

# వి జ్ఞ ప్తి

ఆంధ్ర సారస్వత పరిషత్తు లక్ష్యములలో పండిత సారస్వత, ప్రజా సారస్వత, బాల సారస్వతములను విద్వాంసులచే వ్రాయించి ప్రకటించుట ముఖ్యమైనది. ఆ వరుసలో సుప్రసిద్ధ పరిశోధక పండితులైన డా. తూమాటి దొణప్పగారి 'భాషా చారిత్రక వ్యాసావళి' ని పండిత సారస్వతముగా ప్రచురించుచున్నాము.

డాక్టర్ తూమాటి దొణప్ప గారు ఆంధ్ర విశ్వవిద్యాలయములో ప్రొఫెసరుగా పనిచేయుచున్న ప్రసిద్ధ భాషావేత్తలు. వీరు తెలుగు భాషా చరిత్రకు సంబంధించిన అమూల్యములైన వ్యాసములను భారతి, సాహితి, ఆంధ్రప్రదేశ్ మొదలైన పత్రికలలో చాల ప్రకటించినారు. వీరి వ్యాసములన్నియు భాషాస్వరూపమును తెలిసికొనగోరు జిజ్ఞాసువులకు పరమప్రయోజనకరములని వేరుగా చెప్పనక్కర లేదు. ఆంధ్రదేశమున భాషాశాస్త్రమును మథించిన విద్వాంసులు చాల కొద్దిమంది మాత్రమే కలరు. వారిలో డా. దొణప్పగారు ప్రథమ గణ్యులు.

ఈ సంపుటియందు వారి 'నన్నయ్య-అన్యదేశ్యాభాసములు', 'శ్రీనాథ యుగము–అన్యదేశ్యములు', 'ఆంధ్రభాష–హకారాది పదములు', 'తెలుగులో బుడతకీచు నుడులు', 'మరాఠీలోని తెలుగు నుడులు', 'తెలుగునందలి కృతకప్రామాణిక రూపములు' అను వ్యాసములు వారి పరిశోధనాపాటవమునకు నికషాయమాణములు. వారికి గల బహుభాషాపాండిత్యమునకు ఈ వ్యాససంపుటి ఉచిత నిదర్శనము.

కోరిన వెంటనే విలువగల తమ వ్యాసములను ప్రకటించుటకనుమతించి యిచ్చిన డాక్టర్ తూమాటి దొణప్ప గారికి కృతజ్ఞతలు తెల్పుకొనుచున్నాము. ప్రత్యేక దృష్టితో ఉత్తమ గ్రంథములను ప్రచురించుచున్న పరిషత్తునకు ఆంధ్ర పాఠకలోకము సంపూర్ణముగ సహకరించి చేయూత నొసగగలదని ఆశించుచున్నాము.

గడియారం రామకృష్ణశర్మ
ప్రధాన కార్యదర్శి.

# తొలిపలుకు

శబ్ద స్వరూప నిరూపణము భాషా విజ్ఞానములో ఒక భాగము. ఈ ఏకదేశమునకు రేఖామాత్రముగా చిత్రించు వ్యాససంపుటి 'భాషా చారిత్రక వ్యాసావళి'. తెలుగునందలి దేశ్యేతర పదజాలము అట్టుపుట్టానవాళ్లను నిర్ణయించుటకు చేసిన పరిశ్రమమునకు ఫల మీ సంపుటియందలి ముఖ్యవ్యాసములు.

అప్పుడప్పుడు వివిధ పత్రికలలో ప్రకటితములైన నా వ్యాసములు చెల్లాచెదరుగా నుండుటను చూచిన సహవ్రతులగు మిత్రులు కొందఱు వానిని పుస్తకరూపమున సంగ్రథనము సేయుట ఆవశ్యకమని సూచించుచు వచ్చిరి. ఎప్పటికప్పుడు ఏవేవో చిక్కులు వచ్చిపడుట వలన ఆ సూచన కార్యరూపమును దాల్చుట కింతకాలము పట్టినది.

ఇవి సామాన్యులకొఱకు ఉద్దేశింపఁబడినవి కావు. వీని పరిమిత ప్రయోజనములు వేఱు, ప్రజాసారస్వముతోపాటు పండిత సారస్వతమును ప్రచురించుట ధ్యేయముగాఁ గలిగిన హైదరాబాదు ఆంధ్ర సారస్వత పరిషత్తువారు ఈ సంపుటిని తమ ప్రచురణముగా ముద్రింతుమని ముందునకు వచ్చిరి.

వీనిని ఉన్నవి ఉన్నట్లుగా అచ్చునకిచ్చితిని. పత్రికలలో వచ్చిన అచ్చుతప్పులతోపాటు క్రొత్తవి కొన్ని ఈ సంపుటిలో వచ్చి చేరినవి. ప్రెస్సొకచోట, దూరముగా నే నొకచోట ఉండుటవలన ప్రూఫులు సరి చూచికొనుటకు వలనుపడినది కాదు. అచ్చుతప్పులను, అసలుతప్పులను పాఠకులు అవలీలగా గుర్తింపఁగలరని నా నమ్మకము.

కృతి స్వీకృతి కంగీకరించిన శ్రీ దేవులపల్లి రామానుజరావు గారికి, ప్రచురణకర్తలగు ఆంధ్ర సారస్వత పరిషత్తువారికి, పరిషత్కార్యదర్శి శ్రీ గడియారం రామకృష్ణ శర్మగారికి, సాహితీ ముద్రణాలయము వారికి, కొంతవరకు ప్రూఫులుచూసిన ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రాచ్యవిద్యాకళాశాల ప్రాధ్యాపకులు శ్రీ కే. కే. రంగనాథాచార్యులు గారికి కృతజ్ఞతాభివందనములు.

వాల్తేరు,
5-11-72.

తూమాటి దొణప్ప.

# విషయసూచిక





# 'నన్నికవిద్వయము' —
# అన్యదేశ్యాభాసములు

'గుఱు తెఱింగి వస్తు చయమున
కొఱగెడు నా దీపవర్తియును బోలె నిజ
మ్మెఱింగి కృతివస్తు సమితికి
వఱలఁగ మదినెఱుఁగు విబుధవర్గముఁ దలఁతున్'
—నన్నెచోడుని కుమారసంభవము, (1) 1-26

శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు "సత్కవిరాజోక్త కుమార సంభవ మహాకావ్యంబు" న అంతరములగు కొన్ని ఆధారముల మూలమున నన్నెచోడకవి కాలమును నిర్ణయముసేయ సమకట్టుట ప్రశస్త ప్రయత్నము. అందులో నన్నెచోడకవి ప్రయుక్తపద సంబంధి చర్చయొక భాగము (2). కాని, ఈ చర్చారీతి శాస్త్రీయ పద్ధతులలో సాఁగనందున వారి ఉద్యమము నిర్దిష్టార్థ సాధకము కాకపోయినది. కైపు, తరవారి, బాఁకు—ఈ మూఁడు పదము

---

1. పరిశీలించిన కుమారసంభవప్రతులు :
   i. మానవల్లివారి ప్రతి :
   మొదటి భాగము, వేపేరి, టి. వి. చెంగల్వరాయ నాయకర్ ఆర్ఫనేజ్, ముద్రాక్షరశాల చెన్నపట్టణము. 1909.
   రెండవ భాగము, జ్యోతిష్మతీ ముద్రాక్షరశాల, చెన్నపురి, 1914.
   ii. మదరాసు విశ్వవిద్యాలయ ప్రతి, శ్రీకోరాడ రామకృష్ణయ్య సంపాదితము, 1948.
   iii. వావిళ్ళవారి ప్రతులు, 1953, 1961 ముద్రణలు.
2. 'నన్నెచోడుఁడు తురుష్కులు అనఁగా అల్లాయుద్దీను, మాలిక్ కాఫర్ మొదలైన వారిదండ యాత్రలకు అనంతరుఁడా ముందువాఁడా యను ప్రశ్నకు అనంతరుఁ దేమోయని అతఁడు ప్రయోగించిన కొన్ని పదములచే తోఁచుచున్నది. అది (1) బాఁకు, (2) కైపు, (3) తరవారి (శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి, ఎం. ఏ. గారి "నన్నెచోడుని కవిత్వము", ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీవారి బహుమతినందిన గ్రంథము, మదరాసు, 1959; పుటలు 91, 92).

లను అన్యదేశ్యములను భావనతో వారు తమ చర్చను ఎత్తుగడ చేసి "మజీ యిది (కైపు) పూర్తిగా ఆంధ్రదేశీయమా లేక తురుష్కులయనంతరము మన భాషలోనికి వచ్చినదా యనునదే ప్రశ్న" (3). అను అస్తినాస్తి విచికిత్సలోపడి, "వీనిని (కైపు, బాకులను) త్రోసి పుచ్చినను తరవారి శబ్దమును ప్రయోగించిన యొక పద్యము అల్లావుద్దీను చక్రవర్తిని గూర్చిన శ్లోకమును స్మరింపఁ జేయుట చిత్రము" (4) అని కొంత కొన సాగించి, చివరచివరకు "పైపదములు అన్యదేశ్యములైనను కాకపోయినను, నన్నెచోడుని కాలము తారీఖులతో కుదరకపోయినను, కాకతీయ సామ్రాజ్య పతనమునకు మాత్రము చాలముందేయని తోఁచుచున్నది" (5) అని అసలు ప్రతిపాదనమును నవనవగా జారవిడిచిరి. శ్రీశాస్త్రిగారు ఇదమిత్థమ్మని నిర్ధారింప లేక ఇట్లు అర్థాంతరముగా వదలిన దుర్బల వాదమును పూజ్యులు శ్రీ దేవరపల్లి వేంకట కృష్ణారెడ్డిగారు చేపట్టి, (6) పూర్వోక్త పదములను అన్యదేశ్యములని అవిమర్శముగా అంగీకరించి, వానిని సమర్థించుటలో పోయిన పోకలు సరిగా లేవని నిరూపించుటకు ఈవ్యాసము దిష్టము.

నన్నెచోడునితో పాటు అథర్వణుఁడును నన్నయకు సమకాలికుఁడనిగదా శ్రీరెడ్డిగారి దృఢవ్రతము. అన్యదేశ్యప్రయుక్తిచే నన్నెచోడుని యొక్కయు, 'అన్యదేశీయ" పదప్రయుక్తిచే అథర్వణుని యొక్కయు అర్వాక్కాలికత స్థాపితమగునేమో యని వారి అదుర్దా. స్వపక్ష స్థాపనాభినివేశముతో శ్రీ రెడ్డిగారు నన్నయకృతిలో కూడ అన్యదేశ్యములు ప్రయుక్తములయినవని నిరూపింప యత్నించుట ఆకాశమున మూరలు వేయుట. నన్నయ భారతమున "గాడీ" అను "తురుష్క" భాషాపదము ప్రయుక్తమయినదను వీరి ప్రతిపాదనము దీని ఫలము. "క్రీ. శ. 11 వ శతాబ్దములో అథర్వణాచార్యులు చెప్పినట్లు అన్యదేశీయపదము నింద్యము కాదనుటకు 'గాడి'. 'తరవారి', "కైఁపు", 'బాఁకు'

---

3. పైది, పు. 94.

4. పైది, పు. 95

5. పైది, పు. 97. 6. శ్రీ దేవరపల్లి వేంకట కృష్ణారెడ్డిగారి 'వేంకటాదిత్యకవి'. వేంకటగ్రంథమాల, ఉలవపాడు, నెల్లూరుజిల్లా, 1960. పుటలు 76-83.

అను నన్ని కవిద్వయ ప్రయోగములు గలవు" (7) అను శ్రీ రెడ్డిగారి మతము సూరిజన సమ్మతము కాదు, అయినను అన్యదేశ్యములను వాడి తీరవలెనను నిర్బంధము కవులకులేదుకదా! వీనిని పరిహరించి కవితచెప్పిన ఆధునికులెందఱో కలరు. కావున. అన్యదేశ్యములను వాడ నంత మాత్రమున ప్రాచీనులనుట కుదురదు: వాడినవారు అర్వాచీనులు కారనుట అసలే అదుకదు. "తెనుగు భారతములో "తురక' జాతి అన్యదేశీయ పదమును (తురుష్కగా) సంస్కృతీకరించి ప్రయోగించినప్పుడు లేని దోషము ఆ తురష్కభాషయందలి "గాడీలు" అను అన్యదేశీయ శబ్దమును శబ్దశాసనుఁడు ప్రయోగించుటలో దోషము కలదా" (8) అని రెడిగారి ఎదురుసవాలు. భాష పరంపరీణము, పరిణామ శీలము కావున అన్యదేశ్య పదప్రయోగపద్ధతి దోషజుష్టమని రసప్రబుద్ధులు భావింపరు (9). మహాకవి ప్రయుక్తమయినచో కన్నులకద్దుకొనమా? అసలిట్టి అన్యదేశ్యములు నానా రుచిరార్థ సూక్తినిధియగు నన్నయభట్టు రచనలో ఉపయుక్తము కాలేదని పండిత పరిశీలకుల సిద్ధాంతము (10). కాని, శ్రీ వేంకట కృష్ణారెడ్డిగారి సవాలులో రెండుదోషము లున్నవి, ఒకటి ; జాతివాచకమగు 'తురుక' పదమును నన్నయ 'తురుష్కగా' సంస్కృతీకరించెననుట. రెండు 'గాడీలు' తురుష్కభాషాపదమనుట. 'తురక' ను 'తురుష్క' గా నన్నయ సంస్కృతీకరింపలేదు రాజతరంగిణి (క్రీ. శ. 1129-1150), కథాసరిత్సాగర (క్రీ శ. 1029-1064), బృహత్సంహిత (క్రీ. శ. 6 వ శతాబ్దము) 'సుశ్రుత సంహిత, మున్నగు గీర్వాణ గ్రంథములలో 'తురుష్క' పదము హెరాళముగా ప్రయుక్తము. కప్పసుత్తం, సమవాయంగసుత్తం (క్రీ, పూ. 300) మొదలగు ప్రాకృత భాషాకృతులయందు మూలరూపములగు తురుక్క', 'తురుక్కి' పదములు జాతి పర

7. పైది, పు 83. 8. పైది, పు 79.

9. i. 'క్షితిమ్లేచ్ఛ భాషశ్రుతిగ
స్థితమగునట్లైన నా ధరిత్రివి దానిన్
మతిరోపి విడువఁగూడదు
సతతము వ్యవహార హాని సంధిలు కతనన్' (అప్పకవీయము 1-66)

ii. "అహేయ మన్యదేశీయం యత్తదేవ ప్రయుజ్యతే' (వికృతి వివేకము. సంజ్ఞా, కారిక, 9).

iii. 'ఈ 'తురక' మాటలు అపరిహార్యములు, సరసకవితకు ఆలంబనములు' బాలకవి శరణ్యం పు. 227.).

ముగాఁ గన్పట్టుచున్నవి. 'గాడీ' 'తురుక' పదము కానేకాదు; అరబ్బీ మాట అంతకంటె కాదు. దీని పుట్టు పెంపకములు వేఱు. ఈ తీఱు తెన్నులు వక్ష్యమాణము(11).

నన్నయ భారతములోని 'ఏ నూఱుగాడిదలను' అనుపాఠమే కవిహృదయము. ఈయంశము సూర్యరాయాంధ్ర నిఘంటువున స్పష్టముగా నిరూపితము. ఇట్టిచో 'దూషితకుతర్కవాదులగు శ్రీరెడ్డిగారు 'భాషాకటాక్ష విభ్రమము నా మెఱుఁగారు సదమల శబ్దార్థ శాస్త్రములను' చిన్న చూపు చూచి, పరాస్తమయిన "గాడీలు' అను నడుమంత్రపు పాఠమును పునరుద్ధరింప నడుముకట్టుట సాహితీ తత్త్వ జిజ్ఞాసువుల దురదృష్టము. "గ్రంథాంతరంగిక ప్రమాణములు రెంటిలో భాషావాద చరిత్రను మాత్రమే నమ్మి గణితకవి దేశకాలాది చరిత్రను నమ్మ కూడదనుట పక్షపాత సిద్ధాంతమేకాని, నిష్పాక్షిక సిద్ధాంతము కాఁజాలదు" (12) అని రెడ్డిగారి వితర్కము. యథేచ్ఛసి తథాస్తు ! అట్లని "భాషాచరిత్ర కల్పిత" (13) మనుట విపరీత ప్రతిభాష. భాషాపరిణామరీతులను ప్రాయికముగా ఒక నిర్ణీతరీతిని అనుసరించునని చెప్పవచ్చినది. భాషాచరిత్రకు ప్రబలాధారము గ్రంథస్థమయిన వాస్తవ ప్రయోగపఙ్క్తి. వ్యంగ్య గణితాదుల చరిత్రకు ప్రత్యక్ష

---

10. "నన్నయ కాలమునకుఁ దురుష్కులయు నాంగ్లేయులయు భాషలు తెల్గునఁ బ్రవేశించుట కవకాశము లేకుండుటచేత నన్నయ చింతామణిలో నన్యదేశ్యమును పేర్కొనలేదు. తన భారతమునఁ బ్రయోగింపనులేదు. యయాతి చరిత్రమను చరిత్రాదులలో నన్యదేశ్య (తురుష్క) శబ్దములు ధారాళముగా వాడఁబడినవి. కాన నేఁటి వ్యాకరణములలో నన్యదేశ్యము నొక భాగముగా నంగీకరించుట యుక్తము" - కళాప్రపూర్ణ వజ్ఝల చినసీతారామస్వామి శాస్త్రిగారి బాల వ్యాకరణోద్ద్యోతము, సంజ్ఞా సూ. 3, పు. 10, మూలతత్త్వ మిట్లున్నదని యెఱిగియు శ్రీ వజ్ఝలవారు తమ బాలవ్యాకరణోద్ద్యోత పీఠికలో అన్యదేశ్యప్రసక్తిలో విమర్శక మర్యాదల నతిక్రమించి స్వవచో వ్యాఘాతముగా ప్రసంగము నడుపుట శోచనీయము. "అలంతి' విజ్ఞులు వెలిబుచ్చిన అభిప్రాయములను 'సత్యవిదూరము' లను దబాయింపులతో గాక సహేతుకములును, శాస్త్రీయములునునగు సమాధానములిచ్చి సత్యావిష్కరణ మొనర్చుట 'వలంతి' విజ్ఞుల ధర్మము.

11. వివరణకు ; ఈ పరంపరలోని ద్వితీయవ్యాసమును చూడ వేఁడికోలు.

12. తెంకణాదిత్యకవి, పు. 103. 13. పైది, పు. 106.

సాక్ష్యము మృగ్యము; అనుమాన ప్రమాణము గౌణపక్షము. అందును, ఈ అనుమానమున కాధారములు ఆభాసమాత్రములు. హేత్వాభాసము తత్త్వాన్వేషణమున దుర్బల మనివేత్తల మతము. "గ్రంథాంతరంగిక వ్యంగ్యగణిత చరిత్రకంటె తద్గ్రంథాంతరంగిక భాషాప్రయోగములు ప్రబల ప్రమాణములు కావు" (14) అను రెడ్డిగారి నిర్ణయముపై వ్యాఖ్యాన మనావశ్యము. గణితప్రాధాన్య వాద పక్షపాతము కలదగుటచే ఇది పక్షాభాసము. అయినను తమ నిర్ణయమును సోపపత్తికముగా నిరూపించు భారము అఖిల విద్యానిపుణులగు శ్రీ రెడ్డిగారిది. గణితశాస్త్రమును తప్పనుట సాహసము; సమన్వయక్రమము శాస్త్రీయమా, కాదా అనునదే చర్చ. తెంకణాదిత్యకవి తన కాలాదికములను భంగ్యంతరముగా సూచించెనను ప్రతిపాదనమునకు కేవలముఊహయే ఆధారము. ఉత్తమప్రతిభులగు శ్రీ రెడ్డిగారి ఊహాదోహలమునకీ వ్యంగ్య గణిత సమన్వయము ఉదాత్తమయిన తార్కాణము. నన్నెచోడుని దైవజ్ఞగణిత సూచనలలో వ్యంగ్య వైభవము ఉండవచ్చు; ఉండకపోవచ్చు. దీని బాగోగులు ప్రస్తుత చర్చలో అప్రసక్తము. అన్యత్ర నన్నెచోడుని కాలము "ఫలానా' యని స్పష్టముగా స్థాపితమయినపుడు ఈ భంగ్యంతర సూచనలు ప్రధాన ప్రతిపాదనమునకు ప్రోద్బలకముగు ఉపలక్ష్యములు కాఁగలవు గాని, స్వయముగా కవికాలనిర్ణయ సమర్థములు కానేరవు. అది విషయాంతరము.

"కొన్ని దేశ్యములకు సదృశములు పారసీభాషలో కనఁబడుట వింత. ఉదా : బావి–బావులీ–దిగ్గియ దీర్ఘిక యని యర్థము'' (15) శ్రీ వేంకట రాయ శాస్త్రిగారి ఈ ప్రతిపాదనలోని తాత్పర్యమేమో దురూహము. తెలుఁగున 'బావి' దేశ్యము, కాదు; తద్భవము. ప్రాచీను లెవరును దీనిని దేశ్యముగా పేర్కొనలేదు; ఏ ప్రామాణిక నిఘంటువునను ఈ సూచనలేదు. సంస్కృతము నందలి "వాపీ" పదము, ప్రాకృతముల "వావీ' యయి, తెలుఁగునకుగల ప్రాకృతభాషా సాహచర్యము మూలముగా నిది తెలుఁగున "బావి' యయినది. ప్రాకృతాంధ్రములలోని 'వ' – 'బ' ల పరిణామ పద్ధతి ధ్వని సూత్రబద్ధము.

---

14. పైది, పు. 75.

15. వేదము, నన్నె చోడుని కవిత్వము, పు. 94.

| సంస్కృతము | ప్రాకృతము | తెలుగు |
| --- | --- | --- |
| వణిజ | వణిజ (య) | బలిజ |
| వాపీ | వావీ | బావి |
| విస్తార | విత్థార | బిత్తరము |
| వృషభ | వసభ (హ)- | బసవ |
| వేత్ర | వేత్త | బెత్తము |
| వైశ్య | వేస్స | బచ్చు |
| వ్రీడా | విడ్డా, వీడా | బిడియము |

మొదలగునవి పై సూత్రమునకు లక్ష్యములు. 'బావులీ' పారశీక భాషాపదము. నవీనోత్తరాహ భాషలలో బావి (వు) డీ రీ, లీ) పదమునకుఁగల ప్రచుర వ్యవహారమునకు పారసీక భాషా ప్రభావము ప్రబల హేతువు. బావిడీలోని చివరి యక్షరము ప్రత్యయమని హిందీ నింఘంటు కారుల యాశయము. ఏది యెట్లయినను, తెలుఁగున 'బావి" దేశ్యము కాదుగదా! వైదిక సంస్కృతమును ప్రాచీన పారసీక భాషయును జ్ఞాతి భాషలనియు, ఇండో యూరపియను భాషా కుటుంబము లోని ప్రాచ్యశాఖయగు ఇండో-ఇరేనియను భాషాకుంటుంబము వీనికి సమీప మాతృకయనియు శ్రీశాస్త్రిగారెఱుఁగని యంశముకాదు. ఈ రెండు భాషలలోని కొన్ని జ్ఞాతిపదముల (Cognate words) ను పోల్చి, ఈ చూపుతో చూచినచో కల రూపు నిరూపితము కాఁగలదు.

| పారసి | సంస్కృతము |
| --- | --- |
| అందర్ | అంతర |
| అస్ప్ | అశ్వ |
| ఆబ్ | ఆపస్ |
| కార్ | కార్య |
| ఖానహ్ | స్థాన |
| ఖుష్క్ | శుష్క |
| గరమ్ | ఘర్మ |
| చర్ఖ్ | చక్ర |
| -దార్ | -ధారీ |
| దుఖ్తర్ | దుహితృ |

| | |
|---|---|
| సమాజ్ | సమస్ |
| బాజు | బాహు |
| వారిస్ | ఔరస |
| హజార్ | సహస్ర |

"అన్యదేశీయుల ప్రాచీన చరిత్రను గమనింపని విమర్శలు కొన్ని బయలుదేరు చున్నవి" (16). అని రెడ్డిగారిమందలింపు. కాని, అక్కడే ఉన్నది చిక్కు. మన మెఱుఁగనిదానిపై చేయి వేయుట శ్రేయముకాదు. అయినను, చాపలమనునది ఎంత చెడ్డదో అంతదొడ్డది. దానిని అదపులో పెట్టుట అందఱకును అలవికాని పని. అందును కుఱ్ఱకారునకాతొందఱ కొండంత. సంయమమనునది సాధనమీఁద, సంస్కారముమీఁద అలవడు లక్షణము. తప్పుదారి పట్టినవారిని మందలించుటతో సరిపెట్టుకొనక సరియైన దారియేదో ప్రదర్శించుట విద్యా పరమార్థవేదులగు పెద్దల విధి. అన్యదేశీయముల ప్రాచీన చరిత్ర యెట్టిదో విశదీకరించు పని రెడ్డిగారి మీఁది నున్నది. 'నన్నెచోడకవి ప్రయోగములు (కైవు, తరవారి, బాఁకు) అరబ్బీ, హిందీ భాషలలోనివేయైనను, సంస్కృత ప్రాకృత భాషలలోను, తమిళ, కర్ణా, టాంధ్రభాషలలోను కూడ వ్యవహరింపఁ బడుచుండినవనుట నిఘంటుసమ్మతము" (17). అనుదృఢ విశ్వాసముతో శ్రీ రెడ్డిగారు తమ చర్చకు శ్రీకారము చుట్టిరి. "సవతులందరు సమానులు కాఁబట్టి 'సవత్-సవతు" కూడ తత్సమానార్థక జాతీయమయినది. క్రీ. శ. 11 శతాబ్దమున తురక పదములు ఆంధ్రభాషలో లేవనుభ్రమతో పండితులో వ్రాయసకారులో (నన్నయ భారతమున) "గాడీలు' — "గాడిదెలు" 'సవతు — సరియు' అని తుడుపులు పెట్టి మూలపాఠము మార్చినారు (18) 'అని రెడ్డిగారి ఆరోపణము. "దీనిలో (సవతి గంధవారణ బస్తీ) "సవతి బస్తీ' అను రెండు హిందూస్తానీ పదాలు కాఁబోలు కలసిమెలసి యున్నవి" (19) అని రెడ్డిగారి భావన. అనఁగా "సవతు'తో పాటు తెలుఁగులోని 'సవతి' (= తోడి పెండ్లాము) పదమును శ్రీరెడ్డిగారి దృష్టిలో

---

16. తెంకణాదిత్యకవి, పు. 80.
17. పైది, పు. 76.
18. పైది, అనుబంధము, పు. 7.
19. పైది, అనుబంధము, పు. 7.

ఎరువు తెచ్చిన పదములనియే పంతులవారి ప్రసంగ వైఖరిని బట్టియు, వారొసంగిన ఉదాహరణములను బటియు స్పష్టము. ఇది యిట్లుండ శ్రీ వీరేశలింగము గారి ప్రతిపాదనమును పరామర్శించుచు విమర్శా దర్శక శ్రీ నడకుదుటి వీరరాజు పంతులుగారు, ఇక్కడి 'అన్యభాషా' పదబంధమున కతివ్యాప్తిని పట్టించి, హిందీ, ఆంగ్లాది భాషాపదములను సైతము ఉదాహరించి చేసిన విస్తరము (21) పరిశీలనార్హము. "...ఆంధ్రులు నానా దేశంబుల యందునిలిచి తెలుఁగులె తత్తద్దేశోక్తులంటఁబలికిన నా శబ్దములన్య దేశ్య జాంధ్రము లయ్యెన్" (22) అప్పకవి నిరూపించిన వానికి, అన్యదేశములకు స్వరూప స్వభావములలో సాపత్యములేదు. సంస్కృత ప్రాకృతముల నుండి వర్ణలోప వర్ణాగమాది పరిణామముల వలన తెలుఁగున జేరినవి తద్భవములు. పరీక్షించు అనునది తత్సమము; పరికించు తద్భవము, పరాకు, పరకాయించుట హింద్వార్య భాషాజన్యము లయిన అన్యదేశ్యములు. ఇట్టివివేచనముతో పూర్వోక్తపదముల పుట్టుమట్టులను పుణికి చూడవలసి యున్నది. ముందు నన్నె చోడ కవిప్రయోగ విషయక పరామర్శ.

తొలుత 'కైపు'ను గుఱించి. ఉద్రేకము, కఠినత, కోపము, ద్వేషము, రోఁత, విజృంభణము, వైమనస్యము అను నర్థముల నన్నె చోడ కవికృతిలో ఈ పదము పదునాలుగు తావుల ప్రయుక్తము. పదస్వరూపార్థ నిరూపణము నిమిత్తము తత్ప్రయోగ సర్వస్వమిట ప్రపంచితము.

1. "...భానుఁగని కై
పున మండెడు సూర్యకాంత పుత్త్రికవోలెన్" (2-43)

2. "విరహకాలంబు మరు బాణ వితతిఁగొన్న
గంటు లన్నియుఁ బ్రియుఁగూడి కైపు మిగిలి
పెనఁగునెడ నెట్ట విరిసెనా వనితమేనఁ
గలయ నవనఖదంతవిక్షతము లడరె (8-178)

3. "మును మిడిపైరి వాహినుల
ముట్టి పడల్వడ వ్రేసి గట్టి కై
పునఁ బయికెత్తు వాహకుల
పొంకమఱం దలకొంత గోసి... "(1-42)"

21. విమర్శతరంగిణి. 22. అప్పకవీయము, 1-108.

4. "...నిలిచి
మార్కొను వీరులఁ దాఁకి జ
ర్జరితముగాఁ బడఁ బొడిచి
చంపక చిత్తము కైవువోవునే" (11-49)

5. "...సురాసుర భీమలౌండదులంగని కైవుమిగిలి
మహాఘోరయుద్ధంబు సేయం దొడంగిన" (11-115)

6. "...జెట్టిగ వీరులై దురము
సేసిరి కైవునవీటెకాఱనిన్" (11-148)

7. "శరహతి బాహుమూలములు
చక్కనఁ ద్రెవ్విన మాన కాది సూ
కరముల పోలెఁ గోల్మసఁగి
కైవున గొన్ని మదాంధ గంధ సిం
ధురములు తీవ్ర దంతములు
దూఱరయంబున నొత్తియొత్తి...' (11-154)

8. "..............సం
గర మొనరింప బూని కడుఁ
గైవున మార్కొని.............." (12-42),

9. "...కైవునఁ దాఁకి యేకాదశరుద్రులు
త్కల ఫికరాఖ్యుల గెలిచిరి..." (12-60),

10. "ఘనతర దీర్ఘ దంతములు
కైవున నూటియు..." (12-72)

11. "...సురశత్రు వృత్రు ద్ర
వ్యాలు వడఁ దాఁకు కైవున మ
హాశని జంభుసుదంబు దాఁకినన్ (12-73)

12. "కరులు దెమల్చి పట్టికొని
కైవునఁ జిజ్ఞనఁ ద్రిప్పి మగ్గగా
నరదసమూహిపైచి..." (12-172),

13. "కరిశిరమాడ షణ్ముఖుఁడు
గైవున వ్రేయుడుఁ గుంభ మౌక్తికో
త్కరమసుధారఁ బొల్పసఁగె..." (12-182)

14. "కని త్రిపురారినందనుఁడు
కైవున మార్కొని నిల్చి శక్తి వై
చిన..." (12-188)

కాని, ముద్రిత పాఠములలో ఏక వాక్యత శూన్యము. ఈ పదము భిన్న ముద్రణములలో భిన్నస్థలముల నిర్బిందుకముగను, సబిందుకముగను అనియత ముగా ముద్రితము. మానవల్లి వారి ప్రతిలో నాలుగుతావుల నిర్బిందుకము; ఎనిమిది తావుల సబిందుకము; ఒకచో 'కైవు' అనీ, మఱొకచో 'కెంపు' అనీ ముద్రితము. వావిళ్ళవారి ప్రతిలో ఎనిమిది తావుల నిర్బిందుకము; అయిదు తావుల సబిందు కము. ఒకచో 'కెంపు' అని పాఠము. మదరాసు విశ్వవిద్యాలయ ప్రతిలో పదునొకొండు తావుల నిర్బిందుకము; మూఁడు తావుల సబిందుకము. ఒకచో 'కైంపు' అని తాళపత్ర ప్రతిలో పాఠమున్నట్లు అధస్సూచిక. ఆ ప్రతియందే అర్థవివరణ పట్టికలో నిర్బిందుక రూపము స్వీకృతము. ఆంధ్రనిఘంటువుల నిర్బిందుక రూపమే ప్రామాణిక పాఠముగా అంగీకృతము. నిర్బిందుకమే సాధుపాఠము. దీనిని అన్యదేశ్యమనుట అభ్యస్తము; అవిచారితరమణీయము. 'నన్నెచోడుఁడు ప్రయోగించిన 'కైపు' ను, మత్తు, మాదక ద్రవ్యము అను నర్థములు కలిగి, అరబ్బీ భాషాజన్యమగు 'కైపు' ను భిన్నవ్యుత్పత్తికములు. మొదటిది శుద్ధదేశ్యము; ప్రాచీనము; రెండవది అచ్చముగా అన్యదేశ్యము, అర్వాచీనము. ఉల్లాసము, పారవశ్యము, మనస్థితి అను మూలార్థములు కలిగిన 'కైఫ్' అను అరబ్బీ భాషాపదము (23) పారసి భాషాముఖమున నవీనోత్తరాహ భాషలలోనికివచ్చి, తద్ద్వారమున తెలుఁగున జొచ్చి 'కైపు' అయినది. భిన్న వ్యుత్పత్తికములగు ఈ పదములు రెండును నిఘంటుకారుల అలసతవలననో, ఏమఱిపాటు వలననో ఏకరూపము (Single entry) క్రింద సంగ్రథితమగుట పెద్దపొరపాటు (24). యాదృచ్ఛికమయిన శబ్దమాత్ర సారూప్యము ఈ పొర పాటుకు మూలము. నిఘంటుకారుల పొరపాటు వలన ఉత్పన్నమయిన ఈ అవ్య వస్థ అంతతో ఆఁగలేదు. మన విమర్శకులను తబ్బిబ్బుపెట్టి, తొందరపాటు నిర్ణ

---

23. మౌల్వీ సయీద్ సాహెబ్ అన్సారీ, లుగత్ సయీది, పు. 470

24. ఒక్క కాంబెల్ దొరమాత్రము తెలుగున 'మతు' అనునర్థముకల కలుపు, కైపులను అరబ్బీ జన్యత్వము కల గ్రామ్యపదములుగా నిరూపించినాఁడు (చూ A.D. Campbell, A Dictionary of Teloogoo Language Commonly termed the Gentoo, Madras, 1821 ; *P.* 146 *P.* 179 ; ఆంధ్రదీపికా కర్తయును వీనిని గ్రామ్యములుగా పేర్కొనినాఁడు. చూ, చుండూరి రంగనాయకులు శ్రేష్ఠిగారి 'ఆంధ్రదీపిక', చతుర్థముద్రణము, 1895 ; పు. 78, పు. 104).

యములకు మూలమయినది. అరబ్బీ భాషాపదమగు 'కైఫ్', నన్నె చోడకవి ప్రయుక్తమగు 'కైపు' నకు మూలమని వేదమువారు ప్రతిపాదించుటయు, నీరస హేతువులను ఊఁతగాఁగొని దేవరపల్లి వారు దీనిని నిర్ధారించుటయు సంభవించినది. పండిత పరిశోధకులపై మనకుఁగల ప్రమాణబుద్ధికిది ఫలమును, ప్రబల నిదర్శనమును. దీనివలన, మన నిఘంటు కర్తల ఉత్తర వాదిత్వమెంత గురుతరమో, మన విమర్శకులకు అప్రమత్తత యెంత ఆవశ్యకమో విశదము కాఁగలదు, శబ్దార్థముల లోని యిట్టి యాదృచ్ఛిక సాదృశ్యము రెండు పదముల సమాన మాతృకత గాని, భిన్న భాషల సాజాత్యమును గాని, వాని పరస్పర పోష్యపోషక భావమునుగాని స్థాపింప సమర్థముకాదు (25). శబ్దార్థ సాదృశ్యముకల 'ఈను–yean', 'ప్రాపు-prop' అను నీ యాంధ్రాంగ్ల పదములు ఈ రెండు భాషలకు నిసర్గ సంబంధమును గాని, సంసర్గ సంబంధమునుగాని నిరూపింపలేవనుట ఉత్తమ జ్ఞానవృద్ధులును, తత్త్వ విష్కృత బుద్ధులును నగువారికి తోఁపక మానదు.

నవీనోత్తరాహ భాషలలో ప్రచుర వ్యవహారముకల 'కైఫ్' అరబ్బీభాషా సంబంధి.

---

25. స్పష్టతనిమిత్తమీవిస్తరము. భిన్నవ్యుత్పత్తికములయిశబ్దమాత్ర సారూప్యముకల పదములజంట లీదిగువ నిరూపితములు.

i. చెవి[1]. దేశ్యము, కర్ణము, వీను.
చెవి[2]. అన్యదేశ్యము. తాళపుచెవి; ఇదిబుడతకీచుపదము (చూ. భారతి, మే, 1962).

ii. సాని[1]. తద్భవము. < ప్రాకృత. సామిణీ < సంస్కృత. స్వామినీ = ప్రభుభార్య; (ఏలికసాని, దొరసాని, నాపసాని, మంత్రసాని, ముదుసలిసాని, మేదరసాని, రెడ్డిసాని–మొ. వానియందలి ఉత్తరపదము).
సాని[2]. తద్భవము < ప్రాకృత. సాహణియ = సేనాపతి; సాహణీ= సేన < సంస్కృత సాధన, సాధనీ. తెలుఁగులోని సాహిణము (గుఱ్ఱపుసాల), సాహిణి (మార) (= రథినీపాలుఁడు), సాహిణీ (= గుఱ్ఱపువాడు) పదములు ప్రసిద్ధము. వీనిని దేశ్యములు చూపుటతప్పు; వైకృతము అనుట ఒప్పు. "సాహిణిసాని రౌతునఁగనశ్వారోహకునకుఁదనరు" (సాంబనిఘంటువు, మానవవర్గు, 6వ పద్యము). అల్లసాని, చలసాని, పెమ్మసాని, లక్కమసాని, మొ. గృహనామములలోని ఉత్తరభాగమగు 'సాని', 'సాహిణి'కి వికృతి.

ఉర్దూ : కైఫ్ = ఆనందము, హర్షము; మదము; మాదకద్రవ్య విశేషము;

కైఫ్ = మత్తు; త్రాగుబోతు (మున్షీ ఫాజిల్ సైయెద్ ఇనాయత్ అలీ, పు. 259; మొహమ్మద్ ముస్తఫాఖాన్, ఉర్దూ–హిందీ కోశ్, పు. 137; రామ్‌నారాయణలాల్, ఉర్దూకోశము, పు. 498).

గుజరాతి : కేఫ = మత్తు; మాదక ద్రవ్యము;

కెఫీ = లాహిరి వస్తువుల వాడుకకు అలవాటుపడు (యం. బి. బెల్సారే, గుజరాతీ వ్యుత్పత్తి పదకోశము, పు. 135).

మరాఠీ : కైఫ్ = మత్తు (కులకర్ణి, మరాఠీ వ్యుత్పత్తి పదకోశము, పు. 183)

హిందీ : కైఫ్ = మత్తు, మదము, (శ్యామసుందరదాస్, హిందీ శబ్ద సాగర్ పు. 633).

అరబ్బీభాషతో పోష్యపోషక సంబంధముకల పారసీక భాషలోను ఈ 'కైఫ్' ప్రవేశించినది.

పారసి : కైఫ్ (<అరబ్బీ) = ఆనందము, ఉల్లాసము; భంగును సేవించుటచే కలుగు, మత్తు ; మత్తుమందు ;

కైఫ్‌దాన్ = మత్తువస్తువులుంచు పెట్టె; మందుల పెట్టె (Steingass, Persian-English Dictionary, p. 1069)

తెలుఁగున దేశ్యమగు 'కైపు', ప్రాచీన ద్రావిడభాషా పద సంబంధియను వాదమునకు మూదలగా ప్రధాన ద్రావిడ భాషలలోని సజాతీయమగు సదృశ శబ్ద రాశిని పోల్చి చూచుట ఆవశ్యకము. తత్సంబంధి జ్ఞాతి పదముల క్రమసంగ్రంథనమీ క్రిందిపట్టిక.

తెలుగు : కయిపు, కైపు = ఉద్రేకము, ఉన్మాదము, కపటము; కోపము; రోఁత; వైమనస్యము ;

కసరు = కోపపడు, తిట్టు; విసుగుకొను; పొగరు ; వేసరిక ;

కసి = కసి (గాటు)

కసి = ప్రతీకారము ;

కసు = (కసుఁగందు), కసుఁ(గాయ) లేఁత.

"కపటాఖ్య విలసిల్లు గబ్బిగౌరు గబుసు కైపు కిటుకు....డంబనంగ" (1—38 "కల్ల నంగ సురాఖ్య చెల్లును, కైవు సారాయి సారా నాగరహిఁదనర్చుఁ దద్విశేషంబు" (2—303) అని యిట్లు ఆంధ్ర భాషార్ణవమునం దివి భిన్న పదములుగా భిన్నస్థలముల ఉద్ధృతములు. "మబ్బు లాహిరి కైపు మస్తన మత్తత ఖాసిల్లు" (సాంబనిఘంటువు, మానవవర్గ, 34)

కన్నడము : కచపు = ఉప్పు, మిరియపు పొడులతో పొగపిన కూరలు ;

కడ్, కయి, కయ్యి = చేదు; వైముఖ్యము ;

కయ్పు, కయ్పె (26) = చేదు; ద్వేషము, సరిపడమి ; కాఠిన్యము ;

కస, కసరు, కసి, కసుదు = అపక్వము; లేఁత ; ఒగరు; సరిపడమి;

26. ప్రాచీనకర్ణాట సాహిత్యమున 'కయ్పు', 'కయ్పె' లనుఁగల ప్రచుర వ్యవహార మీదిగువ ప్రయోగముల మూలమున తెల్లము. పదునాలుగుసారులు 'కైపు' ను ప్రయోగించిన నన్నెచోడుఁడు కర్ణాటభాషా ప్రయోగపక్కికా ప్రియుఁడను పరి శీలకుల నిరూపణము సప్రమాణము.

i. "మధుసీతుం కటుసీదు పోపుళిత కళ్ళల్తుం కరం కయు బప్పుదు మారీచి రొడప్పళిందె..." (పంపభారతం ఎంబ విక్రమార్జున విజయ, బెళ్ళావె వెంకట నారాయణప్ప సంపాదితము, కర్ణాటక సాహిత్యపరిషత్తు, బెంగ ళూరు, 1926; చతుర్థాశ్వాస. 88; పు. 114).

ii. "...ఎందుకయ్పెసరం బెరసును డిపభీమసేననను డిగళ్..." (పైది ఆశ్వా. 6, 73 వ పద్యము క్రింది వచనము; కయ్పెసరం = పరుషస్వరము, కఠినోక్తి).

iii. "కయ్పెసరం గళెమ్మనుం తేటపు బేడ.." (పైది. అష్టమాశ్వాస. పద్య. 26).

iv. "...కయ్పె సొరెయకుడియేం మిడియేం?' (గదాయుద్ధం, కవిచక్రవర్తి కవి రన్న ప్రణీతం; ఎం.ఏ. రామానుజ అయ్యంగార్ సంపాదితము, మైసూరు, 1925; తృతీయాశ్వాస–61; పు. 35. కయ్పెసొరె = చేదుసార) ఈపాఠ ము లను గూర్చి తెలిపిన మిత్రులు శ్రీ బెళ్ళకూరు రామచంద్రరావు, ఎం.ఏ.,– ఉస్మానియా విశ్వవిద్యాలయ కర్ణాట భాషోపన్యాసకులు–గారికి నా కృతజ్ఞతాభి వందనములు.

కై = చేదు; ఇవన్నియు దేశ్యములుగా కిట్టెల్ నిఘంటువున ముద్దచ్చులో ముద్రితములు. అన్యదేశ్యములును, మాదక వస్తుబోధకములును అగు కైఫీ, కైపు-లు, దేశ్యమగు 'కయ్పి' తో కలగాపులగము సేయక వేర్వేఱుగా ఈఁబడినవి (డా. ఎఫ్. కిట్టెల్, కన్నడ నిఘంటు)

తుళు : కస = ఉప్పు; ఒగరు ;

కైపె = అసూయ; ఉత్కంఠ : తీక్ష్ణత.

తమిళము : కచ = వైమనస్యము చెందు; రోఁతపడు ;

కచప్పు = కఠినత్వము; దుఃఖాతిశయము; వైముఖ్యము ;

కచర్, కయర్ = ఒగరుకలది ;

కాఢ్ = కోపించు; దూషించు; ద్వేషించు ; హింసించు;

కాఢ్ప్పు = అరుచి, అప్రియము ; ద్వేషము; నిర్వేదము ;

కై = నొచ్చుకొను; కోపించు; ద్వేషించు; వేసారు ;

కైప్పు = కఠినత్వము ; రోఁత ; విసుగు ; వైముఖ్యము ;

ఉర్దూ నుండి ఎరువు తెచ్చిన 'కైపు' తమిళ నిఘంటువులలో ప్రత్యేకారోపముగా ఉట్టంకితము (Tamil, Lexical)

మలయాళము : కయర్క్క = ఎదిరించు ; కలహించు ; గద్దించు; జంకించు :

కైక్క = మచ్చరించు ;

కైప్ప = చేదుసొర ;

కైప్పిక్క = నిర్వేదపడు ; వైమనస్యము చెందు ;

కైప్పు = అరుచి, అప్రియము ; ఆవేదన; మచ్చరము ; వైముఖ్యము.

(డా. ఎచ్. గుండర్టు, మలయాళ కోశము.)

కచ, కచప్పు, కఢ్, కయప్పు, కయర్, కయి, కయిపు, కయ్యి, కస, కసరు, కసి, కసు, కసురు, కాఢ్, కాఢ్ప్పు, కై, కైపు, కైప్పిక్క, కైప్పు-మొదలగునవి శబ్దార్థములలో సాదృశ్యము కల సజాతీయ శబ్దములు ; ప్రాచీన ద్రావిడ *కచ్ -/*కఢ్-ధాతునిష్పన్నములు. ఒగరు, లేఁత, సరిపడమి-అనునవి మూలార్థములు. -చ-/స-ఢ -య-ల మార్పు ద్రావిడ భాషలలో సర్వసాధారణమగు ధ్వనిపరిణామము. లక్ష్యములుగా ఈక్రింది యుదాహరణములను పరిశీలింపుఁడు.

| | తమిళము | కన్నడము | తెలుగు |
|---|---|---|---|
| 1. | పెయర్ | పెసర్, హెసరు | పేరు (నామధేయము) |
| 2. | ఉయిర్ (= గాలిని గట్టిగా పీల్చు). | ఉసిర్, ఉసుర్ (=ఊర్చు; ఊర్పు). | ఉసురు (=ప్రాణము) |
| | ఉయిర్ప్పు (శ్వాసము, గాలి | ఉసురు (=ప్రాణము) | ఊర్చు, ఊర్పు, నిట్టూర్చు, నిట్టూర్పు. |

(గాలి, ప్రాణము అను మూలార్థములు కల *ఉచ్-/* ఉయ్-ధాతునిష్పన్నములు).

| | తమిళము | కన్నడము | తెలుగు |
|---|---|---|---|
| 3. | మయక్కమ్ =అలసత; అజ్ఞానము; మాంద్యము; మైకము) | మయక (=మత్తు; మాంద్యము ; మూర్ఛ; | మయికము. |
| | మయరి (= కలఁత పడిన వాఁడు); | మసక, మసకు(=ధూసర వర్ణము) ; | మచ్చ |
| | మయర్(=తబ్బిబ్బు పడు; తెలివితప్పు, నిశ్చేష్టత)మయర్పు, మయర్వు (=అజ్ఞానము, దిగ్భ్రమ) : | మాసర(=బూడిద రంగు); మాసలు (=మఱికి); | మసక, మసర. మసక మసక. |
| | మాయ్ (=అదృశ్యమగు; సూర్యుఁడస్తమించు); మాయ్ప్పు, మాయ్వు (అదృశ్యము. తిరోధానము) | మాసు (=మాసిపోవు; మఱికియగు) | మసి<br>మాయు. |
| | | | మాపటిప్రొద్దు.<br>మాపు ( = సాయం సంధ్య) |
| | మై (=చీకటి;నలుపు); మైప్పు (=నలుపు) | మైక. | మైకము. |

(మచ్చ, మఱుగు అను మూలార్థములుకల *మచ్-/*మయ్-ధాతు నిష్పన్నములు).

| | తమిళము | కన్నడము | తెలుగు |
|---|---|---|---|
| 4. | పచ్చై (= ఆకుపచ్చదనము; పచ్చి; లేఁత); | పచ్చ, పచ్చనె, పచ్చు పచ్చె, (= పసుపు రంగు; పసిమి | పచ్చ పచ్చన, పచ్చని, పచ్చి, పచ్చిక |
| | | పసి, పసుర్ (= లేఁత) | పసి (= శైశవదశ) |
| | పయిర్ (= పైరు); | పసిరు (= పైరు), పైరు | పయిరు, పైరు |
| | పైమ్మై (= పచ్చరంగు; పచ్చదనము); | పసర్, హసరు, హసురు (= ఆకుపచ్చరంగు; క్రొత్త; లేఁత); | పసరు |
| | పైదు (= నూతనత్వము; పచ్చదనము); | హసు (= లేఁత; మృదువైన); | పసపు, పసుపు |
| | పైదల్ (= శిశువు); | పసుళె (= శిశువు); | పసిఁడి (= పచ్చని లోహము) |
| | పైయల్ (= బాలుఁడు) | హసుళ, హసుళె (= శిశువు) | పయిఁడి, పహిండి, పైఁడి |
| | పైయన్ (= కొడుకు); | | పైద (= బాలుఁడు) పెయ్య, పేయ (= లేగదూడ) పైదలి (= జవరాలు) |

(లేఁత, క్రొత్త, పచ్చరంగు అను మూలార్థములుగల *పచ్-/* పయ్— ధాతు నిష్పన్నములు, పూర్వోక్త పదములతో ఏకాచ్క పరిమితమగు ప్రథమ భాగమే మూలధాతువు; తక్కినది ప్రత్యయము, మూలధాతువు అర్థవంతము ; సామాన్యార్థ బోధకము. ప్రత్యయముల కర్థ మిదమిత్థమని నిర్ణయింపలేముకాని మూలధాతువునకు చేర్పఁబడినపుడు విశేషార్థస్ఫూర్తిని కలిగించును. చోడకవి ప్రయుక్తమగు కైపు దేశ్యమనుట కింతచాలు. శ్రీ వేంకటరాయ శాస్త్రిగారి ‘కైపు’ ను యుద్ధవీరుల త్రాగుడుతో ముడివెట్టఁజూచిన ఉజ్జాయింపు సమన్వయమును వాగ్యోగవిదులు యోగ్యముగా పరిగణింపఁజాలరు.

ఇఁక, 'తరవారి' తత్త్వవిచారమిట్లు : 'తరవారి' (27) పదము నన్నెచోడుని కృతిలో మూఁడుతావుల కన్పట్టుచున్నది. మొదటి రెండుచోటుల నవలోకింతము :

"ఇలఁ జిత్రము తారకరు
చిలసంగతమైన ఘోరతరవారి సొరన్
నిలుపఁగఁ దనుఁ జొరకడరినఁ
దలయుసుధ యగుస్వరోధి రతికర్ద్బభవా" (4-14)

"భూరి తరవారి వారిధి
హారావానంద నాగహరి భూధర లి
క్ష్మీరమణే శోభితుఁడై
సీరధిపతిఁ బోలె వాహినీ విభుఁడగుటన్" (11-15)

"ముంచిరి తరవర్షంబుల
ఉంచిరి వృథివివనమితిఁ జెడ్డాడి రిపులన్
త్రుంచిరి నిజతరవారుల
నించిరి విమకీర్తి దిశల నెఱయఁగ సుభటుల్"

(11-116)

'తరవారి' పదప్రయుక్తిచే నన్నెచోడుఁడు అల్లా-ఉద్-దీన్‌ఖిల్జీ (క్రీ శ. 1296-1316) కి అనంతరుఁడగునని కదా వేదము వారి వాదము. మఱి,

---

27. 'నన్నెచోడవిజ్ఞానము' వారి ప్రయోగ సామ్యములను ఎత్తిచూపుట యన్న శ్రీ జే. వేం. కృ. రెడ్డిగారికి అమితప్రీతి.

"వారణ హస్తానుకారంబులగు వారి
ధారలు నరియు దుర్వారఘోర
తరవారివాహ ప్రకరములు వారింప
సురనివహంబులో సురగణేశు

నైన నోర్వను శక్తమైన..." (ఆది. 8-251) అను నన్నయ ప్రయోగము శ్రీ రెడ్డిగారి చూపున కానినట్లులేదు. ఇందుపై ఏదో యొక కల్పనచేసి చమత్కరించెడి వారు. వాస్తవమునకు నేనిటీవలి దాఁక ఈ ప్రయోగమును గమనించియుండ లేదు. మొన్న మొన్న కాకినాడ, ఆంధ్ర సాహిత్య పరిషద్గ్రంథాలయమునందలి భారతము తాళపత్ర ప్రతులను పరిశీలించుచుండఁగా దైవికముగా నిది నాకంటఁబడినది.

"తునిసిన బాహా మస్తక
తను చరణంబులును బాణ తరవారి గదా
ధనువులుఁ (28) గిరీటకంకణ
కనదంగదములును దఱచుగా ధరఁ దొరఁగెన్"

(భారతము. భీష్మ. 2_134)

అని మూలము (29) లో లేని 'తరవారి' పదమును ప్రయోగించిన తిక్కన (క్రీ.శ. 1200_1270) యు అల్లా_ఉద్_దీనుని కర్వాచీనుఁడగునని తీర్మానించుట హాస్యాస్పదముకాదా ? దీని తద్భవ రూపమగు 'దరవరి' భాస్కర రామాయణములో ప్రయుక్తము.

"పినతండ్రి చావుఁగని య
ద్దనుజుఁడు యూపాక్షుఁడంతఁ దరవరిఁగొనుచున్
దనరథము డిగ్గి సింహ
ధ్వని యెసఁగన్ ద్వివిదుఁడాఁకె దర్పమెలర్పన్"

(భాస్కర రా. యు. 1193)

ఇది అయ్యలార్యుని భాగమునందలిది అయ్యలార్యుఁడు క్రీ. శ. 1350 ప్రాంతము వాఁడని పరిశోధకుల నిర్ణయము.

"ఈ పదము (తరవారి) సంస్కృతమేని అమరకోశమునలేదు. (30)" అని వేదము వారి ఆక్షేపము. ఇది అమరమున లేని మాట వాస్తవము. ఇదొక్క

28. "తునిసిన మస్తక బాహా_తను చరణంబులును బాణ తరవారి గదాధనువులు..." అని ప్రాచీన ముద్రితప్రతుల, కొన్ని తాళపత్రప్రతుల పాఠము.

29. "కాంచనేషు తనుత్రేషు కిరీటేషు ధ్వజేషు చ॥
శిలానా మివశైలేషు పతితా నామభూత్స్వనః॥
పతితా న్యుత్తమాంగాని బాహవశ్చ విభూషితాః॥
వ్యచేష్టంత మహీం ప్రాప్యశతశోఽథసహస్రశః॥"
అని వ్యాసభారతమూలము (శ్లో. లు 8, 9; అధ్యా. 55; భీష్మపర్వ., భాండార్కర్ ప్రాచ్య పరిశోధక సంస్థ, పూనావారి భారత ప్రతి, పుటలు 290, 291)

30. వేదము _ నన్నె చోడుని కవిత్వము పు. 95.

లేనా ? అమరసింహుని సంకలనమున లేని సంస్కృత పదములు వేనకు వేలు ఉన్నవి. అపారమయిన గీర్వాణభాషా పారావారమును ఆపోశనము పట్టెదనని అమరసింహుఁడు ప్రతిన పూనలేదు.

"సమాహృత్యాన్య తంత్రాణి సంక్షిప్తైః
ప్రతిసంస్కృతైః
సంపూర్ణముచ్యతే వర్గైర్నామలింగాను శాసనమ్"

అని అతఁడు తన కోశపరిమితి ప్రయోజనములను గూర్చి అవతారికలో స్పష్ట పఱిచి 'శేషంతుజ్ఞేయం శిష్టప్రయోగతః అని చివరిమాట చెప్పి ఊరు కొన్నాఁడు.

'తరవారి' సంస్కృత పదముగా ప్రామాణిక నిఘంటువులు పెక్కింట ఉట్టంకితము.

1. Sans'krit Worterbuch, otto Bohtiingk und Rudolf Roth: St. Petersburg. 1855; column, 268.

2. శబ్దకల్పద్రుమ, సర్. రాజారాధా కాంతదేవ బహద్దరు; పు. 592 : తరం సమాగత విపక్షబలం వారయతీతి తరవారిః ।

3. సంస్కృత శబ్దార్థకల్పతరుః, ముడుంబై తిరువేంకటాచార్య కృతము, చెన్నపట్టణము, 1872; రచన 1830; పు. 229; తరవారిః ఇకారాంతః పుంసి ॥అమరః॥ ఖడ్గః ఆచార్యులుగారు చూచిన అమరకోశప్రతులలో 'తరవారి' పదఘటిత పాఠముండెనదనుటకు ఉపపత్తులు లేవు. అమర వ్యాఖ్య (31) లో ఈ పట్టున ఉదాహృతమయిన 'తరవారి' పదము ప్రమాద వశమున ఆచార్యులుగారి పద పట్టికలోఁ జొరఁబడినదేమో ?

4. వాచస్పత్యమ్, తారానాథ తర్క వాచస్పతి; 1873; సంపుటము, III పు. 3243 తరవారిః పుం. తరం శత్రూణాం గతిమ్ వారయతి...ఖడ్గ భేదే... అసిశబ్దే.

---

31. భానోజీ దీక్షితుల వ్యాఖ్యలో 'తరవారి' పదముట్టంకితము.

5. సర్వశబ్దసంబోధిని, పరవస్తు శ్రీనివాసాచార్యకృతము, విశాఖపట్టణము. 1875; పు 351; తరవారిః ఇ. పుం. ఖడ్గః.

6. సర్ మోనియర్ - మోనియర్ - విల్యమ్సు, సంస్కృతాంగ్ల కోశము. ఆక్సుఫర్డు. 1899; పు. 438.

7. వామన శివరామఆప్టే, సంస్కృతాంగ్ల కోశము, బొంబాయి, 1890; పు. 469.

8. పండితకులపతి జీవానంద విద్యాసాగర, శబ్దసాగర, కలకత్తా, 1900; పు. 306. వీనిని మించిన కోశములు సంస్కృతమున లేవు. పై పెచ్చు నవీనోత్తరాహభాషా నిఘంటువుల నీ 'తరవారి' సంస్కృతమూలకముగా ప్రదర్శితము.

అస్సామీ : తరోవాల్ < సం తరవారిః (హేమచంద్రబారువా, హేమకోష్, సిబ్ సాగర్. 1955; పు 459).

ఒడియా : తరవార్, టరవారి. తరవార < సం. (జి. సి. ప్రహరాజ్. పూర్ణచంద్ర ఒడియా భాషాకోష్. ఉత్కలసాహిత్య ప్రెస్, కటక్, 1932; పుటలు 3377. 3379).

గుజరాతీ : తర్వార. తల్వార < సం. తరవారి. తర్వారియో, విణ. తరవారితో పోరాడెడి (ఎం. బి. బెల్సారె, గుజరాతీ వ్యుత్పత్తి పదకోశము, అహమ్మదాబాదు, 1895; పుటలు 344, 345).

నేపాలీ : తర్వార్. తల్వార్ < సం. తర (ల) వారిః (సర్. ఆర్. ఎల్. టర్నర్, నేపాలీ నిఘంటువు, లండన్, 1931; పు. 275).

మరాఠీ : తర్వార్, తల్వార్ (కులకర్ణి, మరాఠీ వ్యుత్పత్తి పదకోశము, బొంబాయి, 1946; పుటలు 366, 368).

---

32. కూచిమంచి సుబ్బారావుగారి హిందూస్తానీ - తెలుగునిఘంటువు (కాకినాడ, 1924; పు. 282) లో 'తరవారి' పారసీ మూలకముగా ప్రదర్శితమగుట విచార్యము.

**హిందీ :** తర్వారి < సం. (శ్యామసుందరదాస్, హిందీశబ్దసాగర్, కాశీ నాగరీ ప్రచారిణీసభా, 1920; పు. 1370; కాలికాప్రసాద్, బృహత్ హిందీకోశ్. పు. 551). (32) ప్రసిద్ధములైన ఉర్దూ నిఘంటువుల లోనిది హిందీజన్యముగా నిరూపితము. (33)

ఆంధ్రనిఘంటువు లన్నింటను 'తరవారి' తత్సమముగా ఉల్లేఖ్యము. కందూకూరి పరిష్కృతమగు ఆంధ్రాంగ్ల ద్రావ్యము, ద్వితీయ ముద్రణము (1903) న పట్టాక త్తి యను నర్థమున 'తరవారి' తెలుఁగు పదముగా ప్రదర్శిత మగుట ప్రమాదము. (చూ. పు 512) ద్రౌణ్యమాత్ర భాషా నిఘంటువు మాత్రము తర్వారు, తలవారులను అన్యదేశ్యములుగా పేర్కొనినది. తర్వార్, తల్వార్ – లు తెలుఁగున కిటీవల ఎవరు తెచ్చిన అన్యదేశ్యములు. పూర్వో క్తములగు సంస్కృతాది భాషాకోశము లిటీవలివనియు, సంస్కృతమున 'తరవారి' ప్రాచీనతను స్థాపింపఁజాలవనియు ఎవరు వాదము. అట్లయిన పిక్రింది ప్రాచీనకోశ వ్యవహారములు గమనార్హములు.

పండ్రెండవ శతాబ్ది ప్రథమపాదము వాఁడగు ధనంజయుని నిఘంటువున 'తరవారి' గ్రంథస్థము. ధనంజయుఁడు కర్ణాట జైనుడని పరిశోధకుల తలంపు.

"కౌక్షేయకోఽసిర్నిస్త్రింశః కృపాణః
కరవాలకః
తరవారిర్మండలాగ్రః ఖడ్గనామావళిం విదుః"
(ధనంజయ నిఘంటు, ప్రథమపరిచ్ఛేద. శ్లో 87).

"ఋష్టిః ఖడ్గస్తరవారి కౌక్షేయకౌ చ నందకః..." ఇతి రభసః' – అను శ్లోక భాగము భానోజీదీక్షితుల (17 వ శతాబ్ది) అమరవ్యాఖ్యాసుధ-రామా

33. i. షేక్ ఘులాంఅలీ బర్కత్ అలీ, జదీద్ లుగత్ ఉర్దూ, లాహోరు, పు. 117.
ii. ముస్సిఫాజిల్ సైయెద్ ఇనాయత్ అలీ, లుగత్ ఉర్దూ, మర్కంటైల్ ప్రెస్, లాహోరు, 1928; పు. 99.
iii. ఫిరోజుల్ లుగత్, న్యూతాజ్ ఆఫీస్, ఢిల్లీ; పు. 209.
vi. రామ్‌నారాయణ్‌లాల్, ఉర్దూ – ఇంగ్లీషుకోశము, అలహాబాదు, 1956, పుటలు 195, 203.

క్రమి (34) లో ఉదాహృతము. ఇచ్చట రభసయనఁగా రభసపాలుని కోశమని యర్థము. సర్వానందుని (క్రీ. శ. 1159) అమరకోశ టీకా సర్వస్వమునందును, "అమర శుభాంకహలాయుధ గోవర్ధన రభసపాలకృత కోశాన్" అని మేదినీ కోశమునందును కోశకారుఁడుగా స్మరింపఁబడుటచే రభసపాలుఁడు పంద్రెండవ శతాబ్దికి పూర్వుఁడని నిర్ధారితము. 'తరవారి' పద వ్యవహారము పదునొకొండవ శతాబ్దినాఁటికే కలదనుటకు 'హారకస్తరవారిః స్త్రీ యష్టిశ్చాపిమృదౌ పృథౌ' అను యాదవ ప్రకాశుని వైజయంతి ప్రమాణమును శ్రీవేంకటకృష్ణారెడ్డిగారీ వరకే చూపినారు.

"నిస్త్రింశః కరవాలః ఖడ్గః కౌక్షేయకః
కృపాణస్స్యాత్
ఋష్టిరసి చంద్రహాసౌ తరవారిమండలాగ్రంచ"

(హలాయుధుని అభిదాన రత్నమాలా, భూమికాండం, శ్లో. 318) భట్టహలాయుధుఁడు మాన్యఖేటాధీశ్వరుఁడగు ముమ్మడికృష్ణుని (క్రీ. శ. 940_956) ఆస్థానపండితుఁడు. ఈ యభిధాన రత్నమాలకు కర్ణాటకరచనలో టీక రచించిన ఇమ్మడి నాగవర్మ (35) (క్రీ. 1145) హేమచంద్రున (క్రీ. శ, 1088_1172) కించు మించు సమకాలికుఁడు. అభినవ పంప బిరుదాంకితుఁడగు నాగచంద్రుని (క్రీ. శ. 1100 కు పూర్వుఁడు) రామచంద్ర చరిత పురాణమున (36) "తరవారి యిందిటియె లోహిత వారిగళానవారిదళ్" అని తరవారి పదము ప్రయుక్తము.

---

34. నామలింగానుశాసనమ్, నిర్ణయసాగర్ ప్రెస్. 1944; పు. 293.

35. అభిధానరత్నమాల, మదరాసు విశ్వవిద్యాలయ ప్రచురణ, 1940. సనదవోలి బొంద్రాచార్యుల తోడి వాదము సందర్భమున మల్లికార్జున పండితారాధ్యులు,
'అమరసింహ హలాయుధాది నిఘంట్లు
నమరెడు పాణినీయాది శాస్త్రముల
హరుఁడజ నిటలజుండను సూక్తిఁగలదె'
(పండితారాధ్య చరిత్ర, వాదప్రకరణము పు. 615) అని హలాయుధుని స్మరించినట్లు పాల్కురికి సోమనాథుఁడు వ్రాయుటచే హలాయుధుఁడు పండితారాధ్యులకు ప్రాచీనుండయిన ప్రసిద్ధ కోశకాడుఁడనుట స్పష్టము.

36. రామచంద్ర చరితపురాణం, కర్ణాటక సాహిత్యపరిషత్తు, బెంగుళూరు, 1921; 13_61; పు. 388.

బాణభట్ట రచితమగు హర్షచరితము ఆఱవ యుచ్ఛ్వాసమున ఖడ్గార్థమున 'తరవారి' పదముపయుక్తము. హర్షవర్ధనుని (క్రీ. శ. 606_645) ఆస్థానకవి యగుటవలన బాణభట్టు ఏడవుశతాబ్దివాఁడనుట నిర్వివాదము. ఆ ఘట్టమిది :

"నాగవన విహార శీలంచ మాయా

మాతంగాంగాన్నిర్గతా

మహాసేన సైనికావత్సపతిం న్యయంసిషుః।

అతిదయిత లాస్యస్యచ శైలూషమధ్యమ ధ్యాస్య

మూర్ధాన మసిలతయా మృణాలమివాలు నాదగ్ని

మిత్రాత్మజస్య సుమిత్రస్య మిత్రదేవః।

ప్రియతంత్రీ వాద్యస్యాలాబూ వీణాభ్యంతర

శుషిరనిహిత నిశిత తరవారయో

---

గాంధర్వచ్ఛాత్రచ్ఛద్మానః

చిచ్ఛిదురశ్మకేశ్వరస్య శరభశ్యశిరోరిపుపురుషాః"

(హర్ష చరితమ్, షష్ఠఉచ్ఛ్వాసః, కాశీనాథ పాండురంగపరబ్ సంశోధితమ్, 1925 పు. 198) 'తరవారి రేకధారః ఖడ్గః' అని మహాకవి చూడామణి శంకర కవి రచిత సంకేతాఖ్యవ్యాఖ్య (చూ. పైది. పు. 199). అనఁగా ఒక వాయదార గల ఖడ్గమని భావము. ముప్పదియంగుళములకు మించిన పెద్దకత్తియని సర్వ శబ్ద సంబోధినీ కారులు. ఉపలభ్యమయిన ఈసాక్ష్యము మేరకు 'తరవారి' ఏడవు శతాబ్ది నాఁటికే వ్యవహారమున నుండినట్లు స్పష్టము. తత్పూర్వ మెంతకాలము నుండి వ్యవహృత మగుచుండినదో పర్యాప్త పరిశీలనమునఁగాని నిర్ణాయకము కాదు. (37)

వాద సౌలభ్యముకొఱకై 'తరవారి' పదము ఏదో యొకకాలమున సంస్కృతములో చేరిన కాకితమువంటి (< పారసి కాగజ్) పారసీపదమో, దీనారము

37. 'గౌడవహో' లో 'తరవారి' పదము ప్రయుక్తమయినదని మిత్రులు శ్రీ టి. వి. యం. అయ్యవారు_బళ్ళారి, వీరశైవకళాశాలలో ఆంధ్రోపన్యాసకులు _ గారు చెప్పిరిగాని ఆ కృతిని చూచుట తటస్థపడలేదు. ప్రాకృతమున 'తరవారి' కలదని సూ. ని., సం. 3, పు. 679; "పరితః శిథిలోదగ్ర తరవారి తడిల్లతాః" అను పరమానందభారత (22_39) పాఠము అర్వాచీనమనుటచే ప్రస్తుతచర్చకు ఉపకారికాదు. ఈ క్రింది అరబ్బి, పారసీ కోశములలో 'తరవారి' పదము కన్పట్టలేదు.

వంటి (< Gk. Dinarious) గ్రీకుపదమో, హంవీరవంటి (< అరబ్బీ, అమీర్ = కోటీశ్వరుఁడు; ఉన్నతాధికారి; ప్రభువు) అరబ్బీపదమో కాకూడదా అని అంగీకరించుటకును అవకాశములేదు. అతి ప్రసిద్ధములైన అరబ్బీ, పారసి కోశములలో 'తర (ల) వారి' పదము మృగ్యము. (38) కాఁగా, 'తరవారి' అన్యదేశ్యము కాదనుట ఉత్తరపక్షము.

"ఈ నన్నిచోడకవి తెనుగు కావ్యమును పఠించిన దాక్షిణాత్య పండితుఁడు యాదవ ప్రకాశుఁడు తన సంస్కృత నిఘంటువులో పై హిందీ (తరవారి) తెలుఁగు (జొన్నలు) పేర్లను పేర్కొనియుండఁగా భాషావాదులీ వైజయంతి ప్రమాణములనైనను చూడక తత్కాల నిర్ణయము చేయుట సబబుకాదు. ఈ వైజయంతీ నిఘంటుకారుఁడగు యాదవప్రకాశ పండితుఁడు క్రీ. శ. 11

---

38. i. John Richardson, A Dictionary of Persian, Arabic and English, Dedicated to the king of England. Clarendon Press, Oxford MDCCL XXVII (1777 A. D.) ii. Francis Johnson, Persian, Arabic and English Dictionary, Allen & Co, London, 1852. iii. మున్షీ మొహమ్మద్ పాద్షా, 'ఫర్హంగ్ ఆనందరాజ్' (విజయనగరము మహారాజా శ్రీఆనందగజపతి నామాంకితమయిన అరబ్బీ, తుర్కీ, పారసీకకోశము) మున్షీ నవీల్ కిస్వారి ప్రెస్, లక్నో, 1889. iv. William Thomson, 'Hazmul Arbiya' Arabic - Urdu Dictionary. v. మౌల్వీసయీద్ సాహేబ్ అన్సారీ, 'లుగత్ సయీది' (అరబ్బీ - పారసీకకోశము) ఆజమ్ఘడ్, 1936. vi. Steingass, Persian-English Dictionary, 1949. vii. లుగత్ కేష్వరీ, 1959.

పై కోశములను పరిశీలించుటలో తోడ్పడిన మున్షీమొహమ్మద్ సిద్దిక్ ఖాన్, మున్షీ మొహమ్మద్ అబ్దుల్లా కాదిరీసాహెబ్ గార్లకు నా కృతజ్ఞతాభివందనములు.

శతాబ్దములో విశిష్టాద్వైత మతస్థాపకుఁడగు శ్రీమద్రామానుజాచార్యుల విద్యా గురువు కాబట్టి, తన్నిఘంటు ప్రయోగములైన 'తరవారి-జొన్నలు' 'అను హిందీ - తెనుగు పదములు క్రీ. శ. 11 శతాబ్ది ప్రయోగము లగునేగాని భాషా వాదులన్నట్లు క్రీ. శ. 13 శతాబ్ది ప్రయోగములగుటకు వీలులేదు.(39) అని భాషావాదుల మనుకొనువారికి దేవరపల్లి వారి ఎచ్చరిక. "క్రీ. శ. 1050-1100 ప్రాంతమునందలి యాదవప్రకాశ పండితుని 'తరవారిః' అను వైజయంతీనిఘంటు తురుష్కపద ప్రయోగమును భాషావాదులు చూచియున్నచో, ఇట్టి బాధ్యతారహిత సిద్ధాంతములు నిర్ణయించెడివారు కారేమోకద" (40) అని శ్రీ రెడ్డిగారి మతొక చుఱక. రెడ్డిగారూహించినట్లు 'తరవారి' హిందీకి గుత్తమాట కాదు ; జొన్నలు తెలుఁగున దేశ్యపదముకాదు. 'తరవారి' సంస్కృత పదమనీ, బాణోచ్ఛిష్టమనీ ఇంతదనుక ప్రదర్శితము. 'జొన్నలు' సంస్కృతము నందలి 'య (యా) వనాళ' పదజన్యమగు ప్రాకృత 'జొణ్ణలి ఆ' వికృతి, 'జొన్నలు' తెలుఁగున తద్భవము. జొన్నలు తెలుఁగు నాటికే పరిమితమయిన పంటకాదు. మైసూరు లోను, మరాఠ్వాడాలోను, మధ్యప్రదేశములోను మస్తుగా పండెడిపంట. యాదవ ప్రకాశుని నన్నిచోడ కవికావ్య పఠనమును 'వైజయంతి' లో వీనిఉనికికి హేతువుగా పేర్కొనుట మిథ్యావాదము. కోశకారుఁడయిన యాదవ ప్రకాశుఁడు అతి ప్రసిద్ధములయిన హర్షచరితమును, హలాయుధుని అభిధాన రత్నమాలను చూడ లేదనుట సాహసము. 'జొణ్ణలియా' ధాన్యవాచకముగా హేమచంద్రుని దేశీ నామమాల (3-50) లో "జోవారోఇ జొణ్ణలియా" అని పఠితము. "జొణ్ణ లియా జోవారోధాన్యమ్" అని దేశీనామమాలా వృత్తి. సంస్కృతములో కేవలము నైఘంటుకములుగాఁ గన్పట్టుచున్న 'జోన(ల)ళ', 'జోనా(ల)ళ' 'జోన్నాలా' పదములు, సంస్కృతమునందలి ఇంగాల (<అంగార), మోర (< మయూర), సహార (< సహకార) మొదలగువాని కుదురునకుఁ జెందినవి, ఇంగాలాదులు ప్రాకృత పదములు; ప్రాకృతములనుండి సంస్కృతమునకు ఎరవు తెచ్చినవి. సంస్కృత కోశకారులు సంస్కృతేతర భాషాకావ్య పఠనము వలన ప్రభావితులయి తత్ప్రయుక్తములగు పదములను తమ కోశముల స్వీక

39. వెంకటాదిత్యకవి, పుటలు 82, 83.

40. పైది, పు 104,

రింతురనుట అశాస్త్రీయము. చివర, శ్రీ శాస్త్రిగారు పేర్కొనిన సాహిత్య దర్పణ శ్లోకమసంగతి.

> "సన్ధౌ సర్వస్వహరణం విగ్రహే ప్రాణనిగ్రహః
> అల్లావదీననృపతౌ నసంధిర్న చ విగ్రహః" (41)

ఇది విశ్వనాథ కవిరాజ (క్రీ. శ. 1350) కృతమగు సాహిత్యదర్పణమున గుణీభూత వ్యంగ్యము, అస్ఫుటభేద వివరణమునొద్ద నుదాహృతమయిన లక్ష్యము. సంధియందు సర్వస్వహరణము విగ్రహమునందు ప్రాణనిగ్రహము. అల్లావదీన నృపతిపట్ల సంధి విగ్రహములు పనికిరావు అని దీనిభావము. సంధి విగ్రహములు కాక, తక్కిన ఉపాయములు ప్రవర్తించునని గుణీభూత వ్యంగ్యము; వ్యుత్పన్నులకుకూడ ఝటితిస్ఫూర్తి కలుగదుగాన అస్ఫుటము ఈ శ్లోకమును-

> "ఇలఁ జిత్రము తారక కర
> తల సంగతమైన ఘోరతరవారిసొరన్
> నిలుపగుఁ దనుఁ జొరకడరినఁ
> పలమునుక యగు న్విరోధితతికజ్జిభవా"
>
> (కు. సం. 4-14)

అను పద్యముతో పోల్చి "ఈ శ్లోకమునకీ పద్యము మెఱుఁగై అందుచేత తర్వాతిది కావచ్చు" (42) నని వేదమువారి ఊహాపోహలు. శ్లోక ప్రతిపాదక విషయము గుణీభూత వ్యంగ్యము, అస్ఫుటము. పద్య ప్రతిపాద్యము ఘోర + తరవారి, ఘోరతర + వారి అను విఱుపులమీఁద ఆధారపడిన సంభంగశ్లేష; శబ్దచమత్కారము. కావున రెంటికిని పోలికలేదు. ఈ భావము వీరిద్దఱిదికాక ప్రాచీనుఁడగు మఱొకకవిది కాకూడదా ? ఈ యిరువురును విడివిడిగా తమతమ ప్రతిభావిభవముల కనుగుణముగా అనుకరించి యుండరాదా ? "లేక ఘుణా

41. సాహిత్యదర్పణమ్, చౌఖంబా సంస్కృతసీరీస్, వారణాసి, 1955; చతుర్థపరిచ్ఛేద. కారికా 24; పు 286.
42. వేదము-నన్నెచోడుని కవిత్వము, పు. 97.

క్షర న్యాయమున అల్లాయుడీను నెఱుఁగకయే కవికి అభావము స్ఫురించి యుండ వచ్చు (43)" నని శ్రీశాస్త్రిగారే మార్గాంతరమును సూచించిరికదా !

ఇఁక, 'బాఁకు' (44) ను గుఱించి రెండుమాటలు. కుమారస్వామి సేనానిగా దేవసేన తారకునిపై 'కూచి' చేసిన సందర్భమున 'నిజాధీశ్వరుల కుత్సాహంబుగా వీర పురుషులు మహోత్సాహంబులు పలుకు' ఘట్టమునందలిది ఈ క్రిందిపద్యము.

"పోరఁ బాఁకు దాల్చి నీరు గొన్నటు ప్రతి
బలమునెల్లఁ బాయవడఁగ దోలి
గొడగు క్రిందిరూపుఁ బొడిచి జయంబు నీ
కిత్తు నధిప నన్ను నింతనమ్ము"

(కు. సం. 11-37; మదరాసు విశ్వవిద్యాలయప్రతి, 1948; మానవల్లి ప్రతి, 1914). 'పోరబాఁకు దాల్చి' అని వావిళ్ళవారి 1953 ప్రతి, 'పోరబాఁకుఁ దల్చి' అని వావిళ్ళవారి 1961 ప్రతి. వావిళ్ళవారి ప్రతులలో '-బాకు' కు పూర్వముండ వలసిన అఱసున్న అచ్చులో ఎగిరిపోయినది. 'పోరఁబాఁకుదాల్చి' అను పాఠము సరిగా లేదని వేదమువారి వాదము. పాఁకుఁదల్చి (= పాఁకును త్రోసి) యనుటలో దూరాన్వయదోషమున్నదని 'పోర బాఁకు' దాల్చి' అను వావిళ్ళవారి దురన్వయ పాఠమును శ్రీ శాస్త్రిగారంగీకరించిరి.

"పోరను మృత సంజీవని
కారణమున నిహతులయ్యుఁ గారసురవరుల్
వారల నోర్వఁగ మనకతి
భారము దుర్వార వీర్యబలయుతులగుటన్"

---

43. పైడి, పు. 97.

44. ''బాఁకు' - ఇందులకు కవిత్రయ ప్రయోగము శబ్దరత్నాకరమీయలేదు' (పు 92) అనుటలో శ్రీ వేంకటరాయశాస్త్రిగారి భావమేమో స్పష్టపడలేదు. కవిత్రయమువారు 'బాఁకు' ను ప్రయోగింపఁగా శ. ర. కారుడు తద్దానిని స్వీకరింప నుపేక్షించెనని శాస్త్రిగారి తలంపు కాఁబోలు! మఱి, నాలుగుపంక్తులకు పిమ్మట 'ఈ బాఁకు శబ్దమెట్టిదేశ్యమో కాని, కవిత్రయమువారుగాని శివకవులు గాని ప్రయోగించినట్లు కానరాదు. పరిశోధింపవలెను, అని వారే వ్రాసిరి (పైడి, పు. 92).

(భారత. ఆది. 3_102' ఆనంద ముద్రాక్షర శాలాప్రతి, 1907) అన్న నన్నయ ప్రయోగవైఖరిని పరికించినచో చోడకవి పోకడ గడుసరికూర్పని తేలునేగాని, విపరీతమనిపింపదు. 'అసురవరులు పోరనునిహతులయ్యు మృతసంజీవని కారణమున (నిహతులు) కారు' అనికదా అన్వయపద్ధతి. పోరను మృత సంజీవని కారణమున నిహతులయ్యు' అని యథాక్రమముగా అన్వయించు రీతిని సాహిత్యపదవి కెక్కిన వారు సమ్మతింతురా? అసురవరులు మృతసంజీవని కారణమున నిహతులగుట' కలదా? దూరాన్వయ దోషభీతి ఇట్టి దురన్వయములకు దారి తీయుచున్నది. శాస్త్రిగారికి సమ్మతమయిన పాఠమునే అంగీకరించి "పోర బాఁకుదాల్చి... ప్రతిబలమునెల్లఁ బాయవడఁగఁదోలి గొడుగుక్రింద రూపుఁ బొడిచి జయంబు నీకిత్తునధిప నిన్ను నింత నన్ను" అనుచో 'నీరుగొన్నటు' అను భాగము నిరర్థకముకాదా? "కాని, నీరుగొన్నటుఅనుచో ఉపమకు 'పాకు దల్చి' యన్న నే వాక్యసంపూర్తి (45)" అని శాస్త్రిగారు వ్రాయుట ప్రక్రమ భంగము. శాస్త్రిగారి వాదదౌర్బల్యమునకిది చాలు; వారి ఎత్తుగడ ఎగిరిపోయి నది. కాని, పట్టు విడుపులుకల శాస్త్రిగారి సహృదయత ప్రశంసాపాత్రము. 'పోఁరబాకు దాల్చు నీరు గొన్నటు...' అనుట కవి హృదయమని నా యూహము. "పాఁకుదాల్చు నీరుగొన్నటు, పోరను ప్రతిబలమునెల్ల పాయ వడఁగఁదోలి గొడుగుక్రింది రూపుఁబొడిచి జయంబు నీకిత్తునధిప నన్ను నింత నమ్మి" అనుఅన్వయము సారస్యము; సముచితము.

పైఁగా, 'పాఁకుదాల్చు' అనునది మన కవిరాజ శిఖామణికి ప్రీతిపాత్ర మయిన పలుకుబడిగా కన్పట్టుచున్నది. చోడకవి ప్రయోగధోరణిని ఆమూల చూడముగా అవలోడనము చేసిన శ్రీ రెడ్డిగారు ఈ పలుకుబడిని గమనింప కుండుట వింత. "భాసురమతి వాల్మీకి - వ్యాసాదులు చనిన జగతి వరకవిదా సింహాసనమెక్కి కవీంద్రుల - దాసులుగానేలిన' (కు.సం. 1_19) కాళిదాసుఁడ నిన నన్నెచోడునకు ఈడులేని భక్తి తాత్పర్యములు. 'ఈ కుమారసంభవము కాళిదాసు కావ్యమునకుఁ దెనుఁగు కాక'పోయినను, కాళిదాసుని శ్లోకభావ రత్నములను నన్నెచోడుఁడు తనకృతిభూషలో పొదిగి దానికి సరికొత్త కాంతు

45. పైది,, పు 93.

లను సంతరించినాఁడు. పినాకపాణిని పతిగాఁగోరి పాశుపత మంత్రదీక్షను చేపట్టిన పార్వతిని వర్ణించుపట్టున కుమారసంభవ కావ్యమునగల–

"కుపలతోఁగూడ విలపిల్లు గిరిజమొగము
జడలుదాల్చినఁ గడు బెడంగడరి పొల్చె
భృంగములు మూఁగి చెలువొందు బిసరుహంబు
పాఁకు దాల్చియుఁ(46) గర మొప్పు భంగివోలె"

(కు. సం. 6–85, మదరాసు విశ్వవిద్యాలయప్రతి) అను తేటగీతి క్రింది కాళిదాసుని శ్లోకమునకు తెలుఁగుసేత.

"యథా ప్రసిద్ధైర్మధురం శిరోరుహై
ర్జటాభి రప్యేవ మభూత్త దాననమ్
న షట్పద శ్రేణీభిరేవ పంకజం
సశైవలా సంగమపి ప్రకాశతే"

(సంస్కృత. కు. సం., సర్గ. 5., శ్లో. 9)

వావిళ్ళ, మానవల్లి ప్రతులలో 'పాఁకుదాల్చియు'కు మాఱుగా 'పాఁతుదాల్చియు' అను పాఠాంతరమున్నది. సూ. ని. కారులు, సూ. ని. కార్యాలయమునందలి కుమారసంభవము వ్రాఁతప్రతి ననుసరించి 'పాఁకుదాల్చియు' అనుపాఠమునే స్వీకరించిరి.(47) 'పాఁతు' అనఁగా భూమిలోనగు వానిలోపల దిగినట్టి పర్వతము మొదలగువాని మొదలుఅని యర్థము. 'పాఁతు దాల్చియు' అనుటలో సరిగా అర్థ మొత్తగిల్లదు. బిసరుహంబు 'పాఁతుదాల్చు'ట విపరీతము కాదా ? పాఁతు దాల్చిన బిసరుహమును జడలుదాల్చిన గిరిజమొగముతో పోల్చుట ఏమిసొగసు ? అవిచక్షణులగు అక్షరచణుల వ్రాఁత తప్పుకాక ! శిరోరుహము లిట పాఁకు–శైవలము – తో ఉపమితము. ఇంచుమించు ఇట్టిదే ఇంకొకటి 'పాకు' ఘటిత పాఠము కుమార సంభవమునందలి దక్షాధ్వర ధ్వంసఘట్టమునఁగలదు.

46. "పాఁచి దాల్చియు"అని శ్రీ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారి పాఠము. చూ. కుమార సంభవ విమర్శము, మదరాసు విశ్వవిద్యాలయ ప్రకాశితము, 1937; పు. 68.

47. చూ. 'పాఁకు'; సూ. ని. సంపుటి 5, పు. 324.

"....కడిసన్న తమ్మిఁ బాఁకడరెనో
దీనవదనంబుపై నెరుల్ వెదఱితూల....
దుఃఖాతిశయమునఁ దల్లడిల్లుచున్న
పత్ని వచ్చి పురుష భైక్షంబు వేడుచుఁ
జాలఁదవుల నభవు బ్రమోలబడియె"

(క. సం. 2-88, మదరాసు విశ్వవిద్యాలయ ప్రతి).

"సరసిజమనువిద్ధం శైవలేనాపిరమ్యం..."(48) అను శాకుంతల శ్లోక భాగ భావమునకు '....కడి సన్నతమ్మిఁ బాఁకడరెనోయన...." అను భాగము అనుకృతి యనుట విదితము. ఇట 'దీనవదనము', 'కడిసన్నతమ్మి' తోడను 'చెదఱి తూలునెఱులు', 'పాఁకు' తోడను ఉపమితము; ప్రతివస్తూపమ. ఉపమాద్రవ్యముగా 'పాఁకు' కాళిదాసున కింత ఇష్టము. కావున "పోరఁబాకుదాల్చి నీరుగొన్నటు...." అనుపాఠమే సాధువనీ, చోడకవి ప్రయోగపక్కికి సమ్మతమనీ 'సతతాన్వేషిత సన్మార్గులు' గుర్తింపకపోరు. ఛురికార్థకమగు 'బాఁకు' ఘటితపాఠము నంగీకరించినచో అసలన్వయమే కుదురదు. కాఁగా, 'బాఁకు' అనుపదము ప్రయుక్తమయినదను సమస్యయే లేదు.(49) అపపాఠములపై ఆధారపడి, విపరీత ప్రతిపాదనముల సేయుటను విద్వల్లోకము హర్షింపదు.

ఇక్కడితో నన్నెచోడకవి ప్రయుక్త పద సంబంధిచర్చ సరి.(50).

---

48. అభిజ్ఞాన శాకుంతలమ్, ప్రథమోఽఙ్కః, 19.

49. అథవా 'పాఁకుదాల్చి నీరుగొన్నట్లు' = పాఁకుడును వేఱుచేసి నీరు గ్రహించినట్లు అని శ్రీ వేటూరివారి విఱుపుననుసరించి పక్షాంతరముగా అన్వయించినను తకరారులేదు. ఈ పక్షమునను 'బాఁకు' ప్రసక్తముకాదు.

50. తరువాతి రెండు వ్యాసములలో 'నన్నయ-అన్యదేశ్యాభాసముల' సమీక్ష.

# నన్నయ-అన్యదేశ్యాభాసములు-I

ఇఁక నన్నయ ప్రయోగించెనన్న గాడీ, సవతి, సవతుల విషయము. సుభద్రార్జునులకు కృష్ణుఁడు వస్తువాహనాదికములను అరణముగానిచ్చు ఘట్టమున నన్నయ భారతమున ఈ క్రింది పద్యము కలదు.

సీ॥ అవిరళక్షరిత దానార్ద్రి గండస్థల
గజసహస్రంబును గనకరత్న
రచితమై తురగసారథి సహితంబైన
రథసహస్రంబును రమ్యభూష
ణాలంకృత స్త్రీసహస్రంబుఁ గాంచన
శిబికాసహస్రంబుఁ జిత్రలలిత
గతినొప్పునేనూఱు గాడిదలను
సింధుబాహ్లీక కాంభోజ పారసీక
జాతమైనతురగ శతసహస్రము లక్ష
గోధనంబు నధిక ఘోరవీర
దర్పయుక్తులైన దశలక్షదాశార్హ
వరుల నరణమిచ్చె వామనుండు.

(నన్నయ భారతము, ఆదిపర్వము, అష్టమాశ్వాసము 221 వ పద్యము)
"ఏనూఱు గాడిదలను'' అనుచోట అనేక పాఠాంతరములు ముద్రితప్రతుల యందును, తాళపత్రప్రతుల యందును గన్పట్టుచున్నవి. పై పద్యమునందలి క్రీగీటులుగల భాగమునకు—

"తథైవాశ్వతరీణాంచ దాన్తానాం
వాతరంహసామ్
శతాన్యం జనకేశీనాం శ్వేతానాం
పంచపంచచ"

(శ్లో. 43, ఏకవింశత్యధికద్విశతితమోఽధ్యాయః, ఆదిపర్వాంతర్గత హరణహారిక పర్వణి, (మహాభారతమ్, భాండార్కర్ ప్రాచ్యపరిశోధక సంస్థవారి ప్రతి పుట 833) అన్నది వ్యాసభారతమూలము.)

ఇచట 'ఏ నూఱు గాడీలు' అను పాఠమే కవిప్రయుక్తమని శ్రీ దేవరపల్లి వేంకట కృష్ణారెడ్డిగారి ప్రతిపాదనము. "వ్యాసభారతమూలములో 'అశ్వతర' అనుతుల్యసంస్కృతపదమున్నను, తెనుగు కవికి కంచరగాడిద పాఠము దేశీయము కాదనితోచి మార్చియుండుట దోషముకాదు; ఔచిత్యము. తెనుగువారి పెళ్ళిళ్ళలో 'కంచరగాడిదలు_అరణమిచ్చు' ఆచారము కనబడదు. ఇట్టి మార్పులు నన్నయభారతములో లేకపోలేదు(1)." అని రెడ్డిగారివాదము. ఆంధ్రుల సంప్రదాయములకు విరుద్ధములగు పట్టులందెల్ల నన్నయ మార్పులు చేసినట్లు నిరూపించుట శ్రీరెడ్డిగారి కర్తవ్యము. "...యాదవాగ్రగణ్యులుఁ దాను నగణ్యమహావస్తువాహనంబులు గొని వాసుదేవుఁ డనుజకు నరణమీ నర్థితోఁ జనుదెంచి...." (ఆది 8_215)న ఘట్టమున వస్తువాహనము లొసంగుట సంప్రదాయ విరుద్ధముకాదు. "వినుమటుగాక బల్లిదపు వేసడముల్ వలతేని నిత్తు..." (భారత. అరణ్య. 4_249) అనుటనుబట్టి కంచరగాడిదలను బహూకరించు ఆచారము ఆ కాలముననుు వ్యవహారముననుండినట్లు స్పష్టము. అంతే కాదు, జూదమున ధర్మజుడోడిన వానిలో "ఖరరాసభ నివహంబులు" (సభా. 2_177)ను కలవు. భారవహనమున, శీఘ్రగమనమున కంచరగాడిదలు పెట్టినది పేరు. (అనాఁడు "...వాయు జవంబులయిన రాసభంబులం బూనిన యరదం బెక్కి..." (ఆది. 6_139) చనుట సర్వసామాన్యము.) "అశ్వాశ్వతర శిబి కాందోళకరికరిణీకరభారదానీక వాహనంబులుసిజవిభవంబువెలయంగఁ గరమర్థినెక్కి భూచరులు నడవ .... "(కు.సం.11_12) కన్నులారచూచినట్లు వర్ణించినవాఁడు కదా కవిరాజశిఖామణి "పల్లకులన్ మహోష్ట్రముల భద్రగజంబుల నందలంబులన్ – గొల్లెన బండులన్ నడక గుఱ్ఱపుమోటుల వేసడంబులన్ – బెల్లుగనెక్కి పౌరజనబృందము..." (జై. భారత. 2_113) వోవుట అనాఁడు విడ్డూరము కాదు. "పలు గుడారంబులు బరువులుమోయ – ఎద్దుల నొంటెల హెచ్చైన యట్టి – వేసడంబుల..." (పల్నాటి. పుట 29) ఉపయోగించుట తెలుఁగునాట క్రొత్తకాదు.

1. శ్రీ దేవరపల్లి వేంకటకృష్ణారెడ్డిగారి 'తెంకణాదిత్యకవి', పు. 79.

ఇది యిట్లుండనిండు. అపదాదిగా నన్నయ నాఁటిభాషలో సిద్ధదీర్ఘత యుండదు. అమాస, ఇలాయి, ఉపాసము, కటారిగుడారము, జగా, జరీ, తరాజు, తురాయి, తేజీ, దుమారము, నవలా, నేజా, పల్లకీ, బడాయి, మసీదు, మిటారి, రమారమి, లకోరీ, విలాయితీ, సవారి, హజారము - ఇత్యాద్యపదాది దీర్ఘఘటిత రూపము లన్నియును నన్నయ కర్వాచీనములు. "దీర్ఘాణాం హ్రస్వ స్యాత్" అను సూత్రము క్రింది "నచదేశ్యపదే" (అజంత పరిచ్ఛేదము. సూత్రములు 47, 48) అను ఆంధ్ర శబ్ద చింతామణి యందలి విశేష సూత్రమును, "నైకవర్ణేన దేశ్యేఽపి హ్రస్వో దేశ్యేతు వాక్వచిత్, తద్భవస్యాపి శబ్దస్యదీర్ఘాంతత్వం క్వచిద్భవేత్" (అజంత పరిచ్ఛేదము 30) అను వికృతి వివేకస్థకారిక యందలి దేశ్యతద్భవరూప సంబంధి భాగమును తదర్వాచీనాంధ్ర భాషాస్థితి ప్రదర్శకములగుటచే నన్నయాథర్వణికము లగుట అసంభవము. నన్నయాథర్వణుల నాఁటికి దేశ్యతద్భవములలో దీర్ఘాంతత మృగ్యము(2). ఇంతేకాదు. "చిత్రలలితగతి నొప్పు నేనూఱుగాడీలు సింధుజ బాహ్లిక కాంభోజ పారసీకజాతమైన తురగశత సహస్రము..." అను పాఠము పునరుక్తి దోష జుష్టము. మీఁదుమిక్కిలి చిత్రలలితగతి నొప్పునవి సజీవములగు 'గాడిద'లే గాని, నిర్జీవములగు 'గాడీలు'కావు. అయినను ఈ చిల్లరమల్లర సమాధానములు 'గాడీలు' పాఠముపై గాఢవిశ్వాసము కలవారికి సంతృప్తినీయఁజాలవు; సంశయ నివృత్తిని సేయఁజాలవు.

ఇంతకును ఇంత రగడను పెంచిన 'గాడీ' పదము శ్రీ రెడ్డిగారు భావించినట్లుగా 'తురుష్క' భాషాపదము కాదు. అరబ్బీ, తుర్కీ, పారసి భాషలలో ఈ పదము లేనే లేదు. ఉండుట కవకాశమును లేదు. అరబ్బీ భాషలో పరహాను

---

2. నామంబులకు హ్రస్వంబగు; పదాద్యేకాక్షర దేశ్యంబులకుఁ గాదు; పృథా పల్లక్యాదుల కొండె (చిన్నయసూరి, శబ్దలక్షణ సంగ్రహము, ప్రథమ ముద్రణము, 1853; తృతీయ పరిచ్ఛేదము, 83, 84, 85 సూత్రములు); నామంబుల తుది దీర్ఘంబునకు హ్రస్వంబగు; ఏకాక్షరంబులకు హ్రస్వంబులేదు. (బాలవ్యాకరణము, ప్రథమ ముద్రణము, 1858; తత్సమ పరిచ్ఛేదము, 54, 55 సూత్రములు) బాల వ్యాకరణములో దేశ్యభాగమును వదలుట దేశ్యములగు నామములతో తుదిదీర్ఘ ముండదని దీర్ఘ పరిశీలనమువలన తెలిపియా? లేక తత్సమ పరిచ్ఛేదమున దేశ్యపద నిష్పాదనము కూడదనియా?

మూలీయ (Postvelar) వర్ణమగు 'గైన్' (= గ) విశిష్టము; అరబ్బీ వర్ణమాలలో ఏది పందొమ్మిదవది. గదర్, గఫార్, గరీబ్, గలీజ్, గల్లా, గిలాఫ్, గులామ్, గుస్సా, గైర్, లుగత్-'గైన్' వర్ణఘటితములగు ఇట్టి పదములన్నియు అరబ్బీలో నిసర్గములు. హనుమూలీయ స్పర్శ (Velar stop) మగు 'గాఫ్' (= గ) పారసి భాషలో విశిష్టము; పారసి వర్ణమాలలో 'గాఫ్' ఇరువది యాఱవది. గజ్, గంజీఫా, గల్లి, గష్తి, గారా, గిర్దావర్, – గీర్ (=విజేత; అలంగీర్. జహంగీర్ మొ.), గుజార, గుమాష్త, గులాబీ, గోషా – 'గాఫ్' వర్ణఘటితములగు ఇట్టి పదములన్నియు పారసిలో నిసర్గములు. 'గాడీ' పదములోని ఆద్యవర్ణము పారసిలోని 'గాఫ్' తో సదృశము; అరబ్బీలోని 'గైన్' కంటె భిన్నము. అరబ్బీలో 'గాఫ్' లేదు. అరబ్బీ భాషకు విజాతీయమగు వర్ణముతో కూడినది కావున 'గాడీ' అరబ్బీ భాషాపదము కాఁజాలదనుట నిశ్చితము. ద్వితీయవర్ణమగు 'డ' హిందీలో అజ్మధ్యముగా ప్రతివేష్టిత తాడితము (Retroflex flap); నాలుకకొనను వెనుకకు మడచి మూర్ధభాగమును తాడితము సేయఁగా ఉచ్చరితమగు ధ్వని విశేషము; దుస్స్పృష్ట 'డ'కారమనియు, శిథిల 'డ'కారమనియు ప్రాచీన వ్యవహారము. తక్కిన తావుల హిందీలోని 'డ' ప్రతివేష్టిత స్పర్శము (Retroflex stop). తెలుఁగు, సంస్కృతములందలి 'డ' కారము ప్రతివేష్టిత స్పర్శము(Retroflex stop)హిందీయందలి 'డ', 'ఢ'లు పరస్పర పరిపూరక సన్నివేశముల (Complementary distribution) లో వచ్చు ధ్వనులు; ఏకవర్ణకుటుంబకములు. అరబ్బీ, పారసి భాషలలో ప్రతివేష్టిత (మూర్ధన్య Retroflex) వర్ణములగు ట, డ – లు (ఉర్దూ భాషలోనివి 'టే', 'డాల్' అని వ్యవహృతములు; ఉర్దూ వర్ణమాలలో 'టే' అయిదవది; 'డాల్, పంద్రెండవది. ఉర్దూకు మాతృకయగు హిందీనుండి సంక్రమించిన స్వత్వమీ వర్ణద్వయము) లేవు. అసలీ మూర్ధన్య స్పర్శ (Retroflex stop) వర్ణములు భారతీయేతర భాషలలోఁ గన్పట్టవని వేత్తల మతము. టండేల్, టికా, టుక్డా, టూకీ, టోపీ, బేటా, లోటా, ఠికానా, ఠేక్, ఠోకరా, అడారా, మిఠా, డకాయతీ, డాక్, డిబ్బి, డేరా, డోరీ, డౌల్, ఘడియాల్, ఘోడా, జోడా, నాడా, బిడా, ఖిడ్కీ, ఢలాయత్, ఢీలా, ఢోలక్ – ఇత్యాది మూర్ధన్య వర్ణఘటితములగు రూపము లన్నియు 'ఉర్దూ' లో హిందీనుండి సంక్రమించిన పదములు; కేవల భారతీయములు, అనఁగా అరబ్బీ, పారసి బాసల వాసన సైతము సోఁకనివి.

హిందీ మాతృకగా పురుడు తీర్చికొని, అరబ్బీ, పారసి బాసల పరదాల పొత్తి ళ్ళలో పెరిగి ఈ ఇద్దరు తల్లుల ముద్దుల బిడ్డగా పెరిగి పెద్దదయిన ఉర్దూలో కూడ, హిందీలోని పై పదములు వ్యవహృతము లగుటలో వింతలేదు. ఇట్టిచో 'డ' వర్ణఘటితములగు 'గాడీ' త్యాది పదములు వ్యుత్పత్తిపరముగగాని, ప్రవృత్తిపరముగగాని అరబ్బీ, పారసి బాసలలో నుండునని నిష్కర్షించుట నిర్మూలము.

శకటము, సింహాసనము అను నర్థముల 'గాడీ' పదము నవీనోత్తరాహ భాషలలో ప్రచురము. ఒరియా, కాశ్మీరీ, గుజరాతీ, నేపాలీ, బెంగాలీ, మరాఠీ హిందీ భాషలలో 'గాడి', 'గాడీ'; అవధిలో 'గాడా' 'గాడీ', పంజాబీలో 'గడ', "గడ్డీ", సింధీలో 'గాడో', "గడ్డీ సయడే" యని హేమచంద్రుని (క్రీ. శ. 1088–1172) దేశీనామమాల (3). తీర్థకల్పమను జైనమత గ్రంథ మున శకటార్థమున "గడ్డ" యను పదము ప్రయుక్తము (4). గౌడ భాషా నిఘంటు నిర్మాతల దృష్టిలో దీనివ్యుత్పత్తి ముత్తెఱఁగులు :

1. గుఱ్ఱమును లాగెడి చిన్నబండి; పెంట మొదలగునవి చేరబోసెడి బండి అను నర్థములుకల సంస్కృత 'గన్త్రికా', 'గన్త్రీ' పదములు 'గాడీ'కి మూలమని కొందఱు (5). "సయడో గంతీ" అని ధనపాలుని (క్రీ.శ. 10వ శతాబ్దము) పాఇఅ లచ్ఛీ నామమాల (6).

2. రథమునందలి గద్దె, ఎత్తయిన ఆసనము అను నర్థములుకల సంస్కృత "గర్త" పదము మాతృక యని మఱికొందఱు (7).

వేఱొకధ్వని పరిణామరీతిననుసరించి తెలుఁగు నందలి 'గద్దిగ (య)', 'గద్దె' రూపములు సిద్ధములు.

---

3. దేశీనామమాలా, మురళీధర పండిత పరిష్కృతిప్రతి, కలకత్తా.
4. మునిరతన్ చంద్రజీ మహారాజ్, అర్ధమానధీకోశము, దేశీప్రాకృత విభాగము, సంపుటము ౪, పు 731.
5. సర్ జార్జి అబ్రహాం గ్రియర్సన్, కాశ్మీరనిఘంటువు, పు. 277.
6. జీవరాజ్ దోశీ సంశోధితము, శాదీలాల్ జైన్ ప్రచురితము, 1955; సూత్రము, 963
7. సర్ రాల్ఫ్ లిల్లీటర్నర్, నేపాలీ నిఘంటువు, పు. 140.

3. సంస్కృతమునందలి 'శకటీ' పదమును మూలముగా ప్రదర్శించిన వారు కొందఱు (8). ప్రాకృతమునందలి సగడ, సగడియా, సగడీపదములు సంస్కృత శకట (టీ) పదజన్యములు (9). తెలుఁగు నందలి చెకడా, సగటు, సొగటాలు — శకట పదసంబంధులు. కచడం, కచడా, కచ్చడం, కచ్చడా — లువర్ణవ్యత్యయము కారణముగా "చెకడా" పదమునుండి వికృతి నందినరూపములు. ప్రాకృతమునందలి 'సగడీ' పదములోని ఆద్యక్షరము 'స' లోపింపగా 'గడీ', "గడ్డీ' గాడీ అయి యుండునని మూడవమతమువారి రూపనిష్పాదన ప్రక్రియ కాబోలు ! ఆద్యక్షర మగు 'స' లోపించుట గౌడభాషలలో క్వాచిత్కమగు ధ్వని పరిణామము.

కాఁగా, శాస్త్రసంప్రదాయము మేరకు 'గాడీ' హింద్వార్య భాషాజన్యమయిన అన్యదేశ్యము, కావున 'గాడీ'ని తురుష్క భాషాపద మనుట వృథా వాదము. "పోనిండు. 'గాడీ' తురుష్కభాషా పదమను వాదమును వదలుకొందము. కాని, ఇది హింద్వార్య భాషాజన్య మయిన అన్యదేశ్యమనుటలో అభ్యంతరము లేదుకదా ! అట్టిచో 'గాడీ' పదఘటితమగు నన్నయ భారత పాఠసమన్వయమె" ట్లని పూర్వపక్షమువారి ఆక్షేపము. ఇదిగో సమాధానము

'గాడీలు' అను నన్నయ పాఠమును నవ్యులు 'గాడిదలను' గామార్చిరని కదారెడ్డిగారి వాదము. వీరి వాదమునకు శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులు గారు పరిష్కరించిన భారత ప్రతి ఆధారము. మఱి, మేము నన్నయ భారతము తాళపత్రప్రతులను నూఱింటికిపైగా కంటవ త్తిడికొని పరిశోధించినాము. గుజిలీ ప్రతులు పదునాఱింటిని పరిశీలించినాము, 1901—1959 మధ్య వచ్చిన ముద్రిత ప్రతులను పాతికపైచిలుకు సరిచూచినాము. తాళపత్రప్రతులు పెక్కింట 'ఏ నూఱు గాడిదలను' అను పాఠముకలదు. 1907 కు పూర్వము ముద్రిత మయిన భారత ప్రతులలో సర్వేసర్వత్ర 'ఏ నూఱుగాడీలు' అను పాఠము కన్పట్టుచున్నది. 1907 మొదలుగా ప్రచురితములయిన ఆది సరస్వతీనిలయ, ఆనందముద్రణాలయ, కణ్ణా సెట్టి&కో., చంద్రికాముద్రణాలయ, రామా&కో.,

---

8. పండిత శ్యామసుందరదాస్, హిందీశబ్దసాగర్, పు. 793.
9. హర్ గోవిందదాస్ త్రికమ్‌చంద్ సేఠ్, పాఇఅ సద్దమహణ్ణవో, పు. 1071.

వావిళ్ళ, శ్రీకృష్ణ సేవాలయ ప్రతులలో 'ఏనూఱుగాడిదలను' అనునది అంగీకార్యమయి ప్రామాణిక పాఠముగా వ్యాప్తిచెందినది. 'గాడీలు' పాఠమును స్వీకరించిన ఇటీవలి ప్రతులు అటనట మఱికొన్ని లేకపోలేదు. అనఁగా 'గాడీలు' అనుపాఠమును 'నడుమంత్రపుపాఠ' మని పూర్వవ్యాసమున అభివర్ణితమగుట సమస్త సరిపోయినదికదా: "ఇది (ఏనూఱుగాడీలు) శ్రీ కందుకూరి ముద్రిత పాఠము" అని శ్రీ రెడ్డిగారు వ్రాయుట పాక్షికసత్యము. కందుకూరి వీరేశలింగము పంతులుగారి పుట్టుక (16, ఏప్రిల్, 1848)కు పూర్వము ముద్రితమయిన ఒకటి రెండు ప్రతులలో 'గాడీలు' పాఠమున్నది. ముందు ముద్రితప్రతుల ముచ్చట. వివిధములగు భారత ముద్రణముల యందును, తక్కిన ఆకరముల యందును గల పాఠములు కాలక్రమాను గుణముగా యథలబ్ధిగా నీ దిగువ ప్రదర్శితము. విద్యాక్రమ తత్త్వవేత్తలగు పెద్దలు ఈ క్రింది పాఠముల సరళిని పరికింప వేడికోలు.

క్రీ.శ. 1833 (?) "... చిత్రలలితగతినొప్పు నే నూఱు గాడీలు సింధుజ బాహ్లిక కాంభోజ పారసీక జాతమైన తురగ శతసహస్రము..." (పుట 120) మా. వేంకటకృష్ణమాచార్యులు, రా. వెంకట కృష్ణశాస్త్రీ తో. విజయరాఘవ కవి ఈ మువ్వురిచే లేఖక ప్రమాదజనిత దోషంబులు వారింపబడి ఆలూరి-ఏకామ్ర జోస్యులవారి స్వకీయంబగు జ్యోతిష్కళానిధి ముద్రాక్షరశాల యందును, పువ్వాడ వేంకటరావుగారి స్వకీయంబగు చెన్నపట్టణపు - వర్తమాన తరంగిణీ ముద్రాక్షరశాల యందును ముద్రాక్షరాంకితము సేయఁబడి శాలివాహన శకవర్షంబులు 1755 (10) పరీధావినామ సంవత్సర పుష్యశుద్ధ ౧ సోమవారమున దూర్వాసుల జగన్నాధ సుబ్బారావు ప్రభృతి సమూహమువారి వలన ప్రకటితమయిన ఆంధ్ర భారత ప్రతి, ఆదిపంచకము)

1847. "....గతినొప్పు నే నూఱు గాడీలు ...." (చెన్నపట్టణములోని కాంచీపురము పచ్చయప్ప మొదలారిగారి విద్యాశాలయం దాంధ్ర గీర్వాణ

10. 1775 అని యుండవలెను. శక. 1775 తో వలె 1755తో పరీధావి అను రూప సంవత్సరముగా సంపదించుటలేదు పరీధావి, పుష్యశుద్ధ ౧ సోమవారము - క్రీ. శ. 1853, జనవరి, 10 వ తేదీతో సరిపడుచున్నది. (Swami Kannu Pillai Indian Ephemeris, vol VII, 1800-2000)

ప్రధానోపాధ్యాయులయిన వైయాకరణ రామానుజాచార్యుల వారిచేత లేఖక ప్రమాదాది దోషంబులు లేకఁ బరిశోధింపఁబడి, హానరేబిల్ కంపెనీవారి యూని వర్శిటీ యను శాస్త్ర పాఠశాలయం దాంధ్రోపాధ్యాయులయిన వ. చిన్నయగారి చేత సరిచూడఁబడి, దీనికి శాస్త్ర నిబంధనములను మెండుగా నుంచక వైయా కరణ రామానుజాచార్యుల వారిచేతనే భారతవచనంబను పేరుగలదిగాఁ జేయ బడిన ఛాయా వ్యాఖ్యానముతోడ శాలివాహన శక వర్షంబులలో 1769 వదియగు ప్లవంగనామ సంవత్సరాధిక జ్యేష్ఠశుద్ధ 3 (క్రీ. శ. 1847, మేనెల, 17వ తేదీ) సోమవారంబునందు సరస్వతీపీఠ ముద్రాక్షరశాలయందు అచ్చువేయఁబడిన ప్రతిం ఆదిపర్వము).

1881. "అవిరళ శశిపదానార్ద్రి....శిబికా సహస్రంబుఁ జిత్రలలిత గతి నొప్పునే నూఱుగాడీలు సింధుజబాహ్లీక...." (పంచాంగము వారను వ్యవహార నామముగల భద్రాచలం — తిరుమల నరసింహాచార్యులవారిచేఁ బరిష్కరింపఁబడి పిళ్ళారిసెట్టి రాఘవయ్యనాయని వారిచే శ్రీ భారతీనిలయ ముద్రాక్షరశాలయందు 1881 సం॥ ఫిబ్రవరి నెలలో ముద్రితమయి ప్రచురితమయిన ప్రతి.)

1885 'గాడి'. వి, రథవిశేషము (రూ. గాడీ. "చిత్రలలితగతి గతినొప్పు నే నూఱు గాడీలు". భార. ఆది. ౮. ఆ. — శబ్దరత్నాకరము, ప్రథమ ముద్ర ణము, 1885, పుట 317. "వాస్తవార్థ పరిజ్ఞాన సిద్ధికిని, విశేషపద ప్రాప్తికిని మూలకారణంబగు నాంధ్ర భారతాది గ్రంథ పరిశోధనంబునం దత్యంత సముత్సుకు" (శబ్ది రత్నాకర పీఠిక) లగు బహుజనపల్లివారును 'గాడీలు' పాఠ మును స్వీకరించుట చింత్యము. శబ్ద రత్నాకరము తరువాతి ముద్రణముల (1912, 1922, 1929, 1937, 1958) యందును మార్పులేదు.

1887. "....శిబికా సహస్రంబు జిత్రలలితగతి నొప్పు నే నూఱుగాడీలు సింధుజ బాహ్లీక కాంభోజపారశీకజాతమయిన..." (పు. 107 ములుకుట్ల విశ్వ నాధ శాస్త్రిలవారిచే పరిష్కరింపబడి, ములుకుట్ల వెంకటప్పయ్య వారిచేతను, పంచాంగం శ్రీకాకుళాచార్యులవారిచేతను. వంకాయల కృష్ణస్వామి శెట్టిగారి చేతను, చిత్తూరు గురుస్వామి మొదలిగారిచేతను, మోపూరు కృష్ణమరాజుగారి కుమారుడగు తుళసి రాజుగారి స్వకీయమగు విబుధమనోహారిణీ ముద్రాక్షరశాల యందు 1887 సం॥లో ముద్రితమయి ప్రచురితమయిన ప్రతి).

1888. 'గాడీ' ఎడ్లనుకట్టు రథము ॥ఉ॥ చిత్రలలితగతినొప్పు నే నూఱు గాడీలు॥ భా. (పు. 186, ఓగిరాల జగన్నాథకవి, గురజాడ శ్రీరామ మూర్తి రచితమగు ఆంధ్రపద పారిజాతమను శుద్ధాంధ్ర నిఘంటువు. పిడుగు వేంకటప్పారావు సంపాదితము, శారదానిలయము, ముద్రాక్షరశాలలో ముద్రి తము, చెన్నపట్టణము, 1888).

1890. "....శిబికా సహస్రంబుఁ జిత్రలలిత గతినొప్పు నే నూఱుగాడీలు సింధుజ బాహ్లిక కాంభోజపారసీక జాతమయిన తురగ శతసహస్రము...." (పు. 101, పండితులచే పరిష్కరింపబడిన ప్రతి ప్రకారం సరిచూడబడి చెన్న పట్టణం — గుజరాతి వీధియందలి వంకాయల కృష్ణస్వామి శెట్టివారిచే స్వకీయ శ్రీరంగవిలాస సరస్వతీ విలాస ముద్రాక్షరశాలలయందు సచిత్రంబుగా ముద్రిం పంబడిన ప్రతి ఆదిపంచకము, 1890).

1891. "...శిబికాసహస్రంబు జిత్రలలితగతి నొప్పునే నూఱుగాడీలు సింధుజ బాహ్లిక కాంభోజపారశీక జాతమయిన..." (సరస్వతీ విలాస ముద్రాక్షర శాలయందు తచ్ఛాలాధికారియగు నేలటూరి వెంకట సుబ్బాశాస్త్రులవారిచేతను, కొండగుంట రాఘవశాస్త్రుల వారిచేతను 1891 లో చెన్నపట్టణమున ముద్రిత మయి ప్రచురితమయిన ప్రతి.)

? "...శిబికా సహస్రంబుఁ జిత్రలలితగతి నొప్పు నే నూఱు గాడీలు సింధుజ బాహ్లిక...." (పు. 101, వెస్టువార్డు కంపెనీవారి గుజిలీప్రతి. విజయ నగర పండితులు శ్రీ ఆదిరాజు భాస్కరశాస్త్రిగారిది).

? "...చిత్రలలితగతినొప్పు నే నూఱు గాడీలు సింధుజ...." (పు. 103) పుట చివరిపంక్తులు, వంకాయల కృష్ణస్వామి శెట్టివారి 1890 ప్రతికంటె భిన్న ముద్రణము, విశాఖపట్టణము, మహారాజా సర్ గోడే నారాయణగజపతి హిందూ కీడింగురూములోని గుజిలీప్రతి).

1893. "అవిరళక్షరిత దనార్ద్ర గండస్థల గజ సహస్రంబును...చిత్ర లలితగతినొప్పు నేనూఱుగాడీలు సింధుజ బాహ్లిక కాంభోజపారసీకజాతమైన..." పు. 101, పండితులచేత పరిష్కరింపఁబడి చెన్నపట్టణము శ్రీమాన్ గుదిమెళ్ళ

వెంకట వరదాచార్యుల వారిచేత వాకృతీనిలయ ముద్రాక్షరశాలయందు ముద్రిత మయి, ప్రచురితమయిన గుజిలీప్రతి, ఆదిపర్వము, (1893).

? "చిత్రలలితగతి నొప్పు నే నూఱు గాడీలు సింధుజ...." (పు 116, బొబ్బిలిపండితులు శ్రీ అంపోలు అప్పలాచార్యులుగారి యొద్దనున్న గుజిలీ ప్రతి, ఆదిపంచకము; ముఖ పత్రము, తొలిపుటలు లేనందున ప్రకాశకాది వివరములు తెలియవు)

? "శిబికా సహస్రంబుఁ జిత్రలలితగతి నొప్పు నేనూఱు గాడీలు సింధుజ....'' (పు. 101, బహు దేశంబులనుండి ప్రాచీన గ్రంథంబు లనేకంబు రావించి.... పండిత సాహాయ్యంబునం బరిష్కరించి... రెండవ పర్యాయము హరి వంశ సహితముగాఁ బందొమ్మిది పర్వంబులును సమగ్రంబుగా నచ్చు గూర్పించి ప్రకటించిన గుజిలీ ప్రతి, వంకాయల కృష్ణస్వామి శెట్టివారిది).

1894. "...మరియు చిత్రవిచిత్రముగా నుండెడి యే నూరుగాడీలను, కృష్ణుడు సుభద్రార్జునులకు యిచ్చె. మఱియు కృష్ణుడు లక్ష గుర్రములను, సుభద్రార్జునులకు యిచ్చె. ఆ గుఱ్ఱములు సింధుదేశ బాహ్లికదేశ కాంభోజదేశ పారసీక దేశములయందు బుట్టినవి యగును...'' (పు. 190, మంత్రి లక్ష్మీనారాయణ శాస్త్రిగారి ఆంధ్ర వచనభారతము, ఆదిపర్వము; చన్నపురి, బరూరు_త్యాగరాయ శాస్త్రులచే స్వకీయ గీర్వాణభాషా రత్నాకర ముద్రాక్షరశాలయందు ముద్రింపబడి, ప్రకటింపంబడిన గుజిలీప్రతి, 1894).

? "...గతినొప్పు నేనూఱు గాడీలు సింధుజ..." (పు. 110, గోదావరి జిల్లా — కొమరాజులంక వాస్తవ్యులు శ్రీ చిలుకూరి వేంకటశాస్త్రులుగారి యొద్ద నున్న గుజిలీప్రతి, ఆదిపంచకము. ముఖపత్రములేదు.)

? "...చిత్రలలితగతి నొప్పు నేనూఱు గాడీలు సింధుజ..." (పు. 113, అనంతపురము జిల్లా, కల్యాణదుర్గము తాలూకా, అంకంపల్లి వాస్తవ్యులు పాటీలు తిమ్మారెడ్డిగారి యొద్దయున్న గుజిలీప్రతి, ఆదిపంచకము, మొదటి ఆఱు ఆశ్వాసముల భాగము లేదు).

1901. "శిబికాసహస్రంబుఁ జిత్రలలితగతి నొప్పు నేనూఱుగాడీలు సింధుజ బాహ్లిక కాంభోజ పారసీక జాతమైన తురగ శతసహస్రము...." (పు. 230, ఆది. 8_221 ; రావుబహద్దరు కందుకూరి వీరేశలింగము పంతుల వారిచేతను రాయదుర్గము నరసయ్య శాస్త్రులవారిచేతను బరిష్కరింపఁబడి శత ఘంటము వేంకటరంగ శాస్త్రులవారి పీఠికతో మద్రాసు ఆనంద ముద్రాక్షరశాల యందు ముద్రితమై వేమూరి వేంకట కృష్ణమసెట్టి అన్డ్ సన్సుచే 1901 లో తొలికూర్పుగా ప్రకటితమయిన ఆంధ్ర భారతప్రతి, ప్రథమ సంపుటము, ఆది పంచకము, ప్రత్యేక పద్యపాద విభజనముతో, మంచి గ్లేజుకాగితముల మీఁద ముచ్చటగా అచ్చయిన ప్రతులలో నేను చూచినంతదాఁక ఇదే మొదటిది).

1902. "గాడీ" శబ్దముం గుఱించి : (11) 'గాడీ' శబ్దము హిందూస్థానీ పదము. తురకలీశబ్దముం బలుమాఱు వాడుచుండుట నందఱెఱింగి యుందురు. గాడీయనఁగా నెద్దులనుగట్టు రథము. ఈ పదమును, నన్నయభట్టు భారతములో నాదిపర్వము 8 వ యాశ్వాసములో 221 వ పద్యమున :—

సీ॥ ...చిత్రలలిత । గతినొప్పునే నూఱుగాడీలు....

అని ప్రయోగించియున్నారు. శబ్దరత్నాకరమున నీ పదము దేశీయమని వ్రాయఁబడి యున్నను, దీనిం దురకలిప్పుడు వాడుచునే యుండుట హస్తామలకమే. కవిత్రయమువారి కాలమునను, నన్యభాషాపదము లున్నట్లులుగఁ బ్రబల నిదర్శనము."

— పత్రికాధిపతి,

[అముద్రిత గ్రంథ చింతామణి మయూఖము, నెల్లూరు, సంపుటము 15. పు. 32, జనవరి ఫిబ్రవరి సంచిక, 1902].

1903 "...చిత్రలలితగతి నొప్పునేనూఱు గాడీలు...'' (పు. 363, నాఁటి ప్రెసిడెన్సీ కాలేజీలో ఆంధ్ర పండితులగు రావుబహద్దరు కందుకూరి వీరేశ

11. ఈ యాకరము ఉనికినిగూర్చి తెలిపినవారు మిత్రులు శ్రీ శ్రీధరమూర్తి, శ్రీబొమ్మకంటి శ్రీనివాసాచార్యులుగార్లు, అముద్రిత గ్రంథ చింతామణిలోని ఈ వ్యాసమును వ్రాసి ఇచ్చిన శ్రీ కూనపులి వెంకటరమణయ్యగారికి కృతజ్ఞతాభివందనములు.

లింగము పంతులుగారు పరిష్కరించిన బ్రౌణ్యము, ఆంధ్రాంగ్ల నిఘంటువు, 1903 ; బ్రౌణ్యము ప్రథమముద్రణము (1852) నందీ పాఠప్రసక్తియే లేదు.)

? "...చిత్రలలితగతి నొప్పు నేనూఱు గాడీలు సింధుజ..." (పు. 130, రెండవభాగము, బెద్దచ్చు ఆదిపర్వము. మొదటి పదునాఱు పుటలు లేవు. క్రింది 1910 ప్రతికంటె ప్రాచీనతర మయిన గుజిలీప్రతి. పశ్చిమాంధ్ర ప్రాంతముల బహుళ ప్రచారములో నుండిన శేషాచార్యులు, మదరాసువారి ప్రతి కానోపు.)

1910"...చిత్రలలితగతి నొప్పు నేనూఱు గాడీలు సింధుజ..."(పు.125, రెండవ భాగము; చెన్న పట్టణము నాతా నమ్మయ్యశెట్టి అండ్ సన్ వారి శ్రీరామానుజ విలాస ముద్రాక్షరశాలయందు 1910 లో ముద్రితమయి ప్రచురిత మయిన పెద్దచ్చు ఆదిపర్వము, గుజిలీప్రతి. ఇదే మా పినతాత శ్రీ తూమాటి భీమప్పగారు (1872-1948) నా చిన్నప్పుడు (1937-1939) పాఠముచెప్పినప్రతి).

1911. "...గతి నొప్పు నేనూఱుగాడీలు సింధుజ బాహ్లిక కాంభోజ పారసీక జాతమైన..." (పు. 230, ఆది 8-221, సుజనరంజనీ, కాకినాడ వారి ప్రతి, 1911).

1915. "...దేశ్యములో, అన్యదేశ్యంబని మఱి యొండు విధంబు గలదు. ఉదా॥ ఠావు, పైఠాణము, గాడీ ఇత్యాది హిందూస్తానీ పదములును... ఆంధ్రమునందుఁ గవి సంప్రదాయసిద్ధముగాఁ బ్రయోగింపవచ్చును. ... "రమ్య భూషణాలంకృత స్త్రీ సహస్రింబుఁ గాంచన శిబికాసహస్రింబుఁ జిత్రలలితగతి నొప్పు నేనూఱు గాడీలు సింధుజ బాహ్లిక కాంభోజ పారశీక" — భార. ఆది. 8 ఆ. " (పు. 16, కల్లూరి వేంకటరామశాస్త్రిగారి బాలవ్యాకరణ గుప్తార్థ ప్రకాశిక - రాజమహేంద్రవరము, 1915).

1923. "ఏనూఱు గాడీలను" (పు. 68, 'దీర్ఘాణాంహ్రస్వస్స్యాత్ నచ దేశ్యపదే' అను సూత్రముల యొద్ద ఆంధ్రశబ్దచింతామణికి పారనంది రామ శాస్త్రిలుగారు చేసిన ఉద్యోతినివ్యాఖ్యలో ఉదాహృతమయిన లక్ష్యము. శ్రీ కాశీ నాథుని నాగేశ్వరరాయ ప్రకాశితము, మదరాసు, 1923.)

1937. "హేయములు గాకయున్నను యాయా దేశాంతరీయమగు శబ్దం బుల్ తోయలి తలమానికమా!

'యీయెడిని ప్రయోగమునకు సర్వాంబులుగన్' ... 'కాంచన శిబికాసహస్రింబుఁ జిత్రలలితగతి నేనూఱు గాడీలు ... 'ఇవి హిందూస్తాని పదములు' (పు. 17, సంజ్ఞాపరిచ్ఛేదము, నారాయణీయాంధ్రవ్యాకరణము, గాణపత సూత్ర వివరణసహితము, శ్రీ విద్వజ్జన మనోరంజనీ ముద్రణాలయము, పిఠాపురము 1937).

1937. "అన్యదేశ్యములగు దీర్ఘాంతపదముల తుదిదీర్ఘమునకు హ్రస్వము రాదు. గాడీలు (12) (ఆది viii. - 21) దీనికి 'గాడిదలు', 'గాడ్దలు' అని పాఠాంతరములు కాన్పించుచున్నవి.'' (పు. 1358, రెండవ సంపుటము, డా. చిలుకూరి నారాయణరావుగారి ఆంధ్ర భాషాచరిత్రము, ఆంధ్రవిశ్వకళా పరిషత్ప్రకాశితము, వాల్తేరు, 1937) (12) "నన్నయ కాలమున దీర్ఘాంతములగు దేశ్యపదముల కుదాహరణములు కానరాలేదు'' అని ఇదే సంపుటమున శ్రీ నారాయణరావుగారు వ్రాయుట గమనార్హము. ('నచదేశ్యపదే' అను ఆంధ్రశబ్ద చింతామణి సూత్రమునకు డా. చిలుకూరి నారాయణరావుగారి హృదయము, ఆంధ్ర భాషా చరిత్రము పు. 1634). రమారమి నూఱేండ్ల వ్యవధిలో గతాను గతికముగా "గాడీలు" పాఠమిట్లు స్వీకృతము. ఇదంతయును "గాడీలు'' పద ఘటితమే అసలు పాఠమను వాదమునకు సంవాదకమయిన సాధకసామగ్రి. తత్త్వాన్వేషణమున సత్యనిహ్నవనము పనికిరాదు కదా! వాదిప్రతివాదుల అభియోగ నిరూపణముతో తగవు తేలదు; ధర్మాసనము వారి తీర్పుకదా ముఖ్యము.

కాని, ముద్రిత ప్రతుల పాఠములపై కుమ్ములాడుట నిష్ప్రయోజనము. అనేక తాళపత్ర ప్రతులలో గుజిలీప్రతుల పాఠమునకు భిన్నముగా 'ఏనూఱు గాడిదలను' అను పాఠమే కన్పట్టుచున్నది. కర్తృభిప్రేతమగు మూలపాఠమును నిర్ణయించు నిమిత్తము కాకినాడ, తంజావూరు, తిరుపతి, మదరాసు, రాజమహేంద్రవరము, వాల్తేరు, విజయనగరములలోని తాళపత్రప్రతులు నూటికిపైగా సరిచూడఁబడినవి. నేను స్వయముగా పరిశీలించినవి తొంబదికి

12. "ఈ పాఠము అసందర్భము. నన్నయనాఁటికీ పద మేలేదు. 'గాడీ' చాల నవ్యమయిన హిందీ పదముగదా'' Marginal Notes by Prof. G. J. Somayaji; డా. చిలుకూరి - ఆంధ్ర భాషా చరిత్రము, పు. 1358.

పై మాట. నా యీ పనికొఱకు సాహితీ బంధువులు పరిశీలించినవి పాతికపై చిలుకు (13). పర్యాప్తమయిన ఈ పరిశీలనము వలని ఫలితములివి :

13. వివిధప్రాంతములలోని తాళపత్ర ప్రతులను పరిశీలించుటలో తోడ్పడియు, స్వయముగా వ్రాసి పంపియు సహకరించిన సాహితీబంధువులు చాలమంది. అందఱకును కృతజ్ఞతాభి వందనములు.

కాకినాడ : ఆంధ్రసాహిత్య పరిషద్గ్రంథాలయము నందలి తాళపత్రప్రతులను పరిశీలించుటలో సంపూర్ణ సహకారమిచ్చిన మిత్రులు శ్రీ దువ్వూరి సూర్యనారాయణశాస్త్రిగారు, పరిషత్కార్యాలయోద్యోగి శ్రీ కూనపులి వెంకటరమణయ్యగారు.

తంజావూరు : మహారాజా శరభోజీ సరస్వతీమహలు లైబ్రరీ గౌరవ కార్యదర్శిగారు, గౌరవ లైబ్రరీ పండితులు శ్రీ యస్. విశ్వనాథముగారు.

తిరుపతి : శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్య పరిశోధకసంస్థ గ్రంథాలయ అధికారులు, ముఖ్యముగా శ్రీ యస్.సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, ఎం.ఏ., క్యూరేటరు, పండిత ఎస్. వి. భాస్కరరావుగారు. అక్కఱగల పాఠములను వ్రాసిపంపిన మిత్రులు శ్రీ బూదరాజు రాధాకృష్ణ, ఎం. ఏ., (చీరాల కళాశాలలో ఆంధ్రోపన్యాసకులు), పండిత శ్రీ ఉదయగిరి శ్రీనివాసాచార్యులుగారు (తిరుపతి ప్రాచ్య పరిశోధకసంస్థ పండితులు).

మదరాసు : ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయాధికారులు; వలయు పాఠములను వ్రాయించి పంపిన మిత్రులు శ్రీ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులుగారు, తెలుఁగు భాషాసమితి, మదరాసు.

రాజమహేంద్రవరము : ఆంధ్రేతిహాస పరిశోధకమండలి గ్రంథాలయము. నా ఉద్యమము నెఱిఁగి, ఆనందించి, ఆశీర్వదించిన పూజ్యులు శ్రీ రాళ్ళబండి సుబ్బారావుగారు, ఎం. ఏ., ఎల్. టి. మండలి వ్యవస్థాపకులు; పాఠములను వ్రాసియిచ్చిన మిత్రులు పండిత శ్రీ శ్రీపాద పేరయ్య శాస్త్రిగారు.

గౌతమీ గ్రంథాలయము నందలి తాళపత్ర ప్రతి పాఠములను వ్రాసిపంపిన మిత్రులు, జానపద వాఙ్మయోద్ధారకులు శ్రీ నేదునూరి గంగాధరముగారు.

వాల్తేరు : ఆంధ్రవిశ్వకళా పరిషద్గ్రంథాలయాధికారులు; లిఖితగ్రంథవిభాగ పర్యవేక్షకులు శ్రీ కొమ్మనమంచి జోగయ్యశర్మగారు.

విజయనగరము : విజయనగరము మహారాజావారి ఫోర్టులైబ్రరీ ఉద్యోగి శ్రీ జి. సాంబశివరావు; ప్రభుత్వ సంస్కృత కళాశాలా విద్యార్థులు వఠిష్ఠవుల డి. సత్యనారాయణరాజు, అప్పల నరసింహము.

1. కాకినాడ : ఆంధ్రి సాహిత్య పరిష్గ్రింథాలయమునందలి తాళపత్రి పత్రితులు (సేకరింపఁబడిన మండలముల వారీగా ఉదాహృతములు)

i. నెల్లూరు మండలము :

నెంబరు 11. చిత్రిలీలగతినొప్పు నెనూరు గంధసింధురము (254 వ ఆకు మొదటివైపు)

నెం. 30. చిత్రిలలితగతినొప్పు నెనూరు గాడిదెలను సింధుబాంహ్లీక (185 వ ఆకు, రెండవవైపు).

నెం. 36. చిత్రలలితగతినొప్పు నెనూరు గాడిదెలును శింధు బాంహ్లీక పారశీయ జాతమైన (156 వ ఆకు).

నెం. 639. చిత్రలలితగతినొప్పు నేనూరు గాంద్ధర్వహయములు (196వ ఆకు).

నెం. 664. చిత్రలీలగతినొప్పు నెనూరు గాడిబండ్లును (173 వ ఆకు).

నెం. 704. చిత్రలీలగతినొప్పు నెనూరు గాడి బండ్లును సింద్ధు (204 వ ఆకు, రెండవవైపు).

నెం. 750. లలితగతినొప్పు నెనూరు గంధర్వ భంబ్బున (204 వ ఆకు).

నెం. 810. చిత్రలలితగతినొప్పు నెనూరు ఖరములు మరి సింద్ధు (176 వ ఆకు, మొదటివైపు).

నెం. 914. లలితగతినొప్పు నేనూరు గాళల వరశింధు బాంహ్లీక(111వ ఆకు, మొదటివైపు).

నెం. 2310. లలితగతినొప్పు నేనూరు గార్ధభంబులు సింధు ( 175 వ ఆకు, రెండవవైపు).

నెం. 2644. చిత్రలలితగతినొప్పు నెనూరు గాడిదలును (96 వ ఆకు, మొదటివైపు).

నెం. 4346. చిత్రలలితగతినొప్పు నూరు లోష్ట్రములు.

నెం. 4370. చిత్రలలితగతినొప్పు నెనూరు గాడిదెలును (236 వ ఆకు, రెండవవైపు : పింగళ శ్రావణ శుద్ధ 14 లు).

నెం. 4412. చిత్రలలితగతినొప్పు నెనూరు గాడిదెలుం సింధు బాహ్లీక కాంభోజ (134 వ ఆకు, మొదటివైపు).

ii. చిత్తూరు మండలము :

నెం. 133...(?) సలలితగతినొప్పు నెనూరు గాడెదలును బాంహ్లీక సింధు కాంభోజ (208 వ ఆకు, రెండవవైపు).

నెం. 1633. చిత్రలలితగతనొప్పు నెనూరు శింధ్ధు బాంహ్లీక కాంభోజ పారశియ్య జాతమైన (173 వ ఆకు).

నెం. 2006. అవిరళస్ఫురిత దానార్ద్ర గండస్థల చిత్రలలితగతినొప్పు నెనూరు గంధర్వ హయములు (శార్వరి, వైశాఖ శు ౨ శనివారము).

నెం. 2181. చిత్రలలితగతినొప్పు నెనూరు ఖరములు మరి సింద్ధు బాంహ్లీక కాంభోజ పారశియ్య జాతమైన (210 వ ఆకు, నల భాద్రపద శుద్ధ ౧ శుక్రవారము).

iii. అనంతపుర మండలము :

నెం. 4056. అవిరళస్ఫురిత దానాగ్ర గండస్థల ... చిత్రలలితగతి నొప్పు నెనూరు గాడిదెలున్ సింధు బాంహ్లీక కాంభోజ పారసియ్య జాతమైన (170 వ ఆకు, రెండవవైపు).

నెం. 4091. చిత్ర లలితగతి నెనూరు గాడిలు మరి శింద్ధుబాంహ్లీక.

నెం. 4124. గతి నొప్పు నేనూరునాడిలు శింధుజ (181 వ ఆకు-రెండవవైపు).

iv. కర్నూలు మండలము :

నెం. 1329. చిత్రలలితగతి నొప్పు నెనూరు గాడుదులను శింధుబాంహ్లీక కాంభోజ పారశియ్య జాతమైన (151 వ ఆకు, రెండవవైపు; తారణ భాద్రపద శు. ౧౦ లు)

v. గుంటూరు మండలము :

నెం. 3915. చిత్రలలితగతి నొప్పు నెనూరు గార్ధ భంబ్బులు శింధ్ధు (170 వ ఆకు, మొదటివైపు; బహుధాన్య పుష్య బ. ౮, ఆదివారము – క్రీ. శ. 1759 జనవరి, 21).

vi. కృష్ణామండలము:

నెం. 979. అవిరళ గణిత ధానార్ధ... జిత్రలలిత గతినొప్పు నెనూరు గాడిదెలను శింధు బాహ్లిక పారశికజాతమైన (137 వ ఆకు; ప్లవంగ, మాఘ శు. ౧౦ సోమవారము; క్రీ. శ 1848 ఫిబ్రవరి, 14).

నెం. 2733. చిత్రలలితగతి నొప్పు నెనూరు గార్ధభంబ్బులు సింధ్దు నెం. 3698. గతి నొప్పు నెనూరు గంధర్వ హయములు బాంహ్లిక కాంభోజ పారశియ్య జాతమైన (255 వ ఆకు, రెండవ వైపు)

vii. గోదావరి మండలము :

నెం. 1014. చిత్రలలితగతి నొప్పునెనూరు ఖడ్గాదులను సింధుబాంహ్లిక కాంభోజ పారశియ్య జాతమైన (224 వ ఆకు, రెండవ వైపు; వికారి. కార్తిక శుద్ధ ౭ శనివారము).

నెం. 4550. అవిరళ స్రవిత దానార్ద్ర గండస్థల గజసహస్రంబ్బును... చిత్ర లీల గతినొప్పు నెనూరు గంధర్వహయములు బాంహ్లీక కాంభోజ పారసియ్య జాతమైన (160 వ ఆకు, మొదటి వైపు).

viii. నల్లగొండ(కొలనుపాక) :

నెం. 3452. లలితగతి నొప్పునెనూరు గాడియ్యలను సింధు (135 వ ఆకు, మొదటివైపు).

ix. దక్షిణ దేశము :

నెం. 85. చిత్రలలితగతి నొప్పు నెనూర గాడిదెలను శింధు బాంహ్లీక కాంభోజ పారసియ్య జాతులైన (206 వ ఆకు, మొదటి వైపు).

నెం. 226. చిత్రలలితగతి నొప్పునెనూరు గాడిదెలను (205 వ ఆకు, మొదటివైపు).

నెం. 227. జిత్రలలితగతి నొప్పు నెనూరు గాడిదెలను సింధు బాంహ్లీక కాంభోజ పారసియ్య జాతమైన.

నెం. 309. చిత్రలలితగతి నొప్పు నెనూరు గాడిదులను శింధుబాంహ్లీక కాంభోజ పారశియ్య జాతమైన (236 వ ఆకు, మొదటివైపు; నళసంవత్సర మాఖ శుద్ధ ౭ శెనివారం, తై నెల 26 వ తేది క్రీ. శ. 1797, ఫిబ్రవరి, 4 వ తేదీ).

నెం. 361. జిత్రలీల గతినొప్పు నెనూరు గాడిదెలను సింధు బాంహ్లీక కాంభోజ పారశియ్యజాతమైన (233 వ ఆకు, రెండవవైపు).

x. ఇతరములు (ఏ ప్రాంతమునకు చెందినవో స్పష్టపడని తాళపత్ర ప్రతులు) :

నెం. 669. చిత్రలలితగతి నొప్పు నెనూఱు ఘనగజంబ్బులు సింధు బాంహ్లీక.

నెం. 1473. లలితగతి నొప్పు నెనూరు గాడిదెలను సింద్ధు బాంహ్లీక కాంభోజ పారసియ్య (201 వ ఆకు, రెండవవైపు).

నెం. 1708. అవిరళఝరిత దనార్ద్రగండ స్థలగజ సహస్రంబ్బును...చిత్ర లలితగతి నొప్పు నేనూఱు గాడీలు ఘన శింధుబాంహ్లీక కాంభోజ పారశియ్య జాతమైన (180 వ ఆకు).

నెం. 2313. ఆవిరళగత ధనార్ధ గండస్థల గజసహస్రంబ్బును...లలిత గతి నొప్పు నెనూఱు గాఢభముల సిందుబాంహ్లీక (181 వ ఆకు, రెండవవైపు).

నెం. 2462. అవిరళక్షళిత దాద్ర్ర గండస్థల గజ సహస్రంబ్బును... విచిత్రవలగతి నొప్పు నెనూఱు ఘనతరోష్ట్రింబ్బులు బాంహ్లీక కాంభోజ పారశియ్య జాతమయిన (190 వ ఆకు, రెండవవైపు).

నెం. 2545. చిత్రలలితగతి నొప్పు నెనూరు గార్ధభంబ్బులు శింద్ధు బాంహ్లీక కాంభోజ పారసియ్య జాతమైన.

నెం. 2630. చిత్రలలితగతి నొప్పు నెనూఱు ఘనలోష్ట్రిలును సింధు బాంహ్లీక (187 వ ఆకు, మొదటివైపు).

నెం. 2639. చిత్రలలితగతి నొప్పు నెనూరు ఘనతరోష్ట్రములను (197 వ ఆకు, మొదటివైపు.)

నెం. ? చిత్రలీలగతి నొప్పు నెనూరు గాడిదెలను (188 వ ఆకు, రెండవవైపు).

నెం. ? చిత్రలలితగతి నెనూరు గాడ్దలు మరి శింధు.

నెం. 4414. (?) చిత్రలలితగతి నొప్పు నెనూరు గాడిదులను సింధు బాంహ్లిక (197 వ ఆకు, రెండవవైపు).

II. తంజావూరు : (మహారాజా శరభోజీ సరస్వతీమహలు లిఖితగ్రంధాలయమునందలి తాళపత్ర ప్రతులు.)

D. 58. అవిరళక్షరిత దానార్ద్రగండస్థల ... శిబికాసహస్రంబునుం జిత్రలలిత గతి నొప్పు నేనూరు గాడిదలను సింధు బాంహ్లిక కాంభోజ పారశీయ్య జాతమైన తురగ సహస్రమము (M. 26)

D. 59. అవిరళఝరిత దానాద్రగండస్థల ... శిబికాసహస్రంబుం జిత్రలీలగతి నొప్పు నేనూరు గాడుదులను శింధు బాంహ్లిక కాంభోజ పారశీక జాతమైన తురగతతయుతంబును (M. 27).

D. 60. అవిరళగటిత దానార్ద్ర గండస్థల ... శిబికాసహస్రంబుం జిత్రలీల తగిలి నొప్పు యేనూరు కరభంబులను సింధు బాంహ్లిక కాంభోజపారసింహ్యా జాతమైన (M. 28).

D. 63. అవిరళఝరిత దానార్త్రగండస్థలి .... కాంచనశిబికా సహస్రంబు చిత్రలీలగతి నొప్పునేనూరు గాంధర్వహయములు బాంహ్లిక కాంభోజ పారశీయ జాతమైన (M, 30)

D. 64. అవిరళఝరిత దానార్ద్ర .... చిత్రలలితగతి నొప్పు నేనూరు గాడిదలను (M. 31)

D, 65. అవిరళఝరిత ధానార్ద్ర ... శిబికాసహస్రంబుం జిత్రలలిత గతి నొప్పు నేనూఱు గాడిదలను సింధు బాంహ్లిక కాంభోజ పారశీయ్య జాతంబైన (M. 32, Tel. No. 52.)

D. 68. అవిరళగళిత ... జిత్రిలలితగతి నొ ... తలను (M. 35).

III తిరుపతి :

i. (శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్యపరిశోధక సంస్థ (Sri Venkateswara University Oriental Research Institute – SVUORI) గ్రంథాలయమునందలి తాళపత్ర ప్రతులు).

Stock No. 558 (a). చిత్రలలితగతి నొప్పు నేనూరు గాడిదలను.

Stock No. 561. చిత్రలీలగతి నొప్పు నెనూరు గాడిదెలను సింధు బాంహ్లీక కాంభోజ (శిథిలప్రితి).

Stock No. 579. చిత్రిలలితగతి నొప్పు నేనూరు గాడీలు సింధుజ (అర్వాచీన ప్రతి, 6 నుండి 8 వ అశ్వాసము వరకు కలదు.)

Stock No. 1004. చిత్రరచితగతి నొప్పు నేనూరు గాడిదెలనుశింధు).

Stock No. 6780 (a) లలితగతి నొప్పు నెనూరు ఘనతోష్ట్రిములు సింధు బాంహ్లీక (అర్వాచీనప్రితి).

Stock No. 7594. కాంచన సిబికానహస్త్రింబు చిత్రలలితగతి నొప్పునే నూరు ఘనలోష్ట్రిములు (అర్వాచీన ప్రతి.)

Stock No. 7696(a). చిత్రలీలగతి నొప్పు నేనూరు గాడీలు మరి సింధ్ధు బాంహ్లీక (అర్వాచీనప్రతి.)

ii. మదరాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయము(Govt. Oriental Manuscripts Library, Madras) నుండి తిరుపతిలోని (Svuori) కు మార్చిబడియైన తాళపత్ర ప్రతులు.

D. 189. అవిరళస్ఫురిత దానార్ద్రిగండ స్థల గజస్రంబును ... జిత్ర లలితగతి నొప్పు నెనూరు ఘన లోష్ఠ్రిములు (Tel. B. 116, 11-5-2, ఆది పర్వము సర్వము, అతినూతన ప్రతి.)

D. 194. అవిరళషదిత దానార్ద్రి గండస్థల గజసహస్రంబును ... జిత్రలీలగతి నొప్పు నెనూరు ఘనతోష్టిియులు శింధ్ధు బాంహ్లీక (Tel. B. 120, 14-13-15.)

D. 196. అవిరలహరిత దానార్ద్రిగండస్థల గజసహస్రింబులు ... జిత్రలలిత గతి నొప్పు నెనూరు గార్ద్రిభములు సింధు బాంహ్లీక (Tel. B. 122. 14-7-14.)

IV. మదరాసు :

ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయము నందలి తక్కిన ప్రతులు :

D. 197, అవిరతక్షరిత దానార్ద్రన్గండ స్థల గజసహస్రంబులు ... చిత్రలలితగతి నొప్పు నైనూరు గాడిదలును సింధు బాంహ్లీక కాంభోజ పారశీయ జాతమైన తురగశత సహస్రము (భారతము లక్ష్మీప్రతికి ప్రాచీనమగు తాళ పత్రప్రతి.)

D. 164. చిత్రలలితగతి నొప్పు నేనూరు గాడిదలను శింధు బాంహ్లీక పారశియ్య జాతమైన (బ్రౌనుదొర తయారు సేయించిన కాగితపు ప్రతి, ఆది పర్వము అయిదవ ఆశ్వాసము మొదలు పర్వాంతము వరకు కలదు. 'గార్ధభంబులు' 'గంధర్వహయములు', 'ఖరములుమరి' - అను పాఠాంతరములును గుర్తింపఁబడినవి)

D. 193. అవిరళగళిత ... సారధి సమేతంబైన ... చిత్రలలితగతి నొప్పు నేనూరు ఖరములు మరి శింధు బాంహ్లీక కాంభోజ పారసిక (బ్రౌను దొర వ్రాయించిన కాగితపుప్రతి, ఆది పర్వము సమగ్రము.)

V. రాజమహేంద్రవరము :

i. ఆంధ్రేతిహాస పరిశోధకమండలి, రాజమహేంద్రవరమువారి గ్రంథాలయము నందలి తాళపత్ర ప్రతులు.

నెం. 53. చిత్రలీలగతి నొప్పు నూరేసి గాడిలు మరి సింధు (117 వ ఆకు).

నెం. 59. చిత్రిలీలగతి నొప్పు నేనూరు గంధర్వహయములు (256 వ ఆకు).

ii గౌతమీ గ్రింథాలయము నందలి తాళపత్రప్రతి.

నెం. 51. అరవిశగళిత దానార్ద్ర గండస్థల గజ సహస్రంబ్బును ... రమ్యభూషణాలంకృత శ్రీ సహస్రంబ్బుల గాంచ్చన శిబికా సహస్రంబ్బుం చిత్రలలితగతి నొప్పు నేనూరు గాడిదలను సింధు బాహ్లీక కాంభోజ పారశిక జాతమైన (డా. చిలుకూరి నారాయణరావుగారు గంజాముజిల్లాలో సేకరించి గ్రంథాలయమున కిచ్చినది.)

VI. వాల్తేరు :

i. ఆంధ్ర విశ్వకళా పరిషద్గ్రంథాలయము నందలి తాళపత్రప్రతులు (శ్రీ శేషాద్రి రమణకవులు ఆంధ్ర విశ్వకళా పరిషత్పక్షమున తెలంగాణమున పర్యటించి సేకరించినవి).

Acc. No. 29404. రమ్య భూషణాలంకృతస్రీ సహస్రంబ్బు గాంచ్చన శిబికా సహస్రంబ్బుం జిత్రలీలగతి నొప్పు నేనూరు గాదిర ... సిందు బాంహ్లిక కాంభోజ ప్హారసికజాతమైన తురగ శతసహస్రము.

Acc. No. 29928. కాంచ్చన శిబికా సహస్రంబ్బుం జిత్రలీలగతి నొప్పునే నూరు గాడిదలను సింధు బాంహ్లిక కాంభోజ పారశియ్య జాతమైన తురగ శతసహస్రము.

ii. బొబ్బిలి సంస్థానాధీశ్వరులు ఆంధ్ర విశ్వకళా పరిషద్గ్రంథాలయమునకు బహూకరించిన తాళపత్ర గ్రంథ సంచయమునందలి ప్రతులు.

నెం. 61. చిత్రలలితగతి నొప్పు నెనూరు గాండంబులు సింధుబాంహ్లిక పారశియ్య జాతమైన (188 వ ఆకు మొదటి వైపు, చివరిపంక్తి).

నెం. 73. కాంచన శిబికా సహస్రంబు జిత్రలలితగతి నొప్పు నెనూరు గంధర్వ హయములు బాహ్లీక కాంభోజ పారశియ్య జాతమైన (209 వ ఆకు, మొదటివైపు).

నెం. 88. చిత్రలీలగతి నొప్పు నేనూరు గాండంబులును శింధుబాంహ్లీక కాంభోజ పారశియ్య జాతమైన (213 వ ఆకు, మొదటివైపు).

VII. విజయనగరము :

విజయనగరము మహారాజావారి ఫోర్ట్ లైబ్రరీలోని లిఖితప్రతులు

'అవిరళ గళిత తదానార్ద్ర గండస్థల గజసహ్రంబ్బునుం ... చిత్రలిలగతి నొప్పు నెనూరు గాత్రిమంబ్బులును శింధువాంహ్లిక కాంభోజ పారసియ్య జాత మైన తురగ సహస్రములు... (141 వ అకు, రెండవవైపు).

'అవిరళకలిత దానార్ద్ర గండస్థల గజ సహస్రంబులు...కాంచనసిబికా సహస్రంబు చిత్రలీలగతి నొప్పునేనూరు గాంధర్వహయములు బాంహ్లీకాంబోజ పారశియ్యజాతులైన తురగ శతసహస్రంబును...." (కాకితప్రతి).

'గాడిదలను' అనుచోట అనేక పాఠాంతరము లున్నట్లు తాటియాకు ప్రతులవలన నిర్ధారితమయినది. ఆ యా పాఠాంతరముల రూపభేదములు, ఆ వృత్తియు నిట్లున్నవి.

| | | |
|---|---|---|
| 1. | గాడిదలను (గాడిదలును, గాడిదెలను, గాడిదెలును, గాడుదులును, గాదెదలును, గాడ్దలు, గాదిరలును).... | 1 |
| 2. | గాడీలు (గాడిబండ్లు, గాడియ్యలను, గాడిలు, గాళల, నాడిలు).... | 10 |
| 3. | గంధర్వహయములు (గాంధర్వ హయములు)... | 9 |
| 4. | ఘనలోష్ట్రములు (ఘనతరోష్ట్రంబులు, ఘనతోష్ట్రములు, ఘనతోష్ట్రియులు, ఘనలోష్ట్రిలు,ఘనలోష్థ్రములు,లోష్ట్రములు) | 8 |
| 5. | గార్ధభములు (కీరభంబుల, గర్దభముల, గాభణముల... | 7 |
| 6. | ఖరములు... | 3 |
| 7. | గాండంబులును... | 2 |
| 8. | ఇడ్గాదులు... | 1 |
| 9. | గంధశింధురములు... | 1 |
| 10. | గ్రామంబులు... | 1 |
| 11. | ఘనగజంబులు... | 1 |
| | మొత్తము | 74 |

తక్కిన ప్రతులలో అష్టమాశ్వాసమో లేక ఏతత్కథాఘట్టమో ఉన్న ఆకులు లేక పోవుటవలనగాని. పాఠమున్న భాగము చిఱుగుటవలనగాని, చెదలు కొట్టుటవలన గాని, లేక పూర్తిప్రతి అట్టకట్టి అదుకుకొని పోవుటవలనగాని పాఠముల నెత్తివ్రాయుట వలనుపడలేదు.

వాస్తవస్థితి యిట్లుండగా "కొందఱు 'ఏనూఱు గాడీలు' తురుష్క పదమును భారతము లక్ష్మీపతి వ్యాఖ్యానుగుణముగా 'ఏనూఱు గాడిదలను' మూలపాఠము గాఁబోలనుట కలదు. సూర్యరాయాంధ్ర నిఘంటువు 'ఒక ప్రాఁతప్రతిలో గూడ ('గాడీలు,) పాఠమిట్లే యున్నది' అని సూచించియు, తురుష్క పదమును ఆదరించకపోవుట చిత్రము (14)" అని శ్రీ వేంకట కృష్ణారెడ్డిగారనుట మఱీచిత్రము. భారతము లక్ష్మీపతి వ్యాఖ్యానుగుణముగా అర్వాచీన పరిష్కర్తలు 'గాడీలు'ను 'గాడిదలను' గా దిద్దివేసినారని శ్రీ రెడ్డిగారు వ్రాయుట ఆధార రహితము. భారతము లక్ష్మీపతిసోమయాజి (క్రీ.శ. 1780-1830) తణుకు ప్రాంతమువాఁడు, ఆర్వేలనియోగి. సూరమా లక్ష్మీనృసింహ సూరుల కుమారుఁడు. ఆంధ్ర భారతము పదునెనిమిది పర్వములకు వ్యాఖ్య రచించి, యథాశక్తి సాధుపాఠ నిర్ణయము కావించిన మహాపండితుడు(15). ఈయన రచించిన భారత వ్యాఖ్యానము-కూలంకషవ్యాఖ్య-ఏడు సంపుటముల కాగితపు ప్రతి కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషద్గ్రంథాలయమున నుండెడిదఁట! నేఁడు మృగ్యము !! రాజమహేంద్రవరము ఆంధ్రేతిహాస పరిశోధకమండలి వారి గ్రంథాలయముననను, మదరాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయముననను ఈ వ్యాఖ్యా ప్రతుల కొన్నిభాగములు కలవు. సభాపర్వ వ్యాఖ్యాభాగము 'సారస్వత సర్వస్వము' లో అచ్చుపడినది భారతామ్నాయావధానియగు లక్ష్మీపతి వ్యాఖ్యలో 'గాడిదలను, పాఠమే స్వీకృతము. "ఒకప్రాఁత ప్రతిలోఁ గూడ పాఠమిట్లే ('గాడీలు'అని) యున్నది. కాని, దీనికి మూలమగు సం. భారత. ఆది. 247-

14. తెంకణాదిత్యకవి, పు. 73.

15. భారతము లక్ష్మీపతి 18, 19 శతాబ్దములవాఁడని శ్రీ నందిరాజు చలపతిరావు గారును వ్రాసిరి. చూ.భా. లక్ష్మీపతి కృతమగు, శకటరేఫ నిర్ణయమునకు పీఠిక, ద్వితీయముద్రణము, మంజువాణీ ముద్రాక్షరశాల, ఏలూరు, 1924; పుటలు 3, 6.

41 శ్లోకమునుబట్టి 'ఏ నూఱు గాడిదలను' అను భా.ల. వ్యా. (భారతము లక్ష్మీపతి వ్యాఖ్యానము) పాఠమును ముద్రిత పాఠమును యుక్తముగాఁ గనఁబడుచున్నవి. 'గాడీలు' అను పాఠమును గ్రహించినయెడల రథములు రెండు మార్లు చెప్పఁబడుటయు గాడిదలమాట లేకపోవుటయు సంభవించును"(16). అని సూ.ని. కారులు సూచించుట వారి సత్యావిష్కరణ బుద్ధికి తార్కాణము.

సూ.ని. కారుల ఈ సూచననో, లేక పూర్వోక్తమయిన కందుకూరి ప్రతిపాఠమునో పట్టుకొని శ్రీ దేవరపల్లి వారు తమ వాదమును లేవదీసినట్లున్నది. కాని, భారతము లక్ష్మీపతికి పూర్వములగు తాళపత్ర ప్రతులయందును 'గాడిదలను' అను పాఠము కన్పట్టుచున్నది. చెన్నపట్టణము ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయము నందలి D. 197 నెంబరుకల ఆదిపర్వము తాళపత్ర ప్రతిచివర 'వజ్రాల వెంకప్ప కొమారుడు రంగయ్య వ్రాశిన ఆదిపర్వం...దుర్ముఖి మార్గశిర బహుళ ౧౨ గురువారం' అని ప్రతి లేఖకుని పేరు లిఖితకాలము ఉట్టంకితము. ఈ కాలము క్రీ.శ. 1716 నవంబరు 29 వ తేదీ గురువారముతో సరిపడుచున్నది. ఈ ప్రతి, లక్ష్మీపతికి రెండుమూఁడు తరములు పూర్వతన మనుట నిస్సంశయము. 'గాడిదలను' పాఠఘటితములగు తంజావూరు తాళపత్ర ప్రతులు క్రీ.శ. 1690 ప్రాంతమున లిఖితములు. లక్ష్మీపతి వాసన సోఁకుట కవకాశములేని దక్షిణ దేశమునందలి సర్వ ప్రతులలో 'గాడిదలను' పాఠమే ప్రయుక్తము. ఆంధ్ర విశ్వకళా పరిషద్గ్రంథాలయమున Acc. 29404 నెంబరుకల తాళపత్ర ప్రతి వ్యయనామ సంవత్సర మార్గశిర బ. ౧౨ జయవారం దీ 25 డిశంబ్బరు ఆన 1826 న గోళ్ళమూడి అయ్యవారుగారి ప్రతిలో సక్రమాన సబ్నివీసు భుజంగ రాయఁడు (నందిగామ) వ్రాసికొన్న ఆది పర్వమునందును 'గాడిదలను' పాఠమున్నది. కావున, సంస్కృత మూలానుయాయి యగు భారతము లక్ష్మీపతి వ్యాఖ్యాప్రతి ననుసరించి 'గాడిదలను' అను పాఠమును సృష్టించిరనుట పూర్తిగా నిరాధారము. లక్ష్మీపతి వ్యాఖ్యాప్రతి ననుసరించి తయారయిన తాళపత్ర ప్రతులును లేకపోలేదు; ఇవియన్నియును అర్వాచీనములని వేఱ చెప్పనక్కఱలేదు. మదరాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయమునందలి

16. చూ. 'గాడీ' అను ఆరోపముక్రింద, సూ. ని., సంపుటి 2, పు. 729.

D. 190 నెంబరుకల తాళపత్రప్రతి చివర "వికృతినామ సం. పుష్య బ. ౧౪ బుధవారం వరకు రాపాక సుబ్బన్న, భారతం లక్ష్మీపతిగారి ప్రతినున్న క్రమాన ఆదిపర్వం సంపూర్ణంగా స్వంతానకు వ్రాసుకునెను". అనీ, D. 262 నెంబరు గల తాళపత్ర ప్రతి-శల్య సౌప్తిక స్త్రీ పర్వములు కలదిలో సౌప్తిక పర్వము తుద "నందన కార్తీక బ. ౧౧ ఆదిత్యవారం వరకు రాపాక సుబ్బన్న, భారతం లక్ష్మీపతిగారి ప్రతినున్నక్రమాన యీ సౌప్తికపర్వం..." అని స్త్రీ పర్వాంతమున "నందన మార్గశిర శు. ౧౨ అంగారకవారం వరకు భారతం లక్ష్మీపతిగారి ప్రతినున్నక్రమాన రాపాక సుబ్బన్న స్త్రీ పర్వం సంపూర్ణంగా స్వంత్తముకు వ్రాసుకొనెను" అనీ కలదు. పైమూఁడు కాలములును క్రమముగా క్రీ.శ. 1831 జనవరి. 12; 1832 నవంబరు 18; 1832 డిసెంబరు, 4 తేదీలు అయియున్నది (17).

ఆంధ్రభారతము తాళపత్రప్రతు లనేకములను పలుతావులనుండి తెప్పించి, నిశితదృష్టితో పరిశీలించి, పాఠభేదములను తైపారువేసి లభ్యమగు పాఠములలో ఉత్తమమని నిర్ధారితమయిన పాఠముతో, తక్కిన పాఠాంతరముల సూచనతో ఒక ప్రామాణిక ప్రతిని నిర్మించియుంచిన బ్రౌనుదొరగారు (18) భారతము

---

17. Swami Kannu Pillai, op. cit.

18. "...On my first attempt to read the Telugu Mahabharat, in 1826...before studying a poem I had it copied in clear hand, on English paper numbering the verses to facilitate reference...I first had a copy made from any manuscript of tolerable accuracy, the alternate pages being left blank, and the verses duly numbered: then the volume was bound...A clerk sat with the newly written copy ready; and before him were two, each having charge of five or six manuscripts, the oldest I could discover...Each assistant in turn read a stanza, which thus was recited ten or twelve times; the scribe recorded every deviation; Pandits formed their judgements on each line, and then one of them taking the blotted copy, selected the pure text, and dictated it to a reader..." (p. xv, Preface to C.P. Brown's English-Telugu Dictionary. 'Some Account of the Literary Life of Charles Philip Brown (1798-1884).

లక్ష్మీపతి ప్రతిని చూచినట్లు లేదు. బ్రౌనుదొర గుర్తించిన పాఠములలోఁగాని: పాఠాంతరములలోఁ గాని - ఖరములు, గాడిదలను, గాంధర్వ హయములు, గార్దభంబులు అనునవి తప్ప-'గాడీలు' అను పదమే కన్పట్టదు. బ్రౌనుదొర పరిష్కరించి భద్రపరచిన కాగితపు ప్రతులలో 'గాడీలు' పాఠాంతరము గానైనను సూచింపఁ బడకుండుటచే బ్రౌనుదొర పరిశీలించిన తాళపత్ర ప్రతులలో 'గాడీలు' పాఠములేదనుట అనుమేయము. కాని, బ్రౌనుదొర యొద్దితాళ పత్రమాతృకలను సైతము సంప్రతించితి మని ప్రకాశకులు సాక్ష్యమిచ్చిన ఆలూరి ఏకామ్రజోస్యుల గుజిలీప్రతి (1853) లో 'గాడీలు, పాఠము స్వీకృతమగుట ఆశ్చర్యకరము. "...నన్నయభట్టారక తిక్కనసోమయాజి శంభుదాసులచేఁ దెనుంగు బాసంజేయం బడి యొప్పుచున్న యాంధ్ర భారతమునందు లేఖక ప్రమాదాదులవలన సంభవించిన వ్యత్యస్త శబ్దప్రక్షిప్త గ్రంథ గ్రంథనాదులను-విరుద్ధయతిగణ ప్రాస సంధ్యాగమ రేఫాది సమావేశాదులను బరిష్కరింపించి సుష్టుగా ముద్రాక్షరాంకితము చేయించ వలయునని శ్రీ వేదమూర్తులగు ఆలూరి - ఏకామ్రజోస్యులవారు సాధారణ సంవత్సరము (క్రీ. శ. 1851)లో నుద్యుక్తులయిరి... వెండియు నీ భారత గ్రంథము-బరిష్కరించుటకు వలయు మాతృక లప్పుడప్పుడు మాకు దయ చేయుచు వచ్చినట్టియు-నానావిధ భాషాగ్రంథంబు లపారంబుగ సంగ్రహించి భాండాగారంబుగఁ జేర్చియున్నట్టియు - దద్గ్రంథార్థ సారగ్రహణ కళాకౌశలం బునం బ్రసిద్ధుండయి యున్నట్టియు - నింగిలీషు ప్రభుండునునగు - ఛార్లిస్ ఫిలిప్ - బ్రౌన్ యిస్క్వాయిర్ గారిని... మేమందఱ మమందానందంబున నభినందించుచున్నారము(19).

బ్రౌనుదొర పాఠములు తరువాతి ప్రకాశకులకుగాఁని, పరిష్కర్తలకుఁ గాని నచ్చలేదు కాఁబోలు; వీరు, బ్రౌనుదొర ప్రతులను గమనించినట్లుకూడ కన్పట్టదు. "....పండిత సాహాయ్యంబునం బరిష్కరించి యచ్చుగూర్పించి సులభక్రయంబున నెల్లవారలకు నుపయోగింపఁజేయుట యత్యావశ్యకంబని యెంచి బహుదేశంబుల నుండి ప్రాచీన గ్రంథంబు లనేకంబులు రావించి జాగరూకులమై భగవదనుగ్రహాతిశయంబువలన నే విఘ్నంబును లేక శ్రీ మహాభారతం బను నితిహాసరత్నంబును పదునెనిమిది పర్వంబులును సమగ్రములుగా నచ్చు

19. ఆలూరి-ఏకామ్రజోస్యుల భారతప్రతి (1853) లో ప్రకాశకుల విజ్ఞాపనము.

గూర్పించి ప్రకటించితి మని యెఱింగించుటకు నెల్లజనంబులు దమ యుల్లంబుల నుల్లసిల్లఁ గోరుచున్నాఁడను" (20) అని ఒక ప్రకాశకుని విన్నపము. "ప్రాచీన ప్రతులను బెక్కింటిని సంపాదించి, తగుపండితవర్యులచేఁ బరిశోధన గావింపించి, సాధ్యమగునంత నిర్దుష్టముగా దీనిం బ్రచురింప నారంభించి నారము" (21) అని మఱియొకరి విజ్ఞాపనము. వీరు పరిశీలించిన ప్రతులలో 'గాడీలు' అనుపాఠమే ప్రచురముగా నుండెనేమో ? మఱి, యింతమంది పరిష్కర్తలకు, ప్రకాశకులకు ఆధారమయిన 'గాడీలు' పాఠఘటిత ప్రతు లేమయినట్లు ? ఇంతకు వీరు పరిశీలించిన 'పాచీన గ్రంథంబులు' 'ప్రాచీన ప్రతులు' తాళపత్ర ప్రతులా? లేక పా్రచీన ముద్రిత ప్రతులా? ఎటునిర్ణయించుట కును వీరి మాటలు పట్టీయుటలేదు. ప్రాచీనముద్రిత ప్రతులలో 'గాడీలు' పాఠమే యున్నట్లు పాఠభేదప్రదర్శక పట్టికలో వివృతము. ప్రాచీన ముద్రితప్రతులు మాతృకలుగా అవతరించిన తాళపత్రప్రతులును కొన్ని యున్నవను నంశమును ఈ సందర్భమున గమనింప వేఁడికోలు. కాకినాడ, ఆంధ్ర సాహిత్య పరిషద్గ్రం థాలయమున 4114 నెంబరుకల భారతము, ఆదిపర్వము తాళపత్ర ప్రతి ఈ కోవకు చెందినది. 'వైయ్యాకరణ రామానుజాచార్యులుగారిచే సంస్కరింపఁబడి, కోడూరు రాఘవాచార్యులుగారు అచ్చుగూర్చిన (భారత ప్రతి, 1847) ప్రతినున్న ప్రకారం ప్రమాదీచనామ సం॥ర ఆషాఢ శు॥ ౧౨ భానువారము క్రీ. శ. 1853 జూలై, 17 వ తేదీ) నాటికి వ్రాసినది', ఈ ప్రతి అనంతపుర మండలమున సేకరింపఁబడినది. ఇట్టి అర్వాచీన తాళపత్రప్రతులు సాధుపాఠ నిర్ణయమున ప్రామాణికములుగావు. పూర్వపరిష్కర్తల గ్రంథపరిష్కార పద్ధతులు యావత్తైలం తావద్వ్యాఖ్యానమ్' బాపతుగా ఉన్నట్లున్నది. సుప్రసిద్ధ పరిశోధక పండితులగు శ్రీ తంజనగరము తేవప్పెరుమాళ్ళయ్యగారి ఈ క్రింది వ్రాఁత ఆయనకు పూర్వముండిన గ్రంథ పరిష్కార రీతులలోని అవ్యవస్థకుఁ గల హేతువులను స్పష్టముగా నిరూపింపఁ గలదు.

"....లేఖక పాఠకుల ప్రమాదాదులవలనఁ గలుగు పాఠభేదము లక్షర వ్యత్యయములు గ్రంథపాతములు మొదలైన వానిచేఁ గలుగు బహు కష్టములను

---

20. శ్రీమదాంధ్ర మహాభారతపీఠిక, వంకాయల కృష్ణస్వామిశెట్టివారి (1890) ప్రతి.
21. పీఠిక, కాకినాడ-సుజనరంజనీ ముద్రాక్షరశాలలో ముద్రితమయి ప్రచురితమయిన భారతప్రతి (1911).

బట్టి మొట్టమొదటి ముద్రణమునందుఁ దప్పులు పడుట సహజము. ఆ తప్పులు గ్రంథవైపుల్యమును బట్టి పెక్కులగుటయు నైజమే. ఇట్లు కలుగు తప్పుల కుప్పలను తరువాతి ముద్రణములందుఁ బండితులు గొంతకొంత తొలగించుచు వచ్చిన యెడల గ్రంథమింతకుఁ గడు శుద్ధమైయుండును. అయిన నిట్లుగాదయ్యె. ఏలనఁ బండితులు తమకు సందిగ్ధములుగాను మూలమునకు విరుద్ధములుగాను లేక న్యూనములుగాను నున్నట్టి పట్టులందుఁ దమకవనముతోఁ బాఠములను దోచినట్లు మార్చియుఁ గూర్చియున్నారు. కావున నీ తప్పులు ప్రథమ ముద్రణము నందలి కష్టబాహుళ్యమును బట్టియు గ్రంథ వైపుల్యమును బట్టియుఁ బెక్కులై యుండుటతో గూడఁ బండితుల సొంత కవనముం పట్టి సవరింపరానంత చిక్కులు నైనవి. దీనిని వ్రాఁతప్రతులను గొని మఱల శుద్ధముగా సవరణ సేయఁజాలిన పండితు లిందులకుఁ బూనకుండుటచేతనో, పూనియు దానికి వలయునంత వ్యయ ప్రయాసల కోపమిచేతనో, యోపియుఁ దగిన వ్రాఁత ప్రతులు దొరకమి చేతనో తరువాతి ముద్రణములన్నియు మొదటి ముద్రణము ననుసరించి గతానుగతికముగాఁ దప్పుల కుప్పలైనవి..." (22).

ప్రస్తుత పరిశీలనమునం దుపయుక్తమయిన 74 తాళపత్ర ప్రతులలోని పాఠములలో 'గాడిదలను' పాఠగరితములు 31. 'గాడిదలను' శబ్దము కటువుగా తోఁచుటవలన కాఁబోలు, తత్పర్యాయములగు ఖరములు (3), గంధర్వ హయములు (9), గార్దభములు (7) అను నీ పదఘటితములుగా పందొమ్మిది క్రొత్తపాఠము లవతరించుట। (23) పర్యాయపద ఘటితములతో కలిపి 'గాడిదలను' పాఠములసంఖ్య 50 కి హెచ్చినది. "వ్యాస భారత మూలములో 'అశ్వతర' అను తుల్య సంస్కృత పదమున్నను తెనుగుకవి కీ కంచర 'గాడిద' పాఠము దేశీయము కాదని తోచి, మార్చి

---

22. పరిష్కర్త విజ్ఞాపన, వేమూరి - వేంకటకృష్ణమసెట్టి & సన్సువారి ఆనంద ముద్రాక్షరశాలా గ్రంథరత్నమాల - భారతప్రతి, ద్వితీయముద్రణము. 1907.

23. "చిత్రలలితగతి నొప్పి నేనూఱు గంధర్వహయముల" = మంచినడకగల యేనూఱు కంచర గాడిదలను-అని చదలువాడ సుందరరామశాస్త్రిలు, దండిగుంట సూర్యనారాయణశాస్త్రిలు గార్ల భారత సంజీవని వ్యాఖ్య. శారదాంబా విలాస ముద్రాక్షరశాల, మదరాసు, 1915; పు. 614.

యుండుట దోషము కాదు..." అను శ్రీ రెడ్డిగారి యుక్తి, 'గాడిదలను' పాఠమునకుఁగల వ్యవహార బలము సన్నిధిని నిలువనేరదు. 'గాడిదలను' పదముయొక్క అర్థమును కొందఱకు హితవుగా లేనందున గంధ సింధురములు, ఘనగజంబులు, ఘనలోష్ట్రములు ఇత్యాద్యనేక పాఠాంతరములు వెలసినవి. విడిగా పేర్కొనుట పునరుక్తి కావున 'గంధ సింధురములు', 'ఘనగజంబులు'- "అవిరళక్షరిత దానార్ద్ర గండస్థలగజ సహస్రంబు"న అంతర్భూతములు; పద్యమునందలి పూర్వాపరములు తెలియని లేఖకులు కల్పించిన పాఠాంతరములు ప్రమాణములుకావు. 'ఘనలోష్ట్రములు'ను ఏదోయొక జంతునామమును ఇఱికించు నుద్దేశముతో కల్పితమయిన పాఠము. 'గాడీలు' పాఠమీవరకే పరాస్తము. ఇక, మిగిలిన 'గాండంబులు' 'ఖడ్గాదులు' అనునవి "శ్రీ అయిగీ్రి వాయనమః" "శ్రీ శారదాంబాయనమః" అను నిట్టి స్థాయిలలోగల లేఖకాధములు కల్పించిన అవ్యక్తపాఠములు (24). పర్యాప్తమయిన ఈ పరిశీలనమువలన 'గాడిదలను' అనుపాఠము కర్త్రభిప్రేత మనుట సయుక్తికము; సత్యమూలకము.

---

24. ఆఁడుబిడ్డకు అరణముగా నీఁబడిన వానిపట్టికలో గ్రామము లేకుండుట లోటుగా భావించి, విజయనగర ప్రతి విలేఖకుఁడు 'చిత్రలీలగతి నొప్పు నేనూఱు గ్రామంబుల'ను సుభద్రకిప్పించినాఁడు.

# నన్నయ–అన్యదేశ్యాభాసములు–II

"ఆదిపర్వములో నన్నయభట్టు 'సవతు కావమరేంద్రా – సరియుఁగా వమరేంద్రా' (భారత. ఆది. 3–208 (210) అనుపాఠాంతరములు ప్రయోగించు నట్లు భిన్నముద్రణలు తెల్పుచున్నవి. సవతులందరు సమానులు కాబట్టి, 'సవత్–సవతు' కూడా తత్సమానార్థక జాతీయమయినది. క్రీ.శ. 11 శతాబ్దమున తురకదంపతులు ఆంధ్రభాషలో లేవను భ్రమతో పండితులో, వ్రాయసకారులో, 'గాడీలు – గాడిదెలు : సవతు – సరియు' అని తుడుపులు పెట్టి మూలపాఠము మార్చినారు. (1) అని శ్రీదేవరపల్లి వేంకటకృష్ణారెడ్డిగారి మఱియొక ఆరోపణము. అసలీ 'సరియు' పాఠఘటితమగు పద్యము యయాతి స్వర్గచ్యుతి ఘట్టమునందలిది. పుణ్యలోక భోగములను శతసహస్ర సంవత్సరము లనుభవించిన యయాతిని ఎట్టితపమొనరించితివో తెలుపుమని ఇంద్రుఁ డడుగఁగా, యయాతి యొసఁగిన సమాధాన మీ పద్యమున పొందుపఱుపఁబడినది. ఆపద్యమిది :

"సురదైత్య యక్షరాక్షస
నరఖేచరసిద్ధ మునిగణ ప్రవరుల భా
సుర తపములు నాదగు దు
ష్కర ఘోరతపంబు సరియుఁగావమరేంద్రా"

భారత. తృతీయా, 209 వ పద్యము, ఆనందముద్రాక్షరశాలా ప్రతి, 1907).

ప్రాచీన ముద్రితప్రతులలో 'సవతు' అనుపాఠమును, తాళపత్రప్రతుల యందును, 1907 తరువాతి ముద్రితప్రతుల పెక్కింటను 'సరియు' అను పాఠ

1. శ్రీ దేవరపల్లి వెంకటకృష్ణారెడ్డిగారి 'తెంకణాదిత్యకవి' – అనుబంధము, పు. 7.

మును కన్పట్టుచున్నవి. 'గాడీ' పదమువలె 'సవతు' సైతము నడుమంత్రముగా సృష్టింపఁబడిన పాఠము. 'సవతు' పదఘటిత పాఠములుగల ఆకరము లీ దిగువ ఆనుపూర్విగా ప్రదర్శితము.

క్రీ. శ. 1833 (?) 'సవతుకావమరేంద్రా' (పు. 41. తృతీయా. 207. ఆలూరి - ఏకామ్రజోస్యుల ప్రతి. (2)

1847, 'సవతుకావమరేంద్రా' (వైయాకరణ రామానుజాచార్యుల సరస్వతీ పీఠముద్రాక్షరశాలా ప్రతి. 1847) (3).

1881. 'సవతుకావమరేంద్రా' (పు, 37. పంచాంగమువారను వ్యవహారనామముగల భద్రాచలం - తిరుమల నరసింహాచార్యుల వారిచేఁ బరిష్కరింపబడి పిళ్ళారిసెట్టి రాఘవయ్యనాయనివారిచే శ్రీ భారతీనిలయ ముద్రాక్షరశాలయందు 1881 సం॥ ఫిబ్రవరి నెలలో ప్రచురింపఁబడిన ప్రతి).

1885. 'సవతు కావమరేంద్రా' (చూ. 'సవతు' అను ఆరోపము క్రింద ఉదాహృతమయిన పాఠము. శబ్దరత్నాకరము, 1885 పు. 1680).

1887. 'సవతుకావమరేంద్రా' (పు. 35, ములుకుట్లవిశ్వనాథశాస్త్రుల వారిచే పరిష్కరింపఁబడి, ములుకుట్ల వెంకటప్పయ్య వారిచేతను, పంచాంగం శ్రీకాకుళాచార్యుల వారిచేతను, వంకాయల కృష్ణస్వామిశెట్టిగారిచేతను, చిత్తూరు గురుస్వామిమొదలిగారిచేతను మోహూరు కృష్ణమరాజుగారి కుమారుడగు తులసిరాజుగారి స్వకీయమగు విబుధమనోహారిణీ ముద్రాక్షరశాలయందు 1887 సం॥ లో ప్రచురింపఁబడిన ప్రతి.)

---

2. ఈ యీ గుజిలీప్రతుల ప్రతికాశకాది విశేషాంశములకు చూ; పూర్వవ్యాసము నందలి ముద్రిత ప్రతుల వివరములు.

3. "... దీనికిగాను యేమితపస్సు చేసితివోయి అనగా విని ఇంద్రునకు ఆ యయాతి యిట్లుచెప్పెను. దేవతలు - దైత్యులు - యక్షులు - రాక్షసులు - మనుష్యులు - వియచ్చరులు - సిద్ధులు - మహర్షులు అనియెడు వీరల తపస్సులు నా తపస్సునకు సరికావు, అని తన తపోమదముచేత పెద్దలైన దేవతలు మొదలైనవారల తపస్సును అవమానించిన యయాతిగర్వమును సహింపక ఇంద్రుండు కోపగించుకొని..." (వైయాకరణ - రామానుజాచార్యుల వచనభారతము, 1847 ; ఆదిపర్వము, తృతీయాశ్వాసము, పు. 102).

1890. 'సవతుకావమరేంద్రా' (పు. 34, చెన్నపట్టణము వంకాయల కృష్ణస్వామిశెట్టివారి ప్రతి. 1890.)

1891. 'సవతుకావమరేంద్రా' (సరస్వతీవిలాస ముద్రాక్షరశాలయందు తచ్ఛాలాధికారి యగు నేలవటూరి వెంకట సుబ్బాశాస్త్రుల వారిచేతను, కొండగుంట రాఘశాస్త్రుల వారిచేతను 1891 లో చెన్నపట్టణమున ముద్రితమయి ప్రచురితమయినప్రతి.)(3ఎ)

? 'సవతుకావమరేంద్రా' (పు. 34, పైనుండి 23వ పంక్తి, వెస్తువార్డు కంపెనీవారి ప్రతి. ఆదిపంచకము; విజయనగరము; ఆదిరాజు భాస్కర శాస్త్రులుగారి సొంతప్రతి.)

? 'సవతుకావమరేంద్రా' (పు. 35, పుట పైనుండి 9, 10 పంక్తులు, ఆది, తృతీయా, ఆదిపంచకము, విశాఖపట్టణము, హిందూరీడింగ్‌రూము గ్రంథాలయము నందలి గుజిలీ ప్రతి, పైనఉదాహృతమయిన వంకాయల కృష్ణస్వామిశెట్టివారి ప్రతియందలి పీఠికయును, ఇందలిపీఠికయును సమానములు. అక్షరపరిమాణము. అచ్చుకూర్పు, పుటలసంఖ్యలు - మొదలగు వానిలో రెంటికినీ తేడాలుండుటవలన ఈ రెండును భిన్నముద్రణలు కానోపు! కాని, ఈ రెండిటి పౌర్వాపర్యములు తెలియరాకున్నవి.)

---

"... ఆ యింద్రుడు నా తపస్సునకు ఆశ్చర్యపడి నీ తపస్సుయొక్క గౌరవమును చెప్పుమనగా - దేవతలు, సిద్ధులు, మహర్షులు మొదలయినవారి తపస్సులు నా తపస్సుతో సరిగావని చెప్పితిని..." (పైది) - అని రెండుతావుల 'సరికావు' అనిప్రయుక్తమగుట గమనార్హము.

"మహేంద్రా : దేవగంధర్వ యక్షదానవ దైత్యనరసిద్ధ భూసురముని గణముఖ్యుల తపస్సులు నా యొనర్చిన కఠిన తపంబునకు సరిరా" వనెను...(పునుగు సీతారామ కవికృతమగు ఆంధ్ర వచన భారతము ఆదిపర్వము, రామాప్రెస్ వావిళ్ళవారి ప్రతి; 1928, పు. 136).

3(a). నేలటూరి వేంకట సుబ్బాశాస్త్రులుగారు రచించిన తత్త్వబోధినీ వ్యాఖ్యాయుతమగు భారతప్రతిని చూచుట తటస్థింపలేదు.

1893. 'సవతుకావమరేంద్రా' (పు. 34, చెన్నపట్టణము గుదిమెళ్ళ వెంకట వరదాచార్యుల వారిచేత వాక్సతీ నిలయ ముద్రాక్షరశాలయందు ముద్రితమయిన గుజిలీ ప్రతి, ఆదిపర్వము).

? 'సవతు కావమరేంద్రా' (పు. 39, బొబ్బిలి పండితులు శ్రీ అంపోలు అప్పలాచార్యులుగారి యొద్దనున్న గుజిలీప్రతి ; అతిప్రాచీనము).

? 'సవతు కావమరేంద్రా' (పు 34, హరివంశ సహితముగాఁ బందొమ్మిది పర్వములును సమగ్రంబుగా నచ్చుగూర్పించిన వంకాయల కృష్ణస్వామి శెట్టివారి గుజిలీప్రతి, ఆదిపంచకము).

? 'సవతుకావమరేంద్రా' (పు. 37, కొత్తపేట తాలూకా కొమరాజు లంకవాస్తవ్యులు శ్రీ చిలుకూరి వేంకట శాస్త్రులుగారియొద్దనున్న గుజిలీప్రతి, ఆదిపంచకము).

1901. 'సవతుగావమరేంద్రా' (పు. 76, తృతీయా, 208 ; కందుకూరి వీరేశలింగము పంతులుగారు పరిష్కరించిన ఆనంద ముద్రాక్షరశాలా ప్రతి, ఆదిపంచకము, 1901).

? 'సవతుకావమరేంద్రా' (పు. 85, మొదటిభాగము, పెద్దచ్చు ఆది పర్వము, మొదటి పదునాలు పుటలు లేవు. క్రింది 1910 నాటి పెద్దచ్చు ఆది పర్వప్రతికంటె ప్రాచీనమైన గుజిలీ ప్రతి. పశ్చిమాంధ్రప్రాంతముల బహుళ ప్రచారములోనుండిన శేషాచార్యులు, మదరాసువారి ప్రతికానోపు).

1910. 'సవతుకావమరేంద్రా' (పు. 83, మొదటిభాగము, పెద్దచ్చు ఆదిపర్వము, చెన్నపట్టణము నాతా - నమ్మయ్యశెట్టి అండ్ సన్‌వారి శ్రీరామానుజ విలాస ముద్రాక్షరశాలయందు ముద్రితమయి ప్రచురితమైన గుజిలీప్రతి 1910).

1911. 'సవతుగావమరేంద్రా' (పు. 76, తృతీయా. 208, కాకినాడ - సుజనరంజనీ ముద్రాశాలయందు ముద్రితమయి, ప్రచురితమయిన భారతప్రతి, ఆదిపర్వము ; కందుకూరివారు పరిష్కరించిన ఆనంద ముద్రాక్షరశాలాప్రతి (1901) కి మక్కికి మక్కిగా అచ్చయినది).

1913. 'సవతుగావమరేంద్రా' (పు. 74, తృతీయా. 209 ; మారేపల్లి రామచంద్రశాస్త్రిగారి చేతను, రాజా శ్రీ విక్రమదేవవర్మగారిచేతను పరిష్కరింపఁబడి విన్నకోట అప్పలనరసింహగుప్తచే విశాఖపట్టణము శ్రీశారదామకుట ముద్రాక్షరశాలలో 1913 లో ముద్రింపఁబడి ప్రకటింపఁబడిన ఆంధ్రభారతప్రతి ప్రథమ సంపుటము, ఆదిపంచకము)(4).

1915. 'సవతుగావమరేంద్రా' (పు. 208) చదలవాడ సుందరరామశాస్త్రులు, దండిగుంట సూర్యనారాయణశాస్త్రులుగారల 'భారతసంజీవనివ్యాఖ్యా' యుతమయిన భారతము, ఆదిపర్వము, శారదాంబావిలాస ముద్రాక్షరశాల, మదరాసు వారిప్రతి 1915 ; అధస్సూచికయందు 'సరియు' అనుపాఠాంతరము సూచితము.

1907 నుండి ప్రచురితములయిన ఆదిసరస్వతీనిలయ, ఆనంద, కణ్ణన్ సెట్టికంపెనీ, చంద్రికా, రామాఅండ్ కో, వావిళ్ళ, వెస్టువార్డు శ్రీకృష్ణసేవాలయ ప్రతులలో 'సరియుఁగావమరేంద్రా' యను పాఠము స్వీకృతము. 1925 నాఁటి వావిళ్ళవారి పెద్దచ్చు ఆదిపర్వప్రతి (పు. 206) యందును 'సరియుఁగావమరేంద్రా' యనుపాఠమే కలదు. నేనుచూచినంతదాఁక 1907 కు పూర్వములగు భారతముద్రణములయందు 'సరియు', 'గాడిదలను' అను నీ రెండు పదములను పూర్వోక్త సందర్భముల కానరాలేదు. తాళపత్రప్రతుల ముక్కాలుమువ్వీసము 'సరియుఁగావమరేంద్రా' యనుపాఠమే కన్పట్టుచున్నది. దీనికి పర్యాయములగు 'ఈడు', 'సమము', 'సవతు', 'సాటి' - యనుపదములుకల పాఠములును క్వాచిత్కముగ లేకపోలేదు. మేము చూచిన తాళపత్రి ప్రతుల లోని పాఠముల అనువర్ణనమిది. (5).

---

4. మిత్రులు శ్రీ కొమ్మనమంచి రామకృష్ణారావు, ఎం. ఏ., గారిచ్చినప్రతి.

5. కాకినాడ, తంజావూరు, తిరుపతి, మదరాసు,రాజమహేంద్రిపరము, వాల్తేరు, విజయనగరములలోని తాళపత్రి ప్రతులను పరిశీలించుటలో తోడ్పడినవారెందఱో మహానుభావులు ; అందఱకును వందనములు. వివరములకు చూ. పూర్వవ్యాసమునందలి అధోజ్ఞాపిక, 13.

I. కాకినాడ :

ఆంధ్రసాహిత్య పరిషద్గ్రంథాలయము నందలి తాళపత్రప్రతులు (సేకరింపఁబడిన మండలమువారీగా పాఠములు ఉదాహృతములు.)

i. నెల్లూరుమండలము ;

నెం. 1. సమముగాదమరెంద్రా (72వ ఆకు, రెండవవైపు).

నెం. 11. సరియుగావమరెంద్రా (88 వ ఆకు, రెండవవైపు)

నెం. 30. సరియుగావమరెంద్రా (63 వ ఆకు, మొదటివైపు)

నెం. 36. సరిగావమరెంద్రా (57వ ఆకు మొదటివైపు)

నెం. 78. సాటిగావమరెంద్రా (95 వ ఆకు, మొదటివైపు)

నెం. 436. సరియుగాదమరెంద్రా (75 వ ఆకు, మొదటివైపు)

నెం. 639. సరియుగావమరేంద్రా (62 వ ఆకు, రెండవవైపు)

నెం. 664. సరిగావమరెంద్రా (64 వ ఆకు, మొదటివైవు)

నెం. 682. సరియుగావమరెంద్రా (65 వ ఆకు, రెండవవైపు)

నెం. 704. సరియుగావమరెంద్రా (66 వ ఆకు, మొదటివైపు)

నెం. 750. సరియుగావమరెంద్రా (74 వ ఆకు)

నెం. 810. సరిగావమరెంద్రా (60 వ ఆకు, మొదటివైపు వికారి, పుష్య శు ౧౦ సోమవారము)

నెం. 914. సరియకావమరేంద్రా (38వ ఆకు, రెండవవైపు)

నెం. 2310. సరియుగామరేంద్రో (60 వ ఆకు, మొదటివైపు)

నెం. 2644, సరియుగావమరెంద్రా (37 వ ఆకు, రెండవవైపు)

నెం. 2646. సరియుగావమరెంద్రా (64 వ ఆకు, రెండవవైపు)

నెం. 3562. సరియుంగావమరెంద్రా (70 వ ఆకు మొదటివైపు)

నెం. 4346. సమముగావమరెంద్రా (74 వ ఆకు, మొదటి వైపు ; సర్వ జిత్ భాద్రపద బహుళ ౨ క్రీ. శ. ; 1707 సెప్టెంబరు 3వ తేదీ బుధవారము)

నెం. 4370. సరియుగావమరెంద్రా (80వ ఆకు, రెండవ వైపు ; పింగళ శ్రావణ శు: ౧౪ బు)

ii. చిత్తూరు మండలము :

నెం. 133 (?) సరియుగావ సురెంద్రా (68 వ ఆకు, మొదటివైపు)

నెం. 1663. సరియుగావు నరెంద్రా (53 వ ఆకు మొదటివైపు ; జయ. శ్రావణ శుద్ధ ౧౦ శుక్రవారము)

నెం. 1799. సరియుగావు సురేంద్రా (75 వ ఆకు, రెండవవైపు)

నెం. 2006, సరియుగావమరేంద్రా (44 వ ఆకు, రెండవవైపు : శార్వరి, వైశాఖ శుద్ధ ౨ శనివారము)

నెం. 2026. సరియుగావమరేంద్రా (65 వ ఆకు, మొదటివైపు)

నెం. 2181. సరిగావమరేంద్రా (78 వ ఆకు ; నళ, భాద్రపదశుద్ధ ౨ శుక్రవారము కీ్రి. శ. 1704)

iii. అనంతపుర మండలము :

నెం. 4056. సరియుగావమరెంద్రా (57 వ ఆకు, మొదటివైపు)

నెం. 4124. సవతుకావమరెంద్రా (65వ ఆకు, మొదటివైపు ; క్రోధన పుష్య బ. ౪ బు క్రీ. శ. 1866. జనవరి ; తనకల్లు పార్నంది వెంకట క్రిష్ణ భొట్లు కుమారుడైన భాస్కరప్ప వ్రాసిన ఆదిపర్వం)

? నెం. 4412. సరియుగావమరెంద్రా (46 వ ఆకు, మొదటివైపు)

iv. కర్నూలు మండలము :

నెం. 1329. సరియు గావమరేంద్రా (53 వ ఆకు, రెండవవైపు: తారణ. భాద్రపద శు. ౧౦ లు).

v. గుంటూరు మండలము :

నెం. 3915. సరియు గావమరెంద్రా (70 వ ఆకు, బహుధాన్య, పుష్య బ. ౮, ఆదివారము ; క్రీ. శ. 1759 జనవరి 21వ తేదీ ; పొత్తూరు పాపన్నకు గొల్లపూడి త్రివిక్రమయ్య వ్రాసి ఇచ్చినది).

vi కృష్ణామండలము :

నెం. 979. సరియుగావపరేంద్రా (48 వఆకు, రెండవవైపు ; ప్లవంగ మాఘ శుద్ధ ౧౦, సోమవారము ; క్రీ. శ. 1848 ఫిబ్రవరి, 14వ తేదీ).

నెం. 2733. సరియుగావమరెంద్రా (54 వ ఆకు, మొదటివైపు).

నెం. 3698. సరియుగావమరెంద్రా (76 వ ఆకు, రెండవవైపు).

vii. గోదావరి మండలము :

నెం. 1014. సరియుగావమరేందాౄ (92 వ ఆకు, మొదటివైపు ; వికారి కార్తీక శుద్ధ ౭, శనివారము).

నెం. 4550. సరియకావమరెంద్ర (52 వ ఆకు, రెండవవైపు).

viii. దక్షిణదేశము ;

నెం. 85. సాటిగావమరెంద్రా (69 వ ఆకు, రెండవవైపు).

నెం. 100. సరియుగావమరేంద్రా (68 వ ఆకు. మొదటివైపు).

నెం. 226. సాటిగావమరేంద్రా (79 వ ఆకు, రెండవవైపు).

నెం. 227. సరియుగావమనరెంద్రా.

నెం. 295. సాటిగావమరెంద్రా,

నెం 309. సమముగావమరెంద్రా (80 వ ఆకు, రెండవవైపు) ; నళ సంవత్సర మాఘశుద్ధ ౭ శనివారం, తైనెల 26వ తేదీ; క్రీ. శ. 1797, ఫిబ్రవరి 4 వ తేదీ).

నెం. 339. సరియుగాదమరెంద్రా (92వ ఆకు, మొదటివైపు).

నెం. 361, సరియుగాదమరెంద్రా (81 వ ఆకు, మొదటివైపు).

ix. ఇతరములు :

(ఏ ప్రాంతమునకు చెందినవో స్పష్టపడని తాళపత్ర ప్రతులు).

నెం. 1195 సరియుగావమరెంద్రా (76వ ఆకు, రెండవవైపు).

నెం. 1473. సరియుగావమరెంద్రా (72వ ఆకు, రెండవవైపు),

నెం. 1656. సరియుగావమరెంద్రా (72వ ఆకు, మొదటివైపు).

నెం. 1707. సరియుగావుసురెంద్రా (68వ ఆకు, మొదటివైపు).

నెం. 1708. సరియుగావమరెంద్రా (63వ ఆకు, మొదటివైపు),

నెం. 1710. సరియుగావమరెంద్ర (80వ ఆకు, రెండవవైపు).

నెం. 2313. సరిగావమరెంద్రా (58 వ ఆకు మొదటివైపు).

నెం. 2462. సరియుగావమరెంద్రా (71 వ ఆకు, మొదటి వైపు).

నెం. 2545. సరియుగాదమరెంద్రా.

నెం. 2630. సరియుగాదమరెంద్రా (62 వ ఆకు, రెండవవైపు).

నెం. 2639. సరియుగాదమరేంద్రా (62 వ ఆకు రెండవవైపు).

నెం. ? సరియుగావమరేంద్ర

నెం. ? సరియుగావమరేంౘ్రా (64 వ ఆకు, రెండవవైపు)

నెం. ? సరియగావమరెంౘ్రా (71 వ ఆకు, రెండవవైపు)

II. తంజావూరు :

**మహారాజా శరభోజీ సరస్వతీమహాలు లిఖిత గ్రంథాలయము నందలి తాళపత్రపత్రులు.**

D. 58. సరియుగావమరేంౘ్రా (M. 26)

D. 59. సరియుగావమరేంౘ్రా (M. 27)

D. 60. సరియుగావమరేంౘ్రా (M. 28)

D. 64. సరిగావమరేంౘ్రా (M. 31)

D. 65. సరియుగావమరేంౘ్రా (M. 32 ; Tel No. 52)

D. 68, సాటిగావమరేంౘ్రా (M. 35)

III. తిరుపతి ;

i. శ్రీవేంకటేశ్వరవిశ్వవిద్యాలయ ప్రాచ్యపరిశోధకసంస్థ (Sri Venkateswara University Oriental Research Institute - SVUORI) గ్రంథాలయమునందలి తాళపత్రపత్రులు.

Stock No. 558(a). ఘోర తపమునకు సరిగావమరేంౘ్రా.

Stock No. 561. దుష్క...ఘోర...

బుతో సరియుగాదమ .... ౘ్రా.

Stock No. 580. తపంబు సరియుగావమరేంౘ్రా.

Stock No. 1004. ఘోర తపంబు సరియుగాదమరెంౘ్రా.

Stock No. 1010. సవతుగావమరేంౘ్రా.

Stock No. 5964. సంయుగావమరెంద్రా ('సరియు' కు 'సంయు లేఖక దోషము కానోపు.)

Stock No. 6780(a). ఘోరతపంబులు సరియుగావమరేంద్రా.

Stock No. 7594. ఘోరతపంబ్బు సరియుగావమరేంద్రా (అత్యంత శిథిలప్రతి.)

Stock No. 7696(a). దుష్కరతప...బు సరియుగాదమరెంద్రా.

ii. మదరాసుప్రభుత్వప్రాచ్యలిఖితగ్రంథాలయము (Govt. Oriental Manuscripts Library, Madras) నుండి తిరుపతిలోని శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్య పరిశోధక సంస్థ గ్రంథాలయమునకు మార్చిబడియైన తాళపత్ర ప్రతులు.

D. 186. దుష్కరఘోర తపంబ్బునకు సరియుగావమరెంద్రా (Tel. B. 119 ; 11-15-1)

D. 189. నాందగు దుష్కరఘోరతపంబ్బు సరియుగావమరెంద్రా (Tel. B. 116 ; 11-15-2)

D. 194. దుష్కరఘోరతపంబ్బు సరియుగావమరెంద్రా (Tel. B. 120 ; 14-13-15 ; అత్యంతశిధిలప్రతి.

D. 196. దుష్కరఘోర తపంబు సరియుగాదమరెంద్రా (Tel. B. 122 ; 14-7-14).

D. 200. దుష్కరఘోర తపంబ్బు సరియుగా దమరెంద్రా (Tel. B. 126 ; 14-11-7 ; ప్రాచీనప్రతి, అసమగ్రము, ఆదిపర్వమున మొదటి నాలుగాశ్వాసము లున్నవి).

IV. మదరాసు :

ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయము నందలి మిగిలిన ప్రతులు.

D. 163. 'సరియుగావమరేంద్రా' బ్రౌనుదొరగారి కాకితపు ప్రతి. ఏడు తాళపత్ర ప్రతులనుండి పాఠభేదము లెత్తించి తామీ సంపుటములను కూర్చి

నట్లు బ్రౌను దొరగారు పేర్కొనినారు. తాళపత్ర ప్రతులనుండి సంగ్రహింపఁబడిన పాఠభేదము లాయా కాగితపు ప్రతుల నడుమఁ జేర్పఁబడినవి. అందు యుక్త పాఠములుగ భావింపబడినవి ఖాళీగానున్న ఎదిరిపుటలయందు గుర్తింపఁబడినవి. ఈ పాఠమునొద్ద పాఠాంతరము లేవియు లేవు(6).

D. 193. 'సరియుగావమరేంద్రా' (కాకితపుప్రతి. పత్రమున కొకే వైపున వ్రాయఁబడినవి; రెండవవైపున పాఠభేదములు గుర్తింపఁబడినవి. ప్రస్తుతపాఠమునొద్ద పాఠభేదము లేవియులేవు)

D. 203. 'సరియగావుసురేంద్రా' బ్రౌనుదొరగారి కాకితపుప్రతి. ఆది పర్వము ద్వితీయాశ్వాసము 173 వ పద్యమునుండి ఏడవ ఆశ్వాసమువరకు కలదు. పాఠాంతరములులేవు. బ్రౌను దొరగారు పరిశీలించిన ప్రతులలో 'సవతు' లేనట్లేకదా : (7).

V. రాజమహేంద్రవరము :

i. ఆంధ్రేతిహాస పరిశోధకమండలి, రాజమహేంద్రవరము వారి గ్రంథాలయమునందలి తాళపత్ర ప్రతులు,

నెం. 53. దుష్కరఘోరతపంబ్బు సరియుగావమరేంద్రా (41వ ఆకు),

6. "The Mahabharata now first reduced to numerical arrangement and copied in separate verses and lines by the directions of Charles Philip Brown. The alterations made in this copy show the various readings found in seven (the printed catalogue reads 'some', see p. 174, A Descriptive catalogue of Telugu Manuscripts in the Government Oriental Manuscripts Library, Madras. 1915 ; Vol. I (Prabhandhas) copies compared by me".

7. "The Telugu Mahabharatamu, Vol. 2nd Beginning at Book I, canto 2, verse 173. Charles Philip Brown. This copy is extremely incorrect but contains some valuable readings only upto the beginning of the 7th canto.

నెం. 54, దుష్కరఘోరతపంబుతో సరియుగావమరేంద్రా (21 వ ఆకు).

నెం. 59. దుష్కరఘోరతపంబు సరియుగావమరేంద్రా (81 వ ఆకు; సిద్ధార్థి సంవత్సర వైశాఖ బ. 3 గురువారము).

ii. గౌతమీ గ్రంథాలయమునందలి తాళపత్రప్రతి.

నెం. 51. దుష్కరఘోరతపంబు సరియకావు నరెంద్రా (79వ ఆకు).

VI. వాల్తేరు :

i. బొబ్బిలి సంస్థానాధీశ్వరులు ఆంధ్ర విశ్వకళా పరిషద్గ్రంథాలయమునకు బహూకరించిన తాళపత్ర గ్రంథసంచయమునందలి ప్రతులు.

నెం. 61. నాదగు దుష్కరఘోరతపంబు సరియుగావమరేంద్రా (71 వ ఆకు, రెండవ వైపు, నాల్గవపంక్తి; హేమలంబి సంవత్సర మాఘ శుద్ధ ౧౧, సోమవారము; క్రీ. శ. 1838, ఫిబ్రవరి 5 వ తేదీ).

నెం. 73. నాదగు దుష్కర ఘోరతపంబు సరియు గోవమరేంద్రా (69 వ ఆకు రెండవ వైపు, 70 వ ఆకు. మొదటి వైపు).

నెం. 88. దుష్కరఘోరతపంబు సరియు గావమరేంద్రా (56 వ ఆకు మొదటివైపు, ఆఱవ పంక్తి; ప్లవంగనామసంవత్సర చైత్రశుద్ధ ౫ ఆదివారము; క్రీ. శ. 1847, మార్చి 21వ తేదీ).

ii. శ్రీ శేషాద్రి రమణ కవులు ఆంధ్ర విశ్వకళా పరిషత్పక్షమున తెలంగాణమున పర్యటించి సేకరించిన తాళపత్రప్రతి.

Acc. No. 29211. సరియుగాదమరేంద్రా (60 వ ఆకు, మొదటి వైపు, రెండవ పంక్తి).

VII. విజయనగరము :

విజయనగరము మహారాజావారి ఫోర్ట్ లైబ్రరీలోని లిఖితప్రతులు,

'దుష్కరఘోరతపంబునకు సరిగావమరేంద్రా' (తాళపత్రప్రతి, 45 వ ఆకు. రెండవ వైపు).

‹దుష్కర్మఘోరతపంబుకీడు గా దమరేంద్రా (కాగితపుప్రతి).

పరిశీలితములయిన, నూఱాఱు తాళపత్రప్రతులలో ఈ పద్యములున్నవి 90 మాత్రమే, 'సరియు' నకు 'ఈడు' 'సమము', 'సవతు', 'సాటి' యను నాలుగు పాఠాంతరములు మాత్రమున్నవి. ఈ పాఠముల వ్యాప్తి యిట్లున్నది,

| | | |
|---|---|---|
| 1. 'సరియు' ఘటితపాఠములు | ... | 79 |
| 2. 'సాటి' ఘటితపాఠములు | ... | 5 |
| 3. 'సమము' ఘటితపాఠములు | ... | 3 |
| 4. 'సవతు' ఘటితపాఠములు | ... | 2 |
| 5. 'ఈడు' ఘటితపాఠము | .... | 1 |
| | మొత్తము : | 90 |

ఇట్లు తెలుఁగు మాగాణము నాలుగు చెఱఁగుల సేకరించిన తాళపత్ర ప్రతుల పాఠములు 'సరియుఁగా' వను పాఠమే సాధువనుటకు ప్రత్యక్ష ప్రమాణములు. ఈ సత్యమును ప్రత్యాఖ్యానము సేయఁజాలరు కదా ! ఇంతేకాదు___

1. "....సురసిద్ధమునీంద్ర తప
శ్చరణలు నా తపముతోడ సరికావంటిన్"

(భారత. ఆది. 3_215)

2. "సర్వతీర్థాభిగమనంబు సర్వవేద
సమధిగమము సత్యంబుతో సరియుఁగావ
యెఱుఁగు మెల్లధర్మంబులకెందుఁ బెద్ద
యండ్రు సత్యంబు..."

(భారత. ఆది. 4_96)

3. "...దివ్యసభలెల్ల నరే
శ్వర చూచితి నని దీనికి
సరిగా నత్యంత విభవసౌందర్యములన్"
(భారత. సభా. 1-60)

4. "ధరణి హరిశ్చంద్రుఁడు భా
సురయశుఁడయి చేసె రాజసూయంబదియున్
సరిగాదని యేవగతును
సురుచిరవిభవమునఁ బాండుసుత యజ్ఞముతోన్"
(భారత. సభా. 2-117)

అను నిట్టి నన్నయ ప్రయోగపఙ్క్తియు ఉపమాన ప్రమాణముగా పై అనుమతికి ప్రోద్బలకము (8) ధీరవిచారుఁడగు '...ఎఱ్ఱనార్యుండు సకల లోకైక విదితుఁడయిన నన్నయభట్టమహాకవీంద్రు సరససారస్వతాంశప్రశస్తి దన్నుఁజెందుటయు సాధుజనహర్ష సిద్ధిగోరి '...తత్కవితారీతియుఁ గొంత దోఁపఁ దద్రచనయకా, కవీంద్ర కర్ణపుటపేయముగా' పూరించిన ఆరణ్యపర్వ శేషమునందును—

'ధనధాన్య పుత్రబాంధవ
జనలాభంబులను దలఁపసరిగావుఁ సుఖం
బునఁ దారు, దనదు శత్రులు
ఘనతర దుఃఖములనుండఁగని యలరుటకున్'
—ఆరణ్య. 5-348

'శరణంబని వచ్చిన భీ
కర శత్రునినయినఁ బ్రీతిగావఁగవలయుం
గరుణాపరుల తెఱంగిది
యిరవుగ సరిగావు దీనికే ధర్మంబుల్'
—ఆరణ్య, 5-413.

---

8. "కూంతు సరియపోల్వంగాం తలెందు" - దక్షారామశాసనము, క్రీ. శ. 1065. (South Indian Inscriptions, Vol. IV. No. 1007).

అని యిట్లు నన్నయ ప్రయోగపఙ్క్తియే పాటింపఁబడుట ఈ యనుమితికి అదనపు బలము. ఎఱ్ఱనార్యుని ప్రతిజ్ఞలోని ప్రత్యక్షరమును ప్రమాణబద్ధము. - మఱియొక విశేషము—

"సురదైత్య యక్షరాక్షస
నరఖేచర సిద్ధ మునిగణప్రవరుల భా
సుర తపములు నాదగు దు
ష్కరఘోరతపంబు సరియుఁగావమరేంద్రా"

(భారత. ఆది. 3-209)

అని తపోభిమానమున ఇంద్రునితో పలికి ఉత్తమావమానకారణముగా తపః ఫలహాని నందినవాఁడు యయాతి, స్వీయ స్వర్గచ్యుతికి హేతువును తన దౌహిత్రుల కెఱిఁగించు సందర్భమున —

"సురపతి నా తపమున క
చ్చెరువడి నీ తపముపేర్మిఁ జెప్పుమ యనినన్
సురసిద్ధమునీంద్ర తప
శ్చరణలు నాతపముతోడ సరికావంటిన్"

(భారత. ఆది. 3-215)

'అని సరికావు' అను అదే పలుకుబడి యయాతినోట పునరుక్తమగుట గమనార్హము.

ఇంకొకమాట. తెలుఁగునందలి 'సవతు' ప్రాకృతభవమే కాని హిందీ నుండి ఎరవు తెచ్చిన అన్యదేశ్యముకాదు. ఈ 'సవతు' సంస్కృతమునందలి 'సమతా' పదభవమను ఆంధ్రనిఘంటువుల అంచనా సత్య దూరము. (9) ప్రతిస్పర్ధి, శత్రువు అను నర్థములుకల సంస్కృత 'సపత్న' (10) పదమీ 'సవతు'

9. i. ఆంధ్ర పదపారిజాతము, 1888 ; పు. 768.

ii. బహుజనపల్లి సీతారామాచార్యుల వైకృతదీపిక, తృతీయ ముద్రణము, 1900 ; పు. 110.

(మిగతా 78 వ పేజీలో)

తు అసలు మూలమనుట సత్య సమ్మతము. ప్రాకృతమున 'సవత్త' = సమానము, తుల్యము; విరుద్ధము; విరోధము; అర్ధమాగధీలో 'సవత్త' = విపక్షి పాళీలో 'సవత్త' = వైరము అనునవి సంస్కృత 'సపత్న' పదభవములు. 'సవతి' వైకృతమనుట సర్వలాక్షణిక సమ్మతము. సమానపతిక సపత్ని; 'సపత్ని' సంస్కృతపదము. మహారాష్ట్రి ప్రాకృతమున సఉత్తీ సవత్తిణీ, సవత్తిఆ, సవత్తియా, సవత్తీ; అర్ధమాగధీలో సవత్తియా, సవత్తీ; శౌరసేనీలో సవత్తీ; అపభ్రంశమున సాయత్త; పాళీలో 'సపత్తీ' అనురూపములు సంస్కృత సపత్నీ పదజన్యములు. కాఁగా తెలుఁగునందలి 'సవతి', 'సవతు' పదములు ప్రాకృతభవములు. కన్నడ భాషయందలి 'సవతి' పదమును ప్రాకృతభవమని ఏతద్భాషాపండితుల మతము. క్రీ. శ. పదియవశతాబ్ది ప్రథమపాదమునకు చెందిన 'విక్రమార్జునవిజయ' (పంప భారత) మనుకన్నడ కృతియందు తోడిపెండ్లాము అను నర్థమున 'సవతి' పదము ప్రయు

---

iii. బ్రౌణ్యము, రివైజ్డ్ ముద్రణము, 1903; పు. 1320.

iv. లక్ష్మీనారాయణీయము, 1907; పు, 803.

v. పురుషోత్తమ కవీయము, 1918; పు. 131.

vi. ఆంధ్రవాచస్పత్యము, 1940 పు. 2619.

vii. దేశ్యమని కాంబెల్, 1821; పు. 576.

viii. సమత్వ శబ్దభవమని కవిజనాంజనకారుఁడు, తాళపత్రప్రతి, 16వ ఆకు రెండవవైపు.

10. i. "రిపౌవైరి సపత్నారి ద్విషద్ద్వేషణ దుర్హృదః"
— అమరకోశః ద్వితీయకాండమ్ క్షత్రియవర్గః శ్లో. 10

ii. "అవాప్య భూమా వసపత్న మృద్ధమ్"
—భగవద్గీతా. 2-8.

క్తము.(11) నవీనోత్తరాహ భాషలలోని సఉత్, సవత్, సవత, సవతి, సౌత్, సౌత, సౌతని, సౌతా, సౌతీ(= సవతి, సపత్ని) పదములు ప్రాకృతజన్యములు; అరబ్బీ, తుర్కీ మొదలగు అన్యదేశభాషలనుండి ఎరవు తెచ్చినవిమాత్రము కావు. ప్రాకృతాదులలోని సవత్త, సవత్తీ పదములు తజ్జన్యపరంపరయగు గౌడీయభాషలలో ధ్వనిసూత్రబద్ధములైన స్వల్పరూపభేదములతోఁ గన్పట్టుట స్వాభావికము. సవత్యాది పదవిషయముగా తెలుఁగు, కన్నడములకును, నవీనోత్తరాహ భాషలకును ఏకమాతృకా భావముతప్ప జన్యజనక భావముగాని పోష్య పోషకభావముగాని వర్తింపదు. ప్రాకృతములతోడి సంసర్గసంబంధము వలన తెలుఁగు, కన్నడములకును, నిసర్గ సంబంధమువలన హింద్యాదిగౌడీయ భాషలకును 'సవతి', 'సవతు' పదములు సంక్రమించుట. ఇదిచారిత్రక సత్యము. ఇది శాస్త్రీయప్రక్రియ. విశేషించి, ఒక్క హిందీమొగమునవే ప్రొద్దుపొడువలేదు. గౌడభాషలన్నింటను సవత్యాది పదములు ప్రచురవ్యవహారము కలవి. ఈ హిందీ యనఁగా నిన్నా మొన్నటిది; అవధీ, వ్రజ

---

iii. "తతః సపత్నాపనయ స్మరణానుశయ స్ఫురా
ఓష్ఠేన రామో రామోష్ఠబింబ చుంబన చుంచునా"
—శిశుపాలవధ, ద్వితీయః సర్గః, శ్లో. 14; నిర్ణయసాగర ప్రెస్ బొంబాయి, 1927.

iv. "కృతప్రణామస్య మహీం మహీ భుజే
జితాం సపత్నేన నివేదయిష్యతః
న వివ్యథే తస్య మనో న హి ప్రియం
ప్రవక్తుమిచ్ఛంతి మృషా హితైషిణః"
— కిరాతార్జునీయమ్, ప్రథమః సర్గః, శ్లో. 2; చౌఖంబా సంస్కృత సీరీస్, వారాణాసి, 1952.

v. "...మానధనాఢ్యుఁడైన భూపతి సహియింపనోపునె సపత్నుల వృద్ధియు నాత్మహానియున్" (ఆంధ్రభారతము సభా. 2-98.)

vi. "అశేష రాజావళిలోన నత్యధికులైన సపత్నుల పేర్మిఁజూచి యేఁజూవె సహింపనోపక కృశుండ వివర్ణుఁడనైతి నెంతయున్".
(—పైది సభా. 2-114.)

11. "శ్రీయువతియ నావీర
శ్రీయుపతిగె సవతి మాత్బె నెందరి న్నపరు

మైథిలీ భాషాపరమయిన సాహితీ వ్యవసాయమును (12) సైతము హిందీపద్దు క్రింద జమచేసి లెక్కకట్టినను బంగాళీ, మరాఠీభాషలకి దానీంతనమయిన సాహిత్య చరిత్రకలది. పదునైదవు శతాబ్దికిపూర్వము హిందీలో ప్రామాణికమయిన సాహిత్య మున్నటులు నిర్దుష్టమయిన ఆధారములు మృగ్యము. హిందీలో తీర్చెనన్న అమీర్ ఖుస్రో రచనల అంతు ఇంకను వివాదగ్రస్తము. అమీర్ ఖుస్రోను ఆశ్రయించినను హిందీ పదియవు శతాబ్దికి పోలేదు. 'గ్రంథస్థదశమాటను అటుంచి, హిందీభాషవ్యవహారమాత్రోపయోగిగానైనను ఉండియుండదా' అని పూర్వపక్షమువారి ఆశంక. ఆనాఁటికి హిందీభాష ఆలుచూలు లేని సోమలింగము! మాండలికావస్థకు పూర్వదశలో అపభ్రంశస్థాయిలోనుండినది. ప్రమాణములు కావలయునని పట్టుపట్టినచో బండ్లకెత్తుదుము. మీఁదుమిక్కిలి హిందీభాషావ్యవహారమండలమునకు తెలుఁగు కన్నడ సీమలతోడి సంబంధబాంధవములు అర్వాకాలికములు. అందును అల్పీయములు. శాతవాహనుల యేలుబడి నాఁటికే తెలుఁగులకు మహారాష్ట్రిప్రాకృతముతో ప్రగాఢమయిన ప్రత్యక్షసంబంధము లుండిన వనుటకు ప్రమాణములు పుష్కలములు. నాఁటి ప్రాకృతభాషా కృతులపై ముఖ్యముగా శాతవాహనచక్రవర్తి

---

ళ్ళాయ వెరనె తెదుకొండు ధ
రా యువతిగె నెగర్ద హరిగ నొర్వనెగండం"
— పంప భారతం ఎంబ విక్రమార్జున విజయ, ఆశ్వా.

11, పద్య 1; పు. 281; బెళ్ళావె — వెంకటనారాయణప్ప సంపాదితము, కర్ణాటక సాహిత్య పరిషత్తు, బెంగళూరు, 1927. పంపఁడు క్రీ. శ. 902–941 ప్రాంతమువాఁడు, అనఁగా నన్నయ (1022–1068) కు నూఱేండ్లు పూర్వుఁడు

12. i. "సవతి నహోవి ఆహితుమ్ బైరిని" (=నీవు సవతివికావు, పగతురాలవు) — 94వ చౌపాయీ, మాలిక్ మొహమ్మద్ జాయసీ (క్రీ. శ. 1540) కృతమగు 'పద్మావతీ', లక్ష్మీధరపరిష్కృతము, లండన్, 1949;

ii. "మంథరా కహేసి కథా పత సవతి కఇ" (సవతులకు సంబంధించిన నూఱాఱు కథలను మంథరచెప్పినది) — తులసీదాస్ (క్రీ. శ. 1575), రామ్‌చరితమానస్, పు. 164; ఈ రెండుకృతులును 'అవ్‌ధీ' భాషామయములు.

హాల సంకలితమగు 'సత్తసఈ' పై దిరుగులేని తెలుఁగుముద్ర కలదని సాహితీ సుగతులు శ్రీ తిరుమల రామచంద్రగారి తీర్పు. ఈ చర్చ యంతయు అనుమాన ప్రమాణముగా అంగీకార్యము.

అయిన, 'సరియుఁగా'వను పాఠమును 'సవతుకావు' అని ఏల మార్చిరో నిష్కర్షము సేయుట దుశ్శకము. పూర్వపరిష్కర్తలు చూచిన ఒండురెండు తాళపత్ర ప్రతులలో 'సవతు' అను పాఠము ఉండుటను బట్టి ఆ పాఠమట్లే అంధపరంపరగా తదర్వాచీనప్రతులలో నిర్వహింపఁబడియుండుట సుసంగతము. అర్వాచీనాంధ్ర సాహిత్యమున 'సవతు' పదమునకుఁగల ప్రాచుర్యము (13) మూలమున ఒకరిద్దఱు తాళపత్రలేఖకులీ పాఠమును సృష్టించి యుందురనుటయు సంభవమే! మేము చూచిన నూటాఱు తాళపత్ర ప్రతులలో రెండంటే రెండు ప్రతులలో 'సవతు' ఘటిత పాఠముండుట ఇతః పూర్వమే నిర్ధారితము. ఇవి రెండును అత్యర్వాచీనములు. పూర్వప్రకాశకులు – పరిష్కర్తలుకారుసుఁడీ– పెక్కురు అవిచక్షణులగు అక్షరచణులు. ప్రధానముగా వారిది వ్యాపారదృష్టి. 'పండితులచేత పరిష్కరింపఁబడిన (పూర్వముద్రిత) ప్రతిప్రకారము సరిచూడఁబడి ముద్రింపఁబడిన' (14) ముద్రణములే తొలిదశలో అధికము. ఆదిలో 'కాపీరైటు' బాధయునులేదు. 'కాపీరైటు హక్కు' సాధారణ న్యాయము (common law)గా ఉండెడిది. ఆ తరువాత తరువాతగాని అది వ్యవస్థాపితమగు చట్టము (Statutory Act) గా రూపొందలేదు. అందుకే ప్రాచీన ముద్రణము

---

13. i. "నన్నుఁ జూడుమెవ్వఁడు సవతిటు చూడుమింక" (నృసిం. 5–88);
ii. "అనఁగ సవతులేని యభినవాకారంబు···" (భోజరా. 3–224);
iii. "జననాథ నీ ప్రతాపంబునకు సవతెద్ది" (జై. భారత. 8–164);
iv. "క్రమమునఁ జేసిరన్ సవతురామికిరోసి" (చిత్రభారత. 3–69);
v. "మోవిసవతా చివురెక్కడి మాట" (విజయవిలా. 1–117);
vi. "సవతెచ్చటనులేని చౌకట్టు పోగులు" (యయాతి. 4–94);
vii. "సరియుద్ది ప్రతిదిన్నం సవతుపోలిక దొరజత యనఁగా సదృశమున కెనఁగు" (సాంబ నిఘంటువు, స్థావరవర్గు, 64);

14. వంకాయల కృష్ణస్వామి శెట్టివారి భారతప్రతి (1890) ముఖపత్రము.

లంతింత మాత్రముగా వెలయుట ! కాని, అర్వాచీన పరిష్కర్తలగు తంజ నగరము తేవప్పెరుమాళ్ళయ్య, బుక్కపట్టణము రామానుజయ్య, పురాణం సూర్యనారాయణతీర్థులు మొదలగువారు నాఁటి ప్రకాశకులకు నచ్చజెప్పి, నన్నయ భారతము తాళపత్రప్రతులను పెక్కింటిని పరిశీలించి పాఠనిర్ణయ మొనర్చినవారగుటచేత తత్పరిష్కృత ముద్రణములయందు 'సరియుఁగా' వను పాఠము కర్త్రభిప్రేతముగా స్వీకృతమయి యుండుట సంభావ్యము. అంతేకాని, హిందీలో ఇదే యర్థముకల 'సవత్' పదము తెనుఁగుల వాడుకలోఁ జేరి శబ్ద శాసన ప్రయుక్తమయినదనియు, క్రీ. శ. 11 వ శతాబ్దమున తురకపదములు ఆంధ్రభాషలో లేవను భ్రమతో పండితులో 'వ్రాయసకారు'లో 'సవతు' ను 'సరియు' అని తుడుపులుపెట్టి మార్చిరనియు వాదించుట సప్రమాణము, సత్య మూలము కాఁజాలదు. ఈ 'సవతు' హిందీపదము కాఁబోలునను దృష్టితో పండితులో, 'వ్రాయసకారు' లో 'సరియు'గా మార్చి యుందురని మాటవరుసకు అంగీకరింతము. ఆ పక్షమున ఆక్షేపములు రెండు. ఒకటి : సవతుకు సమీప వ్యుత్పత్తికమును, రెడ్డిగారి చూపులో 'సవతు' తో పాటు హిందీ నుండివచ్చిన అన్యదేశ్యమును అగు 'సవతి' (= తోడిపెండ్లాము) పదఘటితమగు "నీ సవతికి దాసివై" (భారత. ఆది. 2-7) అను గరుడోపాఖ్యానమునందలి పాఠమును ఆ పండితులో, 'వ్రాయసకారు' లో తుడుపులుపెట్టి దిద్దలేదేల ? ముద్రిత ప్రతుల యందును, తాళపత్ర పత్రులయందును సర్వేసర్వత్ర "నీ సవతికి దాసివై" అను పాఠము చెక్కు చెదరకుండ కుదురుగా నిలిచియున్నదికదా ! ఇది, ఇట్టి చూపుగల పరిష్కర్తల దృష్టికందలేదని సమర్థింపఁజూచినచో ఒక్కదండముపెట్టి ఊరకుండుట శ్రేయము. ఇఁక రెండవ ఆక్షేపము : నన్నయనాఁటికి తెలుగుఁన అన్యదేశ్యములు చేరుట కవకాశములేదను భ్రాంతికల పండితులో, లేఖకులో నన్నయ కృతిలోఁగల అన్యదేశ్యములనుమార్చి ఆ తావున శుద్ధదేశ్యములను కూర్చిరనికదా శ్రీ రెడ్డిగారి వాద సారాంశము. 'సవతు' స్థానమున వచ్చిన దనుచున్న 'సరియు' శుద్ధదేశ్యమనికాబోలు శ్రీ రెడ్డిగారి భావన ! కాని, 'సరి' యను పదమును దేశ్యముకాదు. 'సవతు'తో పాటు 'సరి' యును తద్భవము:

ప్రాకృతభవము. ప్రాకృతములో సరి, సరిస=సమానము, తుల్యము (15): మాగధీలో శలిశ ; అర్ధమాగధీలో సరి, సరిస, సరిసగ ; సరిసయ ; శౌరసేనీలో సరిస; అవంతిలో సరిచ్ఛ ; శాకారీలో సలిచ్ఛ ; పాలీలో సదిస, సరిస; అపభ్రంశములో సరి ; నవీనార్య భాషలగు నేపాలీ, మరాఠీ, సింహళీ, హిందీ భాషలలో సరస, సరి, సరిస, సరీ - పదములు ప్రాకృతజన్యములు. ఏతద్రూప పరంపరకు సంస్కృతములోని 'సదృశ ' పదము మూల మాతృక, 'సరి', 'సవతు'లు రెండును హిందీయందు సమానమయిన వ్యవహారబలముకల పదములు (16). 'సవతు'ను హిందీ పదముగా గుర్తింపగలిగిన భాషాజ్ఞానము కల పండితులకు 'వ్రాయసకారు' లకు 'సరి'యను పదమును హిందీయందు ప్రసిద్ధమను నంశము తెలియకపోవచ్చుననుట బలము చాలని ఆశంక. ఇట్టిచో 'సవతు'ను పెఱికి 'సరి' ని ఇఱికించుట ముల్లువుచ్చి కొఱ్ఱుడిచిన చందము కాదా ? కావున నిట 'సవతు : సరియు' అని తుడుపులుపెట్టి మూలపాఠమును మార్చి కూటకరణము చేసిరనుట నిలువనేరని మాట ! ఇట్లు సర్వప్రమాణ సంపన్నమయిన "సరియుఁగా" వను పాఠమే శబ్దశాసనాభిప్రేతమని సిద్ధాంతము.

---

15. 'చేరువ, సమీపము; తోడు; అరాసనము' అను నర్థములతో తెలుఁగునఁగల 'సరస' యును 'సదృశ' పదసంబంధి. ప్రాకృతములందలి 'సరస' దీనికి మాతృక; కాఁగా, నిది ప్రాకృతభవము. దీనిని మన నిఘంటుకారులు (శ. ర., 1885; పు. 1076; లక్ష్మీనా. పు. 800; ఆంధ్రవాచ. పు. 2606) దేశ్యముగా పేర్కొనుట ప్రమాదము.

"... ప్రాచీ దిఙ్ముఖుఁడైన నాకు సరసన్ బ్రద్యుమ్నుడున్ నీవు
హేలా చాతుర్యము దాపలన్ వలపలన్ లావై పచారింప..."-ఉ. హరి 6-65
"... నా సరసన్ జనించి నిన్
బలపెడి వీరుఁ డొక్కఁడెస సత్కృతి నొందెడువాఁడు..." —భాగవతము, దశమ. పూర్వ. 154.

16. "సవి సో కలంకీ రాహుహి పూజా
తోహిన కలంక, నకో ఇ సరి దూజా"

( = శశి కళంకమూర్తి, రాహుగ్రస్తుడు; నీవు అకలంకమూర్తివి, నీ సరి రెండవవారు ఏరును లేరు) - 63 వ చౌపాయీ, 7 వ ద్విపదిక, మాలిక్ మొహమ్మద్ జాయసీకృతమగు 'పద్మావతీ లక్ష్మీధర పరిష్కృతము,పు. 95.

వైకృతములుగా సర్వాదరణీయములయిన 'సవతి', 'సవతు' పదములను అన్యదేశ్యములని ప్రతిపాదించు పెద్దలు ప్రాఙ్నన్నయ్కీయుగ (క్రీ.శ. 575-1022) శాసనములయందలి ఆనతి, ఓవజు, కమ్మరి, కొట్టంబు, గొరవ, జాత్ర, జోగి, దేగుళము, దోసము, పున్నమ, బోయ, రాచ, వాడ — మొదలగు వైకృతములను సైతము హిందీ పదములని రాద్ధాంతముసేయుదురు కాఁబోలు ! తెలుఁగు, కన్నడములకు ప్రాకృతభాషలతోఁగల ప్రాచీన సంసర్గ సంబంధమును విస్మరించి, నన్నయాదుల నాఁటికి కాదుగదా నన్నయ కిటీవల నన్నూఱేండ్లకుఁ గూడ పృథగ్భాషగా నిర్దిష్టమయిన మూర్తిని పొందియుండని హిందీ భాషలోని గాడీ, సవత్, సవతి పదములు నన్నయాదుల కాదరణీయములయి వారి రచనల కెక్కియుండునని సిద్ధాంతీకరించుట చరిత్రను తలక్రిందులుసేయుట ; శాస్త్రమును పెడదారులు పట్టించుట. లోకవ్యవహారమును, శాస్త్రవ్యవహారమును విపరీతార్థ కల్పనలతో విపర్యయముసేయుట ప్రశస్యముకాదు.

"గ్రంథపరిశీలనము లేని వాదముల క్రమములు ; అప్రయోజకములు" అని పూజ్యులు శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారి ఎచ్చరిక. శ్రీ శాస్త్రిగారు నిస్పృష్టార్థప్రియులు, మనీషి, విద్యాశ్రమతత్త్వవేత్తలు. "అమలజ్ఞాన సుదీప వర్తిఁగొని వృద్ధాచారులై వేదశాస్త్రము లందున్న సదర్థ మెల్లఁగొని విద్వత్ప్రీతి గావించు" పండిత పరిశోధకులను ఒప్పించుట, మెప్పించుట కత్తిమీఁది సాము. వారి ఒప్పుదలను, మెప్పుదలను పొందుటకే ఈ అల్పపరిశ్రమము. విశేషించి,

> "మొదలన ప్రియమయ్యును దుదిఁగరంబు
> పథ్యమగుపలుకు ప్రియులందు బలిమినైనఁ
> బలుకవలయు మోమోడక ..."

(సభా. 2-192)

అని భారత నీతి. అందువలన ఈ విస్తరము.

# వికృతి వివేక కర్తృత్వము

వికృతివివేక మథర్వణకృతము గాదనియు, కవిశిరోభూషణ కర్తయగు **అహోబల పండితుడే** దీనిని రచించి గ్రంథప్రామాణ్యసంసిద్ధికయి అథర్వణుని పేరుపెట్టెననియు పెక్కురు పరిశోధక పండితుల అభిప్రాయము. 1 అంత రంగికములగు మఱికొన్ని సాక్ష్యముల మూలమున పై అభిప్రాయమును బల పఱుచుటయే ఈ వ్యాసప్రధానోద్దేశము. అద్యఃక్రియాస్వేత్వాది ఆంధ్రశబ్దచింతామణి సూత్రోపదిష్టభావములను విస్తృతముసేయు తలంపుతో వికృతివివేకకర్త భావిక్రియాసు యస్య స్యాత్ ఏత్వమేవ ప్రయోగతః.....దోలాభాషోత్తరీయాణి విన్యేత్వం నాస్తిమధ్యయః' (అథర్వణకారికావళి, సంజ్ఞా 14_15 పుటలు, వావిళ్ళ, 1955) అను కారికలను రచించినాడనుట స్థితస్థాపకాంశము. దోలాభాషోత్తరీయ శబ్దార్థకములగు ఉయెల, తాయెతు, పయ్యెద_ శబ్దములందక్క తక్కిన నామపదములలో మధ్యగత యకారముమీద ఏత్వ ముండదని దోలేత్యాదికారిక తాత్పర్యము. దీనిమూలముగా వైయాకరణలోకమున చెలరేగిన వాదప్రతివాదముల సమీక్ష కిది అవసరముకాదు. మీది దోలేద్యాదికారికను, అందును ముఖ్యముగా భూషాశబ్దార్థకమగు 'తాయెతు'ను గూర్చి చర్చించుటవరకే ఈ వ్యాసపరిధి పరిమితమయినది.

నా యెఱిగినంతమేర 'తాయెతు' శబ్ద సంబంధి చర్చను సాగించిన లాక్షణికులలో ముద్దరాజు రామన (క్రీ. శ. 1570_1600) మొదటివాడు. "తాయె

---

1. పాడి వేంకటస్వామిగారు, "త్రిలింగ శబ్దానుశాసనము, అథర్వణకారికలు," ఆంధ్రపత్రిక, ఉగాది సంచిక, 211_214 పుటలు. 1911 ఏప్రిల్ నెల 12; కందుకూరి వీరేశలింగము పంతులుగారు, ఆంధ్రకవుల చరిత్రము, ప్రథమ భా. 256_274 పుటలు, రివైజ్‌డ్ ఎడిషన్; కొమర్రాజు వేంకట లక్ష్మణరావుగారు, అథర్వణాచార్యుఁడు, ఆంధ్రవిజ్ఞానసర్వస్వము, మొదటిసంపుటము. 455_461 పుటలు; చాగంటి శేషయ్యగారు, ఆంధ్రకవి తరంగిణి, 3వ సంపు. 75—88 పుటలు.

తును నుయ్యేలయు బయ్యేదయును దక్క-గలుగదెత్వంబు మధ్యయకారములకు -దుదనుగ్రియదక్క- నెత్వంబుగదియ దాది—నత్వమొందదు తెనుగుల నబ్జనాభ" 2 (కవిజన సంజీవని, ప్రథమ తరంగము, యతిపద్ధతి, 117 వ ప,- వావిళ్ళ, 1930). ఏతద్విషయక పరామర్శ మొనర్చిన తరువాతిలాక్షణికులెల్లరును భూషాశబ్దమును 'తాయెతు' అనియే అనువదించుచు వచ్చిరి. కాకునూరి అప్పకవి (క్రీ. శ. 1656) "ధరణినుయ్యేల పయ్యెద తాయెతు అను-గల యకారంబులకు వక్రములని జంబు-ముద్దరాజు రామనవాని మాటిని బద-మధ్యయాలని చెప్పె నిమ్మాట మిథ్య" (అప్పకవీయము, 2 ఆశ్వా. 184వ ప,..వావిళ్ళ, 1951), "ఊచునెల కాకగుటచేత నుయ్యేలయ్యె, బయిని నెదకున్కి- వక్రోక్తి బయ్యెదయ్యె—బయిని-దల్లికాపునకై కట్టదగినయెత్తు—దేలబల్క-గ దాయెతు దేశ్యమునను" (పైది. 2-185) అని వ్యాఖ్యానించినాడు. గణపవరపు వేంకటకవి (క్రీ. శ. 1676-1700) "ఊయలపయ్యెద తాయెతుల నడిమియెత్వమునకు యత్వమేత్వమునగు'' (ఆంధ్రకౌముది. సర్వలక్షణ శిరోమణి యందలి సీస మాలిక, 25వ పుట, ఆంధ్రసాహిత్యపరిషత్తు, కాకినాడ, 1935) అని వివరించినాడు. కూచిమంచి తిమ్మకవి (క్రీ. శ. 1700-1757) ''తాయతయు నుయ్యలయు బయ్యదయు ననంగ-గలుగ దత్వంబు మధ్యయకారమునకు -ననుచు మును ముద్దరాజురామన వచించె-గాని యత్వంబు గృతులందు గలదుశర్వ" (సర్వలక్షణ సారసంగ్రహము, 1-190, మంజువాణీ ముద్రాక్షరశాల, ఏలూరు, 1914) అని రామనను సవరింపనెంచి కావలయు వలయుప్రయోగముల నెత్తి చూపినాడు. ద్వితింత్రిణీ సీతారామకవి (క్రీ. శ. 19వ శతాబ్ది ?) ఉయ్యేల, తాయెతు, పయ్యెదలను శబ్దంబులందప్పం బనమధ్య యకారమునకు నేత్వము లేదు.'' (కవిజనమండనము, వికృతివివేకటీక, 15వ పు. వావిళ్ళ, 1955) అని వికృతివివేకస్థిత డోలేత్యాదికారికకు అర్థముచెప్పినాడు. చిన్నయసూరి (క్రీ. శ. 1806-1862) యు ''ఊయేల పయ్యెద తాయెతులం దిక్క- నామంబులందు యాకుం దాలవ్యవక్రయోగంబు లేదు'' (బాలవ్యాకరణము. ప్రకీర్ణక. 3వ సూ.) అని పూర్వలాక్షణికుల ననువదించినాడు. పాలపర్తి నాగేశ్వరశాస్త్రులు

---

2. తాయెతాది శబ్దోదాహృతులయెడ రామనాదులకృతులలోని పద్యముల పాఠాంతర ప్రదర్శన మిట ప్రసక్తముకాదు—వివరములకు లింగముకుంట తిమ్మకవి కృతసులక్షణ సారము, రావూరి దొరస్వామిశర్మగారిచే పరిష్కృతము, 95-96 పుటలు

(క్రీ. శ. 1869) "ఉయ్యేల—పయ్యెద—తాయెతు అను శబ్దములయందుఁ దక్క—మధ్యయకారంబున కేత్వంబులేదు. ఈ మూడుపదములందున్న మధ్య యకార మకారముగా సత్క—విప్రయోగంబులయందొకానొకచోటఁ గానంబడుట వలన నదియు సాధువుగానే గ్రహింపవలయును."—(సటీకాన్ధ్రశబ్దచింతామణి, 14వ పు. పసల—పార్థసారథినాయనిచే విద్వన్మోదతరంగిణీ ముద్రాక్షరశాలలో ముద్రితము, ప్రచురితము, 1869) అని అద్యః క్రియాస్వీత్యాది సూత్రమునొద్ద వివరణముప్రాసిరి. పిల్లలమఱ్ఱి నాగలింగశాస్త్రులు (క్రీ. శ. 1888) తాతంభట్టు పేర ప్రకటితమయిన సులక్షణసారమను ఛందోగ్రంథమున 'యావడి' యను శీర్షిక క్రింద నుదాహృతమయిన 'తాయెతును నుయ్యేలయు...' అను ముద్దరాజు రామన పద్యమునకు వ్యాఖ్యప్రాయుచు "...తాయెతు నుయ్యేల పయ్యెదయను పదంబు లేకపదంబులని యీ కవికి తాత్పర్యంబు గాన నీ మూఁడు పదముల యందును మధ్యనున్న యకారమెత్వ విశిష్టమైనదేకాని అత్వవిశిష్టంబైనది కాదని యును భూతార్థక క్రియాంత్యమందుఁ గనియె వినియె చవియె ననుచోట నటువలెనే అత్వంబు గాదనియుం దాత్పర్యము" అని వివరించిరి. (శ్రీవాణీ వినోద మందిర కవిరంజనీ, గీర్వాణ భాషారత్నాకరముద్రాక్షరశాలలయందు మదరాసులో 1888వ ముద్రితము, ప్రచురితము. 54–55 పుటలు. తరువాతి ముద్రణము—చెన్నపట్టం పమ్మి అరుణాచలంశెట్టివారి స్వకీయ శ్రీవేంకటేశ్వర ముద్రాక్షరశాలయందు 1900 లో ముద్రితము, ప్రచురితము—నందును ఇట్లే కలదు. 1924 నాటి వావిళ్ళవారి ప్రతియు దీనికి నకలు.) వెంకయ్య వ్యాకరణమునందును "ఉయ్యేల-పయ్యెద-తాయెతు ఈ మూఁడుశబ్దములయందున్న మధ్య యకార మెత్వముగలది" (తా. వెంకయ్య, ఆంధ్రవ్యాకరణము, సంజ్ఞా. 17, సూ. వావిళ్ళ- 1916) అని వివృతమయినది. 'తాయెతు'ను గూర్చి ఇదీ మన లాక్షణి కులు చెప్పిన సంక్షిప్త చరిత్ర.

'తాయెతు' అనఁగా రక్షార్థముగాని, అలంకారార్థముగాని సిగనో, కంఠముననో, సందిటనో, మొలనో కట్టికొను వస్తువిశేషమని నిఘంటువుల నిర్వచనము. ఆంధ్రనిఘంటువులలో ఈ పదము తాయిత, తాయితు, తాయిత్తు, తాయెత, తాయెతు, తాయెత్తు, తాయెదు, తావితి, తావితు, తావీజు, తావేజు, దాయతి అను

రూపములతో ఉల్లేఖింపబడినది. 3 ఆంధ్రసాహిత్యమున అర్వాచీనములగు రచనలయందే ఇది కన్పట్టుచున్నది. శ్రీనాథకృతముగా 'చెలామణి' యగుచున్న పల్నాటి వీరచరిత్రము దీనికి తొలి ఆకరము. ఆ వెనుక రాయల యుగమునుండియు దీనికి విశేషవ్యాప్తి కలిగినది. కొన్ని ఆకరములను పరిశీలించినచో ఆ యా దేశకాలములలోని దీని వ్యాప్తి తెల్లము కాగలదు. "మేనికి రక్షయైమించు తాయెతులు" (పల్నాటివీర చరిత్ర. 17, పు క్రీ. శ. 1440). "దండడికడియములు దంట తాయెతులు" (పైది. 72, పు.), "తాయెతుల బాహులు" (మనుచరిత్ర, 6 ఆశ్వా. 44 వ ప. క్రీ. శ. 1509_1530). "మందుల తాయెత్తులు" (కాళహస్తి మాహా. 3_32, క్రీ. శ. 1509_1530). "సందితాయెతుల దండ" (అష్టమహిషీకల్యా. 1_49, క్రీ.శ. 1530_1570), "నెలవంక తాయెతుల్" (ద్వి. పరమయోగి. చతుర్థాశ్వా. 2_74, పు. క్రీ. శ. 1530_1570), "తాయెతులఁజుట్టి" (చంద్రభానుచ, 1_89, క్రీ. శ. 1585_1614), "తాయెతు చేరుఁజుట్టి" (పైది. 3_73). "పసిఁడి తాయెతల" (శుక సప్తతి. 1_99, క్రీ. శ. 1650_1790) "పసిండి తాయెతులు" (రసికజన. 1_83 క్రీ. శ. 1700_1757). "నిగరాల తాయెతుల్". (రాధికాస్వాంతన. 1_88, క్రీ. శ. 1730_1765), "సందిటి తాయెతుఁ" (హంసవింశతి, 5_99, క్రీ. శ. 1750_1790, శృంగారకావ్యగ్రంథమండలి, మచిలీపట్టణమువారిప్రతి), "వెండితాయెతుల్" (పైది 5_140), "సందితాయెతుల్" (పైది. 5_168), "కేయూరనామంబు తాయెతనంగను" (ఆంధ్రభాషార్ణవము, 2_150, క్రీ. శ. 1769_1789.) 4

తాయెతు శబ్దమున కప్పకవి చేసిన విఱుపును, చెప్పిన వివరణయు శాస్త్రీయరీతికి విపరీతము. అప్పకవి మతమునఁజేరి కొందఱిద్దానిని దేశ్యముగ

3. గాగరా, పావడ అను నర్థముకల తావేదు, తాబందు రూపములు తఅవిజ్ అను అరబ్బీమూలరూపమునుండి నిష్పన్నములయినటులు ఆంధ్రభాషా చరిత్రకారులు పేర్కొనిరి. చూ. ఆంధ్రభాషాచరిత్రము_మొదటిసంపుటము 583 పు. కాని 'తహబంద్' అను పారశీక పదము వీనికి మూలమనుట యుక్తము. చూ. అందే, పారసి తహబంద్_కుచ్చెళ్ళుపోవి మొలకు కట్టుకొను బట్ట 580 పుట.

4. కొన్ని వ్రాతప్రతులలో తాయత, తాయతి, తాయెద_రూపములను చూపట్టుచున్నవి.

భావించి వ్యవహరించుట అవిచార మూలకము. అప్పకవి సవరణయు, వివరణయు శాస్త్రసమ్మతము కావని ప్రత్యాఖ్యాతము సేయబడినవి. 5 చారిత్రకముగ శబ్దవ్యుత్పత్తిని నిర్ణయించుట రూపసాధన ప్రక్రియా బుద్ధులగు వ్యాకర్తల పనికాదు. 'తాయెతు' రూపనిష్పాదనముపట్ల అప్పకవి ప్రదర్శించిన ప్రక్రియా లాఘవము అతని పాండితీపటిమను ప్రకటించుట వినా, అతని చర్చయంతయు నేలవిడచిన సాముగానున్నది. ఇది దేశ్యము కాదు. దీని పరంపర వేరు. అసలిది అరబ్బీ పదము. "ఈ పదము తెనుగు పదమే కాదని నా భావము. ఇది తావీజ్ అను అరబ్బీపదమైయుండును. ఖురాన్ మంత్రాలను వ్రాసి రక్షగా తురకలు కట్టుకొందురు, దానినే మనవారు స్వీకరించినట్లున్నది" 6. తెనుఁగు తోబుట్టువులగు తమిళాది భాషలయందును ఈ పదమన్యదేశ్యముగను, అర్వాచీనముగను ఉట్టంకింపబడినది. తమిళ్ : తాయిత్తు, వి. (ఉర్దూ - తా'ఇత్) వెండి లేక బంగారుతో జేయబడిన రక్షాకవచము ; భూషావిశేషము (మాండలికము) (Tamil Lexicon, 1841 page), కన్నడము : తాతి, తాయిత, తాయితి రక్షాకవచము (కిట్టెల్ కన్నడ-ఇంగ్లీషు నిఘంటువు 707, 709 పుటలు), కురుఖ్ : తాబిజ్ మొలనో, మణికట్టుననో, కంఠముననో ధరించు రక్షాకవచము (గ్రిగ్స్యార్డు కురుఖ్-ఇంగ్లీషు నిఘంటువు 636 పు.), (బాహుఈ : తావీజ్, తావీత్ రక్షాకవచము (అరబ్బీ తఅవీజ్ నుండి) (బాహుఈ-ఇంగ్లీషు నిఘంటువు 287 పు.). అన్నిభాషలలో దీనికి వ్యాప్తిగాని, ఉన్నచోట కావ్య ప్రయోగములుగాని లేవు. ఈ పై రూపముల నన్నిటిని బాగుగా బద్దించి చూచినచో తెనుగునందలి రూపమే కొంతలోకొంత ప్రాతదని తోపక మానదు.

అరబ్బీలో 'తఅవీజ్' అనగా రక్షణార్థము సర్వేశ్వరుని ప్రార్థించుట, ఆశ్రయించుట అని అర్థము. పారసీకుల ఇస్లాము మతావలంబనముతో ఇది వారి భాషలో ప్రవేశించినది. పారసియందును ఇది 'తఅవీజ్' రక్షణార్థము ప్రార్థించుట, ఆశ్రయమును కోరునట్లుచేయుట ; యహూదీ దేశీయులు ధరిం

5. శ్రీ వజ్ఝల చినసీతారామస్వామి శాస్త్రిగారి ఆంధ్ర వ్యాకరణ సంహితా సర్వస్వము ద్వితీయ సంపుటము 1752-1756 పుటలు.

6. సురవరం ప్రతాపరెడ్డిగారి ఆంధ్రుల సాంఘిక చరిత్ర, కాకతీయుల యుగము 97 పు. ఆంధ్ర సారస్వత పరిషత్తు ద్వితీయ ముద్రణము 1950.

పేటి యొకరకపు రక్ష; సమాధి అను నర్థములలో విస్తరించియున్నది. (Steingass పారసీకాంగ్లకోశము 301 పు.) అరబీ పారసీభాషావాహినిలో వల మున్నూలుగా నడచిన ఆధునికములగు ఔత్తరాహభాషలలో ఈ 'తాయెతు' స్థానమును నిరూపించుట అప్రస్తుతముకాదు. హిందీ: తవీజ్, తావీజ్ రక్షా కవచము; మంత్రకవచము; పరమేశ్వరు నాశ్రయించుట (హిందీ శబ్దసాగర్, 4వ. సంపు. 1405 పు.), ఉరుదూ: తఅవిజ్ సర్వేశ్వరు నాశ్రయించుట, రక్షణ నర్థించుట: రక్షాకవచము (ఉర్దూ ఇంగ్లీషుకోశము, 199, పు.) మరాఠీ: తావీజ్ రక్షాకవచము (కులకర్ణి మరాఠీ కోశము, 378 పు), నేపాలీ: తావీజ్ సందిదండ; రక్షాకవచము (టర్నర్–నేపాలీ నిఘంటువు, 279 పు). కాశ్మీరీ: తావిజ్ భూషావిశేషము; ముస్లిం స్త్రీల శిరోభూషణము; తొడ్డి యంత్రవిశేషము; పిశాచాది భయనివారణార్థము ధరించు కాపురేకు (గ్రియర్సన్–కాశ్మీరీ నిఘంటువు. 4 భాగము, 1048 పు.), అస్సామీ: తాబిజ్ సందిదండ; ఆరక్షిక కవచము; రక్ష (హేమ చంద్రబారువా–హేమకోష్, 404 పు.). బెంగాలీ: తాబిజ్ రక్షా కవచము (బాంగ్లా–ఆంగ్లకోశము, 288 పు.). ఒడియా: తాబిజ బాహుపురి, సందిటగాని కంఠమునగాని ధరించు భూషణ విశేషము (జి. సి. ప్రహరాజ్ – పూర్ణచంద్ర ఉడియా భాషాకోశము, 4వ సంపుటము), బలూచి: తెఅవిజ్ (గిల్బర్ట్సన్ – ఇంగ్లీషు, బలూచి నిఘంటువు, 24 పు.). ఇట్లు సోపపత్తికముగా నిరూపితమయినందున దీనిని అన్యదేశ్యమనుటలో విప్రతిపత్తి యుండరాదు.

తెనుగున 'తాయెతు' పుట్టుక ఇన్నే మొన్నటిది. పదునైదవు శతాబ్దము నకు పూర్వ మిది మన భాషలో నుండెననుట కాధారములు లేవు. ఇదియేకాదు, ఆంగ్ల్య, తురుష్క, పారసీకాద్యన్యభాషాపదము లేవియు ఆనాటి సాహిత్యమున గాని శాసనములగాని కానరావు. "ఆంధ్రుల చరిత్రమునకును నీ పదములకును సంబంధ మున్నదని వేఱ చెప్పనక్కఱ లేదు. అట్టి యన్యదేశ్యములలోఁ జాల మట్టుకు పాలక పాలిత సంబంధమునుబట్టియు, వాణిజ్యాది సంబంధములను బట్టియు ముఖ్యముగ హిందూస్థానీ యింగ్లీషు భాషలనుండి తెనుఁగునఁ బ్రవేశించినవి." 7 భిన్న భిన్న భాషావ్యవహర్తలకు రాజకీయార్థిక సాంస్కృతికాది

7. డా. చిలుకూరి నారాయణరావుగారి ఆంధ్రభాషా చరిత్రము, మొదటిసంపుటము. "తెనుఁగునఁ జేరిన యన్యదేశ్య శబ్దజాలము", 575 వ పుట.

సంబంధము లేర్పడినపుడు ఆ యా భాషలలో పరస్పరము భావ వినిమయము, పదవినిమయము సంభవించుట సార్వత్రిక సత్యము. ఇదియును చిరకాలసాహచర్యమునంగాని సాధ్యపడని పరిణామము. ఒక భాషయందలి ఒకానొకపదము మఱి యొక భాషలో జనుల వ్యవహారవశమున ప్రవేశించి తద్భాషాపర్యాయ శబ్దాభావముననో, నూతనభాషా గత వ్యామోహము మూలముననో కవి పండిత సమ్మతిని బడసి కావ్యముల కెక్కి, లక్షణకర్తల పరిష్కారమును బడుట కెన్ని యంతరువులుండునో భాషాతత్త్వవేత్త లెఱుగని యంశముకాదు. వికృతి వివేకకర్తగా భావింపబడుచున్న అథర్వణుడు పండ్రెండు, పదుమూడు శతాబ్దుల నాటివాడని పరిశోధకుల నిర్ణయము ఆనాటికి ముస్లిందండు తెనుగునేలపై అడుగుపెట్టలేదు. 8. క్రీ. శ. 1309 నాటికిగాని వారు ఓరుగల్లు పైకి రాలేదు. క్రీ. శ. 1323లో ఓరుఁగల్లు ఢిల్లీ సులతానుల వశమయినది. క్రీ. శ. 1336లో విజయనగర సామ్రాజ్యమునకు శంకుస్థాపన జరిగినది. క్రీ. శ. 1[illegible]47లో బహమనీ రాజ్య సంస్థాపనము నయినది. దాదాపు ఇన్నూఱేండ్లు ఈ రెండు రాజ్యములును ఎడతెగని పోరాటములతో వృద్ధిక్షయములఁ బొందుచు వచ్చినవి. ఈ యుగముననే పారసీకాద్యన్యభాషావ్యవహర్తలతో తెనుఁగువారికి ప్రత్యక్ష సంబంధ మేర్పడినది. క్రమక్రమముగా తెనుగునాట అన్యదేశ్యభాషలకు నేఁడాంగ్లమునకువలె—రాజకీయరంగమున ఎనలేని అధికారము సంక్రమించినది. రాజకార్యనిర్వాహకులు పారసీకాది భాషలను విధిగా నేర్చెడివారు. భీమేశ్వర పురాణ కృతిపతియును వీరభద్రేశ వేమపృథ్వీశవుల కనుగు మంత్రియును నగు బెండపూడి 'అన్నయ మంత్రిశేఖరుఁ (క్రీ. శ. 1426-1440) మహమ్మదీయును వదాన్య భూమిభృత్సన్నిధికిన్ .... పారసిభాష వ్రాసినన్ గన్నులపండువై యమరుఁ గాకిత మందలి వర్ణపద్ధతుల్' (భీపు. 1-74). ఇంతేకాదు 'అరబీభాష తురుష్క భాష...గాంధార ఘూర్జర భాషల్...మఱియుం భాషావిశేషంబు లచ్చెరువై వచ్చునరేటి యన్నింటికి గోష్ఠి సంప్రయోగంబులన్' (ప్రైది. 1-[illegible]). తదనంతరము 'అరబి పారసి గుజరాతి యాదె మచ్చ—తెనుఁగు కన్నడి మొదలుగాఁ దెలిసి వ్రాయ దారి గన్నట్టి...' (యయాతి. 1-47) వారందఱును దమ యేలికల తలపరసి వర్తించుటలో పెట్టినది పేరుగా పొగడ్త నందిరి.

---

8. Dr. N. Venkataramanaiah, Further Sources of Vijaya-nagara History, Introduction Vol, 1.

తన్మూలమున పారసీకాద్యన్యభాషా పదములు వేయార్లు తెనుగున చోటుచేసికొని నవి. రాగారాగా ప్రభువులును, తదాశ్రితులును వేయించిన శాసనాదులను ఈ పదములు ప్రత్యక్షమయినవి, నూతనప్రియులగు కవులును వీనిని ధారాళముగా తమ కృతుల ప్రయోగించి వీనికి శాశ్వతస్థితిని సంపాదించి పెట్టిరి. లభ్యమగు సాహిత్యమును, శాసన సంచయమును పరికించినచో ఈ యూహాపోహాలు యుక్తాయుక్తములని నిర్ధారణము కాగలవు.

వాద సౌలభ్యమునకు వికృతి వివేక మధర్వణ కృతమని అంగీకరించి పరిశీలించినను డోలేత్యాది కారికను రచింపవలయుచో అథర్వణున కథమపక్షము నూరు నూటయేబది యేండ్లకు పూర్వమే 'తాయెతు' తెనుగున ప్రవేశించియుండ వలెను. అనగా అది పదునొకొండు, పండ్రెండు శతాబ్దులనాటికథ. ఉత్తర హిందూస్థానమున గజినీ (క్రీ. శ. 1001-1030), గోరి (క్రీ. శ. 1175-1192) దండయాత్రలు సాగుచుండిన తొలినాళ్ళవి. రాజ్యదాహముతో తహతహ లాడు చుండిన ఈ విజేతలకును, సామాన్యప్రజలకును సరాసరి సంబంధము లుండినటులు సాక్ష్యములేదు—వీరందరును ఆఫ్ఘనులు. ఆనాటి ఆఫ్ఘనుల భాష—భారతీయభాషలను స్వీయప్రభావపరిపుష్టము సేయజాలినంత ప్రత్యేక ప్రతిపత్తి కలదికాదు. అరబ్బు వర్తకులో, తురుష్క యాత్రికులో, పారసీక రాయబారులో తత్పూర్వము వచ్చియుండరాదా యని ఆక్షేపము రానగును. వచ్చినమాట వాస్తవము. పంజాబును పాలించిరన్న రెండవ దరయస్ మొద లగు పారసీక చక్రవర్తుల ఏలుబడి క్రీస్తునకు పూర్వము అయిదారు నూరేండ్ల నాటిమాట, ఒకానొక అజంతా చిత్తరువున పారసీక రాయబారియొకడు చిత్రింప బడినాడని పరిశీలకుల నిర్ణయము. ప్రాచీనకాలమునుండియు అరబ్బులు భారత దేశముతో వర్తకము సేయుచుండిరని నిర్ధారింపబడినది. విదేశ వాణిజ్యనిర్వ హణమున అరబ్బులు సాటిలేనివారు. ఇస్లాము మతస్వీకారముతో అరబ్బు లలో నూతనోత్తేజముదయించినది. వారి నిసర్గత్వమునకు మతవిస్తరణ కాంక్ష, రాజ్య విస్తరణ కాంక్ష తోడుపడినవి. క్రీస్తుశకము ఎనిమిదవు శతాబ్దము నుండియు భారతదేశమున వారి దాడులు మొదలయినవి. దేశ వాయవ్యభాగ మున చెదరుచెదరుగా జరిగిన ఈ మెఱపు దాడులు దాదాపు రెండువందలయేండ్లు (క్రీ. శ. 711-948) కొనసాగినవి. ఇంతచేసి అరబ్బులు సింధునద పరిసర ములను దాటి ఈవల కాలిడలేకపోయిరి. వారియేలుబడిక్రిందికి వచ్చిన కొలది

భూభాగమును కొంతకాలమయినను కుదురుగా వారిచేతులలో నుండలేదు. అడప దడప చేతులు మాఱుచుండెడిది. సందుచూసికొని దేశీయ ప్రభువులు అరబ్బుల నెదిరించి పారద్రోలుచుండిరి. 9. ఇంతదీర్ఘకాలము నిరంతర సైనిక సన్నాహములతో సాగినందునను, క్రమక్రమముగా ఖలీఫాల ప్రభ అంతరించి నందునను క్రీస్తు శకము పదియవు శతాబ్దము సరిసగము గడచుసరికి అరబ్బులు భారతరంగమునుండి నిష్క్రమించిరి. భారతదేశమున అరబ్బులు సాధించినది అత్యల్పమయినను, ఆనాటి అరబ్బీ భూగోళశాస్త్రవేత్తలు భారతదేశమునుగూర్చి సేకరించి భద్రపఱిచిన చారిత్రక సామగ్రీ సంపద అమూల్యమయినది. 10 క్రీ. శ. 848 నుండి 1335 దాక సుమారైదు శతాబ్దుల వ్యవధిలో ఇంచుమించు ఇరువదిమంది అరబ్బీ భూగోళ శాస్త్రజ్ఞులు భారతదేశమునుగూర్చి అరబ్బీలో వ్రాసిరి. 11 పదియవు శతాబ్దాంతముమేర వీరు వ్రాసిన విషయములు చాలపాలు వారివలన వీరివలన విని గుదిగ్రుచ్చిన కట్టుకథల కట్టలు. స్వయముగా భారతదేశమున పర్యటించి ప్రత్యక్ష పరిశీలనమున విషయ సంగ్రహణ మొనర్చిన వారిసంఖ్య చాల స్వల్పము. మూన్నాళ్ళముచ్చటగా దేశపర్యటన నిమిత్త మరుదెంచిన విదేశిబృందముల ప్రభావమువలన భాషాదికములలో పరిణామములు సంభవించుననుట శాస్త్రసమ్మతము కాదు. కావున 'తాయెతు' ఆ తొలినాళ్ళలో ఎరువుతెచ్చిన పదమని ఊహించుట యుక్తిసహముకాదు. ఒకవేళ, ఏట్లో వచ్చిన దని సమాధానము పడినను, ఎన్నెన్నో పదములుండగా ఈ యొక్క 'తాయెత్తు' మాత్రమే ఒంటెత్తుగా తెనుగున జొరబడినదనుట శాస్త్రీయ పరిశీలన విధానమునకు విరుద్ధము. దీనితోపాటు మఱికొన్ని పదములును వచ్చియుండవలెనుగదా! ఇట్లు వచ్చినట్లు గుఱుతులేదు. చారిత్రకముగను, శాస్త్రీయముగను ఆనాటి తెనుగున దీనియునికి సందేహాస్పదమయి, ప్రాచీన కావ్యసందోహమునను, శాసన సంచయమునను కన్పట్టని ఈ పదమునుగూర్చి ద్వితీయాచార్యుడని

---

9. Dr. R. C. Majumdar, Arab Invasion of India.

10. Dr. S. Md. Husayn Nainar, Arabs knowledge of Southern India.

11. Prof. K. A. Nilakanta Sastri, Foreign Notices of South India.

పేర్కొనబడిన అథర్వణుడు చర్చించెననుట విశ్వాస్యముగా దోపదు. అట్లయిన తెనుగు జనులువాడు పదసామస్త్యమంతయు కావ్యాదుల కెక్కినదా యను ఎదురు వాదము ఎదురుకాక మానదు కావ్యాదుల పరిమితమగు పదజాలమే ప్రదర్శిత మగుటను కాదనలేము. అప్రసిద్ధములును, వ్రీడా జుగుప్సా మంగళకరములును నగు శబ్దములును కావ్యాదుల గానరానిమాట నిజము; కాని 'తాయెతు' శబ్ద మీకోవకు జేరినదికాదు. మత విశ్వాసముల ననుసరించిగాని, సాంఘిక సంప్రదాయముల ననుసరించిగాని నిషిద్ధముకాదు; అతి ప్రసిద్ధమైనది. ఇంకొకటి. అస్తిత్వమువలె అభావము ప్రామాణ్యము కాజాలదని పూర్వపక్షము పలుక వచ్చును. కాని బలీయములగు ఇతరయుక్తుల సన్నిధిలో ఈ శంకకు తావులేదు. అలనాటి వ్యాకరణము కావ్యభాషామాత్రానుశాసనమని పండితులు నిర్ణయించి నప్పుడు సామాన్య లోకవ్యవహారముపట్ల ఈ విధి వర్తింపదు.

ఇక, రామనాదులన్ననో ఇటీవలివారు. మహమ్మదీయ సంసర్గము ముమ్మరముగా ముదిరిన దశనాటివారు. కావున రామన 'తాయెతు'ను గూర్చి వివరించుటయు, అప్పకవ్యాదులు సవరించుటయు తరువాతివారు తలస్పర్శముగా జర్చించుటయు సహేతుకము. వీరికి పూర్వులగు లక్షణకర్తలు-మూలఘటిక కేతన (క్రీ శ. 1220-1280), విన్నకోట పెద్దన (క్రీ. శ. 1407) మొదలగువారు దీని ప్రసక్తిని గొనిరాలేదు. అసలు వారిట్టిదాని నెఱిగియుండినగదా తద్విషయక విచారము ఇట్టిచో అంతప్రాచీనుడని మనము నిర్ణయించిన అథర్వణుడు ఇంత అర్వాచీనమగు 'తాయెత' శబ్దసిద్ధికయి దోలేత్యాదిక కారికను రచించుటెట్లు జతనుపడినది? కారికా వళికర్తృత్వమును అథర్వణునకే కట్టిపెట్టు గట్టికాంక్షతో ఈ కారికను అర్వాచీన కృతి ప్రక్షిప్తమను పక్షమున డోలా భాషోత్తరీయార్థక శబ్దములలో ఊయెల, పయ్యెద - శబ్దము లగతికములు కాకతప్పదు. విశేషించి యెత్వాశ్వ సందేహ నిర్ణాయకమగు 'భావిక్రియాస్వి' త్యాదికారికా రచనమునందలి వికృతి వివేకకారుని యెత్తుగడ వ్యర్థమైపోవునుగదా! అంతేకాదు. "అహేయ మన్యదేశీయం యత్తదేవ ప్రయుజ్యతే" (వికృతి వివేకము. సంజ్ఞా. 9 సూ.) కారికకు సమాధానము రావలయును. అన్యదేశ్యము లనుచోట వైయాకరణ నిర్వచనమును

చూడుడు. "తురుష్కాది భాషాశబ్దము లన్యదేశ్యములనుట నిర్వివాదము." 12 అహేయమిత్యాది కారికావ్యాఖ్యావసరమున సంజీవని వ్యాఖ్యలో నుదాహృతములయిన ప్రయోగముల మూలమున అన్యదేశ్యముల స్వరూప స్వభావములు స్పష్టములగుచున్నవి. నింద్యముకానట్టి యనగా వ్యాకరణాది విరుద్ధము కానట్టి అన్యదేశ్య శబ్దము 'రోజు' మున్నగునది ప్రయోగింపబడుచున్నదని కల్పతరు వ్యాఖ్య. 13 "ఈ రీతి నథర్వణాచార్యు డంగీకరించియున్నను నర్వాచీన మహాకవులు ప్రయోగించియున్నను భారత ప్రయోగ రాహిత్యమునను, చింతామణ్యంగీకృతము కాకుండుటను గావలయు సూరి యన్యదేశ్యము నుపేక్షించె"నని సంజీవని నిర్ణయించినది. 14 తురుష్కాద్యన్య భాషాపదములను అన్యదేశ్యములనుటలో రెండభిప్రాయములు లేవు. అహేయమిత్యాది కారికాభిప్రేతము నిదియే యని నిష్కృష్టముగా నిర్ధారింపబడినపుడు వికృతి వివేక మాథర్వణీక మగుట అసంభవము. మీదుమిక్కిలి పూర్వ లాక్షణికు లెవరును అన్యదేశ్యముల ప్రస్తావనను తేలేదు. ఆంధ్రభాషాస్థితములగు శబ్దముల విభజనలోగాని, తదవసరమున నుదాహృతములయిన పదపట్టికలలోగాని అన్యదేశ్యములను గూర్చిన నామమాత్రపు సూచనయు గానరాదు. 15 ఈ కారికను సైతము ప్రక్షిప్తమందురు కాబోలు. తమవాదమునకు బాధకములగు కారికల నన్నిటని ప్రక్షిప్తములపేర, పాఠాంతరములపేర నిరాకరించుచు వచ్చినచో కారికావళిలో శేషించునది శూన్యము. అందుచే వీనిని ప్రక్షిప్తములనుట పొసగదు. కాగా వికృతి వివేక మథర్వణ కర్తృకముగాదని సారాంశము. అహోబల పండితుడే దీనిని సృష్టించి, తత్కర్తృత్వము నథర్వణున కంటగట్టెనను ఊహ త్రోసివేయరానిది. లేక అథర్వణు డంత ప్రాచీనుడు కాక అప్పకవ్యాదులకు దరిదాపుల సమకాలికు డందురా! అప్పు డింత రగడ యేల? అథర్వణుడు నాల్గయిదు శతాబ్దులు మనవైపు నడచి వచ్చినచో వికృతి వివేక కర్తృత్వము నాయనకే కట్టిపెట్టుటలో నేను మొట్టమొదటివాడను.

---

12. శ్రీ పట్టుల చిన సీతారామశాస్త్రిగారి ఆంధ్రవ్యాకరణ సంహితా సర్వస్వము, 1 భా. 174 పుట.

13. పైది 61 III విషయము, 173 పు.

14. పైది 61, IV విషయము, 173 పు.

15. కేతన ఆంధ్రభాషాభూషణము, 19–27 పద్యములు. విన్నకోట పెద్దన, కావ్యాలంకార చూడామణి, నవమోల్లాసము, 6, 11–21 పద్యములు.

# ఆంధ్రభాష - హకారాది పదములు

'సర్వజ్ఞం తదహం వందే
పరంజ్యోతి స్తమోపహం
ప్రవృత్తా యన్ముఖాద్దేవీ
సర్వభాషా సరస్వతీ'

—నాగవర్మకృత కర్ణాటక భాషాభూషణం.

ఏ భాషయందయినను పదజాలము నిసర్గము (Indigenous), ప్రతిదేయము (Borrowed) అని ద్వివిధావిభక్తము. మూల భాషనుండి పైతృకముగా సంక్రమించిన పదములు నిసర్గములు; తదితరములు ప్రతిదేయములు. పరిసరస్థములగు సజాతీయ సోదరభాషల (Cognate languages) నుండిగాని, సమీపవర్తి విజాతీయ భాషల నుండిగాని, మత వాణిజ్య రాజకీయాది సంవర్గ సంబంధముల మూలమున దూరవర్తి విజాతీయ భాషలనుండి గాని ఎరవు తెచ్చిన పదములు ప్రతిదేయములు. పైతృకము శుద్ధదేశీయము; ప్రతిదేయము అన్యదేశీయము.

ఆంధ్రభాషయందలి నిసర్గదేశ్య భాగము 1 ను శుద్ధాంధ్రదేశ్యముగను, తదన్యమును అన్యదేశ్యముగను, పరిగణించుట ఆధునిక భాషాశాస్త్ర పద్ధతులకు సంవాదకమగు సమన్వయము. కాని, సంస్కృత ప్రాకృతములనుండి ప్రతిదేయమయిన పదజాలమును తత్సమ తద్భవములనియు, తదితర

---

1. 'ఇప్పటికి బహు పండిత సమ్మతమైన సిద్ధాంతము, తెలుగు ద్రావిడభాషా వర్గము లోనిదని. ఆర్యభాషా స్వభావమునకు భిన్నములును, ద్రావిడ భాషకు సాధారణములును అగు లక్షణములు మనభాషలో చాల కలవు. పుట్టుకనుగూర్చి ఈ రహస్యమంగీకరింపక తప్పదు. పోషణలో మాత్రము తెలుగునకు సంస్కృతమువలని యుపకారమే యెక్కువ కలిగినది.' (పింగళి లక్ష్మీకాంతం, గౌతమ వ్యాసములు, ద్వి. ముద్రణము, 1961. పు. 2.)

పదసముదాయమును దేశ్యమనియు వ్యవహరించుట ప్రాక్తనాంధ్ర వ్యాకరణ సంప్రదాయము. ఈ సంప్రదాయమును ప్రాకృత భాషావ్యాకరణ మర్యాదాను సారి. తత్సమ తద్భవ దేశ్యములను విభాగప్రక్రియ ప్రాకృత భాషా పదతత్త్వ ప్రకాశకము.

ప్రాకృత వ్యాకరణములలోని తచ్ఛబ్దము సంస్కృత భాషాపరముగా వ్యవహృతము. ప్రాదేశికమును, అవిజ్ఞాత ప్రకృతికమును నగు పదజాలము ప్రాకృత భాషావ్యాకర్తల దర్శనములో దేశ్యము. ఆంధ్రమునందలి తత్సమ తద్భవ విభాగము ప్రాకృతము నందలి విభాగ ప్రక్రియకు అనుప్రాసము. దేశ్యభాగము ఆంధ్రలాక్షణికుల చూపులో అవ్యుత్పత్తికము. ఆంధ్రమునందలి దేశ్యమునకు ప్రాకృతము నందలి దేశ్యమునకు నామమాత్రపు సాదృశ్యము తప్ప స్వరూప స్వభావములలో యత్కించిత్ సామ్యమును అసంభావ్యము.

ఆంధ్రమునందలి దేశ్యభాగము పైతృకము ; తక్కిన ద్రావిడ భాషలకు సగోత్రకము. విశేషించి, నిత్యవ్యవహారోపయోగి. ప్రాకృతములలోని దేశ్యభాగము వ్యుత్పత్తి దుర్జ్ఞానము గావున ప్రాకృత వ్యాకర్తలు దానిని వేఱుగా పేర్కొనుట. అవిజ్ఞాత ప్రకృతికమని భావించిన ఈ భాగములో చాల పాలు అనార్య భాషా పదచయమని ఆధునిక భాషా పరిశోధకుల నోపపత్తిక నిర్ణయము 2. ప్రాకృతములలో అత్యల్పమయిన ఈ భాగముయొక్క ప్రయోజనము అనుకల్పము కావున నది లుప్తమయినను ప్రాకృతములలో వ్యవహార హాని సంభవిల్లదు. నామమాత్రపు సాదృశ్యము నాధారముగాఁ గొని ప్రాకృతాంధ్రములకు సజాతీయతను స్థాపింప బూనుట వృథా ప్రయత్నము.

ప్రాచీనాంధ్ర లాక్షణికుల నిర్వచన నిరూపణములలో అన్యదేశ్య స్వరూపము అస్పష్టము. దేశ్యమున అన్యదేశ్యమును అంతర్భూతము. ఏ తద్విషయ

2. John Beams, A Comparative Grammar of Modern Aryan Languages, 1872, Vol. I, Introduction, p. 12, Rev. Dr. R. Caldwell, Comparative Grammar of the Dravidian or South Indian Family of Languages, 1875, pp. 56-64, Dr. R. Pischel, Comparative Grammar of the Prakrit Languages, Introduction, para 9.

కములయిన మన శాస్త్రార్థములు బహుధా విప్రతిపత్తి మూలకములు—ప్రస్తుత సమీక్షలో ఏ తద్విచారము అప్రసక్తము. నిసర్గము, ప్రతిదేయము— అను సుస్పష్టమయిన విభాగదృష్టితో ఆంధ్రభాషయందలి హకారాది పదజాలము ప్రస్తుత పరిశీలనమున పరామృష్టము. ఇట తత్సమ తద్భవ దేశ్య రూపములగు సమాహారాంధ్రము ఉద్దిష్టము.

ప్రాచీన ద్రావిడ భాషయందు 'హ' వర్ణము ఉనికి సందేహాస్పద మనియు, ద్రావిడ భాషావికాసమున అనంతరదశయం దేర్పడిన నూతన రీతి (Innovation) కిది తార్కాణ మనియు తత్త్వ ప్రవణులు నిర్ధారించిన యంశము 3. తమిళ వ్యాకర్తలలో ప్రసిద్ధుడును, ద్రావిడ భాషావ్యాకర్తలలో ప్రాచీనుడును అగు తొల్కాప్పియనారు హకారకల్పక మయిన 'ఆయ్దమ్'(ంం) ను ప్రధాన వర్ణమాలలో పఠింపలేదు. ప్రాచీన తమిళమున దీనివ్యాప్తి ఇంచు మించు అజాగళస్తనమువంటిది. పరాశ్రయ భాగిత్వముకల ఈ 'ఆయ్దమ్' సంస్కృతభాషయందలి విసర్గకు వికృతికాఁబోలు నని డా. సుబ్రహ్మణ్యశాస్త్రి గారి ఊహ. 4 మీఁదు మిక్కిలి అపవాదిగానే దీని అస్తిత్వము ; అదియును అతివిరళము. ఐదంయుగీనమగు తమిళములో హనుమూలీయ స్పర్శ (Velar stop) వర్ణమగు 'క' ను అఘోషమధ్యముగా 'హ' గా నుచ్చరించుట తమిళుల అలవాటు. తిరుమాళిహై (< తిరుమాళికై = తిరుమాళిగ). తిర్వడిహళ్ (తిరువటికళ్ = శ్రీపాదములు) సాగరాంధ్రమున ఇహ (= ఇఁక). ఒహటి. (= ఒకటి), మొహం (= మొగము), మొహమాటం (= మొగ మోటము) సహం (= సగము) మొదలగు వానిలోని హకారోచ్చారణము అర్వా క్కాలికము ; సాగరాంధ్రమునకు పరిమితమగు విశిష్టమాండలిక పరిణా మము. 5

---

3. గంటి జోగిసోమయాజి, ఆంధ్రభాషావికాసము, పు. 356, 357.

4. Dr. P. S. Subrahmanya Sastri, History of Grammatical Theories in Tamil, pp. 65–70.

5. వడ్లమూడి గోపాలకృష్ణయ్య, వ్యావహారిక భాషా వ్యాకరణం, శబ్దపరి చ్ఛేదం, సూ. 259.

పదాది పకారము హకారముగా మాఱుట కర్ణాట భాషావికాసమున విశిష్ట లక్షణము. క్రీ. శ. పదియవ శతాబ్దము నుండియు కర్ణాట భాషా వ్యవహారమండ లము లన్నింటను ప్రవర్తితమయినదీ ధ్వని పరిణామము. క్రీ. శ. తొమ్మిదవ శతాబ్దాంతము దాఁక కన్నడము నందలి 'ప–' ఈ మార్పునకు లోనుగాలేదు. ఆ పిమ్మట పదాది 'ప' కారము 'హ' కారముగా వికృతినందినది 6. పత్వము నకు హత్వవ్యవస్థ కర్ణాట భాషాలాక్షణిక సమ్మతము. పదునొకండవ శతాబ్దికి చెందిన నాగవర్మకృత కర్ణాటక భాషాభూషణము నందు 'పేహావా' అని సూత్రి తము. 7. 'పకారస్య స్థానే హకారోవా భవతి' అని వృత్తి. ఇది వికల్ప మనుట స్పష్టము. పదుమూఁడవ శతాబ్దినాఁటి కేశిరాజకృత శబ్దమణి దర్పణము నందును 'అద్విరుక్తమగు పకారమే హకారమగు చున్నదనియు, ఈ పరిణా మమును వికల్పమనియు, ఇది కావ్య సౌందర్య హేతువనియు, ద్విత్వపకారము హకారమగుట లాక్షణిక మతమునకసమ్మతమనియు విస్పృతము.8 ఈ పరి ణామ ప్రక్రియను స్పష్టపఱుచుట కీ క్రింది పట్టిక.

| తెలుఁగునందలి | కన్నడము | |
|---|---|---|
| జ్ఞాతిపదము | ప్రాచీనరూపము : | నవీనరూపము ; |
| పగలు | పగల్ | హగలు |
| పల్లు | పల్ | హల్ |
| పాలు | పాల్ | హాలు |
| పాము | పావు | హావు |
| పిండు | పింతు | హిండు |

6. Dr. A. N. Narasimhia, A Grammar of the Oldest Kannada Inscriptions, pp. 1–25.

7. సూ. 115, యుష్మదాది విధానం, కర్నాటక భాషాభూషణం. Ed. by R. Narasimhachar, Mysore Govt. Central Press, Bangalore 1903.

8. సూ. 159, నామప్రకరణం, అక్షరపరిణామం, శబ్దమణిదర్పణ, Ed. by Rev. Dr. F. Kittel, Re-edited by P. Mangesh Rau, Mangalore, 1920.

| | | |
|---|---|---|
| పిసుకు | పిసుకు | హిసుకు |
| పీర్చు | పీర్ | హీర్ |
| పీలి | పీలి | హీలి |
| పుట్టు | పుట్టు | హుట్టు |
| పులి | పులి | హులి |
| పూ, పూవు | పూ | హూ |
| పూడు | పూడు | హూడు |
| పెట్టు | పెట్టు | హెట్టు |
| పెంపు | పెంపు | హెంపు |
| పేను | పేన్ | హేను |
| పేర్ -( = పెద్ద) | పేర్_ | హేర్ |
| పొగ | పొగె | హొగె |
| పొగరు | పొగర్ | హొగరు |
| పోరు | పోరు | హోరు |
| పోలిక | పోలికె | హోలికె |

దేశ్యములయందే గాక తద్భవముల యందును కన్నడమున ఈ పరిణామము ప్రసారితము.

| సంస్కృతము : | ప్రాకృతము : | కన్నడము : |
|---|---|---|
| ప్రచ్ఛద- | పచ్ఛడ- | పచ్చడ, హచ్చడ |
| ప్రహార- | పహార- (దెబ్బ, = వ్రేటుపడినతావు) | పారె, హారె ( = పార, భూమిని త్రవ్వెడు సాధనము) |

| | | |
|---|---|---|
| పిష్ట- | పిట్ఠ- ( = తండు లాదికచూర్ణము) | పిట్టు, హిట్టు |
| పూర్ణిమా | పుణ్ణిమా | పుణ్ణిమె. హుణ్ణిమె ( = పున్నమ) |
| పోలికా | పోలిఆ | పోళిగె, హోళిగె |

అల్ప ప్రాణమును ఉభయోష్ఠ్య స్పర్శము (Bilabial stop)ను అగు 'ప' కారము, మహాప్రాణమగు 'ఫ' గా ఉచ్చరిత మగుచుండి కాలక్రమమున స్పర్శ స్వభావమును గోల్పోయి 'హ' గా పరిణమించియుండునని కర్ణాటభాషా పరిశీలకుల తలంపు 9. తెలుఁగునందును పదిహేను (< పదిహేను) పదహారు (< పదియాఱు). పదిహేడు (< పదియేడు). పద్దెనిమిది (< పదియెన్మిది) పంధొమ్మిది (< పందొమ్మిది). ఇరభయ్ (<ఇరువది). ముప్ఫయ్ (< ముప్పది). నలభయ్ (< నలువది). యాభయ్ (< ఏఁబది), అరభయ్ (< అఱువది), డెబ్బయ్ (< డెబ్బది) యనభయ్ (< ఎనుబది), తొంభయ్ (< తొంబది)-మొదలగునవి సోష్మ మహాప్రాణ వర్ణఘటితములగుటయు, ఏంభది (< ఏఁబది అను రూపము ప్రాచీనాంధ్ర శాసనములలోఁ గన్పట్టుటయు గమనార్హము 10.

ఆంధ్రమునందలి తత్సమ తద్భవేతరములగు హకారాది పదములఁతో పెక్కులు కన్నడమునుండి ఎరువుతెచ్చినవి. హకారాది క్రియావాచక పదములు

---

9. Dr. A. N. Narasimhia, op. cit.

10. స్వార్థాతిశయమున కొన్నిపదాల పరుషసరళములకు మహాప్రాణములు వైకల్పికముగా వచ్చుటకు చూ. వడ్లమూడి గోపాలకృష్ణయ్య, పూర్వోదాహృత గ్రంథము, శబ్ద. సూ. 260.

తెలుఁగున రెండేరెండు. హత్తు, హెచ్చు అను ఈ రెండును కన్నడమునుండి ఎరువుతెచ్చిన పదములని డా. భద్రిరాజు కృష్ణమూర్తిగారి నిరూపణము 11. ఇవితప్ప పదాది హకార ఘటిత క్రియావాచక పదములు తెలుఁగున లేవని తాత్పర్యము.

ప్రాచీన దక్షిణ ద్రావిడమున 'చ' వర్ణాది పదముల తొలివర్ణము లోపించి **అజాది రూపముగా** పరిణమించుట తెలుచగు లక్షము. చవర్ణాది పదమునకును దీనిపరిణతరూపమగు అజాది పదమునకును నడుమ హకారాదిదశ [చ — > హ — > ం — (= లోపము, అభావము)] ఒకటి ఉండి యుండవలయునని వేత్తల అధ్యాహారము. ఈమధ్య దశను సూచించు హకారాది పదములు దక్షిణ ద్రావిడమున సాహితీ వ్యవసాయము సాఁగిన నాగరక భాషలయందును సంగ్రథితము కాలేదు. మధ్య ద్రావిడభాషలలో నొకటియగు 'కువి' యను గిరిజనుల భాష12 లో ఈదశకు చెందిన పదములుకొన్ని నేఁడును వ్యవహృతములు. మచ్చుకు కొన్ని మాటలు ;

| కువి : | తెలుఁగు : |
|---|---|
| హన్ ( = పోవు) | చను |
| హర్కు ( = వస్తువులు, ఉగ్రాణపు సామగ్రి) | సరకు |
| హోరు, హోరూ ( = ఉప్పు) | సౌరుప్పు |
| హిజ్జు, హీచూ ( = నిప్పు) | చిచ్చు |

11. Dr. Krishnamurthi, Telugu verbal Bases, A Comparative and Descriptive Study, University of California Publications in Linguistics, Vol. XXIV, Berkeley, 1961. p. 23.

12. కువిభాష, ఆంధ్రప్రదేశము విశాఖమండలములోని మన్యప్రాంతముల యందును ఒరిస్సారాష్ట్రము కలహంది, కోరాపుట్టి, గంజాము మండలములలోని మన్య ప్రాంతములయందును గిరిజనుల వాగ్వ్యవహారరూపము, ఈభాషావ్యవహర్తలు 1951 జనాభాలెక్కల ననుసరించి ఇంచుమించు మూఁడు లక్షలు. కూవిజ- కోజు, కోందు, జాతాపు, సామంతు అను ప్రాదేశికవ్యవహార నామములు కల పలుతెగల గిరిజనులందఱును కువిభాషా వ్యవహర్తలు.

| | |
|---|---|
| హీరు | చీర (పోతు) |
| హుక, హూక ( = నక్షత్రము) | చుక్క |
| హెల్లొ, ( = అనుమతి) | సెలవు |
| హేపొరి | చీపురు |
| హేరు, హేరూ ( = వ్యవసాయసాధనము, నాఁగలి) | సేరీ ( = వ్యవసాయము) |
| | ఏరు = నాఁగలి |
| హొమ్మ, హోమూ ( = నగలు డబ్బు, సంపద) 13 | సొమ్ము |

కాని, 'కువి' భాషనుండి తెలుఁగునకు ఎరువుతెచ్చిన పదములు నాస్తి.

ఆంధ్రభాషయందలి హకారాది పదములలో రమారమి మూఁడింట రెండు వంతులు తత్సమములు, తద్భవములు పదికి బొటాబొటి. కన్నడమునుండి ప్రతి గేయములు నలువది పైచిలుకు. మిగిలిన వానిలో ముక్కాలు మువ్వీసము అరబ్బీ పారసీకాది భారతీయేతర భాషలనుండియు, మరాఠ్యాది నవీనోత్తరాహ భాషలనుండియు సంసర్గవశమున ప్రవేశించిన అన్యదేశ్యములు. ఆంగ్లపదములు ఒకకొన్ని. పండితులును, పామరులును సృష్టించిన కృతక ప్రామాణికములు (Hyperforms) మఱికొన్ని, తక్కినవి వ్రేళ్ళమీఁదికి చాలని ధ్వన్యనుకరణములు. ప్రవృత్తి పరముగా ఆంధ్రభాషయఁదున్న హకారాదిపదములు వెరసి ఇన్ని పద్దులక్రింద చెల్లుపడఁగా, మన సొంతమునకు మిగిలినది హుళ్ళికి హుళ్ళి, సున్నకు సున్న. కాగా, వ్యుత్పత్తి పరముగా ఆంధ్రభాషయందు హకారాది పదములు లేవని సిద్ధాంతము.

---

13. F. V. P. Schulze, Vocabulary of Kuvi-Kond Language, Madras, 1913; A. G. Fitzgerald, Kuvinga Bassa (the Language of Western Khonds), Catholic Press, Calcutta, 1913.

ప్రవృత్తి పరముగా ఆంధ్రభాషయందున్న హకారాది పదములు వివిధ శీర్షికలక్రింద, అకారాద్యనుక్రమముగా ప్రపంచితము. ప్రాయికముగా కావ్య ప్రయుక్తములే ఇట ప్రదర్శితము. ముఖ్య శీర్షికలివి : i. తత్సమములు, ii. తద్భవములు, iii. కన్నడపదములు, iv. అన్యదేశ్యములు, v. ఆంగ్ల పదములు, vi కృతక ప్రామాణికములు, vii. ధ్వన్యనుకరణములు, క్రమముగా నీ శీర్షికల విస్తరము.

1. తత్సమములు ; తత్సమముల స్వరూప నిరూపణ మనావశ్యకము. మాదిరికి నన్నయ భారతము, ఆదిపర్వమునందలి హకారాది పదములు కొన్ని :

(చరణ) హతిన్ (6_2_7)

(బ్రహ్మ) హత్యయు (6_270)

హయంబు (1_113)

హరణ (హారికయు) (1_34)

హరా (జగజానన) (1_21)

హరిణముల (4_76)

హరితనయుండు (8_201)

హరి దంతరంబులన్ (8_275)

హరిదశ్వుఁడు (6_174)

హరినందను (6_84)

హరి నీల సమవర్ణుఁడు (8_185)

హరియించు 7_103)

హర్మ్యతలంబుల (4_216)

హర్ష పులకలు (4_108)

హర్షంబుగా (4_105)

హర్షించి (5_136)

II. తద్భవములు : ఆంధ్రమునందలి సంస్కృత ప్రాకృత భవములు నాలుగువేలు—హకారాదు లీదిగువ ప్రదర్శితము14.

1. హంకారము : అభిమానము, అహంకారము. 'హంకారములకెల్ల నాటపట్టు' (చంద్రా. 2—) (శ. ర.)

ప్రాకృత. అహంకార :- అభిమానము, గర్వము

సంస్కృత. అహంకార—

2. హత్తము : చేయి

ప్రాకృత. హత్థమ్, హత్థో

సంస్కృత. హస్త—

3. హత్తి : ఏనుఁగు. 'హత్తి నాదంతి' (వేంకటే. తిర్య. 93 : సాంబ. తిర్య. 72) ; '....సింగంబనా హత్తిగొంగ....' (చౌడప్ప సీసములు 10)15. తా వాచకము. బత్తి వర్తిల్ల నారాచహత్తి వలికె' (బహులా. 3-30).

ప్రాకృత. హత్థి.

సంస్కృత, హస్తిన్.

4. హనుమ : హనుమంతుఁడు. 'హనుమకనిలజుఁ డనియెన్' (అరణ్య. 3-345).

ప్రాకృత. హణుమ—, అణుఁఅ.

సంస్కృత. హనుమత్, హనూమత్.

---

14. వీనికి అత్తెము, అనుమ, అరిదళము, అరుసము, అశది, అమిక, ఇతవు, ఉడుక్కు ఇట్టి అజాదిరూపములును సిద్ధము. అంచ, ఇంగువ మొదలగు తద్భవములలో హకారాది రూపములు మృగ్యము.

15. చౌడప్ప సీసములు, Ed. by N. S. Sundareswara Rao, Bulletin of the Govt. Oriental Manuscripts Library, Madras, 1950. pp. 55-70.

5. హరిదళము : తాళకము, పీతకము, 'నిద్రమేల్కాంచిన నెత్తమ్మి మొగడల పరువంపుఁ బుప్పొళ్ళ హరిదళములుగ' (కాశీ. 1-123) 'హరిదళము చుట్టువెలయ నంతరము గిరి (పార్వతీ. పంచమా. పు 90).

ప్రాకృత. హరి అల, హరి ఆలీ, హరి తాల,

సంస్కృత. హరి తాల –

6. హరుసము : సంతోషము. 'పరహితుఁడైన వానికి శుభంబు లభించిననెల్లవారలున్ హరుసమెకంద్రు...' (ఉ. రా. 2-194). 'హరిరమ్మనియె నటన్నన్ హరుసముతో వారు నలువురతివినయమునన్' (దశా. (9-18).

ప్రాకృత. హరిస -

సంస్కృత. హర్ష -

7. హళ(ళి)ది : హరిద్రావర్ణము. 'హళది పుట్టంబు కటిసీమ నమరువాని' (పాండు. 3-166). (హళిదిపట్టె సమ్మాళిగెల' బహులా. 1-105). 'పట్టుతలాడయున్ హళదిపచ్చ...' (పాంచాలి. 5-10). పైనిండఁబర్విన పద్మపరాగముల్ హళది తాపిత చాయ ననుకరింప...' (వాల్మీకి. ప్రథమా. పు. 29). సబిందుక మనుటకు నిర్ధారక ప్రయోగములు మృగ్యము.

ప్రాకృత. హరిద్దా. హలద్దా, హలద్దీ, హలిద్దా, హలిద్దీ.

సంస్కృత. హరిద్రా

8. హామిక : క్రొవ్వు, గర్వము, మదము. 'హామిక' (రాధికా. 3-3, యామినీ. 4-83), 'హామికల్' సత్యభామా ద్వితీ. : అనిరుద్ధ. 3-102). హామిక సంస్కృతమని శబ్దార్థదీపిక, పు. 1418.

ప్రాకృత. అహమహమిఆ, అహమ హమిగా, అహమహమియా : అత్యుత్కంఠ

సంస్కృత. అహమహమికా.

9. హితవు : శ్రేయము. 'నీవు హితవు క్రియగొనఁగా బల్కెడు వాఁడవు...'

(ఆది. 8-40); యుక్తము. 'హితవుమఱచు రాజులు...' (శాంతి. 3-247).

ప్రాకృత. హిఅ, హియ -

శౌ. ప్రాకృత. హిద -

సంస్కృత. హిత -

10 : హుడుక(కు) : చిన్న డమరుకము. 'హుడుకు నాఁదనర్చు హుడుక్కపేరు' (ఆం. భా. 1-128). దేశ్యమనియు, వస్తుతః ఆజాదియనియు ధ్వన్యనుకరణ మనియు దీని వ్యుత్పత్తి వివాదగ్రస్తము.

దే. ప్రాకృత. హుడుక్క : వాద్య విశేషము.

సంస్కృత. హుడుక్కా.

III. కన్నడ పదములు 16 : 1. శుద్ధ దేశ్యములు. (ఎ) పతి గన్నడమున పకారాదులుగానుండి, హూసగన్నడమున హకారాదులుగా వికృతులు, తెలుఁగున కర్ణాట దేశానేయములు—

1. హంగు ; అనుకూలము, సౌకర్యము, యుక్తము. 'వేసమునకునైన దాసరిగావచ్చు హంగు దప్పువేళ జంగమగును' (వేమన ; బ్రౌణ్యము, పు. 1111). 'హంగుగ వేడఁబోయి...' (కవిచౌడప్ప)

కన్నడ, హంగు, పంగు : కృతజ్ఞత, గౌరవము ; ఉచితము.

2. హణిగ : నతివిశేషము, ఫాలము వంచి నమస్కరించుట. 'నీలాచలనమున నెలకొను పురుషోత్తమునకు హిణిగలు దండిగఁ జేర్చుచు' (హంస. 4-214)

కన్నడ, హణి ; హణె : నుదురు ; పణె : నుదురునకు సంబంధించిన.

---

16. రాయలసీమలోని హగరి, హంచన హాళు, హనకనహాళు, హాలహర్వి, హావళిగి, హిరేహాళు, హువ్విన హడగలి, హొన్నూరు, హొళగొంది, హొసకోట, హొసపేట, హోతూరు - మున్నగు హకారాది గ్రామనామములు కన్నడ ప్రభావ ద్యోతకములు. హత్తు మువ్వరగండ హన్నిబ్బరగండ ఇత్యాది హకారాది బిరుదావళి ప్రస్తుతపట్టికలో పరిత్యక్తము.

3. హత్తు : జతచేయు, చేర్చు, కలుపు, 'గోదిగజాతిలోఁ గొదమ పెంటుల నేర్చిమావుల హత్తించు మార్దవంబు' (విరా. 1-94). 'కుంకుమ హత్తించి కొనగోరఁ దీర్చిన...' (ఉ. హరి. 3-86), 'క్రొత్త లత్తుకహత్తించె...'( నై. 6-44).'మంత్రుల్ హత్తియిరుగడల నుండఁగ, (ప్రబంధ. 599).

కన్నడ. హత్తు, పత్తు : జోడించు, జతకలుపు.

4. హదను : యుక్తసమయము. అక్కఱగలతతి. '...మాన్యసుహృజ్జన బంధుకోటికిన్ హదనున మేలుసేఁత...' (నై. 3-14). 'ఓహరి సాహరిం....ఆ హదనం జెలంగు జనమాంతము నూళ్ళకుఁ బోవరామియున్' (ఆము. 4-93, 'హ' ప్రాసఘటితము). 'ముదుసళు లవ్వయుఁ దాతయు, హదనునజనకుండు తీర్థయాత్రకు వెడలెన్' (కృ. శకుం. 3-17).

కన్నడ. హదను, పదను : యుక్తము. తగినది ; కార్యానుకూలము.

5. హరిగోలు : అరిగోలు, ఏఱుదాటుట కుపకరించు తోలుపుట్టి. 'పరంగులహరిగోలు గుంపునా...' (శుక, 3-319).

కన్నడ, హరి గోళ్ : పరుగెత్తు ; హరి = ప్రవహించు ; ప్రవహించుట ; పరి = ప్రవాహము.

6. హరివాణము : తట్ట, పళ్ళెరము. '...కుందనంపు హరివాణమునన్ మధుపర్కమయ్యెడిన్' (వేం. పంచ. 4-356). '...పసిఁడి హరివాణమునన్...మధుపర్కంబునన్' (మను. 5-77). 'పసిఁడి హరివాణముతో' (అచ్చ. రా. బాల. 48). 'తెలెహరివాణంబు తలియ కంచము తట్ట పల్లెరమనఁ జెల్లు భాజనంబు' (వేంకటే. మానవ. పద్య. 47). '...హరివాణమనన్...పళ్ళెరము పేరు' (రామాయణము కృష్ణయమాత్యునిదేశవామార్థకోశము, పద్య. 23). హరివాణము సంస్కృత పదమను కొందఱు (శ. ర... ఆం. వాచ. శబ్దార్థ చంద్రిక, శబ్దార్థ దీపిక, శ. ర. అను.) నిరూపణము నిరాకరము. సంస్కృత కోశములలో మృగ్యము.

కన్నడ. హరివాణ, పరివాణ : పళ్ళెరము, తట్ట.

7. హరువు (ర్వు) : మనోహరము, యుక్తము. 'హరువైనహూణాన్నాణెయరఁగుల' (సుదక్షిణా. 5-195). 'జవ్వాది పద నిచ్చి క్రొవ్విఁబులుమ్మడిచెఁ

బెన్నె బీవేణి కొక వింత హరువు లెసఁగ' (శుక. 1-226). హరువొప్పన్....' (తారాశ. 3-101). 'హరువు మీఱంగఁ గై సేసి...' (దశా. 8-225), 'అందు విశేషములందుహర్వులు' (సారంగ, 2-63).

కన్నడ. హర్వు, హరుపు: రీతి; సాధనము; యుక్తము.

8. హళ (ళా) హళి: త్వర. 'హళా హళిన్' (మను. 4-98), హళా హళి మెయిరాగ' (సారంగ. 3-117); ఉద్ధతి. 'సైనికావళీ హళ హళికిన్ జెడన్వితిఁగె...' (అము. 3-16). '...మారుండు తీవ్ర సుమాస్త్ర ప్రహతిన్ హళాహళి యొనర్పన్...' (శుక. 1-199); ధ్వని. 'చంచలవీచీ సంచయ సముచిత హళ హళి కలతో రాయంచలు మ్రోయన్....' (కళా. 6-225) 'మంచపు హళ హళలును' (రాధికా. 4-102).

కన్నడ, హళ హళ, హళ హళి, హళ హళికె, ఫళ ఫళ: ధ్వన్యను కరణశబ్దము. తెలుఁగునందలి ఫళ ఫళ, పెళపెళ, ఫెళ ఫెళ — లు దీనికి తోఁబుట్టువులు. 'పెళ పెళ యనుచు నుఱిమె' (విప్ర. 3-54). '... ఫళ ఫళని, దవుడలు కరములఁ దాటించుకొనుచు' (ద్వి. పరమ. ద్వితీ. పు. 138). ఫళ ఫళ పయః పృషత్పరం పరలు గురియ' (హంస. 5-61) ఫెళ ఫెళ ఫెళ మంచు పెటిలు పడిన (దశా. 4-217). 'ఫెళ ఫెళ ఫెళ మంచు విల్లువిఱిగె' (దశా. 7-204) తెలుఁగున నివి ఆమ్రేడిత ధ్వన్యనుకరణములు. హళ (ళా) హళి' సంస్కృత సమాసమున నుండుటయె కారణముగా సంస్కృతమని నిరూపించిన నిఘంటుకర్తల నిర్ణయము. అగ్రాహ్యము.

9. హవణికె; ఒప్పిదము, 'హవణికె' (రాధికా. 1-131); హవణు; రీతి. 'ధవళముల్ విని చొక్కి హవణుఁదెల్పెడు లీల' (విజయ. 1-129): హవణించు: అందగించు. 'మించు హవణించు కనుంగవ' (సుదక్షిణా. 3-67) 'హవణించు వన్నెదగంవడితట్టు. (సత్యభామా ద్వితీయా.): అలంకరించు. 'పయ్యెద చెంగావి పావడ హవణించి' (తారా. 4-81). 'హవణింపఁగా నేర్చు' (పాండు. 1-52).

కన్నడ. హవణిగె = ఉచితము; ఒప్పిదము; కూర్చుట, చేర్చుట.

10. హాయి; సౌఖ్యము, (హాయిన్నన్ను లాలించి' (సత్యభామా. తృతీయా), 'హాయిగ మను నుచితవృత్తి నచలుండనఁగన్' (పైది. చతుర్థా.) హాయిగా (అహల్యా, 3-97. రాధిగా. 1-145)

కన్నడ, హాయి, పాఙు, పాయి : ఇంపు; ఆహ్లాదము; సౌఖ్యము. తెలుఁగునందలి 'హాయి' భారతీయేతరమగు అన్యదేశ్యమును చిలుకూరివారి నిర్ణయము (ఆం. భా. చ. పు. 598) ప్రామాదికము.

11. హాళి : వరుస, క్రమము. 'హాళి' నేఁటేఁట మీరు వేటాడుకతన (యయా. 1-106) 'ఆయా వినోదంబులెల్లను హాళిన్ విని' (సారంగ 1-118); ఆసక్తి, ప్రీతి, 'హాళింబుట్టిన కాఁకనొద్దితివి' (జై. 3-42) 'భువనాళిని' హాళిఁ జరింతు' (పాండు. 2-217). 'బ్రహ్మరుద్రాది దేవతా ప్రభులు మీఁది హాళి యును మాని....' (ఉ. రా. 1-28), నీపై హాళిం జిక్కెఁతి' (వి ప్ర. 3-88).

కన్నడ, హాళి, హాటి: క్రమము; నియతి ; యుక్తరీతి

12. హావడి (ళి): ఉపద్రవము. 'సమీపదేశముల్ హావళిఁబోవకుండ ; (విష్ణు పు. 2-132) ...ఇంచుక యగ్గెనేని లోకావళి హావళింగను...' (ఉ.రా, 5-76), 'హావడి యావడి యన నుపద్రవసంజ్ఞ...' (ఆం. భా. 2-223); బాధ: చిక్కు. 'వర్షంపు నెవ్వన్ రుజన్ హావళ్ళం డిగునన్య భూప్రజల... (ఆము. 4-245), ' మరునిహావళి (హంస. 1-101); కష్టము. 'ఆవర్షాభూవిభునకు హావళి దలచయ్యె. (పాండు. 5-309); నాశము, హావడి 'హావడి సేయును. సావడి లింగన్నమంత్రి.' (శేష. 1-84).

కన్నడ, హావళి: కష్టము; చిక్కు ; కలఁత, తొందఱ; హాడు + వళి; హాడు < పాడు; బాధ; నాశము: తద్భవమని డా. చిలుకూరి. కన్నడము నుండి యని బ్రౌణ్యము, పు. 1-129.

హుటాహుటి: గమనవేగము. 'తేరు హుటాహుటింగదలి' (జై. 6-77). 'హుటాహుటిఁజేరనరిగి' (వరాహ. 2-4), హుటాహుటిం బఱచి' (వేం.పంచ. 2-192). ''శవశవలేకరుగుదుము హుటాహుటి నడలన్' (మను. 1-76). హుటాహుటి నడలతో' (శుక. 1-254).

కన్నడ. పుట;పుటపుట, గంతులువేయు; దూఁకు; హుటహుట: 'వీప్సాను కరణా భీక్ష్య...చాపలాదౌ పదస్య ద్విర్వచనం' అని కర్ణాటక భాషాభూషా భూషణము, 192 సూ, ఇట ధ్వన్యనుకరణము. 'పుటపుటగా వీధివెంట... తిరుగు....' (హంస. 5-24)17.

14. హుళ(ళి)క్కి: అసత్యము, దబ్బఱ; వ్యర్థము. 'ధనము నిప్పుచ్చు రము విద్యయు హుళిక్కి (కాశీ. 4-111). 'లే దరంబు తత్తడి హుళిక్కి సహాయము సర్వమంగళంబు...' (మను. 4 105). 'హుళక్కి' ('బహులా. 5-169, యామినీ. 3-129, ఆంధ్రనామసం. మానవ. 58, రాధికా. 4-70), 'హుళక్కి' (అచ్చ. రా. అయో. 32, నీలా. 2-72; రామా. పు.6; పెద్దాడ. శకుం. 1-50) హంస. 2-146, ఆం. భా. 1-119).

కన్నడ. హొళ్ళు, పొళ్ళు.

15. హుసి ; పొల్లు, అసత్యము ; వ్యర్థము '....దివాణపువారి చేతి కాఁకలు హుసిపోవఁగా గఱవు కాల మెఱుంగ.. ' (శుక. 2-406), 'హుసి యని...పుళిందులు కఱకుమీఱి' (ప్రబంధ. 738).

కన్నడ. హుసి, పుసి ; వ్యర్థము ; పొల్లు, బొంకు ; హుసిగ ; అసత్య వాది ; 'పుసియిల్ల దాట్మ' (వెంకియ చోడని దొంగలసాని కనుమ శాసనము, పంక్తి 21). 'పుసియిల్ల దాట్మె' ( = పొల్లుకాని తాలిమి కలవాఁడు) కర్ణాట భాషా ప్రభావద్యోతకమగు బిరుదము. 'నీకేద నిజభక్తి నీకేదపాటి, పుసిగప్పు మాటలఁ బ్రొద్దుపుచ్చితిరి, వసుదేశులే యూరు వ్రతము లేయూరు....' (చితారు- గంగాధర కవికృత మగు భల్లాణ చరిత్ర. పు. 61). పుసి > పొయ్, పొయి ; కృత్రిమము, మాయ ; పొయిదల : కృత్రిమ శిరస్సు, చోరసాధన విశేషము. 'పొయిదల నీలిడిం డొలికి బూడిద ముండులబంతి...' (దశకు. 5-72) ; పొయ్ + ంకు > బొంకు : అసత్యము.

16. హూ : పూవు. 'వలపలి చలిగాలి వలన నల్లాడు, వెలఁడి హూబాశెలె పీచో పులుగను' (ద్వి. పరమ. తృతీ. పు. 241).

17. Cf. మరాఠీ. హుట హురణేఁ. అ. క్రి. ఆత్రపడు, సంస్కృతము నందలి 'హూడ్' గతౌ (ఆత్మనే.) హూడతే - తో ముడిపెట్టుట చింత్యము.

కన్నడ. హూ, పూ ; హూవు, హువ్వు : కుసుమము.

17. హెగ్గడి : పరివర్త్య నిమిత్తము రాజసన్నిధినుండు వ్యక్తి, హొజ్జాదత్తెనాతి హెగ్గడి (కుమా. 4-40) 'హెగ్గడులు' (కళా. 8-30, బహులా. 3-23) '...వాకిటవాకి నచటి హెగ్గళ్ళు బరిచారకులు బెక్కు భంగుల నదిగి' (ద్వి. పరమ. కృతీ పు. 209). 'హెగ్గడుల్ కైవార ముగ్గడింప' (పాంచాలీ. 2-12). 'హెగ్గడి కత్తియలు' (శుక. 3-315, రసతి. 1-12 రాధికా. 3-5), 'హెగ్గడికత్తెలు' (కళా. 2-73)18.

కన్నడ, హెగ్గడె, పెగ్గడె : ప్రధానమంత్రి ; పర్యవేక్షకుడు : కంచుకి ; పెగ్గడె < పెర్‌గడె. పెర్‌గడ అనునది తెలుగున వర్ణవ్యత్యయమునంది ప్రెగ్గడ ప్రెగడ యయినది. కన్నడమున వర్ణసమీకరణమునంది పెగ్గడె, హెగ్గడె యయినది. అమాత్యుడు, నియోగి అను నర్థముల తెలుగున ప్రెగ్గడ ప్రసిద్ధము. 'పగ్గఱ కొండెము చెప్పెడు ప్రెగ్గడ పలుకులకు రాజు ప్రియుడై మఱి వా నెగ్గు ప్రజ కాచరించుట' (సుమతి). 'ప్రెగడల మనసులు విరసము - లగు గతి...' (ఆశ్రమ. 1-70). భృత్యులుగరణముల్ ప్రెగడలుగాగ' ('పండితా పర్వత. పు. 474). అక్కనప్రగడ, అప్పాప్రగడ, కేశవప్రగడ, చెన్నాప్రగడ, ఎల్లాప్రగడ, మంత్రిప్రగడ, మానాప్రగడ, యల్లాప్రగడ, రామాప్రగడ, రెబ్బాప్రగడ, విన్నాప్రగడ, సిరిప్రగడ - మొదలగు గృహనామములలోని ఉత్తరభాగమగు 'ప్రగడ' పెగ్గడకు వికృతి. మన కవులలో ఎఱ్ఱన యొకడే 'ఎఱ్ఱాప్రెగడ'గా కీర్తితుడు. ఈ 'హెగ్గడి' సంస్కృత 'హేడక' పదజన్యమను అంచనా అగ్రాహ్యము. కన్నడమునుండి యని ప్రాణ్యము, పు. 1133.

18. హెగ్గాళె ; పెద్దకాహళ. '...త ద్దళ రంతు నెట్టనెదురన్ రాకాసు లెవ్వేళ హెగ్గాళల్ పట్టిరి...' (రామా. 8-74) ; హెగ్గాళెలు (అ. మ. క. పు. 191).

కన్నడ. హెగ్గాళె, పెగ్గాళె, పెర్‌గాళె ; పెర్ ( = పెద్ద) + కాళె ( = సం, కాహళ).

---

18. హిగ్గడి, హిగ్గడికత్తె, హిగ్గడు, హొగ్గడి (ప్రాణ్యము, పుటలు 1130, 1133, 1136) అను రూపములు పరిహార్యములు.

19. హెచ్చు : అతిశయము ; అతిశయించు, వర్ధిల్లు. '....అమరవరుల మొనలకున్ హెచ్చుగ దిక్పతిసేనలు వచ్చుటయును...' (నిర్వచ. 6_126). 'రాలచ్చికినై పెనంగిన బలంబులు రెండును గెల్వనేర్చునే హెచ్చుగుఁ గుందగున్....' (విరా. 4_334). 'హెచ్చుగుండాడఁ బని లేదు...' (హరి. 4_22). 'మన కనుంకి హెచ్చు నిదెమందని కంఠముఁగౌఁగిలించి....' (ఆము. 1_70).

కన్నడ, హెచ్చు, పెచ్చు పెర్చు : అతిశయించు, వృద్ధి యగు, పెంపొందు.

20. హెద్దొర : పెద్దనది ; ఒకానొక నది. 'ఉరవడి నుప్పొంగి యుడువీథి దాఁకి, హెద్దొర యనునది యిలనిండి పాఱఁ' దద్దయు నుద్వృత్తి ఘరఁదన్ని నిలిచి... (బస. పు. పంచమా). 'హిద్దొర యనునది యిల నిండిపాఱ' అని కాశీనాథుని నాగేశ్వరరావుగారి ప్రతి, పు. 160 ; వావిళ్ళవారి ప్రతి, 1952, పు. 376 'హెద్దొర యనునది యిల నిండి పార' (అని తాళపత్రప్రతి, ఆంధ్రవిశ్వకళా పరిషద్గ్రంథాలయము. నెం. 32877, 281 వ ఆకు. రెండవవైపు, 1వ పంక్తి). హెద్ధర యనునది యిలనిండి పార (ఆం. విశ్వ. గ్రంథాలయ తాళపత్రప్రతి, నెం. 29745, 103 వ ఆకు. రెండవవైపు), బ్రౌనుదొరగారికి లభ్యమయిన తాళపత్రప్రతులయందును 'హెద్దొర' యను పాఠమే ఉండినట్లు స్పష్టము (చూ. బ్రౌణ్యము, పు. 1134) ; తులనాత్మక పరిశీలనము వలనను 'హెద్దొర' యే సాదుపాఠము[19].

కన్నడ, హెదొఱె, పెర్దొఱె, పెర్ + దొఱె (పెర్ < పేర్ = పెద్ద). కన్నడ బసవపురాణమునను 'హెద్దొఱె' యను పాఠమే కలదు.

21. హేమా హేమీలు : దొరాదొరలు : అధికులు, పూజ్యులు ; ఘనులు, (వరాహ. 10_8, హంస. 1_212), 'బహుంత నన్యులఁ దెల్పు పట్ల హేమాహేములను పల్కు పూజ్యార్థమగుచు నుండు' (ఆం. భా. 3_16). భారతీయేతరమయిన అన్యదేశ్యమని డా॥ చిలుకూరి (ఆం. భా. చ. పుటలు 593, 598).

---

19. 'కనియెన్...స్వర్ధునికిన్ ఔన్నద్ది హొద్దారు వరనది...' (పిడపర్తి బసవ పురాణము, 5_200, వావిళ్ళ, 1925), ఇందలి 'హొద్దారు' సాదు పాఠముగా కన్పట్టదు. 'హెద్దొర' అని యుంట యుక్తము.

హేడ్ మాస్టర్, హేడ్‌మిస్ట్రెస్‌లే (పొడి అక్షరాల కూటమిచే) హేమాహేమీ లయినా రని మిత్రులు. ఏలేశ్వరోపాధ్యాయులు శ్రీ సురభి నరసింహముగారి చమత్కారము.

కన్నడ, హెమ్మె : ఆధిక్యము ; ప్రభుత ; శ్రేష్ఠత ; ప్రభవిష్ణుత ; హెమ్మెగాఱ ; ఉద్ధతుఁడు ; అధికాఁడు ; గర్వి : పెర్మె ; పేర్మె, *హెమ్మె హెమ్మె. వీప్సార్థ్యర్థేషు వివక్షి దేషు పదస్య ద్విర్వచనం భవతి' (కర్ణాటక భాషా భూషణ వృత్తి, పు. 70).

22. హేరాళము : ఆధిక్యము ; సమృద్ధి. 'ఎడవెల్లైవనులేక పెక్కు దినముల్ హేరాళమై వర్షముల్ జడిగాఁబట్టి...' (హర. 2_26), 'ఇంద్రాణితోఁ గూడ హేరాళముగఁ దీర్చెఁజాముండదివ్యభూషావ్రజంబు' (పైది 4_90), 'ఘనము హేరాలమబ్బె...' (కాశీ. 7_254). హేరాళపుంగాంతులన్' (మను. 5_48). 'హేరాళములైన మోహపువిరాళి తనంబుల' (విష్ణు పు 6_21). హేరాళంబగు పేడ్క' (దశా. 2_419) ; హేరాళము సంస్కృత మను మన నిఘంటుకారుల నిర్ణయము సత్యదూరము. హేరాళక్రీడా సంచారిణి నూకాంబ భక్తజన రక్షకునై, (భీమ. 1-101), ముక్తికాంతా హేరాళసుఖంబు గోరెదవు' (నిరంకుశో' 3_44) మున్నగు ప్రయోగములు ఉద్ధతులగు ఆయా కవుల ప్రౌఢవాక్పాటవమునకు నిదర్శనముగా స్వీకరించుట సముచితము.

కన్నడ, హేరాళ, పేరాళ : ధారాళము, వెగ్గలము ; ఔదార్యము ; విస్తారము ; ఆధిక్యము.

23. హేళగీఁడు : కథలు చెప్పవాఁడు. 'పొరిఁగులచ్చిరియారు భువి హేళగీఁడు' (బసవ. పు. ద్వతీ. పు. 105)20.

కన్నడ, పేట్, పేటు, హేటు : చెప్పు, పేర్కొను ; పేటికె, హేటికె: కథనము ; ఆజ్ఞ ; హేళిగ.

---

20. హేళగి (K) a large basket, బ. పు. 2_986 అను బ్రౌణ్యము (పు. 1135) నర్థము సరిపడదు.

24. హొనరు : అందము ; ఇంపు : పొందిక. 'పెంపుమీఱు వసంత వేషమవా హుజురుననుండి చెలామణి హొనరు చెలుప...?' (అనిరుద్ధ. 3-19), 'నీ హొన రెల్ల నేర్పుఱుపు నేర్పరి పొదుపు విస్ఫుర ద్వరా రోహయటన్న పేరు వగు రూఢిగ నీ యెడ సుందరీమణీ' (గోగులపాటి కూర్మనాథకవి సుందరీమణి శతకము, పద్య. 87).

కన్నడ, హొణరు, పొణర్, పొణరు : కలయిక, చేర్పు ; జోడు : అందగించు.

25. హొన్ను : బంగారము ; బంగారు నాణెము. 'లాలనతో నిచ్చె లక్షహొన్నులను' (చితారు గంగాధరకవి శృంగార భల్లాణ చరిత్ర, పు. 20). హొంగాశె ; హెంగిండ్లను' (కృష్ణరా. 4-75). 'హొంగుబ్బలి' (అచ్చ. రా. యు. 598). 'హొంగోక' (రాధికా 1-78). 'హొందగలు' (యామినీ. 4-70), 'హొన్నంచు' (మను. 5-42, ఘటికా. 2-11, ప్రబంధ-605, దశా. 2-66, హంస. 5-359). 'హొన్నందెలు' (ప్రబంధ. 273). 'హొన్నాణి యరంగుల' (సుదక్షిణా. 5-195) 'హెన్నాణిపట్టు' (వైది. 2-128). 'హెన్నుజిగిమేనులు' (ఉ. రా. 5-248), 'హొంబట్టుకులాయలు' (దశా. 7-34), 'హొంబట్టు గవిసెన' (వాల్మీకి. తృతీ. పు. 119). 'హొంబట్టుజిలుగురెండెంబు' (ఆము. పీఠిక, 12), 'హొంబట్టు తలగడ' (ప్రభా. 4-144), 'హొంబట్టు దట్టి' (సారంగ. 1-79), 'హొంబట్టు పచ్చడ' (వైది. 3-147), హొంబట్టుపఱుపు' (రంగా. 3-254). 'హొంబట్టుపాగ' (కళా. 8-35). హొంబట్టుపుట్టముల్' (పాండు. 1-165). 'హొంబట్టు బటువులలో' (కళా. 2-157) 'హొంబట్టుబొందు' (యామినీ. 4-70). 'హొంబట్టు రవిక' (పల్నాటి. పు. 65), 'హొంబట్టులోడీలు' ;(హంస. 5-360), 'హొంబట్టు వలెవాటు' (పాండు. 1-198). 'హొంబట్టుహరువుతెర' (భోజ సుతా. 4-112), 'హొంబుట్టము' (రామా. 3-35), 'హొంబొమిడిక' (అచ్చ. రా. సు. 34).

కన్నడ, హొన్, హెన్ను, హొం. పొన్, పొన్ను, పొం : బంగారు ; బంగారపు.

26. హొమ్ము : స్థూలమయినది ; పెంపు ; అతిశయము. 'హొమ్మైన కంతి నీ గుబారులోన' (సత్యభామా. కృతి). 'తోరముహొమ్ము...స్థూలము చెలంగు' (సాంబ, మానస. 49).

కన్నడ, హొమ్ము : వృద్ధి, పెంపు ; స్థూలమగు, దళసరియగు.

27. హొయలు : విలాసము. 'వివిధ విచిత్ర నవీనవస్త్రముల సవరించిన లింగ నివహాంబు హొయలు' (పండితా. పర్వత. 319). 'హొయలు గుజ్జరినేర' (సారంగ. 3-147), "హొయలుగా గంధంబు మెయినిండఁ బూయుచో..." (రాధామాధవ సంవాదము, పు. 10). 'ముద్దుగుమ్మ హొయలు' (హంస. పు. 2-146), 'హొయల్ బంతులు' (ప్రబంధ. 605).

కన్నడ. హొయల్, హొయిలు.

28. హొరంగు : విలాసము. 'బంగారు హొరంగు సింగపు రతనంపు గద్దియ' (కృష్ణరా. 1-20), 'మేల్ హొరంగు చందువలు' (తారాశ. 4-170). 'తళుకు హొరంగు పెండియము' (రాధికా. 2-107), 'దానిహొరంగు' (సత్య భామా. కృతి.).

కన్నడ. హొరె, పొరె = వర్ధిల్లు, అతిశయించు; ఉత్సాహము

29. హొస : క్రొత్త, నవీనము, 'హొసయనంగ మీఱునవంబు' (ఆం. భా. 3-23) 'హొసతమ్మి' (ప్రబంధ—750) హొసవరి : మనోహరము, సుందరము. 'బిసబిస బిసరెటి హొసవరి సురటిపిట్టల...' (రాధికా. 4-102) 'ఈహొస' మన అకారాది నిఘంటువుల కెక్కలేదు. క్రొత్తది, నూతనము, నవము, అను నర్థములతో 'హొస'యను ఆరోపము కొన్నింట (లక్ష్మీనా: ఆం. వాచ.) సంగ్రథితమయి ఆంధ్రభాషార్ణవ ప్రయోగమే ఉదాహృతమగుట వింత. ఈ నిఘంటువులను నమ్మిన శబ్దార్థదీపిక (చూ. పు. 1419)యు 'హొస'ను ఆరోపముగా నిచ్చినది 'క్రొత్తమిహి హొసయనంగ మీఱును నవంబు' అను ఆంధ్ర భాషార్ణవము నందలి 'హొస'ను 'హొస'గా పఠించుటవలన కలిగిన తబ్బిబ్బిది. ఆంధ్ర భాషార్ణవము ముద్రిత ప్రతులు — చెన్నపురి, వ - ఎతిరాజులు నాయునిచే శ్రీ చింతామణి ముద్రాక్షరశాలయందు, 1899 లో ముద్రితమయి

ప్రచురితమయిన ప్రతి. (పు. 86). 1812, 1861 నాఁటి వావిళ్ల ప్రతులు (పు. 88) — 'హాల' పాఠము గలవి — 'హ', 'హొ'లు రెండును ఒకటికి ఒకటిగా కన్పట్టునవి కావున ఈ ప్రమాదము దొరలియుండ నోపు ; లేక లక్ష్మీనారాయణీయ కర్త చూచిన ఆం. భా. ప్రతిలో 'హాల'యను పాఠమే ఉండినదేమో ? ఏది ఎట్లయినను 'హాల' పరిహార్యము21.

కన్నడ. హొస, హొస : క్రొత్త; క్రొత్తది. క్రొత్తదనము; హొసగన్నడ ; నవీనకర్ణాటభాష; హొసపేట; క్రొత్తపేట (= ఒకానొక పట్టణ నామము); హొసదు = క్రొత్తది.

29a. హోరు: నేర్పు. ఉపాయము; తెలివి. 'హోరుగల కోరమీసల హొయలువాఁడ' (కృ. శతం. 2-45).

కన్నడ. హోరిగె. హోరె, హోరెవు : ఉద్యమము. వ్యాపారము; సామర్థ్యము.

30. హోరాటము : ఆటోపము ; వేగిరపాటు, సంభ్రమము; వివాదము. '...వీరోద్రేకంబున దాపలన్ వలపలన్ హోరాటమైయుంచి సర్వద్రోహిం జరిమార్తమంచు...' (నిర్వచనో. 6-132) 'ఒకనాఁడా తమ ముందటన్ బలుమలున్ హోరాటమై నేలయెత్తికొనంగా బవరంబులన్ గెలువఁగా....' (ఉద్యో. 1-280).

కన్నడ : హోరాట, పోరాట : బాహా బాహి యుద్ధముచేయుట ; ద్వంద్వయుద్ధము. వివాదము, వాగ్వివాదము ; ప్రతిభటత్వము.

---

21. అత్యంతము, మిక్కిలి అను నర్థములతో 'హాలెము' అను ఆరోపమును ఇట్టి తబ్బిబ్బుల వలననే కొన్ని నిఘంటువుల (ఆంధ్రపద పారిజాతము, పు. 792, లక్ష్మీనారాయణీయము, పు. 822, ఆం. వాచ. పు. 2814, శబ్దార్థచంద్రిక, పు. 931, శబ్దార్థదీపిక, పు. 1419)లో కృతకముగా మూర్తికట్టుట. వాస్తవముగా నిది వాలాయమునకు రూపాంతమగు 'వాలెము'ను 'హాలెము' అని పఠించుటవలన దొరలిన తప్పు. 'హార్యము'ను పరిహార్యము.

31. హోరాహోరి : అవిరామమగు పోరు, నిరంతర కలహము. '...విజిగీషువులై హోరాహోరిం బోరిరి.....' (ఆము. 3_15). 'హోరాహోరిఁగా బోరి రిట్లిరు వాగుం దొరలంత...' (రంగా. 3_76) ; పట్టినపట్టు విడలకుండుట. '....చవిగాని యిందులకు హోరాహోరిగాఁ బోరి యేలావాలాయము సేయఁగా....' (మను. 3_94).

కన్నడ : హోరు, పోరు; యుద్ధముచేయు; వివదించు; పోరాటము; వివాదము. ఆభీక్ష్ణ్యమందు ద్విరుక్తి 22.

(b) వర్ణవ్యత్యయము వలన పదాదిగా మాఱిన కన్నడ దేశ్యము.

32. హావుదు : రూ. హౌదు. అవును, అంగీరమును దెలుపుమాట. '...బిరుదు పచారించి యచ్చాటుకారుల్ హావు దప్పా పాత్రరాయా యహాహా బళి బళియంచుఁ బెల్లెచ్చరింపన్...' (వైజ. 1_128); 'అమ్మక్క శబాసుమేలు హావుదంచు ఫణీశ్వరుఁ జూచి...' (కువల. 4_113).

కన్నడ : హౌదు, హావుదు < అహుదు < అప్పుదు (= అగును; ఇట్లే హీగె < ఇహగె (ఇట్లు. ఈ రీతిగా),

హౌదు : చూ. హావుదు. 'బౌసే ముద్దులగుమ్మ మేల్కితవునే యందంపు పూరెమ్మ హౌదేనే చక్కదనాలయిక్క....' (బ్రౌఞ్యము. 1137). 'సాహిచిత్తేశ హౌదయ్యసాహేబు పరా కంచు' (విద్యావతీ దండకము23, పు. 93). 'హౌదయ్య సంచారి భావంబు లౌనౌను విభ్రామ చాతుర్యమున్...' (పైది. పు. 99).

(c) నిసర్గముగా అజాదిరూపమైయుండి హకారాదిగా మాఱిన కన్నడ దేశ్యము.

---

22. ఇట్టివి ఆమ్రేడిత ధ్వన్యనుకరణములని డా. చిలుకూరి నారాయణరావు, ఆంధ్రభాషా చరిత్రము, పు. 502.

23. విద్యావతీ దండకము, గణపవరపు వేంకటకవి (క్రీ. శ. 1670) కృతము. Bulletin of the Govt. Oriental Manuscripts Library, Madras, vol. I. No. 1, 1948.

33. **హడపము:** వక్కలాకుల తిత్తి. 'ముప్పిడి హడపంబు' (ద్వి. పరమ. తృతీ. పు. 193), 'కాళాంజి హడపంబు' (పై ది. పంచమా. పు. 427)24.

కన్నడ, హడప, హడపగాఱ, హడపవళ: అడపమువాఁడు; అడప, అదపగాఱ, అడపవళ; అడకె, అడికె: పోఁకచెక్క; అడకొత్తు. అడకోతు; అడకత్తెర;

తమిళ. అడైప్పై; తాంబూలపుతిత్తి; అడై: తమలపాకు; పై: తిత్తి, పొది,

దే. ప్రాకృత. హడప్ప: తాంబూల కరండము; ఆభరణ కరండము.

అ మాగధీ. హడప్ప: తాంబూలపాత్ర; కాని, యిది శుద్ధద్రావిడ పిండము. అజాది రూపమే నిసర్గము.

## II. కన్నడమున సంస్కృత ప్రాకృతభవము అయి తెలుఁగున ప్రతిదేయములు :

34. హజ్జ: అడుగు, పాదము. 'ఏనుంగు హజ్జలోనెల్ల సత్వంబుల హజ్జలు నడఁగినయట్ల పోలె..., (శాంతి. 2-239), 'బలుహజ్జ మెకపుదాఁటులు' (అచ్చ. రా. యు. 184), 'హజ్జలిడున్ గుజ్జు తల్లి యానందింపన్' (దశా. 5-70).

కన్నడ, హజ్జె, పజ్జె < ప్రాకృత. పజ్జ- < సంస్కృత, పాద్య: పాద సంబంధి.

35. హణ: నాణెము. ప్రాఁతహణఁ జూచి నాదెంపుఁ బణ మటంచు' (బహులా. 5-14), 'శాంతుల సొమ్ములు వెలచేఁ గొంత, పడిం గొంత, కొలను గొంత, హణాచిన్ గొంత హరించు...' (పై ది. 5-13).

---

24. 'హాదులనియు వీలుగు లోనగువాని తొలి హల్లునకు లోపంబు బహుళంబుగ నగు' (సూ. 10 ప్రకీ; బాలవ్యా.) క్రింది పట్టికలోని 'హడపము' అజాదిగా పరిణతమయ్యె ననుట వ్యుత్పత్తి పరముగా విపరీత రీతి.

కన్నడ. హణ, పణ: సంపద, డబ్బు: నాలుగణాల ఎనిమిది దమ్మిడీల విలువకలిగిన ఒక ప్రాంతనాణెము.25 > (ప్రాకృత. పణ < సంస్కృత. పణ—: ఒకనాణెము;) ఆస్తి, సంపద; జీతము; సంపాదన.

36. హంపి: పంపాక్షేత్రము. పంపాసరోవర తీరస్థము. 'అనగ మాన సమున నుండి హంపినుండి... వచ్చె...' (కళా. 2—78).

కన్నడ. హంపె, పంపె: పంపాసరోవర తీరస్థమగు నొక పట్టణము > సంస్కృత. పంపా: దండకారణ్యమందలి ఒక సరస్సు; ఒకనది.

37. హరిగ; కేడెము. 'దురమున లక్ష్మణుండు నిహతుండగుడున్ గుఱుఁడచ్చెలంబునన్ హరిగయువాలుఁ గైకొని...' (జై. 6—189) 'హరిగలు తాటించి' (ప్రబంధ. 89). కన్నడ. హరిగె. పరిగె: డాలు, అడ్డణము > ప్రాకృత. ఫరఅ. ఫరగ, ఫలగ > సంస్కృత, ఫరక, ఫలక.

38. హసాదు: గొప్పవారి యాజ్ఞను విధేయులు మంచిదని యంగీకరించుటయందు వచ్చునది. (శ. ర.) 'అనిన ధీతిలి హసాదని మంత్రులెల్ల—వెను వెనుకకె వచ్చి వెలవెలంబాఱి' (ద్వి. పరమ, తృతీ. పు. 200). 'సామిహసాదని వారలూఁకొనన్' (సారంగ. 1—30). 'అతఁడు హసాదటం చతిరయంబున లంకకుఁ బోయి...' (ఉ. రా. 2—235). '...సృష్టి సేయుమని శ్రీకాంతుండు పంపన్ హసాదని వాణీశ్వరుఁడు...' (దశా. 1—305). అని పద్మజుఁడు పంపఁ జక్రము హసాదంచున్...' (వైది 6—69). కన్నడ, హసాద, పసాద: బహుమతి. ఉడుగర < సం. ప్రసాదః నివేదనము; బహుమతి, ఉపహారము.

---

25. ధ్వనిపరిణామ సూత్రబద్ధములైన స్వల్ప రూపభేదములతో భారతీయ భాషలన్నింట 'అణా' (= రూపాయలో పదునాఱవ వంతు) వ్యవహృతము. దీని వ్యుత్పత్తి యిందాఁక అనిశ్చితము. నాయూహ యిట్లు: కన్నడమున 'హణ', 'పణ' శబ్దజన్యము. 'హణ', 'అణ'గా పరిణతమయి కన్నడమున అణా, అణె, అణె రూపములు సిద్ధము. కన్నడమునందలి 'హణ' నాఁటి పెద్ద నాణెమగు వరహాలో పదునాఱవ వంతు. అర్వాచీనకాలపు నాణెమగు రూపాయలో పదునాఱవ వంతు 'అణా'. నా యీ సమన్వయము సమాదరణీయ మగుచో అన్ని భాషలకును కన్నడము పెట్టిన భిక్ష 'అణా'; ఆంగ్లమునందలి 'Anna' హిందీనుండి యని ఆంగ్ల నిఘంటువులు. Vide : Rev. Dr. Skeat, C. T. Onions etc.

39. హొంతకాఁడు (వి) : సాధనకాఁడు ; గరిడి పనులలో పరిశ్రమించి గడిదేరినవాడు. జెట్టి తండంబుతోడఁ జేపట్టి హొంతకారి విరిచినయట్టుల గలిక విఱుతు' (వి. రా. 1_80), 'బ్రహ్మాండమున్ గరిడిన్ గాలవు హొంత కాఁడు....' (మను. 3_59) 'గరళంబు మ్రింగు బింకపు హొంతకారికిఁ గడిఁదియే యవనాశుగ వ్రజములు' (వేల్పూరి - విస్సనకృతమగు విశ్వేశ్వర శతకము26. పు. 66), గరిడిలో నెఱహొంతకాడులై సాముల మీరిన రాజకుమార మణులు....' (హంస, 2_10). 'హొంతకారి' (ఉపల. 4_96). 'హొంతకారి కవీంద్రులు' (తపతీ. 1_14) 'బిరుదువేసిన జెట్టి పరివారమగునట్టి వారొప్పుదురు హొంతకాడులనఁగ...' (ఆం. భా. 2_208) ; నేర్పరి 'కలికి వయ్యారి బాగగు హొంతకారి' (ప్రసన్న వెంకటేశ్వర విలాస యక్షగానము27.)

కన్నడ. హొంతకాఱ, హొంతకాతి, హొంతగాఱ (తి) : నేర్పరి ; శూరుఁడు ; సమర్థుఁడు ; హొంత : పథము, దారి > సంస్కృత. ? పంథ—.

40. హోళిగ (లు) బొబ్బట్లు, భక్ష్య విశేషము.

కన్నడ, హోళిగె, పోళిగె < సంస్కృత పోలికా ; చూ. ప్రాకృత. పోలిఆ, పోలీ.

IV. అన్యదేశ్యములు28 : నవీనోత్తరాహ భాషలనుండియు, భారతీయేతర భాషలనుండియు ఎరవుతెచ్చిన పదములు ఇట ఉద్దిష్టము, తిక్కన్న

26. శ్రీధరమూర్తి, శరభయ్యగారలచే సంపాదితము, Bulletin of the Govt. Oriental Manuscripts Library, Madras, Vol. XI, Nos. 1, 2, 1958.

27. ప్రసన్న వెంకటేశ్వర విలాస యక్షగానము, కర్ణాట రాయదళవాయి రాయదుర్గము తిమ్మ భూపాల( క్రీ. శ. 1732) కృతము.

28. అన్యదేశ్యములనుగూర్చి ప్రత్యేక పరిశ్రమ చేసినవారు : ఛార్లెస్ ఫిలిప్ బ్రౌను, మిశ్ర బ్రౌణ్యము, 1854 ; డా. చిలుకూరి నారాయణరావు, ఆంధ్రభాషా చరిత్రము, 'తెనుఁగునఁ జేరిన యన్యదేశీయ శబ్దజాలము, పుటలు 575_621 ; నిడుదవోలు వేంకటరావు, శ. ర., అనుబంధము, 1958, పుటలు 98_111.

చివరిరోజులలో గాలివాన చినుకుపాటుగా అక్కడొకటి యిక్కడొకటి చెదరు చెదరుగా పడి చెమ్మగిల్లి, శ్రీనాథుని హయాము నకు చేరేఁడు చెలమగా రూపొందిన అన్యదేశ్య బిందురాశి, ప్రబంధ యుగము నాఁటికి ఆంధ్రభాషా స్రవంతిలో చిఱుపాయగా పెంపొందుట చారిత్రక సత్యము29. క్రీ. శ. పదునెనిమిదవు శతాబ్దాంతమునకు ఆంధ్రకావ్య ప్రయుక్తములగు ఇట్టి అన్యదేశ్యములు వేయికి పైమాట యని ఈపాయ అట్టు పుట్టాన వాళ్ళ నెఱుఁగ కృషి సేయుచున్న మా పరిశోధక విద్యార్థి లకంసాని చక్రధరరావు అంచనా. కావ్యప్రయోగ సహితముగా మదీయ పరిశీలనమున నిర్ధారితమయిన హకారాది పదజాలము ఈ శీర్షిక క్రింద సంగ్రథితము. 'హసనల్లి ఖానుండు' (రంగా. 2_248), 'హసను బేగు' (పద్మనాభయుద్ధము, 117). 'హిరాయత మొహదీన్ఖాను' (రంగరాట్. పీఠిక, 106). 'హుమామియా' (యయా. 1_16). 'హుసేన్ దాసవర్య' (గంగనపల్లి హుసేన్దాను శతకము). 'హైదరుజంగు' (రంగా. 1_142) మొదలగు వ్యక్తి నామవాచకము లిందు పరిహృతము.

1. హజరతి: పూజనీయుఁడు, మాన్యుఁడు. 'హజరతి మొఖిదుంజి ఖాదిరి' (యయా. 1_67), 'హజరతి శేఖు బుదురుది ఖాదిరిని మదిందలంచు శేఖిభరాముండును...' (పైది).

మరాఠీ. హజరత : పవిత్రత, శ్రేష్ఠత; పూజ్యతావాచకము.

పారసి. హజ్రత్ : ధర్మదేశికులు, దైవభక్తులు, చక్రవర్తులు మొదలగువారి నామములకు పూర్వము చేర్చు పూజ్యావాచకము.

2 హజారము: రూ. హజ్జారము, హోజారము: కొలువుకూటము, ఆస్థాన మంటపము. 'ఇంద్రుని హజారపుమేడ...' (కాశీ. 1-125), 'వాఁడును హజారంబు వాకిట నిలిచి...' (వరాహ. 11_57). 'హజారపుఁ ద్రోవ' (కళా. 2_16), '...హజారమునందు భేరి...చఱపించె...' (విజయ. 3_160) 'కొలువు హజారమై' (రామా. 1_4).

---

29. 'శ్రీనాథయుగము : అన్యదేశ్యములు', 'ఆంధ్రప్రదేశ్' పత్రిక, 1963, మార్చి, ఏప్రిల్, మే, జూన్, జూలై సంచికలు.

పా. హాజిర్ : సన్నిధినుండు, సేవకు సిద్ధముగానుండు; హాజిరాన్ : సభాస్తారులు; హాజిరీ = ఓలగము వారు. సభ్యులు.

హజ్జారము : చూ. హజారము. 'నగరి హజ్జారమున వాహనంబు డిగ్గి' (కకు. 3-16).

3. హద్దు : అవధి, మేర, 'ఉభయ పక్షంబుల ఒప్పైనబలము - నివసించి యున్నది నిశ్చలమతిని - హద్దులు చెప్పెద నవి చిత్తగింపు...దక్షిణదిశ హద్దు తగ వివరింతు...పడమటికిని హద్దు బాలచంద్రుండ. కొదమగుండ్ల యనెడి గురిగ్రామమొకటి' (పల్నాటి. పు 87), 'హద్దు ముద్దు మీఱి' (రాధికా. 3-47). 'పెద్దజీకంబులు ప్రియములు-హద్దుగ...' (శేష. పీఠిక, 48), 'వచ్చెను హద్దుతప్పి బలవర్గము...' (రంగా, 3-62), 'హద్దుపత్రికె' (నెల్లూరు శాసనావళి).

మరాఠీ హద్, హద్ద : మితి, మేర, సీమ.

గుజరాతి. హద, హద్ద, : మేర, అవధి ; అంచు.

పారసి. హద్, హద్ద్ : మేర, పొలిమేర, అవధి; వేర్పాటు ; అంచు ; లక్ష్యము ; హుదూద్ : హద్దులు.

అరబ్బి. హద్ : మితి, మేర.

4. హబిశీ : అబిసీనియా దేశీయుఁడు, 'హబిశీ రౌతులనంగఁ దుమ్మెదలు సొంపారెన్' (చారుచంద్రో. 4-46, బ్రౌణ్యమున ఉట్టంకితము, పు. 1123) : 'హాజీలగు బల్ పదాణి హబిసీల మదంబులు దీఱఁగా...' (పెద్దగిరి విజయము30. పు. 59), 'హబిసీలకు లెక్కలుచూచి' (పైది. పు. 58).

మరాఠీ. హప్శీ, హబ్శీ : అబిసీనియా దేశీయుఁడు ; హప్ (బ్) సాణ : అబిసీనియా దేశసంబంధి.

---

30. మల్లంపల్లి శరభేశ్వరశర్మ సంపాదితము. Bulletin of the Govt. Oriental Manuscripts Library. Madras, 1952. Vol. V. No. 2.

గుజరాతి. హప (బ) శీ : అబిసీనియా దేశీయుఁడు ; హప (బ) సణ : అబిసీనియా స్త్రీ. పారసి. హబశ్ = అబిసీనియా వ్యక్తి; హబశీ; అబిసీనియా (ఎథియోపియా) దేశమునకు సంబంధించిన; నల్లబానిస.

అరబీ, హబ్శ్.

5. హమరావు : రూ. హుమ్మరావు; అంగరక్షకుఁడు; సహచరుఁడు. 'అమిత విక్రములైన హమరావులొకచోట' (రంగ రాట్. పీఠిక, 14). 'ఫౌజు దార్లు హమరావులును కిలాదారులు' (పై ది. 112). పారసి. హమ్‌రవ్ : సహయాత్రికుఁడు; హమ్‌రాహీ : సహచరుఁడు, మిత్రుఁడు; హమ్‌రూ : ముఖాముఖి; హమ్; సమత; అన్యోన్యము; రవ్ : ప్రయాణము, దారి; ఉమరా ? : అమీర్ అనుదాని బహువచనము, రాజకుమారులు అని యర్థము. 'ఉమరా ?'ను మూలముగా భావించినచో ప్రస్తుతారోపము 'హుమరావు' అని యుండనగు; ఈ పక్షమున 'హుమరావు' కృతక ప్రామాణికము (hyper form) 'హదురావు', 'హుదురావు' అని రంగరాట్. ముద్రిత ప్రతులు-ఇంకను విచార్యము.

6. హమా : అన్ని, ఎల్ల. 'హమాదినుసు మేలుసరకు గలిగి' (హంస. 2-232).

పారసి. హమా : పూర్ణము, సమస్తము; హమ్ జిన్సీ : సజాతీయ వస్తురాశి; హమ్ జిన్స్ : అన్ని దినుసులు.

6 a హమాము : స్నానద్రోణి. మణికర్ణికా తీర్థ మజ్జనంబు ! నీకు — మొనసిహమాములో మునుఁగుటరయ' (వేల్పూరి విస్సనకృతమగు విశ్వేశ్వర శతకము, ప. 89).

పారసి. హమామ్ : ఉడుకు నీటితోచేయు స్నానము; హమ్మామీ : స్నాపకుఁడు.

7. హరకాలా : వేగులవాఁడు. 'హరకాలాలిటు వచ్చినారు భవదీయా లోకనేచ్ఛా రతిన్...' (రంగా. 2-143). 'హరకాలాల్గాని వచ్చిన పరవానా చూచి...' (పై ది, 2-144).

మరాఠీ. హర్కారా : రాయబారి, దూత, సందేశహారి.

పారసి. హర్ కార్ : సర్వకార్యములు; హర్ కార : వార్తాహరుఁడు; నియోగి, ఆజ్ఞప్తికారుఁడు[31].

8. హరబ్బి : అరబ్బీదేశము; ఆ దేశపు గుఱ్ఱము. 'దేశభేద హయా ళిఫలు హరబ్బి తురికి' (ఆం. భా. 2_196); అరబ్బీ దేశపుభాష. 'ప్రాన్సు పడతకీసు హరబ్బి పార్సి తెనుఁగు... మొదలయిన భాషాంతరముల' (రంగ రాట్. పీఠిక, 81).

పారసి. హర్బీ : వీరుఁడు; విరోధము; హర్బ్ : యుద్ధము; జరగడము; హరూబ్ దోఁపిడి; కొల్లపెట్టుట (ఈ వ్యుత్పత్తి యింతను విచార్యము).

9. హరాంకోరు : కృతఘ్నుఁడు; దుర్జనుఁడు : పోకిరి 'దగులుబాజి హరాంకోరు వాజు...' (హంస. 5_117); హరాంఖోరై నా' (ద. హిం - శా, X. No. 751; క్రీ. శ. 1592.)

మరాఠీ. హరాంఖోర : కృతఘ్నుఁడు; నీచుఁడు.

పారసి. హరామ్ఖ్వార్, హరామ్ఖ్వుర్ : లంచగొండి; హరామ్కార్ : జారుఁడు.

10. హల్లా : కోటను ముట్టడించుట, లగ్గపట్టుట. 'హల్లా సేయుదు వొబ్బిలికిల్లా...' (రంగా. 2-54). '...కించిన్మాత్రన్ హల్లాకు నూలు కొలుపుచుఁ జెల్లాకుం జెదరఁజేతు...' (రంగా. 2_247).

మరాఠి. హల్లా : అల్లరి, సందడి (ధ్వన్యనుకరణము).

10a హవా ; బైబిలు పూర్వ నిబంధన ప్రకారము ఆదిమ స్త్రీ; మాన వుల మొదటితల్లి. 'అఖిల జగదంబ యన్నపూర్ణాంబకిలను - వ్యర్థమగు పేరు మామా హవాయనంగ - విజిత పరయూథ కాశికా విశ్వనాథ!' (విశ్వేశ్వర శతకము).

పారసి. హవా : మానవమాత; మామ్ : తల్లి.

---

31. పారసి. 'హర్ కార్'కు సంస్కృతము నందలి 'సర్వకార్య' జ్ఞాతిపదము. జెండ్ భాషలో 'హౌర్వ' = సంస్కృత. సర్వ—.

11. హసము : దండుకూచి చేయునపుడు రస్తు సరంజామును మోసి తెచ్చెడి పరిచారకులు — 'జతనంబుతోఁ దేఁటి సంచిణి హసము భిన్నీదుఁముదారుగా నిగుడి నడువ...' (అనిరుద్ధ. 3-19).

మరాఠీ. హశమ్ : అనుయాయి; తైనాతి, నౌకరు ;

పారసి. హశ్మ్ : సామగ్రి ; హశమత్ = సేవకులు.

అరబ్బీ. హాశ్మ్ : సరంజాము, సామగ్రి ; హశ్మత్ : పరివారము.

12 హాకిము : ఏలిక, ప్రభువు. '...భయోక్తులు పల్కు మీరు హాకీము లొకించు కేని పరికింపక ...' (రంగా. 2-151), హాకిముల్ దమ రిట్లు పల్కుటకు నర్థంబే విమర్శింపకన్' (పైది. 2-218).

మరాఠీ. హాకిమ : పాలకుడు ; రాజప్రతినిధి ; యజమాని, అధికారి.

పారసి. హాకీమ్ : న్యాయాధికారి ; సేనాని; పాలకుఁడు ; హాకిమీ : పాలన ; ప్రభుత్వము : హాకీమ్ : పదాధికారి; శాసకుఁడు ; స్వామి.

13. హాజరు : రూ. హాజీరు (రాజ) సన్నిధినుండుట. '...అరంగావనీ భర్తదాఁ బంచెన్వీడే వకీలు హాజరుగ...' (రంగా. 2-88). '...శ్రీకృష్ణచంద్ర దేవు మహారాజులుం గారు అనే మేము హాజరులమై శేవిస్తిమి' (శ్రీ కూర్మశాసనము, నెం. 1192, ద. హిం. శాసనావళి 5వ సం ; క్రీ. శ. 1866).

మరాఠీ. హాజర, హాజరి : సమ్ముఖమున నుండుట, సమక్షము.

పారసి. హాజిర్ : సన్నిధినుండుట ; సన్నద్ధ మగుట.

హాజారము : చూ. హజారము. 'యోజింపు మనుచుఁ బంచిన హాజారం బునకు వచ్చి యమ్మంత్రివరుం దేజాడ...' (రామా. 2-75), 'వారిఁబిలిపించి కవుంగిట గారవించి హాజారమునన్ వసించి....' (పెదగిరి విజయము, పు. 53), 'హాజారము హజారమను నివి...ముఖశాల కలరు...' (ఆం. భా. 2-14).

హాజీరు : చూ. హాజరు, 'హాజీరయనెదొ నౌరోజర్సు మేజువాణి విల్కు రావంతి నిలఁగ, (విశ్వేశ్వర శతకము).

14. హాజీలు : చూ. హాజరు. ఎడబాయకుండుట. 'లోలాక్షియుఁ దోడనె హాజీలై రా నారగించి చేఁదోలఁచి...' (సత్యభామా. ద్వితీ.) ; అంగరక్షకులు ఇరు పక్కయల బవిరిగాఁ గ్రిక్కిరిసి హాజీలై తేజీల నెక్కి కుమారలోకమ్మ

నల్లింద్రుఁ గ్రమ్మకొని రాఁగ...' (వైది,) 'హాజీలగు బల్పతాణి హాబిసీం. మదంబులుఁ దీఱఁగా బిరంగీలఁ దెమల్చికాల్చి...' (పెద్దగిరి విజయము, పు. 59).

మరాఠీ. హాజీర్ : సమ్ముఖము.

15. హాలుసాలు : వర్తమాన సంవత్సరము. 'చేవెత్తిపోకుండ నాలవ వాయిదా హాలుసాలునకు కాపయ్యెనందు' (చాటరాతి లక్ష్మనరసకవి పద్మనాభ యుద్ధము, పద్య 42).

మరాఠీ. హాల్సాల్ : నడచుచున్న యేఁడు.

పారసి. హాల్సాల్ = ఈయేఁడు ; వర్తమాన సంవత్సరము ; హాల్ : వర్తమానకాలము ; హాలా : ప్రస్తుతము.

16. హిజుగు : చిక్కు, బంధము. 'మరుహిజుగులు విచ్చఁగ' (సత్య భామా. చతుర్థా).

పారసి హజ్క్ : త్రాటితో బంధించుట ; నొక్కుట ; అదుముట.

17. హిందూ : ఆర్య (వైదిక) ధర్మానుసారి. 'హిందూరావు సుర థాణి...తిమ్మారెడ్డింగారు' (3వ పంక్తి, A. R. No. 469 of 1915 ; క్రీ.శ. 1496) ; 'హిందూరాజ్య రమా ధురంధర....' (మను. 3_142) ; హిందూ రాజ్యసంస్థాపనా' (కావ్యా. సం. 5_243) ; హిందుఖానునిబలావళి' (కువల. 1_32) తురక దొరలము మాకు హిందువులు భరమె' (రంగా. 2_39). మా కలక్ష్యములుగా హిందూల దోర్దర్పముల్' (వైది. 2-44). 'హిందూ ముస ల్మాను లేకమై భుజియింపఁగా నిచ్చఁగనె జగన్నాయకుండు' (30 వ పద్య. వేల్పూరి విస్సనకృత మగు విశ్వేశ్వర శతకము). 'శ్రీమదఖిల భువన భూష ణంబగు చెన్నపురంబున నున్న వివేక గుణసమృద్ధిగల శ్రీమంతులచేత నిర్మితం బైన హిందూ విద్యా సభలో సంస్కృత పండితుండైన పుదూరి సీతారామశాస్త్రి చేత...' (బాలవివేక కల్పతరు_నేఁటి పెద్దబాలశిక్షకు పూర్వరూపము _ పీఠిక, క్రీ. శ. 1853), 'హిందూనరేంద్రులు నందఱు సభఁజేసి....' (చెన్నపురీ. పు. 5), 'హిందువులును పగనాపురమందలరున మంచ విభ్రమాస్పందములై

హిందూ విద్యానిలయము...' (పైడి, పు. 66), 'హిందువులు సిల్కు షాపులు నం దలరున్....' (పైడి, పు. 67).

మరాఠీ, హిందవీ, హిందీ, హిందూ : హిందువులకు సంబంధించిన ; హిందూస్తానీ : హిందూస్తానీభాష ;

గుజరాతి. హిందవాని : హిందూ స్త్రీ ; హిందవీ, హిందీ : హిందువుల భాష ; హిందూస్తానీ : నర్మదానదికుత్తరమునుండు దేశభాగమునకు చెందిన సిపాయి,

పారసి. హిందూ : హిందువు, భారతీయుఁడు, గస్తి తిరుగువాఁడు ; బానిస, సేవకుఁడు ; విగ్రహారాధకుఁడు : హిందవానీ హిందువానీ ; హిందూ దేశపు ఉక్కుతో తయారుచేసిన ; హిందవీ, హిందూవీ : భారతీయభాష ; హిందీ : హిందూదేశమునకు సంబంధించిన[32].

18. హుకుము : హా హుక్కుమ్ము. ఆజ్ఞ ; శాసనము. 'హుకుము బొప్పున నడవక వికటమతిని దిరుగఁబడి...' (రంగా. 2-258), 'భూజను లందరుఁగా హుకుమొసంగిరి క్రమ్మఱ రాజ్యమియఁగాన్' (చెన్నపురీ. పు. [illegible]). 'కొత్వాలుఖానా హుకుం ఖరారైయుండ ప్రహరి తిర్గుటమానె భైరవుండు' (వేల్పాకి విన్నకోటసృతమగు విశ్వేశ్వర శతకము).

మరాఠీ. హుకుమ, హుక్మ : అనతి ; శాసనము ; గుజరాతి. హుకామ.
పారసి. హుక్మ్ : అనుమతి ; తీర్పు ; న్యాయాధికారము ; శాసనము ; అరబ్బీ. హుకుమ్.

19. హుక్కా : పొగాకు పొగను పీల్చెడి సాధనము.

'నీకు హుక్కా పటిలోనె గద్దాయని యా హితాగ్నులం నెత్తు లణచకుండ' (సింహాద్రి నారసింహ శతకము, పు. 15). 'హుక్కాల' (భద్రగిరి శతకము, 50. ప.).

---

32. 'హీనందూషయతి హిందూ' అను వ్యుత్పత్తి అర్వాచీనము, అశాస్త్రీయము. సంస్కృతేతర పదములను ఏదోయొక సంస్కృత మూలధాతువుతో ముడిపెట్టనెంచురీతి నిరాకరము సమూలముపట్టు పెద్దలికను వీరు పాటించినట్టు కన్పట్టదు.

మరాఠీ. హుక్కా.

పారసి. హుక్కా : నగలుగాని మందులుగాని ఉంచెడి గుండ్రని సందుకాపెట్టె; పొగపీల్చెడి గొట్టము.

హుక్కుమ్ము ; చూ. హుకుము. ఇమ్మహిం బ్రబలిన ఢిల్లి యహమ్మదుషా పాదుషా ధరాధీశ్వరు హుక్కుమ్మున...' (రంగ రాట్. పీఠిక, 105).

20. హుజుత్తు : మోసము ; వృథా కలహము. '....వట్టికిత్తులు సేయు రిత్తముడి కాండ్ర హుజుత్తనిపించక విత్తహాని చేసితివని...' (నిరంకుశో. 2-139, సరస్వత్యనుబంధము, 22, కాకినాడ, 1913), '....హుజిత్తనిపించక...' అని (ఆంధ్రశిల్పకళాపరిషత్తు సత్తెనపల్లివారి ప్రతి, 1951, పు. 188) ఒక పాఠము.

మరాఠీ. హుజత్, హుజ్జత్ ; వ్యర్థముగా వివదించుట, పేచీపెట్టుట ; జగడము.

పారసి. హుజ్జత్. వాగ్వివాదము ; వ్యర్థ : కలహము ; సాకు, నెపము ; సాక్ష్యము, ప్రమాణము ; తీర్పు, తీర్మానము.

హుజురు : చూ. హుజూరు. కొలువుకూటము. 'మహందుదమీను హుజురుకు వచ్చి' (ద. హిం. శా. XNo. 759 ; క్రీ. శ. 1663 'ఒనరు నిభరాము పాదుషా హుజురునందు' (యయా. 1-51), హుజురుపాటకు రాక యున్న జక్కులు వేరు' (సత్యభామా. చతుర్థా.) 'పెంపుమీఱు వసంత ఫేహువా హుజురుననుండి చెలావణి హొనరు దెలుప' (అనిరుద్ధ. 3-19) ; 'హుజూరు కొలువులు' (కువల 1-38)

21. హుజూరు : రూ. హుజురు. ఆస్థానము, కొలువుకూటము, '...అవసర సచివుల్ చెచ్చెర హుజూరునకుఁ బిలవచ్చిన...' (రాజవా. (5-37).

మరాఠీ. హుజూర : ఆస్థానము ; అధిపతి, ఏలిక, యజమాని.

పారసి ; హుజూర్ : సమక్షము, సమ్ముఖము ;

అరబ్బీ. హుజూర్ : అస్తిత్వము ; సమ్ముఖము.

22. హుమా : చూ, హుమాయి, హుమాయీ, హుమావు, వాహనము. 'కొక్కు హుమాజోదు' (అచ్చ. రా. పీఠిక, 21). 'చిలుక హుమావజీరు' (గోగులపాటి కూర్మకవి సుందరీమణి శతకము, పద్య .42). 'చిల్కహుమా' (కృ. శకుం. 2-174), సిరిగులెక్కెతి చిల్కహుమా' (యామినీ. 4-71). మరాఠీ నుండివచ్చిన పదమని బ్రౌణ్యము రిషైజడ్. 1397 ; అం. భా. వ. 620.

మరాఠీ. హుమ్మా : గరుడపక్షి.

పారసి. హుమా : భూమిపై వ్రాలకుండ నిరంతరము ఎగిరెడి ఒకపక్షి ; హుమాడమ్ : హుమా పక్షి రెక్కము.

హుమాయి : చూ. హుమా. 'కాయజారాతిగిబ్బ హుమాయినెక్కి' (పరతత్త్వ రసాయనము. 1-111). 'పదార్వన్నెయంచహుమాయి వడిగనెక్కి' (ఉ. రా. 2-178). 'పులుగుహుమాయి జోదు' (అచ్చ. రా. పీఠిక, 4), 'చిల్కహుమాయితేజి' (హంస. 4-88). '...ఘోడాన హుమాయి....' (పాడప్ప సీసములు, 7).

హుమాయీ : చూ, హుమా. 'పెలమిన్ బంగరుతెక్కపక్కెర హుమాయీతేజి...' (దశా. 2-67).

హుమావు : చూ. హుమా. 'మలయు వెలిగిబ్బనీలా హుమావునెక్కి' (విశ్వేశ్వర శతకము, 43 వ.).

హుమ్మరావు : చూ. హమరావూ. '...గోలకొండకు పోయి...అక్కడ ఉండే ఆమీర్లు హుమ్మరావులు దివానులు మొదలయిన గొప్పగొప్ప వారిని దర్శనం చేసుకొని...' (దూపాటి కైఫీయతు ; శ్రీఫరమూర్తి, సర్వేశ్వరరావు గారలచే సంపాదితము) 33.

33. Bulletin of the Govt. Oriental Mss. Library, Madras, Vols. xiii & xiv.

హురుమంజి : చూ, హురుముంజి. 'హురుమంజి ముత్యాల యొరగు పొగమెఱుంగు' (సారంగ. 1_79). 'గొప్ప హురుమంజి సుప్పాణికూర్ప దంపు' (కృష్ణరా. 3_75). హురుమంజి ముత్యాల కుతికంటు..........' (కవి రాజ మనో. 2_190). 'హురుమంజిపూసల' (హంస. 4_109); 'హురుమంజి పల్లము' రాజవా. 2_46).

హురుమంజీ: చూ. హురుముంజి. 'చెలువంబై కళలన్వెలుంగు హురు మంజీదేశపున్ ముత్తియంబులతోఁ గూర్చిన చేరు చుక్క...' (అనిరుద్ధ. 5_72).

23. హురుమత్తు : గొప్ప, పెద్ద (శ. ర.). 'ఒక్క నిబ్బరముగా హురుమత్తు పరువెత్తు సళ్ళించు కళ్ళెముల్ ఘల్లనంగ' (కృష్ణరా. 1_53), 'ఒక్క హురుమత్తు నను మ్మత్తూరు......నోడించి' (పైడి. 3_6). హురుమత్తు వేళల' (పార్వతీ. ప్రథమా. పు. 10). 'సరిఖేలు హురుమత్తుసాపు బాగీలకై మఱచెనప్పటి వృత్తి మాధవుండు' (విశ్వేశ్వర శతకము)

మరాఠీ. హుర్మత్ ; ప్రతిష్ఠ : గౌరవము ; గొప్పదనము.

పారసి. హుర్మత్ : సచ్ఛీలము ; మర్యాద.

24. హురుముంజి : రూ. హురుమంజి. పారసీక జలసంధి చేరువలో క్రీ. పూ. నాలుగవ శతాబ్దినుంచియు ప్రసిద్ధి కెక్కిన ఒకానొక రేవు పట్టణము. క్రిందటి దినముల లోపల గుఱ్ఱముల, ముత్యముల ఎగుమతికి ప్రసిద్ధి. 'హురు ముంజి బలుతేజి హరులు దెచ్చె' (హర. పీఠిక. 26).

పారసి. హర్మజ్, హుర్మూజ్, హోర్ముజ్ : పారసీక జలసంధిలో ఈ పేరుగల దీవి ; : ఈ పేరుగల రేవుపట్టణము.

25. హుశారు : చూ. హుషారు. హుసారు. చలాకీతనము. చురుకు దనము. 'చిగురాకు తెగసౌరు వగరాజిలు హుశారు వగమీఱు రత్నాల పహిగు డార్లు' (కృష్ణరా. 3_75). 'నిశ్శంక నలంకరించుక హుశారున వీథికివచ్చు చుండి...? (హంస. 4_85).

పారసి, హరామ్ : పాపకృత్యము, నిషిద్ధము, న్యాయ విరుద్ధము ; హరామీ : ద్రోహచింతనగల ; హంత : దోఁపిడికాఁడు.

29. హోదా : పదవి ; స్థితి. 'మామాహోదాలో మమ్ములను వుండుమని మాకు సమ్మతులుచెప్పి....' (రమణప్ప జమీదారీ గ్రామాదుల కరణముకాపుల అర్జీ)[35].

మరాఠీ. హోదా :

పారసి. హోద : వాస్తవస్థితి ; సత్యము ; మూలము, ప్రాచీనము.

మూలఘటిక కేతన గ్రామ్యమునకు లక్ష్యముగా నుదహరించిన '...యేగ గొంటూరమ్మ యేదాలు వోదాలు...' (ఆం. భా. భూ. 120) అను పద్యభాగము నందలి 'హోదాలు' కు 'హోదాలు' గ్రాంథిక రూపమను నిర్వ ప్రభా వివరణము విచార్యము.

30. హౌదా : ఏనుఁగుమీఁద కూర్చుండుట కనువుగా కట్టిన పీఠము, అంబారి - 'పిలాతి సకలాతి హౌదాల సామజములు' (రంగా. 1-156).

మరాఠీ. హౌదా : ఏనుగుమీఁది గద్దె.

పారసి. హౌజ : ఏనుగు మొదలగువానిపై పయనించుటకు నిర్మించెడి తొట్టెవంటి పల్లకి ; హౌదజ్ : పయనపు ఒంటెలమీఁద కూర్చుండుట కనువుగా నిర్మించిన కొయ్యచట్రముతోడి గుడారము.

అరబ్బీ. హావద : ఒంటెమూపు.

31, హౌదుఖానా : మాడువుపై నీటితొట్టెకల భవనము. 'హౌదుఖానా నిడు లాయెఁగా యుత్తుంగ సౌధగోపుర బహుస్తంభ వితతి' (వేల్పూరి పెద్దన కృతమగు విశ్వేశ్వర శతకము).

---

35. Telugu Documents, Ed. by Prof. G. J. Somayaji, Published on behalf of the National Archives of India by the Andhra University, Waltair 1957, pp. 10, 11.

పారసి, హౌజ్‌ఖాన: నీటి తొట్లుగల భవనము; హౌజ్ = జలాశయము.

32. హౌసు: రూ. హవుసు. ఒయ్యారము, సొగసు – 'కోటలా తెఱగంటి పాటలాధరలెల్ల నాటలాడఁదలంచ హౌసుమించ' (కృష్ణరా. 2-34). 'సౌరా చక్కఁదనంబు హౌసు....' (తారా. 3-23), 'హౌసుగా స్వారి వెడలు నవసరమున' (రంగరాట్. పీఠిక, 92), 'హౌసుమించి' (సత్యభామా. తృతీ.). 'హౌసుమించె నటంచు' (పార్వతీ. ద్వితీ. పుట 24), 'హౌసుతోఁట సింగారపుఁదోఁట....అనంగను పవనమొప్పు' (సాంబ. స్థా. 68). 'హౌసుకాఁడనఁగను నగు భోగి' (ఆం. భా. 3-10) 'హౌసుకళ' (హంస. 2-45): ప్రేమ. 'హౌసు చెల్లించిన యంచగత్తె' (తారా. 4-59).

మరా. హౌస: ఔత్సుక్యము; హవస్, హౌస్ (స) ఉత్కంఠ, ప్రబలేచ్ఛ; విలాసము; మోహము.

పారసి. హవస్, హివాస్, హోస్, హౌస్; కామము; తీవ్రవాంఛ; ఆకాంక్ష.

అరబ్బీ హవస్: ఉబలాటము: అన్వేషణము.[36]

V. ఆంగ్లపదములు: ఆంగ్లభాషతో మనకుఁగల సహవాసము మూఁడున్నర శతాబ్దుల నాఁటిది. ఆంగ్లము ఆసరాలేనిదే శిష్టసమాజమున పెక్కుర వ్యవహారము అరగడియ సేపు గడవదు. తెలుఁగుల పలుకుబడిలో అడుగడుగున చెలామణియగు ఆంగ్లపదములు వేయాఱులు. కాని, కావ్యప్రయుక్తములయినవి మిగుల పరిమితము. కథావస్తువులు ఆంగ్లసమాజముతో ప్రత్యక్ష సంబంధము కలవి యగుటచే పద్మనాభ యుద్ధము,[37] చెన్నపురీ విలాసము[38] వంటి

---

36. అరబ్బీనుండి యని బ్రౌణ్యము, పు. 1137.

37. వత్సవాయి రాయగజపతి వర్మగారిచే ప్రకాశితము, రాజమండ్రి. 1934.

38. మతుకుమల్లి నృసింహశాస్త్రి కృతము, చెన్ననగరము ఆదిసరస్వతీ నిలయ వివేక రత్నాకర ముద్రాక్షరశాలలలో వావిళ్ళ రామస్వామి శాస్త్రులచే దుందుభి, శ్రావణము (క్రీ. శ. 1862) న ముద్రితము.

ఆధునిక కృతులలో ఆంగ్లపదములు విరివిగా ఉపయుక్తము. హకారాది పదములు కొన్ని క్రింద ప్రదర్శితము.

1. హిజు : His, 'హిజు హైనెస్ దీ మహారాజా మీర్జా విజయరామ గజపతిరాజు....' (మార్కండేయ పురాణము[39] పీఠిక, పుట, 25).

2. హెర్ : Her, 'హెర్ హైనెస్ శ్రీమదలక రాజాంబా మహారాణీ సాహెబావారు....' (పైది).

3. హెడ్డు : Head, ముఖ్యము, ప్రధానము. '....సదర్కోర్టును హెడ్డు పోలీసును' (చెన్నపురీ. పు. 27), 'పేటలకునెల్ల హెడ్డగు మౌంట్రోడ్డు....' (పైది. పు. 28).

4. హైస్కూలు ; ఉన్నత పాఠశాల. '....విచారింప హైస్కూలున్ లోనగు స్కూలు లప్పురి సిరుల్ గుల్కున్....' (పైది, పు. 66).

5 హౌసు : House, బంగళా, కార్యాలయము. 'అలయార్బత్నాటు హౌసు బెన్నిహవు సొప్పారస్ లయన్ హౌసునా బలుహౌసుల్ మజిషావు లున్ ...' (పైది, పు. 66), 'హూణులునుచు హౌసులకు ననుంగుం దమ్ముల హౌసులును...' (పైది, పు 67).

VI. కృతక ప్రామాణికములు (Hyper forms) : హకారాది పదముల తొలివర్ణము లోపించి అజాది రూపములగుట (Deaspiration) సాధారణమగు ధ్వని పరిణామము — హజారము > అజారము ; హజ్జ > అజ్జ ; హత్తు > అత్తు ; హదను > అదను ; హనుమ > అనుమ ; హరిగ > అరిగ ; హరివాణము > అరివాణము ; హరుసము > అరుసము ; హళది > అళది ; హసాదు > అసాదు ; హావడి > ఆవడి ; హితవు > ఇతవు ; హురుముంజి > ఉరుముంజి ; హెచ్చు > ఎచ్చు ; హొమ్మ > ఒమ్మ ; హొసపరి > ఒసపరి ; హోళిగ > ఓళిగ—మొదలగునవి ఈ ధ్వని సూత్రమునకు

---

39. మంద చిట్టి కామేశ్వరశాస్త్రి తెలుఁగుచేత, వైశాఖపట్టణము గరుడా సుందర రామయ్యగారి స్వకీయ శ్రీ వేణుగోపాల ముద్రాక్షరశాలా ప్రచురితము, 1866.

లక్ష్యములు. మీఁది ఉదాహృతులలో హకారాదులు ప్రాథమికములని పూర్వప్రకరణముల నిర్ధారితము. ఇట్టి కొన్ని అజాది రూపములకు హకారాది మాతృకలందు సాదృశ్యము వలన, నిసర్గముగా అజాదులగు రూపములకును హకారాది మూర్తులు సృష్టింపఁబడుటయే కృతక ప్రామాణికమని ఇట వ్యవహృతము. ఇట్టి పదజాలము, వ్యుత్పత్తి స్వభావము ననుసరించి తత్సమములు, తద్భవములు, దేశ్యములు, కన్నడపదములు, అన్యదేశ్యములు. ఆంగ్లపదములు అను ఆఱు ఉపశీర్షికల క్రింద వివృతము.

I. తత్సమములు : వీనికి కావ్యప్రయోగములు మృగ్యము. వ్యావహారికాంధ్ర పద ప్రదర్శినియగు బ్రౌణ్యమునుండి ఒకకొన్ని మాటలు.

1. హంశ : < అంశ (బ్రౌణ్యము, పు. 1121).

2. హంశము : < అంశము (మిశ్రబ్రౌణ్యము, పు. 128).

3. హాశ్చర్యము : < ఆశ్చర్యము (బ్రౌణ్యము, – పు. 1129).

4. హీర్ష్య < ఈర్ష్య (పైది, పు. 1131).

II. తద్భవములు : 1. హాక్రోసు : పగ, ఈర్ష్య < అక్రోసము, అక్రోసు : కోపము

ప్రాకృత. అక్కోస :— కటువచనము, భర్త్సనము.

సంస్కృత. ఆక్రోశ :— ఆక్షేపము, తిట్టు శాపము ; అపవాదము. అపవాది 'ఐ' 'అ' గా మాఱుట ధ్వని పరిణామ సూత్రబద్ధము. తెలుఁగు, సంతసము, సంతోసము, సంతొసము < ప్రాకృత. సంతోస – < సంస్కృత. సంతోష–; తెలుఁగు, అందలము < ప్రాకృత. అందోల- < సంస్కృత అందోల – ఆందోల–'హాక్రోసు' హిందీ పదమను పూర్వ పరిశీలకుల నిర్ణయము (మిశ్రబ్రౌణ్యము, పు. 128. శ. ర. (1912). పు. 1123 : డా, చిలుకూరి, ఆంధ్ర భాషాచరిత్రము, పు. 508, ది. వేం. శివరావు, వ్యవహారకోశము, పు. 166) చింత్యము.

2. హారతి : < ఆరతి. 'పరవిప్ర కాంతలు పడితోడవచ్చి - హారతు లిచ్చినారానంద మొదవ' (పల్నాటి. పు. 61). 'నిశానతి హారతింబట్టు' (రాజశే విలాస, 1-182), 'హారతి పళ్ళెరంబుల మృగాక్షులు...' (కళా. 4-5), 'సైరంధ్రి పుణ్యావసంబునఁ బొందిన హరికిని మంగళ హారతులెత్తును' (హంస. 4-214).

ప్రాకృత. ఆరత్తియ-

సంస్కృత. ఆరాత్రిక-

'హారతి' ఆరతికి మొదటి రూప' మను శ. ర. వ్రాఁత అగ్రాహ్యము[40].

III. దేశ్యములు : 1. హడలు : బెదరు, భీతి < అడలు : బాధ ; భయము ; శోకము.

2. హౌర : < ఔర (బ్రౌణ్యము, పు. 1137).

IV. కన్నడము : హెచ్చరిక : ప్రభువుల యవధానమునకై వేత్రధరులుపయోగించు మాట, 'హెచ్చరికయ్యె స్వామి పరాకీశపరాకు' (కృష్ణరా. 2-110), 'హెచ్చరిక దెలుపు' (తారా శ. 3-28), స్వామి పరాకవధారు దేవ హెచ్చరిక' (దశా. 1-234) ; అవధానము, జాగ్రత్త 'తెచ్చుకోలగు హెచ్చరిక' (శుక. 3-304).

కన్నడ. ఎచ్చరికె : జాగ్రత్త ; ప్రబోధము ; ఎచ్చరిసు : ఎచ్చరించు, ప్రబోధించు ; ఎచ్చరు. కన్నడమున దీని హకారాది రూపములేదు.

హెచ్చు ( < క. హెచ్చు. పెచ్చు. పెర్చు), హెచ్చరిక ( < క. ఎచ్చరికె, ఎచ్చరు)లు ఏకధాతు జన్యములు కావనుట స్పష్టము. 'హెచ్చరిక' 'హెచ్చరించు' –లు క్రమముగా 'ఎచ్చరిక', 'ఎచ్చరించు' లకు మొదటి రూపము'లను శ. ర. నిర్ణయము ప్రామాదికము. వ్యుత్పత్తిపరముగా శకటరేఫ ఘటిత మగునది సాధురూపము.

---

40. బి. సీతారామాచార్యుల వైకృత దీపిక (1900) యందు 'ఆరతి' (పు. 16), 'హారతి' (పు. 116) రెండును ఆరాత్రిక పదభవములుగా నిరూపితము లగుట గమనార్హము.

V. అన్యదేశ్యములు : 1. హంవీరుఁడు శూరుఁడు. '...సమర హంవీ రుఁడు....' (తారాశ. 5-72), 'ఖండ హంవీర తలగుండు గండ...' (శుక. 3-158). 'మంచి హంవీరతాయెతులు...' (హంస. 5-360), 'అచ్చన హంవీ రుఁడు' (అం. భా. 1-17), 'మన్నె హంవీర పెరమన్నె మదవిభాళ' (రంగా. 1-130). 'మన్నె హంవీరులు' (పద్మనాభ యుద్ధము. 26), '...హంవీరుఁ డితండు నాఁజనుము విష్ణుపురానకు...' (పైడి. 177); కొమార హంవీర 'మహా పాత్రుని' (ద. హిం. శా. vi. 248; క్రీ. శ, 1515).

మరాఠీ. అమీర్ : ముఖ్యుఁడు ; శాసకుఁడు.

పారసీ. అమీర్ : ఉలీనుఁడు ; రాష్ట్రాధికారి ; శాసకుఁడు ; రాజులు మంత్రులకు ప్రసాదించు ఒక బిరుదము ; అమిర్ : శాసకుఁడు ; అమారత్ : అమీర్ పదవి ; ప్రభుత్వము : పరిపాలనము.

'హంవీర' – సంస్కృత మను శబ్దరత్నాకరాదుల నిర్ణయము అగ్రా హ్యము.

2. హస్తిభారము : బునాది. '...మేటపు లెత్తి హత్తి బలిమిం గదపా రల హస్తిభారమున్ – దీరిన జంగరాళ్ళు పరఁడీసి...' (పెదశ్రిరి విజయము, పు. 54).

అస్తిభారము, ఆస్థిభారము : అడుగుమట్టు, పునాది. సంస్కృత. 'హస్తి భార –'కు వికృతి యని బ్రౌణ్యము–హస్తిభారము అను ఆరోపమును బ్రౌణ్య మున ఉట్టంకితము41. సంస్కృతమున నిది మృగ్యము.

---

41. బ్రౌణ్యము ప్రథమ ముద్రణము (1852) న అస్తిభారము, అస్థిభారము (పు. 54) హస్తిభారము, హస్తిభారము, హస్తివారము (పు. 1128) లు సంస్కృత పదములను సూచనలేదు. బ్రౌణ్యము పరిష్కృత ముద్రణమున 'హస్తి' ( = ఏనుఁగు) అను ప్రధానారోపము (Main entry) క్రింద ఉపారోపము (Sub entry) గా 'హస్తిభారము' ప్రదర్శిత మగుటను బట్టి చూడఁగా నిది పరిష్కర్తల (మల్లాది వెంకట రత్నము, రావువిహద్దుట కందుకూరి వీరేశలింగము పంతులుగారల) దృష్టిలో (చూ. పు. 1393) సంస్కృత మనుట స్పష్టము.

పారసి. ఉస్తువార్ : దృఢము, స్థిరము, బలిష్ఠము ; పరిపూర్ణత ; ఉస్తువారీ : బలము ; స్థిరము ; స్థైర్యము ; దృఢీకరణము, సమర్థనము.

తమిళాది ద్రావిడ భాషానిఘంటువులయం దీ పదము విజాతీయముగా పరిగణితము.

తమిళ. అస్తిపారం, అస్తివారం < ఉర్దూ. ఉస్తువార్ : బునాది (Tamil Lex. p. 200.)

కన్నడ. అస్తిభార, అస్తివార : బునాది (కిట్టెల్, పు. 132).

3 హిజారు : కాలికి తొడిగికొను చట్ట. 'పసరు పట్టు హిజారు మిసమిసలు జాతకొల్మెలుఁగుటంగికి వింత యొఱపునింప' (శుక. 1_249), 'బంగరు ప్రాఁతల పట్టు హిజారు' (వైది, 2_427). 'సాలవదింట్లు పావలు హిజారులు కత్తులునే జలాయుధాల్ వేలకొలంది...' (పెదగ్గిరి విజయము, పు. 63), 'పొగడ హిజారు చెంగలువ బొందలము' (హంస. 4_86); 'జఘన దేశముల హిజారులమర' (కువల. 1_86).

పారసి. ఇజార్ : మోకాళ్ళదాఁక సరిపడునట్లు లినెన్, మజ్లిన్ గుడ్డతో తయారు చేసిన ముసుగు : ఇజారత్ : లోపావడ ; ఇజార్‌బంద్ : పంట్లాము, గుడిగి ; దేరాగుద్దారపుటంచు.

'హిజారు,' ఇజారునకు మొదటి రూపమను ప్రాఁత అగ్రాహ్యము.

4. హిరాకి : వాహనము, గుఱ్ఱము, ఇరాకీ సీమనుండి కొనితెచ్చిన గుఱ్ఱము. 'రహిఁగ నటియించు చిలుక హిరాకినెక్కి_మదన పాదుశా హొసంతు గదలె నపుడు' (అనిరుద్ధ 3_19).

పారసి. ఈరాక్, యూఫ్రటిస్ టైగ్రిస్ నదుల మధ్య, సౌదీ అరేబియాకు ఉత్తరముగా, ఇరాన్‌కు పడమరగాఁ గల దేశము ; ఈరాకీ : ఇరాక్ దేశమునకు సంబంధించిన.

5. హిరాణీ : ఈరానీ జాతీయుఁడు. ఈరానీ దేశ సంబంధి. '...మహో కాలుండైనను గాలుఁడైన నెదురంగా నో పరిచ్ఛేట మన్నిలంచున్ బలుకంగ నేటికి షరాణీలన్ హిరాణి తురాణీలన్ గోటను జిమ్మలేదె మును...' (రంగా. 2-38).

పారసి; ఈరానీ : ఇరాను దేశసంబంధి.

6. హూజుబెక్ : ఉజ్‌బెక్ (గ్) దేశ సంబంధి; ఉజ్‌బెక్ జాతీయుఁడు. 'హూజు బెక్కొమారుసియోజకొజారును బుతము జారెడు సగల్ దొపిగినాడు' (జగన్నా. 1-90. ప్రౌఢ్యాసు ప్ర. మ. పృ. 1132 న ఉట్టంకితము). మన సాహిత్యమున ప్రసిద్ధమగు సామాను దేశ మిదియే. అర్వాచీన కోశముల నీ యాలోపము పరిహృతమగుట చింత్యము.

పారసి. ఉజ్‌బెక్ ; అఫ్ఘన్ స్తానమునకు ఉత్తరదిశను సోవియెట్ రష్యాలోని ఒక రాష్ట్రము ; ఉజ్‌బెక్ జాతి.

VI. ఆంగ్లపదము : హింగ్లీజు : ఇంగ్లీషు, 'ప్రాంసు హింగ్లీజు దిన మార్గ మెలుంగ ....' (రంగరాట్. పీఠిక, 58).

VII. ధ్వన్యనుకరణములు : 42 1. హో : ఆశ్చర్యాది సూచకము. 'హోయనుచుం బలినోళ్ళఁ దెఱచి యఱచెం బెలుచన్' (అరణ్య 7-136). హో తెలిసికొంటిన్' (ఉ. రా. 2-205). 'వైభవముగాంచి హోయంచు వడిఁ దడించు' (హంస. 3-205). 'హో యటంచు సుమశయ్యన్ వ్రాలె' (విజయ సంపద విలాసము, ద్వితీయా. పృ. 60).

హోహో : 'హో' కు ద్విరుక్తి. 'హోహోధ్వను లెసంగ (ఆది. 6-86). 'హోహోస్వనము లెసఁగ' (అరణ్య. 1-162). 'హోహోరవంబు లెసఁగ (మౌసల. 145). 'అప్పీరుండు...హోహోయనుటయు...' (ఉ. హరి. 3-64).

---

42. ఈ ధ్వన్యనుకరణములు కొన్ని సంస్కృతాది భాషలయందును ఉపయుక్తము. ధ్వన్యనుకరణ శబ్దములు ఏదో యొక భాషకు పరిమితమనుట సత్యదూరము.

3. హాహా : గుఱ్ఱముల నదల్చుటయం దుపయుక్తము. 'హాహా యన నదల్చి' (సిరిప్రగడ తిమ్మయ కృతమగు నలచరిత్రము, 3-21).

4. హుమ్ము : హుంకారము. 'కాగి హుమ్మని యనుచు యుద్ధంబు సడఁక' (నృసిం. 4-190), 'హుమ్మని యదలించు నొక్కొయింతి' (కాశీ. 2-18).

హుమ్మురు : చూ. హుమ్ము. 'పరువంపుఁ జిగురాకు పాఱఁజేకొని లేచి హుమ్మురంచు నురమ్ముఁ గ్రుమ్మడాన' (కృ. శకుం. 2-227).

5. హూ : ఆవులించుటయందగు ధ్వన్యనుకరణము. 'ఒడిగిఁటి కను విచ్చి హూయని బిట్టావులించి' (అరణ్య. 1-94).

6. హూత్ : 'వుడత వుడత హూత్' (చిన్నపిల్లల గేయము).

7. హూహూ : చలియం దగు ధ్వన్యనుకరణము. 'జనులు హూహూ యను చలివేళఁ గుత్తుకబంటితోయముల లోపల వసించి' (భాగ. 4-648).

8. హే : ప్రభువులకు ఎచ్చరికఁ దెలుపునట్లు వేత్రధరులు వాడునది. 'ఎచ్చరిక పరాకు హేయనుచు వేత్రధరాలి పల్కా...' (సిరి ప్రగడ తిమ్మయ కృతమగు నలచరిత్రము, 2-84).

9. హో : ఆశ్చర్యాది సూచకము. 'అలఘు నిశాత శస్త్రమున నంగము లెల్లను నిర్వికారుఁడై యొలువఁ దొడంగె నట్టియెడ హోయని కిన్నర యక్షసిద్ధ సాధ్యులు... పుష్ప వృష్టిఁ గురియించిరి కడ్డపయిన్...' (అరణ్య. 7-374), 'ఎంత దయగలవాఁడు సర్వేశ్వరుండు హోయటంచును నిష్ఠతో నుండుసంత' (పలా. 1-170).

10. హోరు : గాలి, వాన, సముద్రము మొదలగు వాని కదలికకు సంబంధించిన ధ్వన్యనుకరణము. 'కడవ వంచినట్లు హోరని ధారౌఘమైక్య మొందె' (ఆము. 4-91), 'మహాగిరుల్ హోరన' (పైడి. 6-47), 'ఘన ఘనా ఘన సంఘ మవ్విధమునఁ బూని హోరున బెడిదంపు వాన గురియ' (కాశీ. 4-88).

మందకు మందసు అమ్మగా మిగిలిన మేఁకవంటిది 'హైసరే' ఇది మెచ్చికోలును దెలుపుమాట: 'మందహాసంబుల యందంబు హైసరే...' (వాల్మీకి. ద్వితీయా. పు. 50). 'మైసిరి హైసరే' (తారా. 3-28), 'హైసరే యతని పేరవిన మాత్రమునసే కురుదేశ మేల్రాజు గుండె లదరె' (కృష్ణరా. 2-45), 'హైసరే హృదయాపహారమో మౌక్తికహారమో యెలనాగ యలఁతి నవ్వు' (వైది. 4-84). 'హైసరే సరే యటం చనంగ యథార్థముగను' (ఆం. భా. 8-75). 'హై + సరే యని విడదీసి, 'హై' 'హే' వలె సంబుద్ధి వాచక మనఁగునా? ఇంతకును ఇది అనుకల్పి వ్యుత్పత్తి యథార్థ వ్యుత్పత్తి యింకను విచార్యము. హైసరుదొజ్జ (ఆం. వాచా. 2835) అను గోదావరి మాండలికము 'హైసరేమజ్జా' కు వికృతి.

# శ్రీనాథయుగము – అన్యాదేశ్యములు

ఆంధ్ర సాహిత్యమున శ్రీనాథయుగ మనఁగా క్రీ. శ. 1350–1500 మధ్యకాలమని వేత్తల భావన. శ్రీనాథుఁడు క్రీ శ. 1370 ప్రాంతమున జన్మించి, చిన్నారి పొన్నారి చిరుత కూకటి నాఁటి నుండియు సాహితీ వ్యవసాయము సాగించినను, ఉపలబ్ధములగు ఆయన కృతులన్నియు పదునైదవ శతాబ్ది ప్రథమ భాగమునందే ఆకృతి దిద్దుకొనినవి కావున ప్రస్తుత సమాలోచనమున క్రీ. శ. 1400–1500 నడిమి కాలము శ్రీనాథ యుగమని వ్యవహృతము. కోశమును చూడు, అథవా, దేశమును చూడు అను నర్థమున కన్నడమున ఒక సామెత. రెంటిని చూచి, శాస్త్రజన్య జ్ఞానమును స్వానుభవముతో మేళవించి, అష్టభాషా భారతీ సందర్శ సౌభాగ్య గరిమంబు సంగ్రహించిన శ్రీనాథుని సాహితీ సమారాధనము ఆంధ్ర శారదా భాగధేయము. కవిసార్వభౌముని ఆదరించిన సాహితీ పోషకు లందరును హేమా హేమీలు. విస్సనమంత్రి పంక్తిని హేమ పాత్రాన్నము నారగించి, తెనుంగు రాయ రాహుత్తుఁడిచ్చిన కస్తూరిని సేవించి, వీరభద్రారెడ్డి యొసంగిన రత్నాంబరములు ధరించి, సర్వజ్ఞ చక్రవర్తి బిరుదాంచితులగు రెడ్డిరాజుల విద్యాధికారిగా బహుదేశ బుధులతో విద్యాపరీక్షణ వేళలందు భాషించి, ఉద్భటవివాద ప్రౌఢి గౌడడిండిమభట్టు కంచుఢక్కా పగులఁగొట్టించి, కర్ణాట క్షితి పాలమౌక్తిక సభాగారాంతరా కల్పిత స్వర్ణస్నాన గతి ప్రసిద్ధివహించి, రావుసింగమహీపాలు నిండుకొలువున మన్ననలంది ఇట్లు తెలుఁగునేల నాలుగు చెరఁగులు తిరిగి, సీమ సీమల తీరుతీయము లెఱింగి, శబ్దార్థగౌరవ శక్తి మరగి, మధురార్థ శ్రీకముగా, ఉక్తి ప్రగల్భ సమీహితముగా తన కృతులను దిద్ది తీర్చి, సమకాలీన కవులను సైతము ప్రభావితము చేసిన ఉత్తమ సాహితీశిల్పి శ్రీనాథుఁడు. ఈ యుగమున సాహితీరథసారథిగా వెలసిన శ్రీనాథుని కృతులు అయిదు – శృంగార నైషధము, భీమేశ్వర పురాణము, కాశీఖండము, హరవిలాసము, శివరాత్రి మహాత్మ్యము – ఇవి అయిదును

శ్రీనాథకృతములనుట నిర్వివాదము. క్రీడాభిరామకర్తృత్వము వివాదగ్రస్తమయి నను, శ్రీనాథయుగ రచనముగా నిష్కర్షించుట నిర్బాధము. పల్నాటి వీరచరిత్రము శ్రీనాథ కృతమనుటకును, అసలా యుగరచన మనుటకును బలమయిన ప్రమాణములు తక్కువ. శ్రీనాథునిపేర 'చెలామణి' యగుచున్న చాటు సాహిత్యమంతయు తత్కృతమని గట్టిగా చెప్పుట కష్టము. అంతా కాకపోయినను, చాలా పాలు ఆయన గంటపు టొరవడుల పంటయని పండిత పరిశోధకుల విశ్వాసము. దీని శయ్యావైయాత్యమును, పండిత పరంపరా యాతప్రతీతియును ఇది శ్రీనాథప్రణీతమనుటకు హేతువులు. శ్రీనాథ చాటువులకు అసంపూర్ణమయిన అర్వాచీన రూపము వీధి నాటకము. తక్కిన మరుత్తరాట్చరిత్రాదులు నామమాత్రావశిష్టములు. చిన్నకోట పెద్దన, మడికిసింగన, కొలని గణపతిదేవుడు, నిశ్శంక కొమ్మన, పేరంరాజు జక్కన, అనంతుడు, వెన్నెలకంటి అన్నయ్య శ్రీనాథ యుగమున తొలిసగమునకు చెందినవారు. బమ్మెర పోతన, ప్రౌఢకవి మల్లన, కొఱవి గోపరాజు, గౌరన, పిల్లలమఱ్ఱి పిన వీరభద్రుడు, దూబగుంట నారాయణకవి, బైచరాజు వేంకటనాథుడు, దగ్గుపల్లి దుగ్గన, నంది మల్లయ-ఘంట సింగయలు మలి సగమునకు చెందినవారు. భాస్కర రామాయణములోని యుద్ధకాండ శేషకర్తయగు అయ్యలార్యుడు దేవరకొండ రాచవారికి ఆశ్రితుడగుటవలన క్రీ. శ. 14[illegible] ప్రాంతమున వాడని మల్లంపల్లి వారి నిర్ణయము[1] ప్రమాణముగా ఒకటి రెండు అయ్యలార్యుని ప్రయోగములు నైతే ఈ కృషిలో స్వీకృతములు. వెన్నెలకంటి సూరన కృత విష్ణుపురాణ కృతిపతి యగు రావూరి బసవయ రాఘవరెడ్డి క్రీ. శ. 1528 ప్రాంతము వాడని నిర్ణీత మగుటచే తత్కృతియందు ప్రయుక్తములయిన అన్యదేశ్యములిందు పరిహృతములు. నాచికేతూపాఖ్యాన ప్రబోధ చంద్రోదయ కావ్యములకు కృతిపతి చెందలూరి అనంతామాత్యుని గంగయ మంత్రి[2] కావున దగ్గుపల్లి దుగ్గనయు, నంది మల్లయ-ఘంట సింగయలు, సమ్మ సమకాలికులు. తాళ్ళపాక అన్నమయ్య నూటికి నూఱుపాళ్ళు పదునైదవ శతాబ్దివాడు. ఫణిభట్టు, భైరవ

1. M. Somasekhara Sarma, History of the Reddi Kingdoms pp. 532, 533.

2. 'ప్రఖ్యాత నాచికేతూ-పాఖ్యాన మహాప్రబంధ పరిమళిత సుధీ-వ్యాఖ్యాన-ప్రవర్ధిత - సౌఖ్య, సంఘటిత చిత్త శంకరసద్మా!' (ప్రబోధ. 4-71).

కవి రచనములు వెలయ్యగినవగునాయనిశంక. అయినను పూర్వపరిశీలకుల నిర్ణయము ననుసరించి ఈ రచనలను ప్రస్తుత చర్చలో ఉదాహ్మృతములు.

పారసీకాద్యన్య దేశభాషలనుండి ప్రత్యక్షముగాఁగాని, పరోక్షముగా మరాఠీభాషాముఖముగాఁగాని తెలుఁగునఁ జేరినపదములును, మరాఠీభాషకు నిసర్గములయి సంసర్గవశమున తెలుఁగునఁ బ్రవేశించిన పదములును అన్యదేశ్యము లని ఈ వ్యాసమున పరిమితార్థమున ప్రయుక్తము. ఈ వ్యాసము చివరి పట్టిక లోని పదములలో ముక్కాలుపాలు పారసీకాద్యన్య దేశభాషలకు నిసర్గములు. మిక్కిలినవి మహారాష్ట్రి ప్రాకృతజన్యమగు మరాఠీభాషాస్వత్వములు. ఈ యా పదములు హిందూస్థానీ జన్యములని పూర్వ పరిశీలకుల మతము. ఉర్దూపాలెక్కువయున సంకీర్ణహిందీ భాషను 'హిందూస్థానీ' యని వ్యవహరించు పరిభాష ఆంగ్లుల రాకతో మూర్తి కట్టుట. హిందీభాషగాని, దీని మాండలికములుగా సంభావ్యము లగుచున్న అవధీ, బ్రజ, మైథిలీ, ఖడీ బోలీ మొదలగునవిగాని హిందీభాషా వికృతియగు హిందూస్తానీగాని ఆంధ్రుల చరిత్రమునను, సాహిత్యమునను అప్రసక్తములు. అర్వాచీన యుగముల మాండలిక పరముగా 'ఉర్దూ' భాషా ప్రభావము లేకపోలేదు. శ్రీనాథ యుగమునాఁటికి 'ఉర్దూ' అలు మొలక లేని సోమలింగము. 'జాతీయ కాంగ్రెసు' ప్రోద్బలమున, దక్షిణ భారత హిందీ ప్రచారసభ పక్షమున ఇరువదియవ శతాబ్ది ద్వితీయ పాదమున ప్రచారము ప్రారంభమగు దాఁక, హిందీ భాషతోఁగాని, తద్వ్యవహార ప్రాంతముతోఁగాని తెలుఁగు జనులకు సంబంధ బాంధవములు మృగ్యము. నాఁటికి నేటికి హిందీ, తెలుఁగునకు పరిసరస్థభాషకాదు. కావున, ప్రాక్కాలికమగు హిందీ బాంధవ మును నిర్వహింప నుద్యోగించుట నిష్ప్రయోజనము; తెలుఁగు నందలి మధ్య యుగ నాన్యదేశ్యములకు హిందీతోడి సమీప మాతృకతను స్థాపింప సమకట్టుట నిరాధారము. కాని, మరాఠ్వాడా–తెలుఁగు నాడులకుఁగల సంబంధ బాంధవ ములు ఇక్ష్వాకుల తాత ముత్తాతల నాటివి. పైపెచ్చు తెలుఁగు – మరాఠీలు భౌగోళికముగా పరిసరభాషలు. శాతవాహన చక్రవర్తులనాఁడు ఇంచు మించు నన్నూఱేండ్లపాటు మరాఠ్వాడా, తెలుఁగు నాడులు ఒక గొడుగునీడ కూడి మాడి యుండుట జగమెఱిఁగిన చరిత్ర. మరాఠ్వాడాను ఏకాతపత్రముగా శాసించిన పశ్చిమ చాళుక్య వంశీయుల ఒక రెమ్మయేకదా సాగరాంధ్రసీమల వేంగీ రాజ మహేంద్ర పురములు ఆలవాలములుగా ప్రాచ్య చాళుక్య శాఖగా పరిఢవిల్లుట;

నెల్లూరి '...మన్నవిభు పంపైచన్న సైన్యంబు '...మహారాష్ట్ర సామంతు సారంగుండోలి తురంగముంగొనిన సంగ్రామము'' (నిర్వచనో. 1-48), తెలుఁగు మరాఠీల సరాసరి సంబంధములకు ఒక చక్కని నిదర్శనము. యాదవ రాజుల పరిపాలన కాలము మరాఠ్వాడా చరిత్రలో స్వర్ణయుగము. దేవగిరి యాదవరాజులలో రామచంద్రదేవుఁడు (క్రీ. శ. 1271-1309) సుప్రసిద్ధుఁడు. ఇతని మహామాత్యుఁడే హేమాద్రి. క్రీ. శ. 1277 నాఁటి పంఢరాపురశిలాశాసనమునను, క్రీ. శ. 1279 నాఁటి ఉణ్ణాక దేవ శిలాశాసనము (ఆదిలాబాదు మండలము) నను కీర్తితుఁడయిన మహాప్రౌఢ ప్రతాప చక్రవర్తి శ్రీరామచంద్రదేవుని మహాప్రధాని హేమాడియును, చతుర్వర్గ చింతామణికర్తయగు హేమాద్రి పండితుఁడును అభిన్నులని చరిత్రకారుల నిర్ణయము. వ్రతదాన తీర్థమోక్ష పరిశేషములను నైదు ఖండముల సంగ్రథిత మయిన విజ్ఞాన సర్వస్వము చతుర్వర్గ చింతామణి. యాదవ రాజుల దేవగిరికి, త్రిలింగ పరమేశ్వరుల ఓరుగంటికిఁగల రాజకీయ సంబంధములు చిరకాల సమీచీనములు. కాకతీయ చక్రవర్తుల కొలువులో మెలఁగి, పాలకుల మెప్పుఁగొన నెఱింగిన రాజనీతి చతురుఁడు ప్రోలయ వేమారెడ్డి (1300-1353); ఓరుగంటి పతనముతో మధ్యాంధ్ర మహీ మండలమున స్వతంత్ర పతాకమెత్తిన ఈ రెడ్డి ప్రభువు రెడ్డిరాజుల కుదురునకు మూలపురుషుఁడు. రెడ్డిరాజులకు ఒకటి రెండు తరములు పూర్వుఁడయిన హేమాద్రి పండితుని చతుర్వర్గ చింతామణికి సాగరాంధ్ర సీమలో నుండిన ప్రచార ప్రభావములు అనన్వయము. చతుర్వర్గ చింతామణి త్రిలింగ రాజ పరమేశ్వరు (కాశీ. 3-248) అగు రెడ్డి ప్రభువుల నిత్యానుష్ఠానములకు ప్రమాణ గ్రంథముగా చెల్లుబడి యగుచుండి నట్లును, అది వీరి విమల చారిత్ర శిక్షకాచార్యకము వహించి నట్లును ప్రమాణములు కోకొల్లలు. రెడ్డిరాజు లందఱును హేమాద్రి ప్రోక్తదాన పరులు. హరివంశ కృతిపతియగు ప్రోలయ వేమారెడ్డి 'హేమాద్రి' పరికీర్తితాంచిత వ్రతదాన నివహంబులన్నియు నిర్వహించె' (హరివంశము. పీఠిక, 19) నని ఎఱ్ఱాప్రెగ్గడ ప్రశంస. ప్రోలయ వేమారెడ్డి తనయుఁడు అనవేమారెడ్డి (1364-1386) 'హేమాద్రి దాననిరతి' బిరుదాంకితుఁడు (చూ. శ్రీశైల శాసనము, A. R. No. 20 of 1915; క్రీ. శ. 1377; 132వ పంక్తి) అనపోతారెడ్డి కుమారుఁడగు కుమారగిరి రెడ్డి (1386-1402) యును (చూ. తంగెడ శాసనము, A. R. No. 380

of 1926 ; క్రీ. శ. 1391 ; 3 వ పంక్తి), కొండవీటి పెదకోమటి వేమారెడ్డి (1402-1420) తనయుఁడగు రాచ వేమారెడ్డి (1421-1424) యును (చూ. ఆకునపాడ శాసనము. A. R No. 543 of 1909 ; క్రీ. శ. 1415 : 3వ పంక్తి), వీరభద్రారెడ్డి జనకుఁడగు దొడ్డమరెడ్డి అల్లాడరెడ్డి యును (చూ. పలివెల కొప్పేశ్వరస్వామిదేవాలయ కల్యాణ మంటప స్తంభము మీఁది శాసనము, A. R. No. 503 of 1893 ; క్రీ. శ. 1416 : 41 ; 42 పంక్తులు) 'హేమాద్రి దానచింతామణి' బిరుద విరాజితులుగా కీర్తితులు — వీరభద్రారెడ్డి అగ్రజుఁడు. కాశీఖండకారయిత'.... వేమాంబాల్లమహీశ భాగ్య విభవో వేమ క్షమా ధీశ్వరః...హేమాద్రి దానాని సదాకరోతి...' (చూ. దాక్షారామ శాసనము, A. R. No. 448 of 1893 : 4, 5, 6...8, 9 పంక్తులు). ఈ అల్లయ వేమారెడ్డియే '...హేమాద్రి దానక్రియా మహత్వంబున విప్రుల నతి దశాన్వితులఁ జేయు ...' నని నిశ్శంక కొమ్మన సాక్ష్యము (చూ. శివలీలా విలాసపీఠిక). కాశీఖండకృతిపతియగు అల్లాడ వీరభద్రయ్య 'హేమాద్రి దానదీక్షితుఁ...' డని రెడ్డిరాజుల విద్యాధికారి శ్రీనాథుని కైవారము (చూ., కాశీ. 5-1). ఈ వీరభద్రయ్యయే 'హేమాద్రి దాన దీక్షా గరిష్ఠుఁడు'గా శివలీలా విలాసకర్తచే కీర్తితుఁడు. వీరభద్రారెడ్డి అనుజన్ముఁడును, శివలీలావిలాస కృతిభర్తయును అగు దొడ్డారెడ్డియును 'హేమాద్రి విశిష్టా దానపరుఁడు'గా వర్ణితుఁడు. ఈ బిరుదములు కేవలము కుల క్రమాగతములని కొట్టివేయ వీలులేదు. ఇవి రెడ్డిరాజుల వితరణ గుణప్రవర్తకము లయి, ప్రతిపద సార్థకములయిన బిరుదములని వారి శాసనాదికములు ప్రత్యక్ష సాక్ష్యము.

బహమనీ సామ్రాజ్యము ప్రబలగు నాఁటికి మహారాష్ట్ర తెలంగాణము లొక యేలుబడిలోని మండలములు. మరాఠీభాషయు, తద్వ్యవహర్తలును 'ఆరెము,' 'ఆరె' అను పేరులతో తెలుఁగున వ్యవహృతమగుటకు మున్నె యుగములనుండియు ప్రమాణములు పెక్కులు. పండితారాధ్య చరిత్రయందలి 'ఆరె' మయసనదకలు సుప్రసిద్ధములు (పుటలు, 381-387, పర్వత ప్రకరణము). '...ఆరెలుఁ గన్నడీల రవణుఁ దెలుఁగులుఁ దన బిరుదందియఁ దగిలి కొలువ నెగడి....' (ద్వి. 1-42) ననువాఁడు నవద్రోలి వెన్నయ మంత్రి. ఈ వెన్నయ, వెలనాటి చోడవంశీయుఁడగు గొంకనృపాలుని మంత్రి : పదుమూఁడవ శతాబ్ది

వాఁడు. సింహాసన ద్వాత్రింశిక కర్తయగు కొఱవిగోపరాజు ఈ పెన్నయ మంత్రి కేశవు తరమువాఁడు. తెలుఁగు సీమలో రెడ్డి ( = మునసబు లేక పటేలు), కరణము ( = పట్వారి), షెట్టి, తలారి మొదలగు పండ్రెండుగురు గ్రామోద్యోగులను 'బారా బలూతి' (<మరాఠీ. బారా = పండ్రెండు; బలుతేఁ = గ్రామోద్యోగుల హక్కు) అని వ్యవహరించు ఆచారము మహా రాష్ట్రీలది. నిన్న మొన్నటి దాఁక పశ్చిమాంధ్ర ప్రాంతముల ప్రబల ప్రచారములోనుండిన 'బాళబోధ్' లేక 'బాళబంధు' లిపి సంప్రదాయము మహారాష్ట్రీ ప్రభావమునకు మఱియొక మచ్చుతునుక. తెలుఁగువారు కొందరు తమ పేళ్ళ చివర తగిలించుకొను 'రావు' (పేష్వాబాజీరావు, జీవాజిరావు సిందియా, మురారి రావు ఘోర్పడే, యశ్వంతరావు హోల్కార్) మరాఠీ వారిది. ఆంధ్రలో - ముఖ్యముగా కర్నూలు, కాకినాడ, గుంతకల్లు పరిసరముల యందలి తోలుబొమ్మ లాటలవారు మహారాష్ట్రులు. తెలుఁగు సీమలోని సంచార జీవులగు సుగాలీలు ( = తండాలు, లంబాడీలు) మరాఠీ-గుజరాతి జాతులకు చెందినవారు ; మరాఠీ-గుజరాతి భాషాసమ్మిశ్రమముతో, స్థానిక భాషాసాహచర్యముతో వికృతినందిన వాగ్రూప వ్యవహారము వీరి భాష, పత్తికొండ సీమకు చెందిన 'ఆరె మరాఠీల' కథయు, పానుగంటి సీమకు చెందిన 'మాయలమరాఠీ' కథయు తెలుఁగులకు సుపరిచితము. తెలుఁగు కన్నడిగుల ఉగాదియును, మరాఠీల ఉగాదియును ఒక్కనాడు, ఏ కారణము వలననో గాని తెలుఁగులతోపాటు మరాఠీలును పంచద్రావిడులుగా పరిగణితులు. ఇంకను, ఇట్టి చిల్లర మల్లర పోలికలు సవాలక్ష. ఇది సంక్షేప రూపమయిన చరిత్ర. అనాదియును, అవిచ్ఛిన్నమును అయిన ఇట్టి సమీపసంసర్గ సంబంధము వలన ఈ రెండు ప్రాంతములలోని వ్యవహారభాషలు పరస్పరము ప్రభావితమైయుండు నసుట నిర్వివాద విషయము. తొలినాళ్ళలోని ఆదాన ప్రదానముల మహారాష్ట్రీప్రాకృతము ప్రముఖపాత్ర వహించినట్లు చరిత్ర. మహారాష్ట్రీప్రాకృత పుత్రికయగు మరాఠీ పండ్రెడవు శతాబ్దాంతమునఁ గాని సాహిత్యస్థాయినందికొనలేదు4. ఆమాటకు వచ్చినచో, పండ్రెండవు శతాబ్దికి

3. తిరుమల రామచంద్ర, మనలిపి పుట్టుపూర్వోత్తరాలు, పుటలు 164-166.

4. శ్రమణబెళగుళ (క్రీ. శ. 983), దివే అగర (క్రీ. శ. 1060), ఆంబేజోగాఇ (క్రీ. శ. 1144) శాసనములు మరాఠీ భాషానేపథ్యాలంకారములని కొందఱు (Vide : Prof S. G. Tulpule, An Old Marathi Reader, Poona).

పూర్వము నవీనోత్తరాహా భాషలేవియును ప్రతిపద గదినుంచి వెలికివచ్చినవి కావు. ఈ సంసర్గముకారణముగా తెలుఁగు పదములెన్నో మరాఠీ వారి నోళ్ళలో నలుగుడుపడి వ్యావహారిక రూపములుగా కోశముల కెక్కెయు, పండితకవి సమ్మతిని బడసి సాహిత్యస్థాయిని సంపాదించియు అక్షరరూపమున చిరస్థాయి యయినవి. అడకిత్తా (= అడకొత్తు), ఆటపాట (= బాలికల ఆట), ఊఁగుడి, ఓనామా, కట్టి (= అరఁగు), బసవీ, (= వేశ్య), బాగ (= బాగు), వకటి (= విటదాండు–బిళ్ళంగోడి లేక చిల్లకట్టె– ఆటలో 'ఒకటి' అను అంకె). సజ్జగురా (= సజ్జకొల్లు). ధాన్యవిశేషము–మొదలగునవి మరాఠీలో మచ్చికపడిన కొన్ని తెలుఁగు పదములు5. వీనిలో ఒక కొన్నింటికి కావ్యప్రయోగములును లేకపోలేదు. భక్తకవి యగు జ్ఞానేశ్వర (క్రీ. శ 1290) కృతమగు 'జ్ఞానేశ్వరి' (భగవద్గీతకు మరాఠీలో విపుల వ్యాఖ్యానము) యందును, మహానుభావ పంథకు చెందిన భాస్కరభట్టు కవి (క్రీ. శ. 1305) రచితమగు 'శిశుపాలవధ' యందును పూర్వోక్తములగు తెలుఁగు పదములలో కొన్ని ప్రయుక్తము. 'విటిదాండు' ఆట లెక్కింపులోని వకటి, లేండ, మూండ, నాల, అవ, వైద–అను అంకెలు క్రమముగా తెలుఁగునందలి ఒకటి, రెండు, మూడు, నాలుగు, ఆఱు, ఐదు–అనువానికి వికృతులు. మరాఠీలో ఈ యాట యందు అవ (= ఐదు), వైద (= ఆఱు) అని వ్యవహారము. మూలపదముల అర్థము తెలియమియు పరిగణన క్రమము సంపలి ఈ తబ్బిబ్బునకు మూలము. ఇట త్ర్యర్థకముగా 'మూండ' అని ప్రాచీనోచ్చారణమునకు గుఱుతుగా పూర్ణబిందు ఘటితరూపము నిర్వాహమగుట గమనార్హము ! ఆఱేడు శతాబ్దుల క్రిందటిమాట. మరాఠ్వాడాలో పండ్రెండేండ్లు వఱపు పట్టి పెద్దకఱవు రాగా. ఆరె వారు అవాల గోష్ఠాలను సుభిక్షమగు తెలుఁగు సీమకు వలసవచ్చిరట ! ఆ పండ్రెండేండ్ల నావాసము ఊరకపోలేదు. 'సోకా దొప్పియునెత్తమున్ మొదలుగా జూవంబు....' అనేటి పరిభాష యంతయు మరాఠీవారి ఆటలనుండి తెలుఁగున దిగుమతి యయినది.6 తెలుఁగు పిల్లల ఆటపాటలు మరాఠీ బిడ్డలు నేర్చిరట ! తెలుఁగు అంకెల పరిభాష కలిగిన 'విటిదాండు' దీనికి సాక్ష్యము. ఇది, మన గొప్పకు చెప్పితి

5. K. P. Kulakarni, Marathi Etymological Dictionary.

6. ఉత్తరహరివంశము, తృతీయా 120–129.

అన్యోన్య ప్రభావితా కథనము కాదు. ఇది, మరాఠీ పండితులును, చరిత్రకారు లును అంగీకరించిన యంశము ? మరాఠీయందలి ఇట్టి తెలుఁగు పదములను గూర్చి వివరించు భారము మరాఠీపండితులది. తెలుఁగునందలి మరాఠీపదములు శ్రీనాథయుగీనములు ఈ వ్యాసమున వివృతములు. తదర్వాచీన యుగీనములగు పదములు : ఉగ్రాణము మరాఠీ ఉగ్రాణ, ఉగ్రాణీ ; సంస్కృత. ఉద్గ్రాహణ (ణీ) ; చూ ప్రాకృత. ఉగ్గహాణ ; తెలుఁగు. గడమ (వ)ంచు, గెడంచు, గెడమంచ (చి). < మరాఠీ. ఘడమంచ, ఘడోంచీ < ప్రాకృత. ఘడిమంచి < సంస్కృత. ఘటమంచ (పక). ఇది దిక్ప్రదర్శనము మాత్రము 8

ఇఁక, అంయుగము నాఁటి పారసీక సంబంధము మాట : ఉత్తరాపథమున మొహమ్మద్ ఘజ్నవీ, షాహబ్-ఉద్-దీన్ మొహమ్మద్ గోరీల మొదలు దాడులు9 కడచని, ఖిల్జీసుల్తానుల (క్రీ. శ. 1290-1320) పాలన అంతరించి, తుఘ్లక్ వంశీయుల (క్రీ. శ. 1320-1414)ను సయ్యద్ వంశీయులు క్రీ. శ. (1414-1450)ను, లోడీ వంశీయులు (క్రీ. శ. 1451-1526)ను క్రమముగా ఢిల్లీ సింహాసన మధిష్ఠించిన కాలమది. ఆర్షధర్మ నిర్వాహకములుగా పెట్టని కోటలయిన దేవగిరి, ఓరుగంటి రాజ్యములు పతనము కాఁగా తండములు తండ ములుగా వచ్చు ముస్లిముల దాడుల నరికట్టుటకుగాను క్రీ. శ. 1336 లో విజయనగర సామ్రాజ్యమునకు విద్యారణ్యుల చేతి మీఁదుగా శంకుస్థాపన జరిగె, విజయ పరంపరలతో, విద్యావినోదములతో తుంగభద్రా సముత్తుంగ తరంగ రంగములు నూత్న భంగిమల నంగీకరించిన స్వర్ణయుగమది. దీనికి వక్కలో

---

7. సురవరము ప్రతాపరెడ్డి, ఆంధ్రుల సాంఘిక చరిత్ర, ద్వి. ము., పుటలు 84, 85.

8. మఱికొన్ని ఉదాహరణములకు చూ, డా. భద్రిరాజు కృష్ణమూర్తి, మాండలికవృత్తి పదకోశం (వ్యవసాయ విభాగం) ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ ప్రచురణ, 1962, పుటలు 33, 34.

9. వీరి మొఱపుదాడులవలన ఉత్తర భారత భాషలేవియును ప్రభావితము కాలేదని డా. హరదేవ్ బాహిరి నిర్ధారణము (Vide : Dr. Har Dev Bahri, Persian Influence on Hindi, pp. 3, 4). ఇట్టిచో దక్షిణభారత భాషల ప్రస్తావము అప్రస్తుతము.

అన్యోన్య ప్రభావితా కథనము కాదు. ఇది, మరాఠీ పండితులును, చరిత్రకారులును అంగీకరించిన యంశము.[7] మరాఠీయందలి ఇట్టి తెలుఁగు పదములను గూర్చి వివరించు భారము మరాఠీపండితులది. తెలుఁగునందలి మరాఠీపదములు శ్రీనాథయుగీనములు; ఆ వ్యాసమున వివృతములు. తదర్వాచీన యుగీనములగు పదములు: ఉగ్రాణము మరాఠీ ఉగ్రాణ, ఉగ్రాణే; సంస్కృత. ఉద్గ్రాహ్యాణ (జీ): మా ప్రాకృత. ఉగ్గహాణ; తెలుఁగు. గడను (వ)ంచు, గడంచు, గడమంచ (చి). <మరాఠీ. ఘడమంచ, ఘడోంచీ < ప్రాకృత. ఘడమంచ <సంస్కృత. ఘటమంచ (చకి). ఇది దిక్ప్రదర్శనము మాత్రము.[8]

ఇఁక, అనుయోగము నాఁటి సాహిత్యక సంబంధము మాట! ఉత్తరాపథమున మొహమ్మద్ ఘజ్నవీ, షహాబ్-ఉద్-దీన్ మొహమ్మద్ గోరీల మొదలు దాడులు[9] కడవని, ఖిల్జీసుల్తానుల (క్రీ. శ. 1290–1320) పాలన అంతరించి, తుగ్లక్ వంశీయుల (క్రీ. శ. 1320–1414)ను సయ్యద్ వంశీయులు (క్రీ. శ. 1414–1450)ను, లోడీ వంశీయులు (క్రీ. శ. 1451–1526)ను క్రమముగా ఢిల్లీ సింహాసన మధిష్ఠించిన కాలమది. ఆర్షధర్మ నిర్వాహకములుగా పెట్టని కోటలయిన దేవగిరి, ఓరుగంటి రాజ్యములు పతనము కాఁగా తండములు తండములుగా వచ్చు ముస్లిముల దాడుల నరికట్టుటకుగాను క్రీ. శ. 1336 లో విజయనగర సామ్రాజ్యమునకు విద్యారణ్యుల చేతి మీఁదుగా శంకుస్థాపన జరిగి, విజయ పరంపరలతో, విద్యావినోదములతో తుంగభద్రా సముత్తుంగ తరంగ రంగములు నూత్న భంగిమల సంగీకరించిన స్వర్ణయుగమది. దీనికి పక్కలో

---

7. సురవరము ప్రతాపరెడ్డి, ఆంధ్రుల సాంఘిక చరిత్ర, ద్వి. ము., పుటలు 84, 85.

8. మరికొన్ని ఉదాహరణములకు చూ. డా. భద్రిరాజు కృష్ణమూర్తి, మాండలిక వృత్తి పదకోశం (వ్యవసాయ విభాగం) ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ ప్రచురణ, 1962, పుటలు 33, 34.

9. వీరి మొదటిదాడులవలన ఉత్తర భారత భాషలేవియును ప్రభావితము కాలేదని డా. హర్‌దేవ్ బాహిరి నిర్ధారణము (Vide: Dr. Har Dev Bahri, Persian Influence on Hindi, pp. 3, 4). ఇట్టిచో దక్షిణభారత భాషల ప్రస్తావము అప్రస్తుతము.

బల్లెముగా క్రీ. శ. 1347 లో తెలుఁగు-కన్నడ నాడుల కూడలియగు 'గుల్బర్గా' రాజధానిగా బహమనీ సామ్రాజ్యము అవతరించి నిరంతర ప్రతిఘటత్వముతో ప్రభుతనిర్వహించిన స్పర్థామయ మది. కాలము, కర్మము కలసిరాక ఆంధ్ర సురత్రాణ బిరుదాంచితులగు ముసునూరి దొరల రాచసిరి తరలిపోఁగా, కొండ వీడు, రాజమహేంద్రవరములలో రెడ్డిరాజులును, రాచకొండ, దేవరకొండలలో వెలమవేఁడ్లును, అహమహమికతో రాచఱికము నెఱపిన రగడ రోజులవి. ఈ యుగమున హిందూ ముస్లిము పాలకులకు జరిగిన సంధి విగ్రహాదులు అసంఖ్యాకములు. వాని నన్నింటిని పేరుపేరున పేర్కొనవలయుచో ఇది యొక కంబరామాయణము కాఁగలదు. విస్మృతాంశములు కొన్ని ఇట విస్తృతము.

ఢిల్లీశ్వరులకు నామమాత్రపు సామంతులుగా, పాండువాపట్టణము రాజధానిగా బంగాళా సుబాను పాలించిన సుల్తానులనే శ్రీనాథుఁడు "పండువాసురతాణు'లని వ్యవహరించుట. వీరికే లఖ్నావతీ పాదుషాలనియు వ్యవహారము. వీరిలో ఘియాజ్-ఉద్-దీన్ ఆజమ్‌షా (క్రీ. శ. 1389-1410), సైఫ్-ఉద్-దీన్ హంజహ్‌షా (క్రీ. శ. 1410 - 1412), షిహాబ్-ఉద్-దీన్ బాయజీద్ షా (క్రీ. శ. 1413-1414), అలా-ఉద్-దీన్ ఫిరోజ్‌షా (క్రీ. శ. 1414-1415), జలాల్-ఉద్-దీన్ మొహమ్మద్ షా (క్రీ. శ. 1415-1431)లు శ్రీనాథునకు సమకాలికులగు 'పండువాసురతాణులు' పదునూఁడవు శతాబ్దినుండియు పండువా - కటకములకు సరిహద్దు వివాదముల మూలమున అప్పటప్పటి చిటిపొటికయ్యములు సాఁగుచుండెడివి. పండువాసురతాణులలో పూర్వుఁడగు షంష్-ఉద్-దీన్ ఇల్యాస్‌షా (క్రీ. శ. 1345-1359) ఫౌజులు 1353 లో ఒరిస్సాపై దండెత్తి చిలకసరస్సు దాఁక కూచిచేసినవి.[10] బంగాళమునకును, సాగరాంధ్రమునకును నడిమిది ఉత్కళదేశము. మధ్యాంధ్ర మహీశులగు రెడ్డిరాజులును గౌడాధిపతి గెల్చి గజపతిదళవిజాళాఖ్యాన బిరుదంబు లలవరించి.....సింహాచలోత్తరభాగలిఖిత వివిధ జయశాసనాక్షర...సమిద్ధగుణులు.'[11] రెడ్డిరాజులు, పండువాసురతాణులు ఈ ఉభయులును కటకేశ్వరులకు అహితులు. ఒకే శత్రువునకు సామాన్య శత్రువులగుట కారణముగా ఈ యుభయులును పరస్పరము

10. R. C. Mazumdar, Delhi Sultanate.

11. నిశ్శంకకొమ్మన శివలీలా విలాస పీఠిక.

హితులు; సమాన వ్యసనవ్యాపారములచే సన్నిహితులు. తన్మూలముననే 'పండువాసురతాణి పావడం బంపిన భద్రేభములు (రాజమహేంద్ర) వీధిఁ జాలె ముండు' (భీమ. 1-38; కాశీ. 1-35) టః. ఇంతేకాదు. 'పండువాడిల్లి రాఢాది పట్టణముల యధిపతులు మౌళిఁదాల్చు రత్నాంకురంబులవచి త్రిపురాంతకాసిత యానపాత్ర సింహళ ద్వీపమండల క్షేత్రజములు' (హర. పీఠిక. 29) ఈ అవచిత్రి పురాంతకుఁడు 'కామరగిరి నృపవసంతాగమ కేళిగంధసార కస్తూరీ కుంకుమ కర్పూర హిమాంభస్సముదంచిత బహుసుగంధి శాలాధ్యక్షుఁడు' (హర. పీఠిక, 30). అవునో కాదోకాని, అర్వాచీనుఁడును, కావ్యాలంకార సంగ్రహకృతిభర్తయును నగు నరసభూపాలుడు 'మక్కామండువ పండువా భయదదోర్మాహాత్మ్య' (కావ్యా. సం. 5-244) ము కలవాఁడఁట! పారసీక భాషావలంబులగు పండువా సురతాణు లిట్లు మన సాహిత్యమున ఉట్టంకితులు.

మఱియొక దిక్కు: ధారా, మండువా పట్టణములు రాజధానులుగా, వింధ్యాద్రి పాదములఁగల మాళవదేశ దక్షిణ భాగమును పాలించిన ఘూరీ వంశీయులగు సుల్తానులు (క్రీ. శ. 1401-1500) ఆంధ్ర సాహిత్యమున ధారాసురత్రాణులుగా వ్యవహృతులు. వీరే మండువా సుల్తానులు. వీరు అటు గుజరాతు నవాబులతోడను, ఇటు హిందూ పాలకులగు ఒరిస్సా ప్రభువుల తోడను నిరంతరము యుద్ధములు చేయుటయందే గడపిరి ఈ సుల్తానులలో నొకఁడగు హూషంగ్ (క్రీ. శ. 1405-1435) కుటిల రాజనీతి కోవిదుఁడు; క్రీ. శ. 1421 లో కటకేశ్వరుఁడగు నాల్గవ భానుదేవుని (క్రీ. శ 1409 - 1435) కపట ప్రబంధమున ఓడించి, చెఱపట్టినవాఁడు.[12] కటక విజయముతో మత్తెక్కి, భద్రజాతి గజసైన్యముతో రాజమహేంద్రపురమును ముట్టడించి, దొడ్డయ అల్లాడరెడ్డి చేత నిర్జితుఁడయినవాఁడు ఈ హూషంగ్. వాస్తవముగా భద్ర జాతి గజముల పెంపకమునకు ధారాసురత్రాణులు పెట్టినది పేరు. కడిమి కత్తుల మ్మినివర్ణించు సందర్భమునందలి 'దాని చన్నుదోయి ధారాసురత్రాణ కటక కుంభి కుంభకలహకారి' యను క్రీడాభిరామకర్త ఉత్ప్రేక్ష దీని కనుప్రాసము. 'ప్రబల ధారాసురత్రాణ భద్రజాతి కరిఘటా సైన్యదుస్సాధ కనక లోహ గోపురద్వాః కవాటప్రదీపి తమది సాంద్రవిభవంబు రాజమహేంద్రపురము' (కాశీ. 1-58)

12, R. C. Mazumdar, Delhi Sultanate.

రాజధానిగా 'చీకటియున్ గళింగియును చిల్కాసముద్రము సింహశైలమున్... ఏకసితాత పత్రముగ నేలిన ఉత్తమ శ్లోకుఁడు......' (కాశీ. 1-60) అల్లాడ వీరభద్రారెడ్డి 'ధారాపట్టణ సార్వభౌమ సురధాణ్నిర్వాహారక్రియా ధౌరంధర్య పటిష్ఠ నిష్ఠుర భుజాదండోశ్రీ సంరంభ...' (కాశీ. 5-37)ము వలన 'ధారాసురత్రాణ దర్ప ధరణీధ్ర పవి' (కాశీ. 6-300) యని బిరుదందినవాఁడు. వీరభద్రారెడ్డి జనకుఁడగు దొడ్డయ అల్లాడరెడ్డి '...ధారాసురత్రాణుఁ బోర నిర్జితుఁజేసి క్రొల్లపెట్టించెఁ దద్ఘోటకముల...' అని శివలీలా విలాసకర్త నిశ్శంక కొమ్మన కథనము. 'ధారాసురత్రాణ ధాటీ సమారంభ గర్వపాథోరాశికలశజులు...వీరభద్రేశ వేమ పృథ్వీధవులు...' (భీమ. 1-29) అని వీరభద్రారెడ్డి విద్యాంసుఁడు కైవారము సేయుట 'ధారాసురత్రాణ పరాజయము' ప్రాధాన్యమును ఆమ్రేడించుటకు '...అల్లడాధీశు వేమ క్ష్మాధినాథు భూరి నిష్ఠుర ధాటీ విహార చటుల సైన్యనాసీర తుఙ్గార శఫపుటోత్థ విన్ధ్యపార్శ్వ వసుంధరా విపులధూళి' (కాశీ. 1-34) దీనికి ఉపబలకమగు మరియొక ఉపపత్తి.[13] రాఁగాముల నిర్ధారింప

13. చరిత్ర కావచ్చును, కాకపోవచ్చును గాని ఇక్కడ ఒక చమత్కారము. సుమేరుశైలముతో ప్రతిఘటించిన వింధ్యమహీధర వృత్తాంతము రెడ్డిరాజులకు, ధారాసురత్రాణులకు ప్రధానత్వాపేక్ష నడచిన పోరాటములకు వ్యంజకముగా వచ్చినదని నా యూహము. సంస్కృత కాశీ ఖండమున వింధ్యాటోపఘట్టమింత విశిష్టముగా లేకపోవుట నా యూహకు ప్రధానబలము. శ్రీనాథుని సంతరింపునందలి కొన్ని ధ్వన్యంతర సూచనలు దీనికితోడు. వింధ్యమువలె "ఐరుల ధైర్యైశ్వర్య మెకింఛియు పరితపింపనట్టి ఖలుఁడు..." (కాశీ. 3-6) ధారాసురత్రాణుఁడు. వింధ్యము ప్రతిస్పర్థించిన సుమేరుశైలము సురాష్ట్రపాలకుఁడగు గుజరాతు నవాబు అహమ్మదుషాహి (క్రీ. శ. 1411-1443). వీరభద్రేశ వేమ పృథ్వీధవుల మంత్రి బెండపూఁడి అన్నయ పారసి బాసలో కాకితములు వ్రాసినది ఈ అహమ్మదుషాహికే అఁట : (Vide : History of the Reddi Kingdoms, p. 186, Fn. 38). రెడ్డిరాజులకు మిత్రులయిన గుజరాతు నవాబులకును, జ్ఞాతిభూభృజ్జిగీషా చింతాగ్రస్తులగు ధారాసురత్రాణులకును నిరంతరము పోరాటములు సాఁగుట చరిత్రప్రసిద్ధము. 'ఉదయ పర్వత కటక గండోపలము ఆ... ప్రాఁకిన భానుకిరణముల......' (కాశీ. 1-122) కటకేశ్వరుఁడు నాగ్లప భానుదేవుఁడు (క్రీ. శ. 1409-1435) వ్యంజితుఁడు. 'ఒక్క నిమేషము రాహువు పుక్కిటిలోఁ దగులు వడకపోయెను భానుం డిక్కాంత వక్కఁజిక్కు...' (కాశీ. 1-134) టలో వింధ్యపార్శ్వవసుంధరా సురత్రాణుఁడగు హూషంగ్‌షా చెఱలోఁజిక్కి చీకాకుపడిన నాగ్లప భానుదేవుఁడు సూచితుఁడు. 'భాను...ప్రతిబంధము త్రైలోక్యప్రతిబంధంబై

[illegible]గాని '...బోనగిరి వెంచికొమ్మ ధారాపురీ పెనుగొండాద్యఖిలైక [illegible] ప్రెంఖత్ప్రతాపోదయుఁడు' (జై. 6-271) అఁట జైమినీభారత కృతిపతియగు సాళ్వగుండ నారసింహరాజు! ఆ పిమ్మట ఉద్ధతుల మధ్య పేద [illegible] 'కర్ణాటోత్కళ పారసీకనృపసఖ్య' (కాశీ. 3-243) ము [illegible], 'ఉత్కళ కర్ణాట తురుష్కరాట్పరమమిత్రులు' (కాశీ. 2-155)గా వారు మెలఁగ ప్రయత్నించినను వారి ప్రభుత్వము అనతికాలముననే అంతరి [illegible]. మనకు మిగిలినది 'దాక్షారామ చళుక్యభీమ వరగంధర్వాప్సరోభామినీ వక్షోజద్వయ గంధసార ఘుసృణద్వైరాజ్యభారంబు నధ్యక్షించు' కవిసార్వభౌముని ప్రౌఢసాహిత్యము. ఈ సాహిత్యమే ప్రస్తుత సమీక్షా వ్యాపారమునకు మొదలు నంచి.

బహమనీ సులతానులు, గుజరాతు నవాబులు, ఘూరీ వంశీయులగు ధారా [illegible]తానులు, ఖండువా పాదుషాలు రాజకీయ భాషగా పారసిని చేపట్టి రాజ్యభార [illegible] వ్యాపార దక్షులయిన శతాబ్దమది. ఈ యా ముస్లిము పాలకులతో రాజకీయ సంబంధములను సమర్థముగా నిర్వహింపవలయుచో, అందఱు కాకపోయినను [illegible] సీమలలోని బాహత్తరి నియోగము వారిలో ముఖ్యులు కొందఱయినను పారసీ భాష నభ్యసింపక తీఱదు కదా! శక్తిత్రయ చతురుపాయ [illegible] ప్రయోగ్యాయోగ్యవిచారులగు రాయబారులు '......లిపులెల్లఁ జదువను లిఖియింపనేర్తురై భాషలఁ బెక్కింటఁ బ్రౌఢిగల్గి...' (342) యుండవలయు [illegible], [illegible] 'అలఘుచిత్తుఁడు లఘుహస్తుండునై పెక్కులిపులభ్యసించి

---

[illegible]...' (కాశీ. 1-136)ట భానుదేవుని నిర్బంధము త్రైలోక్యవిజయ [illegible]దులగు రెడ్డిరాజులకును విపత్పరంపరలకు మూల మనుట వ్యంగ్యము. [illegible] నయిన ఆపదను తొలఁగింప అగస్త్యునివేఁడ కాశికరిగి, 'నిఖిల దేవతా సార్వభౌమునకు త్రైలోక్యసామ్రాజ్య పట్టాభిషేకంబునకుఁ దగిన హేమ [illegible] యమ్మహాస్థానంబు గలయఁగ్రుమ్మరి' (కాశీ. 2-42)న వారు జంభ [illegible] పురోగములైన సురలు. 'త్రైలోక్యవిజయాభిధంబైన చంద్రశాలా ప్రదేశంబునందు' (కాశీ. 1-10) కొలువుండ కృతిస్వామి వీరభద్రేశుఁడు ద్వితీయ శంభుఁడు [illegible] ధ్వన్యంతర సూచన. వింధ్యగర్వాటోప భంజనుఁడు కలశజుఁడు. '[illegible] గర్వపారావారి కలశజులు...వీరభద్రేశవేమ పృథ్వీవరులు...' (భీమ. 1-29). 'కలశజుఁడు' వ్యంగ్య వైభవమునకు పతాక.

యేలికకు మిగుల ననుకూలుఁడై ...'(303) మెలఁగవలయు ననియు మడికిసింగన (క్రీ. శ. 1430) సకల నీతి సమ్మతము మతము మంచన కేయూరబాహు చరిత్ర కృతిపతియగు గుండనామాత్యునకు '......వాచకత్వము లేఖకత్వము నాంధ్రలిపిరీతిగా సర్వ లిపులయందు – ఫణితి జాతియుఁ దీవ్రభంగియును దెనుంగుబాసపోలిక సర్వభాషలందు......సహజమఁట ; పంచాంగస్థిర మంత్ర రక్షణ కళాప్రౌఢులును, స్వామి కార్యనిర్వహణ ప్రవీణులుననగు రెడ్డిరాజుల అమాత్యులును పరిసర భాషలను, ముఖ్యముగా పారసిని నేర్చి, అభ్యస్తలిపి ప్రపంచులయి నియోగము నెఱపుట తప్పనిసరి ; కొండవీటి మహామాత్యుఁడును, శృంగారనైషధ కృతిభర్తయుననగు మామిడిసింగన 'యవనాదీశ సభానిరంతరశవచో వ్యాపారపారంగతుఁడు' (నైష. 2-144) వీరభద్రారెడ్డి మంత్రియగు బెండపూఁడి అన్నయ (క్రీ. శ. 1423-1447) 'అరబీభాష తురుష్కభాష గజకర్ణాటాంధ్ర గాంధార ఘూర్జర భాషల్ మళయాళభాష శకభాషా సింధు సౌవీర బర్బరభాషల్ కరహాటభాష మఱియుం భాషావిశేషంబులు...' (భీమ. 1-73) గోష్ఠీ సంప్రయోగముల అచ్చెరువుగా నియోగింప నేర్చిన వ్యవహారవేత్త. ఈ 'అన్నయ మంత్రిశేఖరుఁ డహమ్మదు షాహివదన్య భూమి భృత్సన్నిధికిన్ 14 మదిన్ సముచితంబుగ వేమమహీవరేంద్ర రాజ్యోన్నతి సంతతాభ్యుదయ మొందఁగఁ బారసిభాష...' (భీమ. 1-74) లో కాకతములు వ్రాసిన స్వామి కార్యాభిరక్షక్రియాదక్షుఁడు, 'కర్ణాట...ఘూర్జరాది నృపసభాస్థాన బుధవర్ణనీయ సుగుణ మండనుండగు బెండపూఁడన్న మంత్రివరుఁడు...' (భీమ. 1-19) శ్రీనాథుని కృతిపతులలో నొకఁడు. ఈ సమీక్షా కాలమున రాజకీయ సంబంధమేకాక, వాణిజ్యపరమయిన సంసర్గమును లేకపోలేదు. 15 మన బేహారులు, "విలాతి బాజారు దుకాణదారులనుండి జలతారు

---

14. ఈ పాదము 'అన్నయ మంత్రిశేఖరుఁడహమ్మదుషా గుజరాత భూమి భృత్సన్నిధికిన్...' అని యుండుట యుక్తమని మల్లంపల్లి వారి సూచన (Vide : History of the Reddi Kingdoms, p. 186, Fn. 38).

15. He (Firuz Shah of Bahmani, 1397-1422 A.D.) devoted much attention to the two principal ports of his Kingdom Chaul and Dabhol, which attracted trading ships from the Red sea and Persian gulf, and poured in to the Kingdom articles of necessity and luxury not only from Persia, Arabia and the African coast, but also from Europe (R. C. Mazumdar, Delhi Sultanate, p. 256).

కుల్లాయిలు, జరీ శాలువులు, ముఖమల్లు మోజాలు, లాలుజీబులు, పింగాణి సామానులు, సుప్పాణి ముత్యములు, గంజాయి, గసగసలు మొదలగు లాహిరి సరుకులు, హురుముంజి తేజీలు, కప్పలి, జోఁగు, వల్లి, వలికా, సమ్మాన్లలో తెప్పించి సరసపు వెలలకు విక్రయించి, అసలు ఖర్చు వహితేల్చి కోటికి పడగ లెత్తినవాఁడు. ఉలపోసనపు జమ్ముఖానములు పరచిన హజారపు చావడిలో జాళువా పైఁడి దిండ్లపై తబల, సన్నాయి, డమాములు మ్రోయ ఖుసిమీరన్ సురధాణి సింహాసనపై కూర్చుండెడివాఁడు. కొజ్జాలు, గులాములు సేవింప, నకీబులు పరాకు చెప్పుచుండ, విలాతిఖానులు, సరిహద్దు సహోలు పంపిన రాయబారులు వచ్చి అరబి, అరె, పారసి, రుమీ మొదలగు బాసలలో వ్రాసిన కాకితములను వినిపించెడివాడు. విలాతి దుకాణదారులు వచ్చి కుందనపు కమ్మరుబందులు, చిత్రి చేసిన అపరంజి మోళపు జాఁతలు, బిబ్బిల గాగరాలు ఉలుపా చదివించెడివాడు. బాటసరులు గలబ, జులుము, లూటిసేయకుండ గస్తుకావలివారు కాఁపుండెడివారు. కంపాణి, కత్తలాని, సాప్రాణి, జిరా తేజీలపై చబుకుసేయు సవారీ హొజు బరాబరులు చేసెడిది."16 'చీని సింహాళ తవాయి హురుముంజి బోటంగి పిరుజాసిరిగోవ ప్రభృతి నానాద్వీప నగరాకరంబులగు ధనకనక వస్తువాహన మాణిక్య నాణిక్యములు తెప్పించెడి అవచితిప్పయసెట్టి' (హర. 1-7) హరవిలాస కృతిపతి; శ్రీనాథునకు బాల్యసఖుఁడు. 'హరిహరరాయ ఫేరొజ జహో సురధాణ గజాధిపాదిభూవరులు నిజప్రభావ మభివర్ణన సేయ కుమార గిరిక్షితీశ్వరుని వసంత వైభవము సర్వము నొక్కఁడ నిర్వహించు...తిరుమల నాథసెట్టి...' (హర. 1-24) అవచి తిప్పయ కనుజన్ముఁడు.

వ్యాకరణ సంప్రదాయము : తెలుఁగు వ్యాకర్తల విభజనలో శబ్దజాలము తత్సమ తద్భవ దేశ్యములని మూఁడు ముఖ్యవర్గములు. 'ఒక భాషలోని కితర భాషలనుండి సంక్రమించిన పదములన్నిటిని అన్యదేశ్యములుగాఁ బరిగణించినఁ జాలదా అని విచారించినచో వీరికి సాంప్రదాయము ప్రాకృత వ్యాకరణముల పద్ధతి ననుసరించుట వలన వచ్చినదని తెలియకపోదు' 17 తాను, 'త్రాసు' అను

16. ఈ యుద్ధరణ చిహ్నముల నడిమి కూర్పు పదపట్టికలో నుద్దంకితమయిన అన్యదేశ్యముల చేర్పు.

17. కోరాడ రామకృష్ణయ్య, ఆంధ్రదేశ్యము - అన్యదేశ్యము, భాషాచారిత్రకవ్యాసములు, పు. 111,

అన్యదేశ్యమును ప్రయోగించియు కేతన, అన్యదేశమును పేర్కొనకపోవుట వింత. అచ్చతెనుఁగు కాక దేశితెనుఁగులు (ఆంధ్రభాషా భూషణము, 24), దేశ్యంపుఁ దెనుఁగులు (పైది. 25) అను రెండు రకములయిన పట్టికల నిచ్చుటలోని పరమార్థము దురూహము. కావ్యాలంకార చూడామణి కర్తయగు విన్నకోట పెద్దన (క్రీ. శ. 1405).

'కవమునఁ దత్సమమును ద
ద్భవమును సహజాంధ్రదేశభవమును
దేశోద్భవమును గ్రామ్యముననఁ బం

చ విధములై తెలుఁగు పలుకుజాతము పరఁగున్' (కావ్యాలంకార చూడామణి. 9-11) అనియు

'శ్రేయములై బహు దేశా
నేయములై చక్కఁదనము నెఱఁదనములునై
యాయా నెలవులఁ జెవులకుఁ

దీయములగు పలుకులెల్ల దేశ్యములరయన్' (పైది. 9-16) అనియు నిరూపించినాఁడు. దేశోద్భవమనఁగా పరిసర స్థలములగు దేశభాషలనుండి ఎరవుతెచ్చిన పదరాశికాఁబోలు ; బహుదేశానేయములైన దేశ్యములివియే, సహజాంధ్ర దేశభవము లనఁగా తెలుఁగు సీమకు విసర్గములయిన పదములని అన్వయము. కాని, దేశి నామకములైన పదముల పట్టికలో అచ్చెరువు, డిల్ల (పాటు), (నె)మ్మోము మొదలగు తద్భవములుండుటను ఎట్లు సమన్వయింప వలెనో తత్త్వాభిజ్ఞులు నిర్ణయింతురుగాక !

'తజ్జాసమాచ దేశ్యా గ్రామ్యా చేయం చతుర్విధాభవతి.
ప్రకృతిద్వయ జాతజ్జాతుల్యాతు సమా ప్రవాహిని దేశ్యా'—

అని ఆంధ్ర శబ్దచింతామణి. 'అహేయ మన్య దేశీయం యత్తదేవ ప్రయుజ్యతే' (వికృతి వివేకము. సంజ్ఞా. కా. 9) అను వికృతి వివేకకారుని హృదయమేమో సుబోధముగాదు. ఈ పట్టునఁగల వ్యాఖ్యాతల వివరణమును కారికాతత్త్వ

ప్రాకృతముగా స్వీకరించుట యుక్తియుక్తముగాఁదోఁపదు. తేజీ, నేజా — మొదలగు అన్యదేశ్యములను నాల్గవ శబ్దస్మృతి దేశ్యములని వ్యవహరించినాఁడు. (చూ. బాల వ్యాకరణము, ఆనం. 'నచదేశ్యసదే' అను సూత్రము క్రింది వివరణము). అప్పకవి (క్రీ. శ. 1656) శుద్ధాంధ్రంబులు, అన్యదేశ్య జాంధ్రంబులు అని ఆంధ్రదేశ్యము రెండు తెలుంగు లయ్యెనని చెప్పి (చూ. అప్పకవీయము 1-106) లక్ష్యములు పేర్కొనినాడు.

'... ఆంధ్రములు నానా
దేశంబుల యందు నిలిచి తెలుఁగులె తత్త
ద్దేశోక్తులంటఁ బలికిన
నా శబ్దములన్యదేశ జాంధ్రములయ్యెన్ 18'
(ప్రైఅ. 1-108) అని నిర్వచించి

'ఆకులు ఉప్పు....మక్కువ తెల్లమియనఁ దనరు నిటులన్యదేశ జాంధ్రములు పెక్కు' (ప్రైఅ. 1-109) అని కొన్ని పదముల నుదాహరించినాఁడు. వాస్తవమునకు ఇవి అన్యదేశ జాంధ్రములు కావు. విన్నకోట పెద్దన నిర్దేశించిన సహజాంధ్రదేశ్య పదములు, అప్పకవి చెప్పిన శుద్ధాంధ్రంబులు నొక్కటేగ. పెద్దన దేశ్యాంధ్రమే అప్పకవి పేర్కొనిన అన్యదేశ జాంధ్రము. కవి జనాంజనకారుఁడగు [illegible] నరసరాజు (క్రీ. శ. సు. 1800)...కొన్నిటికి హ్రస్వ దీర్ఘములు కానరావు.....లకోరి మొదలైన దేశ్య పదాలకు యెట్లంటె :

'హాయుకానవలా హూ మాదులు దేశ్యంబు లోలినిందు లకోరీ లకోరి
చేటి తేజీ నేజ నేజా కటారీ-కటారి బాజాది రెంటను జెలంగు...' అని

'హాయుకా...కటార్యాదులను దేశ్యములుగా నిరూపించినాఁడు.19 కాఁగా, మన వ్యాకర్తల విషయ విభాగ నిర్ణయమున ఏకవాక్యత లేదనియు, లక్ష్యలక్షణ సమన్వితము గాకుండుటచే సుబోధముగా లేదనియు తాత్పర్యము.

---

18. అప్పకవి యీ తప్పును దృష్టిలో నిలిపికొనియేకాఁబోలు, 'ఆంధ్రులితర దేశముననిలిచి యా యితర భాషలలోని పదములను దమభాషలోఁగలుపు కొనినవి అన్యదేశ్యము' అని సులభవ్యాకరణ కారుఁడు వ్రాయుట. 'ప్రసిద్ధాన్యదేశ్యంబులు ప్రయోగార్హంబు' అని వ్రాయుచు గాణపతసూత్రవివరణ కర్త తమిళకర్ణాటపదములను ఉదాహరించుటయు ఇందుమింద ఇట్టిదే.

19. కవిజనాంజనము, విశాఖపట్టణము పరవస్తువారి గ్రంథాలయమునందలి తాళపత్ర ప్రతి. 8[illegible] వ ఆకు. 2 వ వైపు.

## శబ్దరత్నాకరకారుని దృష్టి

'దేశ్యము ఆంధ్రదేశ్యము, అన్యదేశ్యమని ద్వివిధము. ఆంధ్రదేశ్యము,-తల్లి, తండ్రి లోనగునది. అన్యదేశ్యము,-తావి, మోవి లోనగునది' (పు. xi, భాషాప్రశంస, శ. ర., 1885) ఇదీ శ.ర. కారుని చూపు 'అన్యదేశ్యము దేశ్యముతోఁ జేర్పఁబడినది గాన దానికిఁ బ్రత్యేకముగా సంజ్ఞ యిడఁబడదు.' (4వ నియమము, నియమ విధానక్రమము, పు. xviii, శ. ర.). కాని, శ. ర. లో ఈ నియమము సక్రమముగా పాటింపఁ బడలేదనుట క్రింది ఉదాహరణముల మూలమున స్పష్టము. శ. ర. తొలి ముద్రణము నందే అటనట 'ఇది అన్య దేశ్యము' అని కొన్ని పదముల యొద్ద సూచితము. శ. ర. మలి ముద్రణము లలో హిం. ( = హిందూస్తానీ), అన్యదే. ( = అన్యదేశ్యము) అను సంకేత ములు ధారాళముగా ఉపయుక్తము. శ. ర. తొలి ముద్రణము ప్రతినుండి మచ్చు నకు కొన్ని : 1. అచ్చాళు : దే. విణ. (అచ్చము + ఆళు) జంజాటము లేని వాడు...(ఆళు అన్యదేశ్యము). అనుబంధము, పు. 1125. 2. జెండా : దే వి. టెక్కెము, ధ్వజము,....(ఇది అన్యదేశ్యము), అను. పు. 1142. 3. దస్తూరి: దే. వి. వ్రాఁత.... (ఈ యన్యదేశ్య మీ గ్రంథము నందు మాత్రము కినఁబ డెడి), పు. 530. 4. నగాసు : దే. వి. చిత్రము (ఇది అన్యదేశ్యము). అను. పు. 1146. 5. నంబెరుమాళ్ళు : దే. వి. బ. (నమ్ + పెరు మాళ్ళు) శ్రీరంగ నాయకులు. (ఇది అన్యదేశ్యము). అను. పు. 1146. మలి ముద్రణములలో 'ఇది అన్యదేశ్యము' అను సూచన తొలఁగింపఁబడి, అర. ( = అరవము) దే. వి. బ. గా మార్పఁబడినది. (చూ. శ. ర., 1912 ప్రతి, పు. 575). 6. సలాము : దే. వి. నమస్కారము ... (ఇది యన్యదేశ్యము). పు. 1079 7. హుసారు : దే. వి. జాగ్రత్త... (ఇది యన్యదేశ్యము). పు. 1122. 8. హొన్ను : దే. వి. పొన్ను, బంగారు. ... (ఇది యన్యదేశ్యము.) పు. 1123. 9. హోళి : దే. వి. కామునిపండుగ కడపటినాఁడు తగులఁ బెట్టుటకై పోగుచేసెడి గడ్డి కంప. (ఇది యన్యదేశ్యము). పు. 1124

పైఁది పరిశీలనమును బట్టి నవీనోత్తరాహ భాషా పదములతో పాటు తమిళ, కర్ణాటాది ద్రావిడ భాషల నుండి ఎరవు తెచ్చిన ఆళు, [20] నంబెరు

20. తమిళము. ఆళ్ = వీరుఁడు; సమర్థుఁడు; భర్తుఁడు.

హొన్ను, హోన్న22 మొదలగు పదములను శ. ర. కారుని దృష్టిలో అన్యదేశ్యములని గ్రహించుట యుక్తము. కాని, శ. ర. 'భాషా ప్రశంస' లో అన్యదేశ్యములకు లక్ష్యములుగా నుదాహృతమయిన తావి, మోవి పదము లీ వృత్తితో కూడినను అన్యదేశ్యము లగుట అసంభవము. శ. ర, కారుని ఈ అభిప్రాయమునకు పూర్వ వ్యాకర్తల నిరూపణము అధారము. అప్పకవి 'మోవి' ని అన్యదేశ్య శబ్దముగా నిరూపించినాఁడు. కేతన కెమ్మోవి, కమ్మతావులను దేశ్యపు తెనుఁగులుగాఁ (ఆం. భా. భూ., 25) పేర్కొనినాఁడు. కేతల [illegible], [illegible]ము–అను తద్భవములను దేశ్యంపు తెనుఁగులలోను; ఉవిద, [illegible] పదములను దేశి తెనుంగులలోను పఠించుట విచార్యము. తావి, మోవి పదములు ఆంధ్రదేశ్యములుగా ఉట్టంకించిన బాలవ్యాకరణోద్ద్యోత కారుని శాస్త్రీయము. '....మహారాష్ట్రి మొదలగు విజాతీయ భాషలనుండి కాక (తమిళము, కన్నడము మొ.) సజాతీయ భాషలనుండియు సంక్రమించిన శబ్దములు అన్యదేశ్యములుగనే గ్రహింపఁబడవలసి యుండు' నని శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారి సమీక్ష23 పరిసర స్థములగు సజాతీయ దేశభాషలనుండి వచ్చిచేరిన పదములను 'తిసైచ్చొల్' (= దిశలనుండి వచ్చిన పలుకులు) అని వ్యవహరించుట తమిళ వ్యాకరణ సంప్రదాయము.24 ప్రస్తుత సమీక్షలో 'తిసైచ్చొల్' – సజాతీయ భాషల నుండి సంక్రమించిన పదరాశి–అప్రసక్తము.

---

21. తమిళము. నంపెరుమాళ్ నమ్ (< నామ్) + పెరుమాళ్) = శ్రీరంగమునందలి క్షేత్రమూర్తియగు విష్ణువు; పెరుమాళ్ = స్వామి; ప్రభువు; విష్ణువు.

22. కన్నడము. హొన్, హొన్ను, హొమ్, హోన్, హొన్ను, హోమ్ = బంగారు. పకారము హకారముగా వికారమునందుట కర్ణాట భాషా విశిష్టస్వభావము. ఇది క్రీ. శ. పదియవ శతాబ్దినాఁటినుండి కర్ణాటభాషలో ప్రవర్తితమయిన ధ్వని పరిణామము. తెలుఁగునందలి హత్తు, హదను, హాయి, హాళక్కి, హెగ్గడి, హెచ్చు, హేరాళము, హోరాటము మొదలగు పదాది హకారఘటితములు కన్నడము నుండి ఎరవు తెచ్చిన పదములు.

23. భాషా చారిత్రకవ్యాసములు, పు. 138.

24. 'సెంతమిఙ్ చేర్న్త పన్నిరునిలత్తున్। తజ్ కుఱిప్పినవే తిసైచ్చొఙ్ కిళవి' (తొల్కాప్పియమ్, సొల్లదికారమ్, సూ. 400)

## పూర్వాంధ్రము - అన్యదేశ్యా భాసములు

'గాడీ' (= బండి) అను అన్యదేశ్యము నన్నయ భారత (ఆది. 8-221) ప్రయుక్తమని భావించుట 25 ప్రమాదమనియు, 'గాడీలు' పదఘటిత మపపాఠ మనియు, 'గాడిదలను' అనునదచట మూలానుసార మగుటయకాక, అదియే కవ్యభిప్రేతమనియు సోపపత్తికముగా నిరూపితము. 26 కైపు, తరవారి, బాఁకు (-పాఁకు) లను నన్నెచోడకవికృతిలోని అన్యదేశ్యములుగా శ్రీ వేదము వేంకట రాయ శాస్త్రి, ఎం. ఏ., గారు చేసిన మదింపు కూడ సువిచారితము కాదని నిర్ధారితము. 27

'లేదింకం బగయని ఘను
రాదుల దెస వాహనముల యందు సంత్య
క్తాదరులై పగతురనెఁ
డాదమఱచి నిద్రవోదు రదితఁడిపొడువన్' (భారతము, సౌప్తిక. 1-51)

అని తిక్కన ప్రయోగించిన 'ఆదమఱచు' 28 లోని 'ఆద' పారసి బాసయందలి 'యాద్' ( = జ్ఞప్తి, స్మృతి) తో జన్యజనక సంబంధము కలదను ఆచార్య

---

25 అముద్రిత గ్రంథ చింతామణి మయూఖము, సంపుటి 15, సంచికలు 1-2, జనవరి, ఫిబ్రవరి, 1902, పు. 32; దేవరపల్లి వేంకట కృష్ణారెడ్డి, తెంకణా దిత్యకవి, పుటలు 76-83.

26. నన్నయ—అన్యదేశ్యాభాసములు, సాహితి, ఫిబ్రవరి-మార్చి 1963 సంచికలు.

27. 'నన్నికవిద్వయము'-అన్యదేశ్యాభాసములు, సాహితి, నవంబరు-డిసెంబరు. 1962 సంచికలు.

28. 'ఆదమఱ' = జ్ఞప్తిభ్రంశే, అకర్మకక్రియ. జ్ఞప్తిదప్పుట' అని ఆంధ్రధాతుమాల, పు. 5. 'ఆదమఱచు'నకు శ్రీనాథయుగ ప్రయోగములు కొన్ని ;
'అరగి యుచ్చట శయ్యపైనాదమఱచి; నిద్రగూరినతల్లిపై నెపముగొలిపి'
—పద్మపురాణము, ఉత్తరఖండము, 9-116;
'మధురలోన నాదమఱచి నిద్రించిన; నరులనెల్ల నొక్కనాఁటిరాత్రి
ద్వారవతికిఁదెచ్చి..., —పైది, 9-363;
'కొంత తడవాదమఱచి నిద్రింతురపుడు. —వరాహపురాణము, 11-126,

శ్రీ [illegible] గారి ప్రతిపాదనము 29 విచార్యమానము. తిక్కన [illegible] 'త్రాసు' 30 అను మూర్త పదార్థ బోధకమగు అన్యదేశ్యము మాత్రము [illegible]. వాడుక పరముగా 'త్రాసు' అతి ముఖ్యమయిన వస్తువు. భాషల [illegible] ప్రథమ దశలో సిద్ధమూర్త పదార్థ బోధకములగు పదములే [illegible], ఆ మూర్త పదార్థ బోధకములగు పదములు [illegible] ప్రతి దేశములు కావనుటయు స్థితి స్థాపక విషయము. [illegible] గమునందలి అన్యదేశ్యములును ముక్కాలు మువ్వీ[illegible] మూర్త పదార్థ బోధకములగుటయు, వీనిలో పెక్కులు విలాతి సీమలనుండి [illegible] మాటలగుటయు ప్రత్యక్ష ప్రమాణము. [illegible], సంస్కృతము నందలి 'ఆత్మన్' శబ్దమునకు వికృతియగు 'ఆద' శౌరసేనీ ప్రాకృతమున రూపము. సంస్కృతమునందలి అపదాదితకారము శౌరసేనీ ప్రాకృతమున దకారమగుట సర్వసాధారణమగు ధ్వని పరిణామము. 31 [illegible]. తెలుగు నందలి 'అద' 32 ను శౌరసేనీ ప్రాకృత సమముగా నిరూ[illegible] యొప్పు.

## అన్యదేశ్య నిరూపణమున తబ్బిబ్బులు

అన్యదేశ్యములు [illegible] వాని మూలరూపములేవో గుఱుతింపరానంత [illegible]. '[illegible]' ( = దళవాయి; సేనాని; సైనికుడు; సేనా

---

29. Bulletin of the Linguistic Circle of New Delhi, Edited by Prof A. C. Sekhar, New Delhi, 1955.
30. [illegible] 'త్రాసు' అను ఆరోపము క్రింద.
31. [illegible] క్రింది ఉదాహరణములు ;

| | | | |
|---|---|---|---|
| సంస్కృత, దుహితృ | > | శౌ. ప్రా. | దుహిదా, దుహిదరమ్, దుహిదే. |
| ,, [illegible] | > | ,, | [illegible] |
| ,, [illegible] | > | ,, | [illegible] అరో |
| ,, పితృ | > | ,, | పిదా, పిదరమ్. పిదరో |
| ,, మతి | > | ,, | మది |
| ,, మాతృ | > | ,, | మాదా, మాదరమ్, మాదాట, మాదే. |

32. 'అద' ( = విచారము) దేశ్యముగా శ. ర. లో ఉట్టంకితము (చూ. పు. 74); అధి ( = మనోవ్యథ) శబ్దభవమని పురుషోత్తమ కవీయము. పు. 8.

సంబంధమయిన) అను పారసి భాషాపదము తెలుఁగున 'లసికిరి' గా పరిణతము-కాకమాని మూర్తి కవికృతమగు రాజవాహన విజయమున నీ పదమిట్లు ప్రయుక్తము.

'లసికిరి జోదులగ్గలిక
 లగ్గల కెక్కినఁ గుంతపఙ్క్తులన్
పసుమతిఁ గూల్చియున్ గదల
 వైచియుఁగత్తుల వ్రక్కలించియున్
వసుల వధించియున్ ముసల
 వర్గములం బడమోది వాలుకల్
మసలక వేసి వంచియును
 మందుల తిత్తులు గాల్చివైచియున్' (రాజవా 5-31) [33]

ఈ పద్యమున సమాపక క్రియ లేదని కాఁబోలు 'లసికిరి' ని ప్రథమ పురుష మహద్బహు వచము నందలి భూతకాలిక క్రియా రూపముగా భావించి (పిసికిరి-పిసుకు. పలికిరి-పలుకులవలె) 'లసుకు' అను నొక అనిష్ట మూర్తిని సృష్టించి, దే. స. క్రి. అను సంజ్ఞా పత్రమును దాని మొగమునఁ గట్టి, సందర్భమునుబట్టి గుఱికి బారెఁడు దూరముగా 'నాశముచేయు' అను ఉజ్జాయింపు టర్థముతో శ. ర. కారులు ఉల్లేఖించుట ప్రామాదికము.[34] శ. ర. కు పూర్వ రచనలగు విల్లియంబ్రౌను కూర్చిన జెంతూ నిఘంటువునఁగాని, ఆంధ్రదీపికలోఁగాని, ఆంధ్ర ధాతు మాల లోఁగాని, కాంపెల్ నిఘంటువునఁగాని, బ్రౌణ్యమునందుగాని, వీనికి పూర్వతన

33. నూతిలోఁబడిన బిందెను తీయుటకు పాతాళభేదివేయఁగా బేతాళములు బయలువడి నట్లు, ఏవో యొక ఉత్తమపాఠము చిక్కకపోదను ఆశతో పరిశీలించిన ఒక్క తాళపత్రప్రతి (ఆం. వి. గ్రంథాలయమున 111 నెంబరు గల దొబ్బిలి ప్రతి)లో
 'లలకిలి జోదు లగ్గలిక; లగ్గలకెక్కిన కుంత్త పంఙ్క్తులన్; పసుమతి గూల్చియున్ గదలవైచియు...'
 అను నీ యసందర్భపు పాఠమొకటి కన్పట్టినది. వ్రాయసకాఁడు ప్రాసభంగమును గమనించినట్లులేదు. 'లలకిలి జోదు లగ్గలిక లగ్గల కెక్కిన' వరకు ఒక యాకు మీఁదను మిగిలిన పద్యభాగము తర్వాతి యాకు మీఁదను లిఖితమగుటచే, ముందు వెనుకలు పరిశీలించి, సవరించుకొనుటకు ప్రతి విలేఖకునకు ఉసులుపాటు లేకపోయినదికాఁబోలు!

34. శ. ర. 1885, పు. 983.

మఱియే ఆంధ్ర వర్ణ నిఘంటువులం(గాని ఈ 'లసుకు' అడ పొడ కానరాదు. [illegible] సీతారామాచార్యుల సృష్టి. పైపద్యము, తర్వాతి దగు '...[illegible] లసుకు ఒమ్మడిక్కి నొంచె మగధనృప సేన నొకనాఁటి పగటి [illegible] ([illegible] 5-112) తో అన్వయము. ఈ'లసికిరి' (<లష్కరు) జోదులు [illegible] చెందినవారు. 'లసికిరిజోదు' లనఁగా మూలబలము (Stan-[illegible]) నకు చెందిన యోధులు, కైకూలి బంటులు, దినరోజు జోదులు, [illegible] 'లసికిరి జోదులు' భిన్నులు. శ. ర. మీఁది ప్రమాణ బుద్ధి [illegible] కోశకారులు, భాషాతత్త్వ పరిశోధకులు, గ్రంథ వ్యాఖ్యాతలు [illegible] గమనార్హము. ఆంధ్ర పద పారిజాతము, లసుకుట, [illegible] రాయనీయము, పు. 735; బ్రౌణ్యము - రివైజ్డ్, పు. 1106; [illegible] శంకరనారాయణ, పు. 1036; ఆంధ్రవాచస్పత్యము. [illegible]; [illegible] శ్రీరాములు రెడ్డి, తాహ్మ్రరి - ఆర్ముగం పిళ్ళగారల '[illegible]' విద్యార్థికోశము, చిత్తూరు, 1943, పు.303; దాచేపల్లి వారి శబ్దార్థ [illegible], 1[illegible], పు. 1141, తుదకు పరమ ప్రామాణికులయిన సూ. ని. కారులును ([illegible] vi, 1958. పు. 527) సుపరీక్షితము గావింపక ఈ తప్పునట్లే [illegible] వ్రాసి అచ్చొత్తించుట ఆశ్చర్యము. ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ వారు ప్రచురించిన ఆంధ్ర క్రియా స్వరూపమణిదీపిక ([illegible]) యందును 'లసుకు' దేశ్యక్రియగా అవిమర్శముగా అంగీకృతము. ప్రచురితము కానున్న మఱి యెన్ని కోశముల కెక్కనున్నదో? ఇఁక భాషా పరిశీలకుల, వ్యాఖ్యాతల మాట: శ. ర. వ్రాఁతను అంధ పరంపరగా అనుకరించిన వారు శ్రీ. చిలుకూరి నారాయణరావుగారు (చూ. ఆంధ్రభాషా చరిత్రము. సంపుటము 1, పు. 1[illegible], 'తెలుఁగు నందలి దేశ్యమూల ధాతువుల పట్టికలో 292 వ దానిగా 'లసుకు' ఉట్టంకితము). రాజవాహన విజయము - మంజువాణీ ముద్రాక్షరశాలా ప్రతి, 1937 - లోని 'లసికిరి' = నశింపఁజేసిరి' అనుటీకకు శ. ర. యే ప్రమాణము. ఒకచోట దొరలిన తప్పు ఎందరెందఱు హేమా హేమీలను తప్పుదారి పట్టించెనో తెలుపుటకీ యొక్క 'లసుకు' జాతకము చాలు! ఆనాఁడె శ్రీ భద్రిరాజు కృష్ణమూర్తిగారు దీని నిజతత్త్వము నెఱిఁగియే కాఁబోలు

ఆంధ్రదేశ్య క్రియా స్వరూప నిరూపకమగు తమ సిద్ధాంత గ్రంథమునందు 'లసుకు' ను పరిహరించుట. 35

అచ్చముగా కోశసంబంధమయినది కాకపోయినను ఒక ముచ్చట : తంజావూరు మహారాజా శరభోజి సరస్వతీ మహలు లైబ్రరీలోని ఆంధ్రభాషామయమైన తాళపత్ర గ్రంథ సంచయమునకు ఆంధ్ర విశ్వ కళాపరిషత్తు వారొక కేటలాగును తయారు చేయించి ప్రకటించినారు. 36 ఆచార్య శ్రీ పి. పి. ఎస్. శాస్త్రిగారు దీనికి ప్రధాన సంపాదకులు. పూజ్యులు, కథావశేషులు శ్రీ కురుగంటి సీతారామ భట్టాచార్యులవారు దీని నిర్మాణమున ముఖ్య సారథులని వినికి. ఇందులో 275 వ నంబరు కలదిగా సంక్షేప రామాయణ మను పేర తాటియాకుల ప్రతి యొకటి వర్ణితము. ఈ ప్రతి రూపురేకలేవో టూకీగా వివరించిన పిమ్మట 'గ్రంథమసంపూర్ణము. రామాయణ కథ సంక్షేపముగాఁ జెప్పఁబడియెను... గ్రంథమున నెక్కడను గ్రంథకర్తృ నామాదికములు గన్పట్టవు. కృతిభర్త లేఁడు. ఆశ్వాసములు, ఆశ్వాసాంత గద్యములు కూడ మృగ్యములు. This work is samksipta ramayanamu of unknown authorship' 37 అని చివర సంపాదకుల రిమార్కు కలదు. ఈ వ్రాతలను చూచి ఏమనవలెనో తెలియదు. ఎంత తొందరపాటు! వాస్తవముగా నీ తాళ పత్ర గ్రంథ భాగము పోతనకృత భాగవతము, నవమస్కంధము (259-349) నందలి సంక్షేప రూపమయిన రామాయణ కథ! ఇంచుమించు తొంబది గద్య పద్యముల భాగము!! అంతా అయినదైదు గ్రంథముల పరిమితికి లోపు మాట!!!. ఎవఁడో రామాయణ కథాపారాయణాభిలాషతో పోతన కృతి నుండి విడిగా ఎత్తివ్రాసికొనిన తాటియాకుల బొత్తి! పోతన భాగవతము. అందును నవమస్కందము, పైగా అతి ప్రసిద్ధ మయిన రామకథ. ఇందలి ఒక్కొక్క పద్యమును పోతన శైలిని పట్టి

35. Dr. Bh. Krishnamurti, Telugu Verbal Bases-A comparative and Descriptive study, Ph. D. Thesis, University of California Publications in Linguistics, Vol. 24, Berkeley, 1961.

36. A Descriptive Catalogve of the Telugu Manuscripts in the Tanjore Maharajah Serfoji Saraswati Mahal Library. Andhra Uviversity Publication, Waltair, 1933.

37. చూ. పైది, పుటలు 79, 80.

యిచ్చెడి శబ్దాలంకార సర్వస్వము. ఏమయిననేమి, కేటాలాగు నిర్మాతల యెఱుకకిది అందలేదు. నిర్మాతలు ఎవరైననేమి, ప్రమాదో ధీమ తామపి ! మా ప్రాంతములలో నీ రామాయణ కథ—గజేంద్రమోక్షము, ప్రహ్లాద చరిత్రము, రుక్మిణీ కల్యాణములవలె—బిడిపిల్ల లందఱకును కంఠోపాఠము. ఒకందుకు సంతోషము. షష్టికా శతవ్యాస కల్పనలగు కొందరు విమర్శకుల దృష్టిలో ఇది పడినట్లు లేదు. పడియుండెనా, 'తంజావూరి రామాయణ' మని అపూర్వ పరిశోధక వ్యాస మొకటి అవతరించి యుండెడిది. 'ఎటువంటి బుద్ధిశాలులకును నిట్టి మహా కార్యములయందు పొరపాట్లు కలుగక మానవు'. అంతమాత్రమున వారి చిరంతన కృషి సుధీసేవ్యము కాకపోదు. అమర్చిన దానిలో అత్తగారు వ్రేలుపెట్టినట్లు, ఒకరికృషిలో తప్పులుపట్టుట చాల తేలిక ! తంజావూరి ముచ్చట మనలను చాల దూరము తెచ్చినది. పరదోష కథా పరాఙ్ముఖులగు పెద్దలకు రామాయణములోని ఈ పిడుకల వేట ఇంపునింపదు గావున, ఈ ప్రసంగము నింత కట్టిపెట్టి ప్రకృత మనుసరింతము.

అన్యదేశ్య ప్రయుక్తియందు శ్రీనాథుఁడు ప్రథముఁడు కాకపోయినను ప్రముఖుఁడు. ప్రధానముగా ఇతనిది గౌడీరీతి - వైదర్భీరీత్యనుయాయుల కంటె గౌడీరీత్యనుయాయులకు శబ్దముల కూర్పుపట్ల శ్రద్ధ యెక్కువ. రసాభ్యుచితబంధముగఁ గవిత చెప్పవలయుచో తత్తత్ప్రకరణోచితముగను, తత్తత్పాత్రోచితముగను భాషాప్రయోగపద్ధతి యుండుట అవశ్యకమని యెఱిఁగిన పద వాక్య ప్రమాణ పారీణుఁడీతఁడు; తత్ప్రయోజన సిద్ధికై 'శబ్దంబు పలకించియు,' అశేష మనీషి హృదయంగమంబుగా శబ్దంబనుసరించియు' (నైష. 8-202) సాహితీ నిషేవణ మొనర్చిన సరస సాహిత్య సామ్రాజ్య చక్రవర్తి శ్రీనాథుఁడు. క్రొత్తమాటలను ఏర్చి కూర్చుట శబ్దదారిద్ర్యము వలనఁ గాదు. ప్రాతపడ్డ మాటలను పరిహరించుటయు, క్రొత్త పలుకుబడులను స్వీకరించుటయు కవి సంప్రదాయము. విశేషించి, నూతన వస్తు సన్నిధిని ప్రసన్న వివేకముగా తద్బోధకములగు పదములను ప్రయోగించుట అర్థవ్యక్తికి, ఝటితిస్ఫూర్తికి అవశ్య కర్తవ్యము. పలుకుల పొందికలో నాజూకు పోకడలకు మోజు పడెడి రసప్రజ్ఞుల కిట్టి పట్టులు అమృత చషకములు.

ప్రస్తుత చర్చలో పరిశీలితములయిన ప్రధాన గ్రంథములు :

1. అధ్యాత్మ సంకీర్తనలు : తాళ్ళపాక అన్నమయ్య 5-10 సంపుటములు
2. కావ్యాలంకారచూడామణి : విన్నకోట పెద్దన్న
3. కాశీ ఖండము : శ్రీనాథుడు
4. క్రీడాభిరామము : ? వల్లభామాత్యుడు; ? శ్రీనాథుడు
5. చాటువులు (వీధినాటకము): శ్రీనాథుడు
6. ఛందోదర్పణము : అనంతుడు
7. జైమిని భారతము : పిల్లలమర్రి పిన వీరభద్రుడు
8. జ్ఞాన వాసిష్ఠము : మడికి సింగన
9. ద్వి. భాగవతము : మడికి సింగన (దశమస్కంధము)
10. ద్వి. హరిశ్చంద్ర : గౌరన
11. నవనాథ చరిత్ర : గౌరన
12. నాసికేతూపాఖ్యానము : దగ్గుబల్లి దుగ్గన
13. పంచతంత్రము : దూబగుంట నారాయణకవి
14. పంచతంత్రము : బైచరాజు వేంకటనాథుడు
15. పద్మపురాణము : మడికి సింగన
16. పరతత్త్వ రసాయనము : ఈశ్వర ఫణిభట్టు
17. పల్నాటి వీరచరిత్ర : ? శ్రీనాథుడు. (బాలచంద్ర యుద్ధము)
18. ప్రబోధ చంద్రోదయము : నంది మల్లయ, ఘంట సింగయలు
19. భాగవతము : బమ్మెర పోతన
20. భాస్కర రామాయణము : అయ్యలార్యుడు (యుద్ధకాండ శేషము)
21. భీమేశ్వర పురాణము : శ్రీనాథుడు
22. భోజరాజీయము : అనంతుడు
23. రత్నపరీక్ష : బైరవ కవి
24. రసాభరణము : అనంతుడు

25. రుక్మాంగద చరిత్ర : ప్రౌఢకవి మల్లన
26. వరాహపురాణము : నంది మల్లయ, ఘంట సింగయలు
27. విక్రమార్క చరిత్రము : పేరంరాజు జక్కన
28. వీరభద్రవిజయము : ? బమ్మెరపోతన
29. శివయోగసారము : కొలని గణపతి దేవుడు
30. శివరాత్రి మాహాత్మ్యము ; శ్రీనాథుడు
31. శివలీలా విలాసము : నిశ్శంక కొమ్మన్న
32. శృంగార నైషధము : శ్రీనాథుడు
33. శృంగార శాకుంతలము : పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు
34. శృంగార సంకీర్తనలు : తాళ్ళపాక అన్నమయ్య (4వ సంపుటము)
35. శ్రీరంగమహత్త్వము : భైరవకవి
36. షోడశ కుమార చరిత్రము : వెన్నెల కంటి అన్నయ్య
37. సకలనీతి సమ్మతము : మడికిసింగన
38. సింహాసన ద్వాత్రింశిక : కొఱవి గోపరాజు
39. హరవిలాసము : శ్రీనాథుడు
40. దక్షిణ హిందూదేశశాసన సంపుటములు

శ్రీనాథునకు పూర్వులగు కొట్టరువు తిక్కన, నాచన సోమన, పాల్కురికి సోమన, మూలఘటిక కేతన మొదలగువారు ప్రయోగించిన అన్యదేశ్యములును ఆయా తావుల ఉదాహృతము. కేవలము కోశ ప్రయోగములతో సరిపెట్టక ఏతద్యుగీనములను సర్వాంధ్రగ్రంథములను పారముముట్ట పరిశీలించి ఆవశ్యకములగు ప్రయోగ భాగము లిందు ప్రదర్శితము. సాధు పాఠనిర్ణయము అక్కఱ కలదని తోచిన పట్టుల వివిధ ముద్రణముల పాఠములును, తాళపత్ర ప్రతుల పాఠములును, అనువాదములైనచో సంస్కృత మూలములును ఉట్టంకితము. ఈ యుగమునకు చెందిన శాసన ప్రయోగములును ఎడనెడ ఉద్ధృతము.

పదపట్టికలోని ప్రధానారోపములు 107. వీని రూపాంతరములు 23. మొత్తము ఆరోపములు 130. ప్రధానారోపపదములకు తప్ప, వీని రూపాంత

పదములకు వరుస సంఖ్య వేయలేదు. ఇందులో శ్రీనాథ ప్రయుక్తములు చక్కని సగమునకు పైమాట.

అరబీ, అసివారు, కత్తలాని, కప్పలి, కమరు, కాకితము, కిచ్చడి, కుందనము, కుల్లా, కోహళి, ఖుసి, గంజాయి, గసగస, గాగరా, గుల్లాము, గోవ, చికిలి, జబ్బు, జరి, జలపోసనము, జోగు, తరుణాసీరి, తవాయి, తేజీ, త్రాసు, దుకాణము, పంజార, పంజు, పడుదా, పరాకు, పారసి, పేషణి, బాజారు, బిబ్బి, బొందిలి, మసీదు, మైజారు, మోళము, రావు, లాహిరి, లుంగ, వలికా, వల్లి, సమ్మాను, సహా, సురతాణి, సేబాసు, హజారము, హురుముంజి మొదలయినవి శ్రీనాథ ప్రయుక్తము. ఇందులో పల్నాటి వీరచరిత్రము (బాలచంద్ర యుద్ధము) నందలి అసలు, ఖర్చు, చబుకు, చామలా, చావడి, డమామి, డేరా, తాయెతు, బరాబరి, బాకు, ముఖమల్లు, రోజు, సన్నాయి, సరిహద్దు, హద్దు — ఈ పదునైదును చేరలేదు. సమకాలికులు వాడఁగా శ్రీనాథుఁడు వాడని అన్యదేశ్యములు సగమున కించుక తక్కువ. అవి ఇవి ; అపరంజి,[38] ఈనాము, కంఖాణి, కంగారు, కొజ్జా, ఖాస, గలబ, గస్తు, గొంగడి, గోరక్కుఁడు, గోహరి, చవుక, చాడి, జమ్మిఖాణము, జిరా, జీబు, జులుము, జూటరి, తబల, దరిబేసి, దుహిలీ, నకీబు, పింగాణి, పౌజు, బిడారము, మాలిమి, మేకు, మోజా, లాలు, లూటి, వహి, విలాతి, శాలువు, సంగడి, సవా, సామ్రాణి, సుపాణి, సోళాదొప్పి, హుమాయి — మొదలగునవి.

మరాఠీ భాషకు నిసర్గములయి తెలుఁగున ప్రతిదేయములగు అన్యదేశ్యములు : కిచ్చడి, గంజాయి, గలబ, గాగరా, గొంగడి, గోరక్కుఁడు, గోవ,

---

38. 'గురుతైన యపరంజి గొప్పముత్తెపునత్తు మోవిపై నొకవింత ముద్దుగుల్క' అని క్రీడాభిరామము (గంటివారి ముద్రణము) ఉపోద్ఘాతము (పు. 62)లో శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు శ్రీనాథచాటు పద్యభాగముగా ఉదాహరించినను 'హురుముంజి ముత్యములు, ప్రసిద్ధములగుట వలన, ఈ పద్యపాదము 'గురుతైన హురుముంజి గొప్పముత్తెపునత్తు' అని యుండుట యుక్తమని భావించుటచే 'అపరంజి'ని శ్రీనాథప్రయుక్తముగా పరిగణింపలేదు.

జప్పు, బాకీ, బావడి, బూటకి, దమామి, దేరా, పరాకు, పేషణి, బాఁకు. బిరాము, బొంచిలి, రావు, లూటి, వహీ, సంగడి, సవా, సుపాణి, సొగటాఇ, సోగాబొప్పి — మొదలగునవి.

అరబ్బీ పారసీ కావ్యాన్య సీమలలోని భాషలకు నిసర్గములయి ప్రత్యక్షముగా పారసీమందెగాని, పరోక్షముగా మరాఠీ భాషా ముఖమునఁగాని తెలుఁగునకు వచ్చి తెచ్చినవి మొత్తము పదములలో ముక్కాంపాలు. ఏవి ప్రత్యక్షముగా వచ్చినవో, ఏవి పరోక్షముగా వచ్చినవో బరాబరిగా గెలగీచి తూఁచి చెప్పుటకు ఉపలబ్ధి సామగ్రి చాలదు. అందాజు అంచనా యిది: అసరంజి, అంటీ, అసలు, ఆసివారు, ఈనాము, కత్తలాని, కమరు, కాకితము, కుందనము, ఖల్లా, ఖోజ్జా, ఖచ్చి, ఖాస, ఖుషి, గసగస, గస్తు, గులాము, గోహరి, చలువ, చకిలి, జబ్బులు, జలపోసనము, జిరా, జీబు, జుబము, తబల, తామెతు, తేజీ, త్రాసు, దరిదేసి, దుకాణము, దుహిలీ, నకీబు, పంజు, పారసి, పింగాణి, ఫౌజు, బరాబరి, బాజారు. బిబ్బి, మసీదు, మాలిమి, ముఖమల్లు, మేకు, మైజారు, మోజా, మోకము, రోజు, లాలు. లాహిరి, లుంగ. విలాతి, సన్నాయి. సరిహద్దు. సహా. సామ్రాణి, సురతాను. సెజాసు, హజారము. హద్దు. హమామము, హురుముంజి—మొదలగునవి.

టక్కి—సవాయికి సమీపమాతృక లివి:
కప్పురి. జోఁగులు మలయాభాషలోనివి.
తడజాసీకి, తవాయి, రమణా — లు బర్మాకు చెందినవి.

'సమ్మాను' చీనీ భాషాజన్యము; పరోక్షముగా మలయా భాషనుండి ప్రతిదేయము.

వలికా, పల్లి—పదముల మూలములు మృగ్యము.

ఈ పట్టిక పమగ్రమనుట సాహసము, నా యెఱుకకందని అన్యదేశ్యములు మరి కొన్ని యుండవచ్చు. విశేషాంశములు ఆయా ఆరోపములకడ వివృతము.

ఈ క్షేత్రమున సాగిన కృషి
శీలనము వలన అపూర్వములయిన అం
ఆశంస ![40]

పదప

1, అపరంజి : ఉదిరి, పుటప
దప్తకాంచనమా' (సాంబ – స్థా. 67
జేసే' (ఆధ్యాత్మసంకీ, సంపుటి V,
కలరుతాఎవలె' (వేం. పంచ 4–
(పైది 4–101). 'పశ్చిమంబు ప
4–341). < పారసి. అఫ్‌రంజ్ =
రంజ = ఈజిప్టు దేశములోని ఒక
వారి రాకపోకలతో ఎక్కువగా వాడు
రము : అపరంజి < అరబ్బీ అఫ్‌రం
(బౌ్రిణ్యము, రివైజ్‌డ్, పు. 1404).

2 అరబీ : అరబ్బీ దేశపుభాష, సెమిటిక్ భాష
ఆరేబియా యందును ఇస్లాము మతధర్మవాహకముగా త
చము నందును వ్యవహారముకల భాష. 'అరబీభాష తురు
1–73) < పారసి. అరబ్ = కౌశల్యము. నేర్పు; ధ
అక్కఱ.

3. అసలు : మూలము, మొదలు. 'అమ్మ నీ యల్లుని నసలేనెరుంగ–ఏరీతి దెలియదు నేయుపాయంబు' (పల్నాటి. పు. 73) < మరాఠీ. అసల్,

39. మోదేకుర్తి సత్యనారాయణ, తెలుగుశాసనాలలో అన్యదేశ్యాలు, భారతి. అక్టోబరు, 1959.

40. ఆచార్య శ్రీ గంటి జోగిసోమయాజిగారి పర్యవేక్షణమున లకంసాని చక్రధర రావుఆంధ్ర విశ్వకళా పరిషత్పరిశోధక విద్యార్థి–ఆంధ్ర భాషయందలి అన్య దేశ్యముల తలస్పర్శి విమర్శనమునకు పూనుకొనుట ముదావహము.

41. పదపట్టికలో వాడిన సంకేతములు సుపరిచితములు. '<' ఈ సంకేతము మొన వైపున నున్నది జన్యపదమనిగాని, పరిణతరూపమనిగాని అర్థము.

అస్సల్ = పురాతనము; మూలము; అసలీ = మౌలికము; అరబ్బీ అస్ల్ = మూలము; వాస్తవము; పారసి. అస్ల్ = ప్రాచీనము; అస్లాఫ్ = పూర్వులు; పితృదేవతలు; ఇస్లాఫ్ = సంచకర మిచ్చుట.

4. అసివారు : వాహ్యాళి, సవారీమార్గము. 'ఎవ్వాఁడు నలువతేరెక్కి-యష్టాదశ ద్వీపాళి యసివారు దిరిగెలీల' (కాశీ, 4-194), 'ఎవ్వండు నలువతేరెక్కి- యష్టాదశద్వీపి యందసివారు దిరిగె లీల' అని పెక్కుతాళ పత్రప్రతుల పాఠము. అసి ( = అల్పార్థకము) + పాఱు ( = పరుగెత్తు). అసివాఱు = మందగమనము-అను నిట్టి రూపనిష్పాదల రీతి ననుసరించిన ఆంధ్రనిఘంటువుల (శ.ర., పు.65; బ్రౌ.ని., పు. 103 : సూ. ని., సం. 1. పు. 361) వైఖరి ప్రామాదికము. దీనిని శకటరేఫ ఘటితముగా భావించుటయు భ్రాంతిమూలకము. 'అసివారు' ననంతర రూపమగు 'స్వారి' నిదేశ్యమను వజ్ఝలవారి అభిప్రాయము నిర్మూలకము (చూ, వైయాకరణ పారిజాతము, 1937.. పు. 112). 'అస్వార్' అను పారసిపదము దీనికి అసలు మాతృక; < మరాఠీ. అసివార = రౌతు, అశ్వారోహకుఁడు; పారసి. అసూవార్, అస్వార్ = రౌతు. 'ఆ పంచగౌడ ధాత్రీ పదం బెవ్వాని కసివారుగానేఁగునట్టి బయలు' (మను చ. 1-11) అను పద్యపాదమును ఎవ్వానికి + అసివారుగా అని విఱుచుటకు మాఱు, ఎవ్వాని + కసివారుగా అని తప్పుగా విఱిచి ఆంధ్రపద పారిజాతకర్తలు 'కసివారు' అను అనిష్టరూపమును సృష్టించిరి. (చూ, ఆంధ్రపద పారిజాతము, 1888 పు.182). వీరిని అవిమర్శముగా అనుకరించినవి, లక్ష్మీనారాయణమును (చూ. పు. 226), ఆంధ్రవాచస్పత్యమును (చూ. పు.787). ప్రాచీన వ్యాఖ్యలయందును ఇట్టితప్పు విఱుపు కన్పట్టదు. 'అసివాఱుగాన్ = సవారీ మార్గముగా' అని జూలూరి అప్పయ్య పండితుల ప్రతిపదటీక, పు. 3; (భారతీ ముద్రాక్షరశాల, చెన్నపురి, 1875). ప్రసిద్ధులయిన గురజాడ శ్రీరామమూర్తి, ఓగిరాల జగన్నాథకవి గారలు సంతరించిన ఆంధ్రపద పారిజాతముపై అల్పబోధనులగు కొందఱు చేయిపడియుండుట పరిశోధకవిదితము. 'ఆంధ్రపద పారిజాతము అను శుద్ధాంధ్ర నిఘంటువు ఓగిరాల జగన్నాథకవిగారి చేతను, గురజాడ శ్రీరామమూర్తిగారిచేతను రచియింపఁబడి తన్మిత్రులగు పిడుగు సుబ్బరామయ్యగారి చేతను, మఱికొందఱు పండితులచేతను మఱికొన్ని పదములను సోదాహరణముగాఁ జేర్పించి' ప్రచురించుట వలన ఈ పొరపాటు దొరలియుండునని నా

యూహ. 'మటికొన్ని పదములను' సోదాహరణముగాఁ జేర్చిన 'మటికొండఱు పండితులే' దీనికి కారకులు.

5. ఈనాము : చేసిన సేవలకు మెచ్చి యిచ్చెడి బహుమతి, పసదనము. 'కరిమయూర మరాళికలకు నొయ్యారమీనా మిచ్చి' (వరాహ. 4-159). < మరాఠీ ఇనామ : బహుమతి; పారసి, అరబ్బీ. ఇన్ ఆమ్ : బహుమతులు.

6. కంఖాణి : ఆఫ్ఘనిస్థానపు పరిసరములఁగల సీమనుండి కొనితెచ్చిన మేలి రకము గుఱ్ఱము. 'కంఖాణతురగరింఖా పుంఖిత....' (వరాహ. 5-27). 'సంజ్ఞా కంఖాణిన్' (పైది. 5-96). 'కంఖాణ' సంస్కృతపదమను ఆంధ్ర నిఘంటువుల నిర్ణయము సత్యవిదూరము. సంస్కృతసమాసమధ్యమునఁ బ్రయుక్తమగుటయే వీనికి ప్రమాణముకాబోలు ! 'ఈ శబ్దము తెనుఁగు గ్రంథములయందే కానిపించుచున్నది ! అని సూ. ని. కారుల జ్ఞాపిక, (చూ., సూ. ని, సంపుటి II పు. 8). ఆంధ్రదేశీయులగు సంస్కృత నిఘంటు కారులు దీనిని సంస్కృతపదముగా భావించుట ఆశాస్త్రీయము. 'కఙ్ఖాణః - అ. పు. గుఱ్ఱము' (సర్వశబ్దసంబోధిని, పు 117), 'కంఖాణః - అనంతః పుంసి॥ అమరః॥ ॥అశ్వే॥ గుఱ్ఱము' (సంస్కృతశబ్దార్థకల్పతరు, పు. 168). అమరకోశమున నీపదము లేకున్నను, శబ్దార్థకల్పతరుకర్త అమర సింహుని పేర్కొనుట ఆశ్చర్యము. వాస్తవముగాఁ అమరమునలేని పదములకును అమరమును ఆకరముగా బ్రదర్శించుట ఈ నిఘంటువునందలి విపరీత వైఖరి. తక్కిన ప్రసిద్ధ సంస్కృత నిఘంటువులలో ఈ యారోపమేకన్పట్టదు. వాస్తవముగా ఈ పదము సంస్కృతము కాదు. అశ్వములకు ప్రసిద్ధినందిన యొక దేశవాచకమిది. శుద్ధదేశ్యములగు పదములను సైతము సంస్కృత సమస్తపదములలోఁ బ్రయోగించుట శ్రీనాథునివచో విలాసములలో నొకదినుసు, కైవారము, హేరాళము మున్నగు సంస్కృతేతరపదములు సంస్కృత సమాసములలోఁ బ్రయుక్తమగుట శ్రీనాథరచనములఁగన్పట్టు లక్షణము. '...శ్రీనాథునకు సంస్కృత సమాసమున సంస్కృతేతరపదములఁ జేర్చు నలవాటుగలదు. ఇట్లే 'హేరాళ' పదమును గూడఁ బ్రయోగించినాఁడు....కయివారము అను రూపాంతరముండుట చేతను అచ్చతెనుఁగు గ్రంథములలోనుండుట చేతను దీనిని (కైవారమును) అచ్చికముగా గ్రహించుటయే యుక్తము.' అను సూ. ని. మతము (చూ., సూ., సం. II. పు. 460) సూరి జనసమ్మతము.

'...కలిభుపాలుని యొద్ది పాఠకులమీకైవార దుర్భాషణంబులకుంగాని యతండు మెచ్చండు...' (నైష. 7-89), 'ఆవేళను గంధర్వులు - కైవారాపదానుసారక మహీయముగాఁ బ్రావేశిక ధ్రువాగానావళులఁ బరిఢవించిరి....' (హర. 6-9), 'భారతీదేవి కైవార వాక్యంబులు పఠియింపుచున్నది ప్రస్ఫుటముగ....' (కాశీ. 7-57) 'ఇచటఁ గైవారశబ్దము సంస్కృత సమాస ఘటితమైయున్నది. ఇది సంస్కృత శబ్దము గూడని శ. ర. న నున్నదిగాని యచ్చకర్ణాట శబ్దముగఁ గర్ణాట నిఘంటువులలో నున్నది. ప్రాచీన సంస్కృత నిఘంటు గ్రంథములలో నెక్కడ నీశబ్దముగనఁబడదు. కావున నిది దేశ్యమొందెఁ గవివార (కవులపలుకులు) శబ్ది తద్భవ మొందెంగావలయు. ఈ శబ్దము స్తుతిపరముగనే యఱవమునను గన్నడమునను వాడఁబడుచున్నది.... శ్రీనాథుఁడు (దీనిని) సంస్కృతముగ భ్రమించెనని తోఁచుచున్నది.' (వావిళ్ళవారి కాశీఖండప్రతిలోని అధస్సూచిక). కైవారము దేశ్యమేగాని తద్భవముగాదు. కన్నడమున 'కయ్‌పాడ్, కైపాడ్, కైవార' పదములున్నవి. చేయెత్తి మంగళాశాసనము పలుకుటయని దీని యర్థము 'కైవార' (పంపరామాయణం ఎంబ రామచంద్ర చరితపురాణం, 12-50). తమిళమునందును 'కైవారమ్' అను పదమిదే యర్థమున దేశ్యముగా నుట్టంకితము. తమిళమున 'కైవారిగళ్' అనఁగా నిలిచి చేయెత్తి రాజులను పొగడుటకు నియమితులయిన వారనియర్థము. ఇట్లే '.... హేరాళ క్రీడా సంచారిణి నూకాంబ' (భీమ. 1-101) యను ప్రయోగమును శ్రీనాథుని ప్రౌఢ వాక్పాటవముగాఁ బరిగణింపనగు. హేరాళము సంస్కృత పదమని శబ్దరత్నాకరము (చూ. పు. 1123), కాని యిది పేరాళమ్ (> పేర్ + ఆళమ్) అను శుద్ధ దేశ్యమునకు అర్వాచీనరూపము, 'ప', 'హ'గా మాఱుట ద్రావిడభాషలలో ఒక్క కన్నడమునకు పరిమితము. కన్నడమునను క్రీస్తు పదియవ శతాబ్దమునుండియు ప్రవర్తకమయిన ధ్వనిపరిణామమిది. తమిళమున పేరాళన్, పేరాళి = ప్రసిద్ధవ్యక్తి, యశస్వి. కన్నడమున పేరాళ్ = యుద్ధవీరుఁడు; సమర్థుఁడు; హేరళ, = విరివి, విస్తారము. ఇట్టి సమాస రచనలో శ్రీనాథుఁడు అర్వాచీనకవులకు ఆచార్య పీఠము. కంఖాణ శబ్దమునకు అర్వాచీనకవి ప్రయోగములు కొన్ని:

'అంబుధి తెరల కొందఁబునఁదుటుములై భాసిల్లు కంఖాణ బలము లొదవి'

—విజయ 3-152

'గజ కంఖాణ శతాంగ పత్తి బల వర్గంబుల్—' —పైది, 3-174

'సురకుల ధురీణ కంఖాణ కరిక్రుపాణ రమ్యధావళ్య జైత్రపారావతంబు'
—సారంగ. 1-127.

'మదగజ కంఖాణ మాణిక్యగాణిక్య కనకాంబరము లుపాయనములందె'
—ఏనుఁగు లక్ష్మణకవి రామవిలాస పీఠిక.

'అరుణకంఖాణరింఖా ఘాతమైమించు నస్తగైరిక రజోవ్యాప్తియనఁగ'
—రంగారాయ. 3-137.

7. కంగారు: కలవరము; మనః క్షోభము. 'వెంగలి విత్తయి తిరుగుచుఁ—గంగారై చెడక' (భాగ. 9-583); యుద్ధము అని ఆంధ్రపద పారిజాతము, పు. 106 < మరాఠీ. ఖంగార్ = నాశము; శిథిలము; పారసి కంగర్ = మొండి పట్టుదల; మోటుతనము.

8. కత్తలా (శా) (ణి)ని: రూ. ఖత్తులాణము, ఖత్లానదేశపు గుఱ్ఱము. A horse brought from Khatlan (ప్రౌఢ్యము); తెల్లని గొరిజయుఁ దోఁకయు వెండ్రుకలునుగల నల్ల గుఱ్ఱము (శ. ర., పు. 197); కవచము తొడిగిన గుఱ్ఱము (ఆంధ్ర పద పారిజాతము, పు. 116); 'అమర వల్లభహరితో నుల్లస మాడంజాలెడు-తెల్లని యొక కత్తలాని తేజీహయమున్' 42 (నైష. 6-96), (ద్వా. 3-141); 'సాహిణుల్ దెచ్చిన కత్తళాని' (వరాహ. 3-40). 'వేలుపుఁ గత్తళానికి . . .' (పైది 4-145). ఇది కర్తలాణ శబ్దభవమని ఆంధ్ర నిఘంటువుల అంచనా (శ. ర., పు. 197, వైకృత దీపిక, పు. 27; పురుషోత్తమ కవీయము, పు. 22). కాని, ఏ సంస్కృత నిఘంటువునను 'కర్తలాణ' పదము కానరాదు. తుదకు ఆంధ్రదేశీయులయిన సంస్కృత కోశ

42. 'మహేంద్ర ముచ్చైః శ్రవసా ప్రతార్య యన్నిజేన్య పత్యాఽకృతసింధురన్విత మ్
స తద్దదేఽస్మై హయరత్నమర్పితం పురాను బద్ధుం వరుణేనబంధుతామ్'
—(శ్లో. 25, షోడశః సర్గః నైషధ మహాకావ్యమ్ చౌఖంబాప్రతి) అన్నది దీనికి మూలము.

[illegible] చేర్చినారేమో. శ.ర.లో కత్తి లాణము అను పదము నొద్ద [illegible] తెల్లని గొరిజ తోక వెండ్రుకలుగల నల్ల గుఱ్ఱము, కత్తలాని [illegible] 'హ్రస్వపిచ్ఛో ఽబ్జాంగ స్త్వథా కృష్ణోభవేద్యది-వరోనామ్నా [illegible] కత్తిలాణ స్తురంగమః' అను శ్లోకము శివతత్త్వ రత్నాకరములో నిదిగా ఉదాహృతము. ఈ శివతత్త్వ రత్నాకర మెక్కడిదో ఎప్పటిదో యెఱుఁగరాదు. 'కత్తి దేశపు గుఱ్ఱ'మని బ్రౌను దొరగారు చెప్పిన వ్యుత్పత్తి సంగతమగునో కానో పూర్తిగా ఉపేక్షించుట యుక్తము కాదు. <పారసి. ఖత్‌లాన్ = బదఖ్షాన్ దేశములోని 'ఖత్‌లాన్' అను మండలము. బదఖ్షాన్ ఇండియా-[illegible] దేశముల నడిమి దేశము; పద్మరాగములకు ప్రసిద్ధి; ఖత్‌లానీ = ఖత్‌లాన్ దేశమునందలి; 'ఖత్‌లాన' దేశపు మేలిజాతి గుఱ్ఱము; అరబీ ఖత్ల్ = కుటిల ప్రవాహము, కుటిలగతి: హొంచియుండి ఒడిసిపట్టుట ముఖ్యముగా శృంగార [illegible] ప్రయోగ మిట పరిశీలనార్హము.

'తెల్లని యొక కత్తులాణ తేజోహయమున్' (భువనగిరి రంగయ్య శెట్టి [illegible] చెన్నకేశవులు శెట్టిగారి జ్ఞాన సూర్యోదయ ముద్రాక్షరశాలా ప్రచురితమగు [illegible], అ. సరస్వతీ-నృసింహాచార్యుల వారిచేఁ బరిష్కృతము [illegible], 1889, పు. 99);

'తెల్లని యొక కత్తిలాణ తేజో హయమున్' (కత్తలాణము నొద్ద [illegible] శబ్దరత్నాకర పాఠము, 1885, పు. 211);

[illegible] సర్వంకష వ్యాఖ్యలో 'కత్తలాని' పాఠము స్వీకృతమయి కత్తిలాణ శబ్దభవముగా నిరూపితము, శ. ర. లో నుదాహృతమైన శ్లోకమే [illegible] ఉట్టంకితము, 1913;

'తెల్లని యొక కత్తులాని తేజీ హయమున్' (శ్రీమద్దేవ రాజసుధీ పరిశోధితము, కే. వేంకటశాస్త్రి విరచిత టీకా తాత్పర్య సహితము, ఆనంద ముద్రాలయ ప్రచురితము, 1914, పు. 561);

'తెల్లని యొక కత్తలాని తేజీ హయమున్' (ఉత్పల వేంకటనరసింహాచార్య పరిష్కృతము, వావిళ్ళ ప్రచురితము, 1927 వావిళ్ళ, 1951);

ఇంక, తాళపత్ర ప్రతుల పాఠము లీ దిగువ ఉద్ధృతములు :

'తెల్లని యొక ఖత్తులాణి తేజీ హయమును' (ఆంధ్ర విశ్వకళా పరిషద్గ్రంథాలయమునందలి తాళ పత్ర ప్రతి నెం. 29672, 79 వ ఆకు, మొదటి వైపు, 3వ పంక్తి) ;

'తెల్లని యొక ఖత్తులాణ తేజో హయమును' (ఆం.వి.గ్రం. తాళపత్ర ప్రతి నెం 29800,95 వ ఆకు, రెండవవైపు, 6వ పంక్తి);

'తెల్లని యొక ఖత్తులాణి తేజీ హయమునూ' (ఆం. వి. గ్రం. తాళ పత్ర ప్రతి, నెం. 32660.80 వ ఆకు, మొదటివైపు, 3 వ పంక్తి).

"ఒక తాళపత్ర గ్రంథములో 'ఖత్తులాని తేజో హయమున్ అని పాఠ భేదము....సంస్కృత నిఘంటువులలో ఈ పదము కానరాదు. ఇంకను విచార్యము" (సూ ని., సంపుటి II, పు. 154, క త్తలాణము' శబ్దము నొద్ద). శబ్ద రత్నాకరమున 'తేజీ' శబ్దము నొద్ద (చూ. శ. ర., 1885, పు 498) 'తెల్లని యొక కత్తలాని తేజీ హయమున్' అను పాఠము ఉదాహృతము. పూర్వ ముద్రణ పాఠములను, తాళపత్ర ప్రతుల పాఠములను పరిశీలింపఁగా, 'కత్తు లాని/ఖత్తులాణ' ఘటితములే మూల పాఠములనియు, బ్రౌనుదొరగా రొసంగిన వ్యుత్పత్తి సుసంగతమనియు, కత్తలాణ శబ్ద నిర్వహణకు శ.ర. కర్త మార్చిన నైషధీయ పాఠమగ్రాహ్యమనియు పిండితార్థము. శ్రీరంగమహత్త్వము (మానవల్లి సంపాదితము, జ్యోతిష్మతీ ముద్రశాలా ప్రచురితము, చెన్నపురి 1912) నందలి 'వెసఁగదలించి హేయనిన ప్రేల్మిదిలోనన నిల్చు ... వాగె వదల్చివేఁ జువ్వనన్ - జవంబెసఁగఁగ గాలి మీఱు భువి నెన్నికకెక్కిన ఖర్తులాణములో' (చతుర్థా. 1009వపద్యము) లోని 'ఖర్తులాణము'పై శ. ర. కర్త సృష్టించిన 'కర్తలాణము ముద్ర గాఢముగా పడినట్లు స్పష్టము.

9. కప్పలి:- సరకుల రవాణాకు ఉపకరించెడి ఒక దినుసు విలాతీ ఓడ. '....కస్తూరికా ద్రవ్యముల్ శరధిం గప్పలి జోఁగువల్లివలికా సమ్మోన్నతిం దెప్పించు....' (హర. పీఠిక, 28). మలయా భాషలో 'కప్పల్' అనఁగా ఓడ.

కమ్మరిశబ్ద భవముగా పేర్కొనుట (వైకృతదీపిక, పు. 28; పురుషోత్తమ కవీయము. పు. 23) ప్రామాదికము.

10. కమరు:- ఒడ్డాణము; మొలనూలు. '....కటి మండలము మీఁద వజ్రాల కమరు గర్వించుచూప' (కాశీ. 3-240). '....వజ్రాల కమరు నిల్పి' (వైజ. 7-148). 'వజ్రాల కమరు చేప విడంబనము సేయునే కొండ మొలచుట్టు నిండుకొనఁగ' (శివరా. 2-3); 'నితంబముమీఁద సవరింపవేల వజ్రాలకమరు' (వైజ. 2-26). < మరాఠీ. కమర, కంబర, కమ్మర = నడుము, కటి స్థలము; కమ్మర్ బొంద్ = వడ్డాణము; పారసి కమర్ నడుము; కమర్-బంద్ = ఒడ్డాణము.

11. కాకితము:- లేఖ, పత్రము, అన్నయమంత్రి శేఖరుఁడు...పారసి భాష వ్రాసినన్ - కన్నుల పండువై యమరు కాకితమందలి వర్ణ పద్ధతుల్' (భీమ. 1-74). < మరాఠీ. కాగద్ = కాకితము. పేపరు; పారసి. కాఘజ్, కాఘిజ్ = కాగితము; లేఖ; పత్రము; ఇది కాకలశబ్ద భవమను మన పండితుల నిర్ణయము (వైకృత దీపిక, పు. 32; పురుషోత్తమ కవీయము, పు. 27 ఆంధ్ర పదపారిజాతము, పు. 134; ఆంధ్ర వాచస్పత్యము, పు. 805; లక్ష్మీనారాయణీయము, పు. 225) నిరాధారము. కాకల శబ్దమే సంస్కృత నిఘంటువునను గన్పట్టలేదు. 'కాకల' శబ్దము 'కాకితము'అగుట అసంభవము. సంస్కృతమున 'కాఘజ్' పారసి మూలకముగా మోనియర్ విల్యమ్సునఁ బ్రవర్తితము.

12. కిచ్చడి:- నానా వస్తువులు చేర్చివండు చిత్రాన్న విశేషము (శ.ర; సూ. ని.). '...చాపలుఁ దియ్య కూరలుఁ బచ్చడులుం గిచ్చడులును . . .' (కాశీ. 7-185) < మరాఠీ. ఖిచడీ ఖిచిడీ; పారసి. కిచ్ రీ: పప్పు, బియ్యము, వెన్న - వీనితో తయారుచేయు భారతీయుల వంటకము.

13. కుందనము:- మేలిమి బంగారు. 'దశశతాక్షుఁడు తొడుగు కుందనపుఁ బైఁడి కంకటముబోలు? (నైష. 6-106). 'పదియారు వన్నెకుందనపుఁ బగడు' (భీమ. 2-55), 'కూర్పించె నల్లిండ్లు కుందనమున' (వైది. (5-188), 'కడాని కుందనంబు' (కాశీ. 7-126). 'కుందనపుఁ బూదె చందాన నందమొందె' (హంస. 2-115). 'కోమలి కాంతితోఁ గుందనంబు' (విక్ర, 4-19) 'వలిచన్నుగవ తళుకులు కుందనపు నిగ్గుల నొనర్ప'

(రుక్మాం 3-145), 'ధగ ధగమించు కుందనమున' (నవనా. పు. 20) 'ఉలూచిదాల్చు కుందనపు మెఱుంగుఁ గమ్మలును' (జై. 7-74). 'చందనంబున బుష్టంబు గుందనమున' (పి. శకుం. 2-62), 'అట్టి యాకుందన మొక్కచోట నిడి' (నా. పంచ. మిత్రభే. 515). 'కుందనపుకాశ' (తాళ్ళపాక, ఆధ్యాత్మ. X. సంకీర్తన, 180), 'కుందనపుఁ గాహళంబులు' (వరాహ. 11-44); 'సకలాకల నొరసిన కుందనపు బూదెయునుబోలె' (ప్రబోధ. 1-29). 'కుందనంపు హరివాణమునన్' (వేం. పంచ. 4-356). < మరాఠీ. కుందన; గుజరాతీ, కుందన్ = మేలిమిబంగారు; పారసి. కుందన్ = పరిశుద్ధలోహము. కన్నడమునందలి 'కుందణ, కుందన' పదములు దేశ్యములని కిట్టెల్ కన్నడ నిఘంటువు. పు. 441.

14 కుల్లా:- పటరచితమకుటము. 'కుల్లాపెట్టితిఁ గోకసుట్టితి ....' (శ్రీనాథుని చాటువు). < పారసి. కులాహ్ = నల్లగొఱ్ఱెపిల్లతోలుతో కూచిగా చేసి ముస్లిము సాధువులు, దర్వేషులు ధరించెడి టోపి; కులాహ్ = రాజు, ప్రభువు; కుల్లాయి, కుళ్ళా (యయి) పదము అర్వాచీనసాహిత్యమున విరివిగాఁ బ్రయుక్తము. ఇది ఖోలకశబ్దభవమని వైకృతదీపిక, పు 35; పురుషోత్తమ కవీయము. పు. 31; చూ కోహళి.

15. కొజ్జా:- షండుఁడు, నపుంసకుఁడు. 'వీథులఁదిరగంగ వెసఁద లారులుపట్టి కొజ్జానుజేసి రోసజ్జవారి....' (భోజరా. 4-319); 'అవుషండునకు కొజ్జాయనంగ....' (వేంకటేశాంధ్రము. మానవవర్గ, 33) <మరాఠీ. ఖోజా, ఖ్వాజా = ఫకీరు: ఏలిక. ఒక బిరుదము; పారసి. ఖ్వాజా = ధర్మదేశకుండు; పూజ్యుఁడు; ఏలిక, నపుంసకుఁడు; అంతఃపురము; ఖ్వాజసరా = నపుంసకుడు; ఖ్వాజా = షండుడుఁ; రాణివాసపు కావలివాఁడు; ఖ్వాజా = ఆశీస్సు అంతఃపురము; ఖ్వాజసరా = నపుంసకుఁడు; ఖ్వాజా = ఆశీస్సు.

కోహళి:- చూ. కుల్లా = శీర్షాచ్ఛాదనము; ఆలవట్టము, ఉల్లడ - అని పూర్వనిఘంటువులు. 'మౌళింగోహళి సంఘటించిన క్రియన్ మధ్యాహ్నవేళన్ మహాకాళంబైన నభో విభాగమున వీఁకంగాసె బీరెండ .... (హర. 7-109), 'పార్వతీపతికిఁ బ్రభాత భూతపతిగొన్న యలరుఁగెందమ్మి కోహళియనంగ— భానుబింబంబు గన్నులపండువయ్యె' (ఉ. హరి. 3-86). 'పయిరెండు ప్రయోగ

ములు లక్కుఁ దెలుఁగున నీపదము నాకెక్కడను గానరాలేదు' అని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి వ్రాఁత. (చూ. తెలుఁగు మెఱుఁగులు, పు 120).

కాని, మదికి సింగన ప్రయోగము—

'ఎసగంగ నుదయాచలేంద్రంబు మౌళి

పసిఁడికోహళియన భానుఁడు వొడమ' (ద్వి. భాగ. పు. 193) శ్రీ శాస్త్రిగారి చూపున కాని నట్టు కన్పట్టదు 'మరుఁడను నైంద్రజాలికుఁడు మాసిని నీలముఖ స్తనద్వయీ-నిరుపమ కోహళీ యుగళినించి ....' (కోహళీ యుగళి— తొడుగులు, కుప్పెలు) అను 'వనమాలివిలాస' ప్రయోగము సూ. ని. ఉట్టంకితము-కోహళికి ఆంధ్రశాసన ప్రయోగములు కొన్ని :

'....శ్రీ విక్రమోత్తుంగ రాజేంద్ర చక్రవర్తిన్ స్వస్తిశ్రీ త్రిపురాంతక శ్రీ మన్మహాదేవరకుం బెత్తెంచిన పహిండిచతుమున్ఖ కోహళి' (త్రిపురాంతక శాసనము, A. R. No. 170 of 1905: 2,3 పంక్తులు; క్రీ. శ. 1292);

'....ఈ దినమందు ధర్మలింగానకు పంచవర్త్రి కోహళి భంగారానం జేయించి సమర్పిన్ంచిరి' (పంచవార్ల లింగేశ్వరాలయ శాసనము, A. R. No. 218 of 1899; 17, 18, 19 పంక్తులు; క్రీ. శ. 1422);

'....ఉత్సవ పెరుమాళ శ్రీ ముఖానకు ఐను తులాలు ౫ భంగారాసను కోహలి సమప్పిన్ంచినాడు' (శ్రీ కూర్మము శాసనము, A. R. No. 347 of 1896: క్రీ శ. 1495). మఱి యొక ప్రయోగము కళింగ శాసనములలో నెక్కడో చూచినట్లు గుర్తు. ఇది సంస్కృత పదము కాదు. దేశ్యము కావచ్చును. దీని రూపమే ఒక తార్కాణము. తొడుగు, గొసెన అను నర్థముల 'కోహళె' కన్నడ కుమారవ్యాస భారత ప్రయుక్తము. మరాఠీ. ఖోళ = అచ్ఛాదనము; పొది; గుజరాతీ. ఖోళీ = గొసెన, పరుపుగలేబు కులాహ్'అను పారసీ పదము వర్ణ పరివర్తనమున కుహ్లా > కొహ్లీ > కోహళి అయి యుండ నగునేమో? ఇంకను విచార్యము.

ఖత్తులాణము:- చూ. కత్తలానివాస్తవముగా కత్తలానికిదిపూర్వరూపము. '....విగతత్రాణంబులగు ఖత్తులాణంబులను విస్తీర్ణజీర్ణాంగంబులకుమాతంగంబులను....' (పి శకుం. 3-114). తాళపత్రప్రతులను, ముద్రితప్రతులను 43 'ఖత్తు

బాణంబులు'అను పాఠముకలదు. '....విగతత్రాణంబ్బులగు కత్తు బాణంబ్బులును విస్తీనన్ జీవన్ంబ్బులగు మాతంగ్గంబ్బులును ....' (ఆంధ్ర విశ్వకళా పరిషద్గ్రంథాలయము నందలి తాళపత్ర ప్రతి (బొబ్బిలి ప్రతి) నెం. 111,51 వ ఆకు, రెండవవైపు, రెండవపంక్తి) '.... విగత త్రాణంబులగు ఖత్తు బాణంబులును విస్తీనన్ జీనాన్ంగంబులగు మాతంగంబులును....' (ఆం. వి. గ్ర. తాళ పత్ర ప్రతి, నెం. 2944,172 వ ఆకు, మొదటివైపు, 3వ పంక్తి). చతురంగ బలమున మాతంగములతోబాటు తురంగములను పేర్కొనుట సంగతము కావునను, అశ్వార్థమున 'ఖత్తులాణ' పదము అన్యత్రి స్థితిస్థాపకముకావునను. ఇట 'ఖత్తులాణంబులు'అనుపాఠమే యుక్తము. 'ఖత్తుబాణంబులు' లేఖ కల్పితము; పదస్వరూపమును పరిశీలింప పొలుమాలిన పరిష్కర్తల అలసతకు ప్రతి బింబము

16. ఖర్చు:- వ్యయము. 'అన్నపు ఖర్చున కాకుపోకలకు-ఈ నున్నదేమైన ఇపుడె యిప్పించు' (పల్నాటి పు 69) < మరాఠీ. ఖర్చ = వ్యయము; ఖర్చణేఁ = ఖర్చుచేయు ; పారసీ. ఖర్చ్ = ఖర్చు; ఖర్చీ = ప్రయాణ సంబంధమైన వ్యయము; రోవెల < అరబ్బీ.

17. ఖాన:- ముస్లిములలో పఠానీ తెగవారి పట్టపుపేరు. 'ఇమ్మడి సైవఖానాధి రాజ్యభార ధుర్యుండు విఠ్ఠల ప్రభువరుఁడు' (శ్రీరంగమహాత్మ్యము పీఠిక, 43). < మరాఠీ ఖాన = ముస్లిముపాలకుల బిరుదము; పారసీ ఖాన్ = ఖాత, తూరానీ (తార్తారీ) వంశీయులగు రాజుల బిరుదము; యువరాజు; ఉత్తమ వంశీయుఁడు; ఏలిక, ప్రభువు < తుర్కీ, ఖాన్.

18. ఖుసి:- సంతోషము; విలాసము. 'ఖుసి మీఱన్ సురధాణీ నిండు కొలువై కూర్చున్నచో....' (హర. పీఠిక, 22) < మరాఠీ, ఖుశీ, ఖుశ, ఖూశ (ష) = ఆనందము; సుఖము; పారసీ, ఖుసీ.

19. గంజాయి:- గంజాయి ఆకుతోఁ జేసిన మత్తుపదార్థము. 'గంజాయి

---

48. 'విగతత్రాణంబులగు ఖత్తు బాణంబులును విస్తీర్ణ జీర్ణాంగంబులగు మాతంగంబులును' —వావిళ్ళవారి 1923 ప్రతి, పు 68; కొండపల్లివారి 1968. 1947 ప్రతులు, పు. 64.

దినఁగ మత్కుంఠఁజేసినవాఁడ' (శివరా. 3-62). 'గంజాయి దినెనేమి....' (ద్వి. హరిశ్చ. ఉ. పు. 241) <మరాఠీ. గాంజా. 'కల (ళ)ంజ' పద భవమను పండితుల నిరూపణము అగ్రాహ్యము.

20. గలబ:- అల్లరి, సందడి, కలఁత. 'ఈ మహోత్సవంబులలో నిట్టి గలబలు సేయుదురే' (ద్వా. 7-30.) 'ఎల్లజనులం గూర్చుండనిచి గలబ పుట్టకుండ నెడ నెడందలవెరుల నిలిపి' (పై ది. 7-64) < మరాఠీ, గలబలణేఁ = అల్లరియగు; గలభా = క్షోభము. ధ్వన్యనుకరణమును కావచ్చు.

21. గసగస:- ఒక దినుసు మసాలా విత్తులు; నల్లమందు విత్తులు (ఆంధ్రపద పారిజాతము, పు 184) 'గసగస లివయును. (భీమ. 3-57). 'గసగస యొసక మెసఁగె' (కాశీ. 3-23), 'గసగసలు' (పై ది. 7-185), గసగసలు చాఱపప్పు' (రుక్మాం. 3-6)<పారసి. ఖష్‌ఖాష్; 'గసగసాలు: the minute seeds of the poppy plants This is corrupted from the Arabic name 'khash khash' Ainsl. 1.326 (బౌణ్యము. ప్రథమ ముద్రణము, పు. 204). గసగసాలనుట పునరుక్తియను భ్రమవలన కాఁబోలు 'గసాలు' అని అనంతపుర మండలము వారి వాడుక.

22. గస్తు:- దొంగతనము లోనగునవి జరుగకుండుటకై కావలివారు ఊరు తిరిగి కాచుకావలి. 'గస్తు దిరిగి' (ద్వి. హరిశ్చ. ఉ. పు. 252), 'అర్ధరాత్రవేళ-ఖడ్గఖేటకపాణియై గస్తుదిరిగెఁ - బెద్దతలవరి కింకరోపేతుఁడగుచు' (వేం. పంచ. 3-197)<మరాఠీ. గస్త = కావలి, విహారము; పహారా; పారసి. గష్త్ = అవలోకనము; విహారము; పహారా, కావలి కాయుట; గష్తీ = కావలి; గష్తియా = కావలివాడు; గుల్‌గష్త్ = విహారానుగుణమగు గులాబీలతోట; శహర్ గష్త్ = ఊరేఁగింపు.

23. గాగరా:- స్త్రీలు కట్టుకొను పావడ. 'వన్నెలగాగరా జిలుగు వల్లువకుచ్చెళులందు....' (శ్రీనాథుని చాటువు < మరాఠీ. ఘాగ్రా = స్త్రీల పావడ; ఘాగ్రీ = పిల్లల మొలనూలిగంట.

24. గులాము:- రూ. గుల్లాము, దాసుఁడు; దాసురాలు; జానిస 'ఓసి

గులాము నన్నెఱుంగకుండగ నెయ్యెడ కేఁగితి....' (నా. పంచ. మిత్రభే. 183వ పద్యము); హీనుఁడు. 'చెలుసెల్లముల కీక్షింప నిచ్చినసొమ్ము మగుడనీ లేవి కోమటి గులామ' (వేం. పంచ. 1-763) < మరాఠీ. గులాను = కొండెగాఁడు; నీచుఁడు; తొత్తు కొడుకు; బానిస. పారసి. గులామ్ < అరబ్బీ.

గుల్లాము :- చూ. గులాము. నీచురాలు. 'లంజెతల్లియె యిదియు గుల్లాముగాక' (క్రీడా. 265).

25. గొంగడి :- కంబళి. 'గొంగడు లెగురగవైచుచు' (భాగ. 10. పూ. 437) 'ముసుఁగిడ్డ యొరగొంగడియు' (నవనా. పు. 27). 'గొంగళ్ళు' (వేం. పంచ.) < మరాఠీ ఘొంగ = దుప్పటి; ఘొంగడీ. 'కంబళ' శబ్దభవమని కవిసంశయ విచ్ఛేదము. పు. 70. ఆంధ్రపద పారిజాతము. పు. 201. ఆంధ్రవాచస్పత్యము. పు. 1108; 'పదపడియలతి దుప్పట్లు గొంగెడలు' (పర్వత. పు. 339) అని పండితారాధ్య చరిత్ర ప్రయోగము.

26. గోరక్కడు :- నవనాథులలో నొకఁడు; మత్స్యేంద్రనాథుని ప్రధాన శిష్యుఁడు. 'గుణరత్న నిధియును గోరక్కుఁడనఁగ' (నవనా. పు. 254). 'అక్కడ మాని తత్పురియుపాంతమునన్ మననంబులోన గోరక్కుఁడు మీన నాథుడు...' (ద్వా. 12-48) < మరాఠీ. గోరక్ష = నవనాథులలో నొక సిద్ధుఁడు.

27. గోవ :- పశ్చిమ సముద్రతీరమునఁగల రేవు పట్టణము; పడమటి సీమలనుండి వచ్చు బేరపు దినుసులు ఈ రేవుగుండ దిగుమతి యయ్యేదివి. పూర్వనామము గోమంతకమఁట; 'సిందాపూర' యని మధ్య యుగముల వ్యవహారము. గోమంతకము 'గోవ' అయినదఁట; 'గోవజవ్వాది' = గోవారేవునుండి దిగుమతియయిన జవ్వాది (నైష. 6-120). 'గోవసంశుద్ధ సంకుమద ద్రవముఁ దెచ్చె' (హర. పీఠిక, 26). 'తరుణాసీరి తవాయి గోవరమణాస్థానంబులన్....' (పైది. పీఠిక, 28) > మరాఠీ. గోవేఁ = గోవా పట్టణము.

28. గోహరి : పరాక్రమము. 'హరికిశోరముల గోహరికి శోషిలని దుర్వార గర్వాటోప వీర భటులు' (జై. 6-154) > పారసి, గోహార్ = ప్రతిభ; అంతర్నిహిత శక్తి.

29. చబుకు : కొరడా, చేబుకోల. 'వాజీశవంబుల వడిమీద నెక్కి-చబుకుల గొట్టుచుచనుమను వారు' (పల్నాటి. పు. 119). 'సమరసముఁజూపి నెఱయఁబగ్గములు వదలి. సైంధవంబుల ధేయని చబుకు సేయ' (జై. 6-53) < మరాఠీ, చాబూక = కొరడా. పారసి. చాబుక్ = కొరడా; చాబుక్ బాజీ = చబుకు సేయుట. చబుకుతోఁ గొట్టుట. 'చబుకు' గ్రామ్యమనియు, పారసి జన్యమనియు కాంబెల్. (Campbell, p. 224).

30. చవుక : రూ. చౌక. ఎల్లిదము, లోఁకువ. 'జీవితతుల్యులం జవుక సేసి' (వేం. పంచ. 1-368) < మరాఠీ, సంవగ (ఘ) = అగ్గువ; గుజరాతీ, సోంఘ = వెల తక్కువ; అపభ్రంశ భాషలో 'సుమగ్ఘ (<సంస్కృత, సమర్ఘ)

31. చాడి :- కొండెము 'చాడిముచ్చు గొల్లెత' (తాళ్ళపాక. శృంగార సంకీర్తనలు, సంకీర్తన, 113),'చాడికి చెవిఁజేర్తురు' (వేం పంచ. 1-532) 'చాడికి నొడంబడి యుండెడి వృత్తికన్నఁ జావుమిగుల లెస్స' (పైది. 2-144) <మరాఠీ, చహాడీ, చాడీ, చాహాడీ = నింద; చాడ, చాడీ = తీవ్రవాంఛ; చాడ = కపటి, మాయావి.

31. a. చామలా :- ఒకరకమైన కడియములు. 'చామలా కడియముల్....' (పల్నాటి. పు. 72) < మరాఠీ, శామల = అబిసీనియాదేశపు సోమాలి.

32. చావడి :- కొలువు కూటము; రచ్చ, కార్యస్థానము '..పెద్ద సావళ్ళ - చేరి భాషించుచు....' (పల్నాటి. పు 28). 'స్వప్నమనే యెడపుఁ జావడిలో (తాళ్ళపాక. ఆధ్యాత్మ. vi 124), '....నగరిచావడి కడ వాకిటఁ దురగమ్ముడిగం... ' (జై. 8-80), లోపలచావిడిం గొలువున్న....' (వరాహ. 6-90), '....అద్దంకి సావడిని ..' (A. R No. 792 of 1922, 5వ పంక్తి క్రీ. శ. 1448) <మరాఠీ, చావడీ = కొత్వాలు చావడి: రచ్చబండ; చాహవడీ (వేళాపూర్ శిలాశాసనము) <సం: చౌహాట (మరాఠీ వ్యుత్పత్తి పదకోశము, పు. 276)

33. చికిలి-తుడిచి చక్కచేయుట (శ. ర.), మెఱుఁగు, పదను; శస్త్రసమ్మార్జనము. 'చిఱుసానఁ బట్టించి చికిలిచేయించిన గండ్రగొడ్డలి....' (కాశీ.

1-121) 'చికిలి చేసిన యడిదంబు' (శివరా, 4-74), 'చికిలి చేసిన తామ్రంపుఁ జెంబుఁబూసి' (వీధి నాటకము, 17). 'శృంగార రసమునఁ జికిలిసేయించిన కంతుమోహన సాయకంబులన....' (రుక్మాం. 1-71). చికిలి చేసిన మదనాస్త్ర నికరమనఁగ' (పరతత్త్వ రసాయనము, 1-100) < మరాఠీ సికల = మెఱుఁగు; గుజరాతీ సికల్ = మెఱుగు; సికలీగర = ఆయుధములకు పదను పెట్టువాఁడు; పారసి, సక్కాల్ = మెరుగు పెట్టువాడు; అరబ్బీ, సక్ల్ = మెఱుఁగు.

చౌక :- చూ. చవుక. తక్కువ. లోఁకువ. 'చౌక సేయక క్రుంకి' (నవనా, పు. 265), 'వానిబ్రదుకు చౌకౌగాదే' (ద్వా. 3-194), ఆచారంబు చౌక సేయు' (పి. శకుం. 5-163).

34. జబ్బు :- అలసము, మందము (శ. ర., పు. 421), అసారము (ఆంధ్ర పదపారిజాతము, పు. 251), జడిమ. 'జబ్బించుకలేని యొడలు' (శ్రీ నాథుని చాటువు)< మరాఠీ. జబూన = పేదపడిన, బీదగిలిన; పారసీ. జబ్ఫ = కృశించుట. చిక్కిపోవుట, వట్టిపోవుట. శుష్కించుట. <అరబ్బీ; దేశ్యమని కిట్టెల్ (కిట్టెల్ కన్నడ నిఘంటువు, పు. 636).

35. జమ్మకాణము :- రంగు రంగుల నూలిపట్టెలుగల ఆస్తరణము. జముఖాణము, '....వస్తువిచారుఁడు....వివేక నృపతి చరణంబులకున్ – వినతుండై తచ్ఛాసనమునఁ జేరువజమ్మఖాణమునఁ గూర్చుండెన్' (ప్రబోధ. 4-13)- ఇది సూ: ని. పాఠము. '....జమ్మఖాణమునఁ గూర్చుండెన్' అని ముద్రిత ప్రతిపాఠము, పు. 35. 'వస్తు విచారః॥ (ఉపసృత్య) జయతు జయతు దేవః ఏషవస్తు విచారః ప్రణమతి.

రాజా॥ ఇహోపవిశ్యతాం.

వస్తువిచారః॥ (ఉపవిశ్య) దేవ!, ఏషతే కింకరస్సంప్రాప్తః, తదాజ్ఞ యాతను గృహ్యతాం'— అని మూలము (కృష్ణమిశ్రయతి, ప్రబోధ చంద్రోదయ—చతుర్థాంకః. పు, 125, త్రివేంద్రమ్ సంస్కృత గ్రంథ మాలిక,

నెం. 122, సాంబశివశాస్త్రి సంపాదితము. 1936) <మరాఠీ. జమ్‌ఖాణ 44

36. జరి ;_ వెండి బంగారముల మొలాము. 'జరిగొన్న వెలిపట్టు జన్నిదంబులలుంగ' (క్రీడా. 42). 'జరివోవి గడితంపుఁ జిలుతచౌకంబుల' (పైది, 134). 'జరిగొన్న వెలిపట్టు జన్నిదంబుల తోడ రత్నాల తారహారము ధరించి' (శివరా. 2_90), 'వెన్నెలజరియడ్డ వెఁడితీగెఁ బోలు యజ్ఞోప వీతంబులు...' (విక్ర. 7_143)<పారసి. జర్, జరీన్ = బంగారు; ధనము; జర్‌తార్ = బంగారు పోఁగుతో చేయఁబడిన: వెండి, బంగారము మొదలగు వానితో మొలాము చేసిన నూలిపోఁగు; జర్ (= బంగారు) + తార్ (= దారము); జర్‌తారీ = బంగారు మొలాము చేసిన నూలి పోఁగుతో నేసిన వస్త్రము; జరబాజీ (జు) = జరీవస్త్రము; తెలుఁగున జరతారు.' 'జలతారు'గా పరిణమించుట వర్ణవిభేదనము (dissimilation)కు లక్ష్యము. జలతారీ (రు), జల్తా (రీ)రు దీని రూపాంతరములు, 'జలకము + తారు' అను శ. ర. వ్యుత్పత్తి అశాస్త్రీయము, తన్మూలమున నిరాకృతము. శ. ర. 'జరి' నివైకృతమనుట నిరాధారము. వైకృతదీపికలో నీపదము కానరాదు. ప్రాచీన పారసీక భాష_అవెస్తా_లో 'రన్య' అనఁగా బంగారము. అవెస్తాకు సోదర భాష యగు సంస్కృతమునందలి 'హిరణ్య', పారసిలోని 'జరన్య'కు జ్ఞాతి పదము (Cognate word). జరీకుచ్చులజీను. జరీకోక, జరీబుటాచీర_ అన్నవి తెలుఁగున అర్వాచీన ప్రయోగములు; చూ. జలపోసనము.

37. జలనోంగి : ఇది యే పట్టణమో యెఱుఁగరాదు; ఆఫ్రికా తూర్పు తీరము నందలి 'జీలాన్' రేవు పట్టణము కానోపు. 'జలనోంగి బంగారు మొలకఁ దెచ్చె' (హర. పీఠిక, 26).

38. జలపోసనము ; బంగారుపై పూఁత. సువర్ణాచ్ఛాదనము; 'బంగారు జల పోసనముతోడి ప్రన్నని సట్టు తోరము ధరించి' (క్రీడా. 42,). పైఁడి జల

44. పారసి. జామ = మూఁత, తెర; ఆచ్ఛాదనము; ఖానహ్ = స్థానము, తావు; జామ్ = రంగు రంగుల గాజు తలుపు; జామ్‌కాన్ = స్నానాల గదులలో దుస్తులు భద్రపఱచు అలమార; స్నాన సమయమున ధరించు ఉడుపులు; జామ్ ఖానహ్ = నేలపై పరచునది.

పోసనపు కసీసంపు పట్టు బంతి' (కాశీ. 6-161). 'పసిఁడి జలపోసనము తోడనె సక మెసఁగు- బిసరుహాసను పుటియ కప్పెరధరించి' (హర. 5-55). 'పైఁడి జలపోసనము వీణె' (రుక్మాం. 4-35). పైఁడి - జలపోసనంబులఁ జాల నొప్పారు - పల్లనంబులు....' (నవనా. పు. 143). 'సరిలేని బంగారు జల పోసము వీణె' (శ్రీరంగ మహత్త్వము. 2-70) < పారసి. జర్‌పోష్ = బంగారు లేసు పని; జర్ ( = బంగారు) + పోష్ ( = ఆచ్ఛాదనము. పూఁత); గుల్‌పోష్ = గులాబీలచే అలంకృతమయిన; జీన్‌పోష్ = జీనుమీఁది ఆచ్ఛాద నము; పలంగ్‌పోష్ = పరపుపైని దుప్పటి; పాయ్‌పోష్ = పాదాచ్ఛాదనము. పాదరక్ష (తెలుఁగున 'పాపచ్చులు, పాపోసులు, పాయిపోసులు) మేజ్‌పోష్ = మేజామీఁది ఆచ్ఛాదన వస్త్రము — ఇట్లు '-పోష్' అనునది పారసిలో విరివిగా ఉపయుక్తము. సర్వాంధ్ర పద ప్రదర్శని యగు ఆంధ్రపద పారిజాతము 'జర పోసు' అను పదము నుట్టంకించి 'జరీ' అను నర్థము నిచ్చినది. (చూ.పు-251) 'జలపోసనము = జలకము (<సం. జలమ్) + పోసనము' అనువ్యుత్పత్తి (శ.ర., పు. 423; ఆంధ్ర వాచస్పత్యము, పు. 1296; సూ. ని. III. పు. 407) నిర్మూలము.45

'జలపోసనముల మీఁదుల విలాసములఁ
గలశముల్ వట్టుఁగుచ్చుఁ జిత్తరువులు'

—పండితా. పర్వత. పు 310;

'సరిరత్న పంక్తుల జలపోసనములఁ
గరమొప్పు తొంగళ్ళుగల చల్లడములు'

—పైది. పు. 436 - ఇట్టి ప్రయోగములను బట్టి పండితారాధ్య చరిత్ర పండ్రెండవు శతాబ్ది రచన కానేరదు. సోమనాథుఁడు క్రీ. శ. 1290 ప్రాంతము వాఁడను మల్లంపల్లి వారి నిర్ణయము (భారతి, 1945, ఫిబ్రవరి) తో ఏకీభవింపక తప్పదు.

---

45. పూజ్యులు శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, శ్రీ దీపాల పిచ్చయ్య శాస్త్రి ప్రభృతులు ఆ మధ్య 'జనపోసనము'పై కన్ను వేసి సాఁగించిన చర్చయెక్కడో చదివినట్లు గుర్తు. వీ రేమి నిర్ణయించిరో స్మృతిలో లేదు. ఆకారము కొఱకు వెదకినను ఫలితము శూన్యము.

39. జాళువా : మేలిమి బంగారు, 'Fine gold. Probably (like Ophir or Potosi) the name of a place. Thus జాళువా పసిడి' (బ్రౌణ్యము, పు. 327). 'కమ్మ విలుకాని జాళువా బొమ్మ యనఁగ' (శ్రీనాథుని చాటువు), 'చెలగుచు జాళువా చీర ధరించి - రాజిల్లు హొంబట్టు రవికను దొడిగి' (పల్నాటి. పు. 65), 'తోరపు జాళువా పసిఁడి తొట్టుల...' (వేం. పంచ. 4-341). దీని మూలము అవిజ్ఞేయము. బ్రౌను దొరగారూహించినట్లు 'జాళువా' యనునది ఏదో యొక స్థల వాచక సంబంధి కానోపు. ఇంకను విచార్యము.

40. జిరా : ఏనుగులకు, ముఖ్యముగా గుఱ్ఱములకు పైని వేసెడి వస్త్ర కవచము. పక్కెర. 'వాగె వదలి జిరా గనగనం గదలించి తోలిన' (ద్వా. 8-71). 'జిరాల్ గురాలు' (వేం. పంచ. 1-188) <పారసి. జిర, జిరహ్, జిరిహ్ = కవచము; జిరిహ్ జామ = మీఁది ఉడుపులు; జిరిహి పోష్ = సైనికుల దుస్తులను ధరించుట.

41. జీబు : వస్త్ర భేదము. '.... శ్రీరామ తోఁపులును.... జీబులును....' (ద్వా. 3-188); 'చందురకావి జీబులు' (ఆము క్త. 5-90). 'హొన్నుఁచు పై తాణి సన్న జీబులు' (ఘటికా. 2-11), 'మాదాసళులను జీబులను' (కవి. 3-195) - అని అర్వాచీన ప్రయోగములు < పారసి. జేబ్ <తుర్కీ.

42. జులుము : దుండగము, అత్యాచారము. 'సతి నమ్మెదను హరిశ్చంద్రుఁడన్వాఁడ - జులుము లేటికి నొండు సుద్దులు మాని - తొలఁగుము...' (ద్వి. హరిశ్చ. ఉ., పు. 192) 'జులిమి' అని అందే అధస్సూచిక. 'దుడుకు లూటి జులిమి దుండగ మనఁదదు....' (వేంకటేశాంధ్రము, మానవవర్గు'69). 'దుడుకు లూటి జులిమి దుండగమ్మన నుద్ధతాఖ్య లౌ.....'(సాంబ. మానవ. 43) < మరాఠీ. జులూమ జులుమ = క్రూరపాలనము; ఉగ్ర శాసనము; అరబ్బీ. జల్మ = చెడుగా ప్రవర్తించుట; బలాత్కారము.

43. జూటరి : కల్లలాడు, మోసగాఁడు. 'కోటి చదువఁగవచ్చు కోపము నిలుపరాదు - జూటరై వొకఁడు దన్నునోఁక నాడితేను' (తాళ్ళపాక. అధ్యాత్మ VII. సంకీర్తన, 240) జూటు + అరి; 'జూటు' వైకృతమని శ.ర. (పు 429)

పరిగణనము.కాని, వైకృత దీపికలో ఈ పదము కానరాదు < మరాఠీ ఝుట్, ఝూట్, ఝూట = అబద్ధము; మోసము.

44. జోఁగు : = వెదురు బద్దలను, వేపబెత్తములను పేర్చి అల్లిన తెర చాపలు మూఁడు నుండి పండ్రెండు దాఁక అమర్చెడి పెద్ద ఓడ. 'మహిత లావణ్య వార్ధిలో మదనుఁడెక్కు-కప్పురపు జోఁగుఁగంటిమి కంటిమనుచు - నర్మగర్భంబుగా నొక్క- నలినవదన-పొగడె సఖిచంటి మీఁది యొప్పుల నఖంబు' (నైష. 3-101).46 సుడివడ్డ ముత్యాల జోఁగువోలె' (కాశీ. 1-138). 'కదలి మొగ యక్కలిందగులు వడి చిక్కిన జోఁగునుంబోలె....' (వైది. 2-98). '...శరధిన్ గప్పలి జోఁగు వల్లి వలికా సమ్మాన్నఁ దెప్పించు నేర్పరియై....' (హర, పీఠిక, 28). ఈ 'జోంగ్' జావనీ, మలయా భాషలలోనిది. ఈ ఓడల తయారీకి చీనావారు కారకులఁట! వీని తెరచాపలను అక్కఅలేనిచో దింపివేయక చుట్టగా చుట్టి ఓడ కంబములకు కట్టివేయుదురు. నాటు పడవలు, ఓడలు కొయ్యా చీలలతోడను, కొబ్బెర పీచుపురులతోడను బిగింపఁ బడుచుండగా, 'జోంగు'ల కొయ్యపలకలు ఇనుప చీలలతో బిగింపఁబడి బలిష్ఠముగా నిర్మింపఁ బడుచుం డెడివఁట. పదునాలుగవు శతాబ్ది వారగు ఇబ్న్ బతూతా, రషీద్-ఉద్-దీన్ మొదలగు విదేశ పర్యటకులు 'జోంగు'లను గూర్చి విస్తరించి వ్రాసిరి. మలక్కా మొదలగు ప్రాచ్య ద్వీపములలో భారతీయ వర్తకులు ముఖ్యముగా చోళమండల తీరము వారగు 'జెంతూ' ( = తెలుఁగు) సెట్లు చాలమంది నివసించుచుండి రనియు కోటికి పడగలెత్తిన వీరు 'జోంగు'లను పేరుగల పెద్ద పెద్ద సొంత ఓడలను సరకుల రవాణాకు వాడుచుండిరనియు బార్బోజా వ్రాతలు.47 ఈ తెలుఁగు సెట్లలో నెల్లూఁవారు, అపచి తిప్పయ్య సోదరులు, చామిసెట్టి ప్రభృతు లను ఉండవచ్చు. వ్యుత్పత్తి పరముగా చూచినచో సబిందుకము సాధుపాఠము.

---

46. 'నానాస్మరః కింహరక్షితిగుప్తేః పయోధరే ఖేలతి కుంభ ఏవ
ఇత్యర్ధ చంద్రా భ నఖాంక చుంబి కుచా సఖీ యత్ర సఖీభిరూచే'
—(శ్లో. 66. షష్ఠస్సర్గః, నైషధ మహాకావ్యమ్, చౌఖంబాప్రతి) అని మూలము

47. Hobson - Jobson, p. 472.

తాళపత్ర ప్రతుల పెక్కింటను సబిందుక రూపమే కలదు.48 నిర్బిందుకముగా కొందఱు ఉదాహరించుట పొరపాటు.

45. డమామి (యీ) : డిండిమము, డంకాకంటె చిన్నదియయిన చర్మ వాద్యము. 'డమాయీలు' (పల్నాటి, పు. 4), 'తబల....డమామి....ధ్వానంబు' (వరాహ. 3-52) < మారాఠీ. డమామి.

46. డేరా : గుడారము 'జగడంపు డేరాలు...' (పల్నాటి. పు. 36);'డేర యనఁగ వెలయు పటకుటీరాఖ్య....' (వేంకటేశాంధ్రము, మానవ. 74) < మరాఠీ. డేరా = గుడారము.

47. తబల : ఒకే కన్ను కలిగి మద్దెలను బోలిన చర్మవాద్యము. 'తబల డమామి....ధ్వానంబు....' (వరాహ. 3-52) < మరాఠీ తబలా; అరబ్బీ, పారసి తబ్లా, తబ్ల = చిన్నమద్దెల; తబ్ల్ = మద్దెల వాయించు; చిన్నమద్దెల; తబ్ల్‌జన్, తబ్ల్‌బాజ్ = మద్దెలకాఁడు.

48. తరుణాసీరి : బర్మాదేశము దక్షిణ భాగమున, తన్నాసరి రాష్ట్రమున, తన్నాసరి నది యొడ్డునఁగల ఒక రేవుపట్టణము. 'తరుణాసీరి తవాయి గోవరమణాస్థానంబులన్....' (హర. పీఠిక, 28) 'తరుణాచీని' యను వేటూరి వారి పాఠము ముద్రా రాక్షసము కాఁబోలు; 'తర్నాసరి మలయ ద్వీపకల్పమున నొక రాష్ట్ర ప్రధాననగరము' అని వేటూరివారి నిర్ణయము. మలయా-భాషలో 'తనాసరి' యని వాడుక. 'తనాహ్‌సరి' యనఁగా 'ఆనందసీమ' అని యర్థము. బర్మీలో 'త-నెన్-ధా-రి', 'తనంగ్-సరి' యని వ్యవహారము. అబ్దుల్‌రజాక్, నికోలాదీకోంతి, బార్బోజా-మొదఁగు విదేశ పర్యటకుల వ్రాఁతలలో "తన్నా

---

48. 'మహితలావణ్యవాధిన్‌లో మదనుఁ డెక్కు
తప్పరపు జోంగు గంట్టిమి కంటిమనుచు
పమన్గ భన్ంబుగా నొక్క నలినవదన
పొగడె సఖి చంటి మీంది యొప్పు లనఖంబు' (శ్రీం. నై., అం. వి. గ్రం లోని తాళపత్ర ప్రతి నెం. 29800. 42వ. ఆకు, మొదటి వైపు, 4.5 పంక్తులు);
'....జోంగు గంటిమి గంటి మనుచు....' (శ్రీం. నై., అం. వి. గ్రం. లోని తాళపత్ర ప్రతి నెం. 32660, 39వ ఆకు, మొదటివైపు, 7వ పంక్తి);

స్సరి,' 'తర్నస్సరి.' 'ఢెనాస్సరిమ్', 'దహ్‌నసరి' యను రూపములు ఉదాహృత ములు (Hobson-Jobson p. 914).

49. తవాయి : బర్మాదేశము దక్షిణ భాగము నందలి తన్నాసరి రాష్ట్రము న తవాయి నది తూర్పు ఒడ్డునఁ గల ఒక రేవుపట్టణము; తవాయిజిల్లాకు ముఖ్య పట్టణము. 'చీని సింహళ తవాయి హురుముంజి చోళంగి ప్రభృతినానా ద్వీప నగరాకరంబులకు....' (హర. పీఠిక, 7), తరుణాసీరి తవాయి గోవరమణా స్థానంబులన్....' (పైది. 28) మలయా ద్వీపకల్పమునఁగల రేవుపట్టణమవి వేటూరివారు-బర్మీభాషలోనిది 'ధ-వే', 'ధ-వాడ్' అని వ్యవహృతము-బర్మీ పండితులు దీనికి పలురకముల వ్యుత్పత్తి చెప్పిరి. 'ధ-వాడ్' అనఁగా ఖడ్గము లను కొనెడిచోటు; హ్తు-వాడ్' = బుద్ధునకుఁ సంబంధించిన', మలయా భాషలో 'తవాడ్' మూలరూపమున 'సయామీ' భాషలోనిదఁట ; (Hobson - Jobson. p. 904.) నేఁటి 'తవాయి' పట్టణము జనాభా 36 వేలకు పైబడి.

50. తాయెతు : దండనో మెడనో మొలనో కట్టుకొను రక్షాభూష. 'మేనికి రక్షయై మించు తాయెతులు' (పల్నాటి. పు. 17), 'చెలువొందు చుండెడు చేతుల రెంట-గత్తాలు చెక్కిన రమ్యాంగదములు - పండకడియములు దంట తాయెతులు-మక్కువతోఁ గట్టి - (పైది. పు 72), 'వక్షఃస్థలంబున రక్షపూసల పేరు దండతాయెతులను దగధరించి' (ద్వా. 7-45) < మరాఠీ. తావీజ = రక్షా భూష ; పారసి. త'వీజ్ = తాయెతు, రక్షాబంధము; అరబ్బీ, త. అవీజ్ = శరణుకోరుట: రక్షణార్థము సర్వేశ్వరుని ప్రార్థించుట; తాయెత్తు. ద్వ. వి. (తాయి + ఎత్తు) తల్లి బిడ్డలకుఁగట్టు రక్షాబంధము అని శ. ర. (చూ. పు. 468); 'నెలవంక తాయెతులు, లక్క తాయెతులు' అని అర్వాచీన ప్రయోగములు.

---

'..కప్పురపు జొదు గంటిమి కంటిమనుచు
... పొగడె సతి చంటిమీది యొప్పులనఖంబు' (శృ. నై. అం. వి. గ్రం. లోని తాళపత్ర ప్రతి నెం. 29672,30 వ ఆకు, మొదటివైపు. 7,8 పంక్తులు):
'మహితలావణ్య వాధిన్‌లో మదనుఁడెక్క
కప్పురపు జోగు కలకంఠి కంటిమనుచు...,' అని భువనగిరి వారి ముద్రిత ప్రతి. 1880, పు. 40;
సుడివడ్డ ముత్యాల జోంగువోలె' (కాశీ ఖండము, అం. వి, గ్రం. లోని బొబ్బిలి తాళపత్రప్రతి, 24వ. ఆకు, మొదటివైపు, 3వ. పంక్తి).

'తామెతు' పూర్తిచరిత్రకు చూ. వికృతి వివేకకర్తృత్వము, 'భారతి' జూన్, 1959.

తాసు : చూ. త్రాసు. '...వాలుచును తాసువలెనున్న దిదే – తాలిమిధర్మా ధర్మములు' (తాళ్ళపాక, అధ్యాత్మ. సంకీర్తన. 105).

తురక : చూ. తుర్కా. 'ఓపితురకల గెలిచి ప్రతాపరుద్ర – మనుజ నాయకు కోట నేమరక కాచె' (శివయోగ సారము, పీఠిక).

తురికి : తుర్కీ దేశమునుండి కొని తెచ్చిన మేలిజాతి గుఱ్ఱము – 'దిన మణి తేజీలకంటె నొప్పు తురికి గములుగలిగి' (భాస్కర. యుద్ధ. 2280). గుఱ్ఱపు నడకలలో నొకటి. 'తురికి నడయు' (ద్వా. 8–71). తురంగ శబ్దభవమని వైకృత దీపిక, పు. 59; పురుషోత్తమ కవీయము. పు. 66; చూ. తురక్కా.

51. తుర్కా : రూ. తురక, తుఱుక తుర్కీజాతీయుఁడు, తుర్కీదేశీయుఁడు: ఇస్లామమతానుయాయి. 'కర్తారుఁడుండు 49. తుర్కల మసీదు' (క్రీడా. 148) < మరా. తుర్కా = మ్లేచ్ఛుఁడు; తురుష్క జాతీయుఁడు; పారసి. తుర్క్ = ఒకజాతి; 'తురుష్క,' 'తుర్కా',కు సంస్కృతీకరణ రూపము. 'తురుక్కా' పదము క్రీ. పూ. మున్నూ జేండ్ల నాఁటి ప్రాకృత భాషాగ్రంథ

48. కర్తారుఁడను పదము హిందీయని కొందఱు. హిందీలో ఇది లేదు. 'కర్తృ' ప్రథమా బహువచన రూపము 'కర్తార'. సృష్టికర్త సర్వేశ్వరుఁడని అర్థము.

1. 'కర్మకర్తారుఁడని కడలేని పుణ్యముల కర్మఫలములు దనకుఁ గైకొలుపఁగా కర్మగతిఁదెచ్చి వెంకట విభుడు మా వుభయ కర్మములఁ జెరిచె నెక్కడి దైవ మిఁతడు' (తాళ్ళపాక. అధ్యాత్మ v. 196);

2. '...సర్వతంత్రములకుం గర్తారుఁడంచున్...' వీరభద్ర విజయము, 4–102);

3. '...ముజ్జగంబులకు నెల్లన్ దాన కర్తారుఁడై...' పైది, 4–222);

4. '... అతఁడు దానైన కర్తారుఁడలమి కూర్మిఁ బ్రోవ' (యయా. 1–16);

5. 'ఎప్రొద్దుఁ గూరిమి హెచ్చఁ గర్తారునిఁ దలఁపులో నిలుపుగతాతఖను' (పైది. 1–47) ;

6. 'ప్రౌఢక'ర్తారు శబ్దంబు రూఢికెక్కె' (కువలయా. 1–40);

7. '...కర్తారుండనుచున్ దురుష్కులు మొదల్గాఁగొల్వ...' (విప్ర. 3–50);

8. 'సారెసారెకుఁ గర్తారు దూఱువారు' (కృష్ణరా. 3–46).

ములఁ గన్పట్టుటవలనను. తెలుఁగునందలి 'తుర్కా'కు సమీప మాతృకను నిర్ధారించుట దుస్సాధ్యమగుటవలనను 'తురక,' 'తురికి,' 'తుర్కా,' 'తుఱుక' లను వైకృతములుగా సంభావించుటయు సంగతము. 'తురక' తురుష్క శబ్దభవమని వైకృతదీపిక, పు. 59; పురుషోత్తమకవీయము, పు. 66.

తుఱుక : చూ. తుర్కా. '....తుఱుక రాజులు....' (A. R. No. 211 of 1892; క్రీ. శ. 1485; దక్షిణ హిందూదేశ శాసన సంపుటి. iv).

తేజి : చూ. తేజీ. '....క్రాలెడు తేజు లెవ్వనికి....' (కావ్యా. చూ. 5-98), 'తేజుల' (మడికి సింగన, ద్వి. భాగ., పు 83), 'హురుముంజీ జలుతేజి హరులు దెచ్చె' (హర. పీఠిక, 26), 'గుఱ్ఱము లెల్లను దేజులప్పు రిన్' (విక్ర. 1-99), 'సామ్రాణి తేజులను' (నవనా, పు. 185), 'ఒక సారె యేడు తేజులు....' (ద్వా. 5-83), 'తేజులఁ జామరంబులను' (వైది' 8-5), 'అన్నిటఁదేజి యాడఁగ దేవుఁడు- తిన్నఁగ వాగెలు దిప్పీవాఁడే' (తాళ్ళపాక. అధ్యాత్మ. vi, 93) 'గబ్బితనమున తేజి మొగంబు గట్టి' (జై. పీఠిక, 32), 'అర్కా తేజుల' (పి. శకుం. 1-80), 'ఎక్కాడు తేజి వ్యర్థమయ్యె' (వరాహ. 4-45), 'తేజికి' (వేం. పంచ. 4-161).

52. తేజి :- రూ. తేజీ. మేలుజాతి గుఱ్ఱము. 'దినమణి తేజీలంటె నొప్పు తురికిగములు కలిగి' (భాస్కర. యుద్ధ. 2280), 'అట్లనికినిచ్చె... నమర వల్లభూహరితో నుల్ల సమాడం జాలెడు- తెల్లని యొక కత్తలాని తేజీ హయమునన్' (నైష. 6-96), 'పడివాగెతేజీలు పల్లకీజోళ్ళు' (పల్నాటి. పు. 4), 'తేజీలన్ మదేభంబులన్' (రుక్మాం. 3-81), 'తేజీలు, మదమెత్తి తిరుగు నేనుఁగులు' (నవనా. పు. 25), 'సాంబ్రాణి తేజీలు' (ద్వి. హరిశ్చ. ఉ పు. 283). పడివాగెతేజీలు (తాళ్ళపాక, x, 94), 'చెలువమున నిండు ముఖులు తేజీలనెక్కి, (జై. 5-111), 'అంచతేజీ' (వరాహ. 7-33), 'విభుఁడు తేజీనెక్కెన్' (వేం. పంచ. 2-198) <మరాఠీ. తేజీ = అరబ్బీ దేశపు గుఱ్ఱము; పారసి. తాఝీ, తేఝీ, తాజి = అరబ్బీదేశపు గుఱ్ఱము; తాజీ యాన్ = అరబ్బీ గుఱ్ఱములు.

53. త్రాసు : రూ. తాసు = తుల, తక్కెడ. 'గడసిల్లు ధరయొడ్డ గెడవైన నెవ్వాఁడు త్రాసుపైఁగట్టె చందమునవంచె' (భీమ. 2-77), 'సహజ

కీలిఁ బుష్పశరుఁడు త్రాసునఁదూఁచి....' (విక్ర. 4-183), 'భాసుర రూప సంపదలఁ బ్రాఁతిగ నాతని భావసంభవుం-ద్రాసునఁ దూఁన్పవచ్చు....' (పైడి. 7-147), 'తాసునంబెట్టి తూచిన' (నాసికే. 3-27), 'బహు శౌర్యముల్ త్రాసునఁ దూఁపవచ్చునన....' (జై; 5-199), 'గంధర్వ బాలికలఁ ద్రాసులం దూఁచు బంగారు ప్రతిమల విధంబుల....' (వరాహ. 12-43) 'ఇనుపత్రాసు' (వేం. పంచ. 1-767, 1-783). 'ఎలుకల్ దినెఁద్రాసని' (పైడి. 1-774). శ్రీనాథునకు పూర్వులగు కవుల కృతులయందును 'త్రాసు' ఉపయుక్తమయ్యె ననుటకు క్రింది ఉదాహృతులుచాలు: 'త్రాసులంబోని చిత్తంబుల తోడుతఁ బ్రజవివాదములెడఁ బక్షముడిగి-విని ధనవాంఛమై ధనికుల దెసవ్రాలి తీర్పక ధర్మంబు తెరువు దప్పకుండఁ బాడిదీర్చి....'(భారత. శాంతి. 2-374),'ధనము కలిమియు లేమియుఁ ద్రాసునందు - నిలిపి యెత్తంగములుసూపె నిర్ధనత్వ- మెక్కుడై హాని దక్కున నెట్టులన్న-వినుము గుణదోషముల భంగి విస్తరింతు' (పైడి. 4-33), అచ్చులఁ ద్రాసులఁ దూములఁ - బొచ్చెంబుగఁ జేసి....' (విజ్ఞా. ప్రాయశ్చిత్త. 65). 'సత్యదినంబున సరిత్రాసుఁ బూజించి....' (పైడి, వ్యవహార. 117), '... త్రాసునం దూఁచువారునుం బోలె....' (ఉ. హరి. 4-256); '...అమదోపడికి త్రాసు నాయమువలన ఇచ్చినది....' (ఈపూరి శాసనము. A- R. No. 531 of 1913, క్రీ. శ. 1278), '....ఓగిరానకూ త్రాసునాయము వల్ల....' (ఈపూరి శాసనము, A. R. No. 531 of 1913, క్రీ శ. 1278) అని 'త్రాసు'శాసనములయందును ఉపయుక్తము (త్రాసు నాయము = తూనికవలనవచ్చు లాభము) < మరాఠీ తరాజూ = త్రాసు; పారసీ;తరాజూ = తుల; తూఁకము;సమానత,న్యాయము.'త్రాసు' దేశ్యమని బ్రౌణ్యము,పు.467. పదాదిరేఫ పరకసంయుక్తత ఆంధ్రభాషా వికాసమున విశిష్ట-పరిణామము. తెలుఁగునందును. మధ్యద్రావిడ భాషలగు కుఇ కువి, కొండదొర భాషలయందును దప్ప, తక్కిన ద్రావిడభాషలలో పదాదిరేఫ పరక సంయుక్తత కన్పట్టదు. తెలుఁగున తద్భవ దేశ్యముల యందును ఈ పరిణామరీతి ప్రచురము. ఉదా: క్రీడి (= అర్జునుఁడు) < ప్రాకృత. కిరీడి < సంస్కృత-కిరీటి; మ్రానుఁ = వృక్షము : తమిళము, మరం : తెలుఁగు. వ్రేలు : తమిళము. విరల్. తెలుఁగునందలి క్రాలు, క్రిందు, క్రొత్త, క్రోవి, త్రాచు, త్రిప్పు, ప్రోలు, మ్రింగు, మ్రొక్కు, వ్రాయు మొదలగు పాదాది రేఫ పరకసంయుక్త రూపములు మఱికొన్ని లక్ష్యములు. అన్యదేశమగు 'త్రాసు'ను ఏతత్పరిణామాను గుణముగ సిద్ధము.

54. దరిబేసి : ముస్లిము ఫకీరు. 'సందులఁ గుండలముల్ గుడిసందిసి శివలింగమును నొసలభూతియుఁ బెంపొందఁగ నొక దరిబేసి మరుందెగవెడు నన సమయ విరోధము...' (ఛందో, 4_31),50 'భుజమునఁ గూబకంబు ధరించుకొని సోలు దరిబేసియగుచు బేతాళుఁడొకఁడు' (జై 5_196) దైన్యము గలవాఁడు. దీనుఁడు అని శ. ర; పు - 529; జైమిని భారత ప్రయోగమునకు 'పీర్ల పంజాను ధరించిన జలాలీ' అని అర్థముచెప్పుట యుక్తము < మరాఠీ. దరవేస, దరవేశీ, = దేశసంచారి యగు ముస్లిముభిక్షుకుఁడు; దిక్కులేనివాఁడు, పారసి. దర్వేష్=దరిద్రుఁడు, నిర్ధనుఁడు; ఫకీరు; సన్యాసి; దర్వేషాన=బిచ్చము, దర్వేషీ = ధార్మిక జీవితము; దర్వేషిసుల్తాన్‌దిల్ = మొహమ్మదు పైగంబరు అన్వర్థబిరుదము.

55. దుకాణము : అంగడి, మళిగ. 'తొలకరిమింపుఁ దీవగతి దోఁప దుకాణము మీఁదనున్న యయ్యలి కులవేణితోఁదములపాకల బేరములాడఁ బోయి....' (శ్రీనా. చాటువు).'....ఒయ్యారంబుఁ జూపన్ దుకాణముపై బొంది లిదోర్తు నిల్చె....' (శ్రీనా. చాటువు) < మరాఠీ. దుకాణ(న); పారసి, దుకాన్; దుక్కాన్: అరబ్బీ. దుక్కాన్: దుకానీ = దుకాణదారుఁడు.

56. దుహిలీ హస్తాభరణ విశేషము - 'తోరంపువజ్రాల దుహిలీలడాలు' (నవనా_పు. 46), < మరాఠీ. దుహేరా, దుహేరీ, దుహేలీ = జంట; పారసి? దువాల = తోలుపట్టీ; దువాలక్ = చిన్నపట్టీ.

57. నకీబు : చోపుదారి, ఎచ్చరిక దెలుపు వేత్రధరుఁడు; స్తోత్రపాఠకుఁడని బ్రౌణ్యము, పు. 473 'వరతత్త్వరాజు ముందట మొరయు నకీబులవిధాన మ్రోయుచు' (వరాహ. 9_112), మిన్నుముట్టిన ప్రాంతమినుకు నకీబుల హుంకృతి' (పైది. 10_5) 'కరువలినకీబుగాగ....' (పైది. 10_29); పొదలఁదుమ్మెదనకీపులు బిట్టుమొరయ' (ద్వి. పరమ. తృతీయా. పు. 241) అని అర్వాచీన ప్రయోగము < పారసి. నకీబు = బిరుదుగద్యలు చదివి, దర్శనార్థులను ప్రభువునకు పరిచయము చేయువాఁడు.

---

50. (అమరఁగఁ బులితోలును మ : స్తమునం బలుజడలు దాల్చి సొగతుఁడొప్పెన్ : హిమకరశేఖరు గుడి నన : సమయ విరుద్ధార్థమగుచుఁ జను సత్కృతులన్' :: (6_134) అని సమయ విరోధమునకు లక్ష్యముగా కావ్యాలంకార చూడామణి.

58. పంజార : 'సుమాత్రా' ద్వీపమున 'పజ్జార్' అను పేరుగలది. ఒండే. బోర్నియో' ద్వీపమున 'పంజార్ మాసీస్' అను పేరుగలది. ఈ రెండు దేశములు కర్పూర వృక్షములకుఁ బ్రసిద్ధములేయఁట' (వే. ప్ర. శాస్త్రిగారు, హర విలాస పీఠిక, పు. 7) 'పంజారఁ గర్పూర పాదపంబులు దెచ్చె...' (హర. పీఠిక, 26).

59. పంజు : ప్రకాశించు రత్నములు చెక్కిన. 'పంజుమంచము డిగ్గి మంజుఘోష' (హర. 7-137) దివటీ. 'వెంటి పంజువలె' (ప్రబోధ. 4-48). [51] 'సూరెల వెలుంగు పంజుల' (వేం. పంచ. 4-345) < పారసి. పంజ్ = జ్యోతి; ప్రకాశము; పంజ = ఐదుప్రేళ్లపోలిన కాగడా.

60. పండువా : పదునాలుగు పదునైదు శతాబ్దులలో పశ్చిమ బంగాళమును పాలించిన సుల్తానుల రాజధానియగు 'పాండువా' పట్టణము — నేఁటి బంగాళమున మాల్దా జిల్లాలోని ఇంగ్లీషుబజారు( < అంగ్రేజాబాద్)నకు నాలుగున్నర కోసుల దూరమున నీ పట్టణమున్నది. దీనికే ఫీరూజాబాద్ అనియు నామాంతరము. 'పండువాయను దేశము' అని సూ. ని. (చూ. సంపుటి. v, పు. 28). 'పండువా సురతాణి పావడంబిచ్చిన భద్రేభములు వీధిఁబాలెముండు' (భీమ. 1-38). పండువాసురధాని పావడంబంపిన భద్రేభములు వీటఁబాళెముండు' (కాశీ పీఠిక, 35). 'పండువా ఢిల్లి రాఢాది పట్టణముల యధిపతులు' (హర. పీఠిక, 29).

61. పరాకు : ఉపేక్ష, నిర్లక్ష్యము. 'దమయంతి ... పరాకువహించి యుండె' (నైష. 5-106) 'పరాకుసేయకు' (తాళ్ళ. అధ్యాత్మ Vii. 61) తత్పరత. 'రాకుమారునిఁజూచు పరాకు కతన' (నైష. 6-63); ఏమఱపాటు '..ముచ్చటల్ ద్రవ్వుచు నొక్క కోమలి పరాకున నుండఁగ...'(నైష. 6-113). '...ఇదియేమి పరాకున నున్నదానవో తొత్తుల తొత్త..' (నా. పంచ. మిత్రభే. 205), 'పరాకుగా' (వరాహ. 4-11), 'అతని పరాకుచూచి రుధిరాక్ష నిశాటుఁడు...' (జై. 6-167). 'నాకెక్కడిది పరాకు...' (వేం. పంచ. 2-91); మఱి యొకట మనసు చెల్లుట. 'ఆత్మ నొక్కించుకయుఁ బరాకయ్యెనేనిఁ బ్రాణవల్లభ దన్నేమియనునొ యనుచు' (నైష. 7-16), 'కొందఱు ప రా కు లేకాకినులై

51. 'వెంటపంజు' అని ముద్రితపాఠము, ప్రబోధ చంద్రోదయము,చింతామణి ముద్రాక్షరశాల. చెన్నపురి, 1900 ; పు. 40.

మగని మొఱఁగి యెక్కడికేనియుం జనుదురు' (కాశీ. 2-79), 'ఉడుగనివంత నింతతడ వూఱటలేక పరాకువోలె' (వేం. పంచ. 2-74), అచ్చెనఁటి పరాకుఁ బోలె నటు మొగమయ్యెన్' (పైది. 2-88); ఎచ్చఱిక దెబుపుమాట. 'బహు పరాకాయె' (తాళ్ళ. అధ్యాత్మ. Vi. 58). [(పార్వతీ ధవ పరమేశ భవపరాకు (పరతత్త్వరసాయనము, 1-118)] < మరాఠీ ప రా ఖ్, పరిఖ్ = శోధన; ఏకాగ్రత ; పర్యవేక్షణ పరాఙ్ముఖ శబ్దవికృతి కావచ్చునని మా గురువర్యులు శ్రీ మధుసూదన ఘోడంగీగారు. పరాక్-శబ్ద భవమని వైకృతదీపిక, పు. 73; పురుషోత్తమ కవీయము, పు. 84. ఈ పక్షమున నిది వాక్-వాక్కు, వాకువలె పరాక్-పరాక్కు—పరాకు అని తత్సమముగా సాధింపనగు పరాక్కు = ప్రతి లోమగామి. పరాఙ్ముఖము.

పవుజు : చూ. పౌజు. 'ఇరులు పవుజులు' (విక్ర. 6-63).

62 పారసి : ఇరేనియను భాషా కుటుంబమునకు చెంది, పారసీకదేశ మున ప్రచుర వ్యవహారము కల ఒక భాష. 'అన్నయ మంత్రి శేఖరుఁడు...పారసి భాష వ్రాసినన్...' (భీమ. 1-74) < మరాఠీ. ఫారశీ(సీ) = పారసిభాష : పారసి వాఁడు (పారసీకము సంస్కృతీకరణ రూపమని మరాఠీ వ్యుత్పత్తి పదకోశము. పు. 526). అరబీలు : ఫర్స్ = పశుపాలన, పారశీక శబ్దభవమని వైకృతదీపిక, పు. 77. పారసీక శబ్దభవమని పురుషోత్తమ కవీయము, పు. 88.

63. పింగాణి : 'ఒక దినుసు తెల్లమట్టి పాత్రము' (శ. ర., 676). 'గాజు పింగాణి' (రుక్మాం. 4-35), 'గంగాళాలు పింగాండ్లు' (వరాహ. 4-112), 'పచ్చల పింగాణిఁ బన్నీరు గులికిన' (పైది. 4-156) < పారసి. పింగాన్ = పళ్ళెరము; ఫింజాన్ = చీనా మట్టిపాత్ర, ఇది మ రా ఠీ లేక క న్న డ పదమై యుండవచ్చుననియు, సీతాకోక చిలుక అని అర్థమనియు, రంగురంగుల సీతా కోక చిలుకల బొమ్మలను చిత్రింపఁబడిన పాత్రలు కావున వీనికి 'పిం గా ణి' పాత్రలు అను పేరు సిద్ధించిన దనియు మిశ్రబ్రౌణ్యము, పు. 75.

64. పేషణి : దూత, సందేశహారి.[52] 'పేషణి హనుమంత బిరుదాంకు

---

52. 'పేషణీ యనఁగా వన్నెకల్లు—హనుమంతుఁడు సన్నెకంటిమీఁద పచ్చడి నూఱిన నెట్లు నూఱునో శత్రువులను అట్లు నూఱెడువాఁడు అని బిరుదార్థముగా నుండ నౌపు' (వేదమువారి సర్వంకశావ్యాఖ్య. మదరాసు. 1913 ; పు. 18.).

లగు రాచ వారికి నెయ్యంపు వరసుతుండు...మంత్రి యల్లాడరాజు...' (నైష 1-32)[53] 'పేసని హనుమంత్త బిరుద ప్రతాప వత్సవాయ అయ్యపదేవ మహారాజులు...' (పెద్దాపురము తిరుపతి శ్రీరంగరాయ (? శృంగారరాయ) దేవాలయ ముఖ మంటప స్తంభము మీఁది శాసనము, 5, 6, 7-పంక్తులు, క్రీ. శ. 1442), 'దానప్రతిగ్రహో ధీన బిరుదు మీది-పేషణీ హనుమంత బిరుదనాది' అని అర్వాచీనుఁడగు కందుకూరి రుద్రకవి చాటువు (చాటు పద్య మణిమంజరి, ద్వి. భా. పు. 26) <మరాఠీ. పేషణ = నియోజించుట; పేషణీ = రాయబారి < సంస్కృత-ప్రేషణ = పంపుట; ఆదేశము ; ప్రాకృత. పేసణ = నియోజనము; ఆజ్ఞ, ఆదేశము-'పేసణంచ కజ్జమ్మి' అని దేశీనామమాల vi. 57.

65. పౌజు : రూ. పవుజు. సేన; పటాలము. 'పౌజుపై నడచిరి' (పల్నాటి. పు. 114), 'చిలుక గుఱ్ఱపుఁ బౌజు' (విక్ర. 8-57), 'పుట్టుగులనే పౌజుల కురికి' (తాళ్ళ. అధ్యాత్మ Vi. 25), 'వలరాచ పౌజులు' (పైది. Vii. 52), 'పార్థునిఁ బౌజులు సేయఁబంచి' (జై. 3-98), 'పౌజుల్లాయితంబు చేయుమనిన....' (వరాహ. 11-57), 'విఱిగె నీ పౌజంచు' (పైది. 11-103). 'మనపౌజులు' (ప్రబోధ. 4-60) < మరాఠీ, పౌజ = దండు. సేన ; పారసి. ఫౌజ్ = సేన : సర్ ఫౌజ్ = దళవాయి, సేనాపతి ; అరబ్బీ, ఫౌజ్ : తెలుఁగున 'పౌజు'ను సబిందుకముగా కొందఱు పఠించుటకు హేతువు, ఇది పుంజ శబ్దభవముగా భావింపఁబడుట. నిర్బిందుకముగా స్వీకరించుట యుక్తియుక్తము

66. బరాబరి : ప్రభుదర్శనము నిమిత్తము గుమిగూడు ప్రజలను బగళముసేసి ఎచ్చరిక దెలుపుట. 'పటువేత్రకుల్ బరాబరి లొనరించి, (పల్నాటి. పు. 15). 'బద్దల వారంత పకుగునవచ్చి-చెలగి బరాబరుల్ చేసిరి మ్రోల' (పైది. పు. 46). 'ప్రజ తండములు బరాబరి సేయ' (ద్వి. హరిశ్చ. ఉ. పు. 283) < మరాఠీ-బరోబర = సదృశము. సమానము : పారసి. బర్-అ-బర్ = సమత : సదృశము ; స్పర్ధ ; బర్-ఆ-బరీ = సమత్వము, సాదృశ్యము.

---

53. 'ప్రెషణి హనుమంత బిరుదాంకుడగు రాచవారికి...' (శృం. నై., ఆం. వి. గ్రం. లోని తాళపత్ర ప్రతి నెం. 29672. 4వ. ఆకు, 2వ. వైపు. 6వ పంక్తి) ; 'పెషిణి హనుమంత్త బిరుదాంక్కుండగు రాచవారికి' (పైది, ఆం. వి. గ్రం. లోని తాళపత్ర ప్రతి నెం. 29800. 4వ. ఆకు మొదటివైపు, 7వ. పంక్తి).

67. బాఁకు : మొనదోపుకొను వంకికత్తి. 'అలరాజు బాకున కవతార మొందె' (పల్నాటి. పు. 2). 'పరశువుల్ బల్లెముల్ బాకు కటార్లు-శార్ఙ్గముల్ ధనువులు శరధులుదాల్చి (పైది. పు 28). 'బాకుల రొమ్ములు పరియలుచేసి-గదలచే శిరముల గడునుగ్గొనర్చి' (పైది. పు. 111) < మరాఠీ. బాఁక, బాక = వంకర, వంపు.

68. బాజారు : విపణి వీధి యందలి జనము. పూఁజారి వారికోడలు తాజాఁఅగ బిందెజాఱి దబ్బున ఁబడియెన్. బైజారు కొంగుపడిసిన-బాజారేతిరిగి చూచి పక్కున నవ్వెన్. (శ్రీనా. చాటువు) < మరాఠీ. బాజా (ఝా)ర అంగడి వీధి; సంత; పారసి. బాజార్ సంత; సంతరోజు; బేరము; బాజారీ = బజారునకు సంబంధించిన వర్తకుడు. "బాజాఱు" శకటరేఫ ఘటితముగా తెలుఁగు నిఘంటువులు ఉట్టంకించుట పొరపాటు, ఇది ప్రసార శబ్దభవము; వైకృతదీపిక, పు. 85, పురుషోత్తమకవీయము. పు. 99.

69. బిడారము : దండుదిగుటకనువుగా ఏర్పఱిచిన పటకుటీరాదికము... మున్నాయితఁడు సేయించిన బిడారంబుల సకలయాదవుల విడియించి...' (జై. 3-119) మరాఠీ. బిఱార, బిఢార = ఇల్లు. విడిది; ఉగ్రాణము, సరకుల కొట్టు; దేశ్యమనికిట్టెల్ 1115.

70. బిబ్బి : తురుష్కులయంతఃపుర స్త్రీ, కులీన. (.... మబ్బుకురులుబ్బు నగవులు బిబ్బిలకుఁగాక కలవె పృథివీ స్థలిపై, (శ్రీనా. చాటువు) "బిబ్బిగబ్బి మిటారులు" (రాజవా. 2-60) అని అర్వాచీన ప్రయోగము < మరాఠీ. బిబి = ముస్లిము స్త్రీ. యవనకన్య; పారసి, బీబీసత్కుల ప్రసూత యగు స్త్రీ < తుర్కీ.

71. బొందిలి; బొందిలీజాతి, బొందిలి దేశమునకు చెందిన. వన్నెల గాగరా.... కరకంజములన్ మునుఁగున్ బిగించి ప్రచ్ఛన్న ముఖాబ్జయైనడచె బొందిలి భామ గోమునన్ (శ్రీనా చాటువు). .... ఒయ్యారంబుఁజూపన్ దుకాణముపై బొందిలి దోర్తునిల్పె ముఖచంద్రస్ఫూర్తి శోభిల్లగన్ (శ్రీనా. చాటువు). జీవిక నిమిత్తము బుందేల్ ఖండమునుండి పెక్కురు దక్షిణ దేశమునకు తరలి వచ్చిరని చరిత్ర. బహమనీసుల్తానుల పౌజులలో శస్త్ర జీవులను బొందిలీలు

అసంఖ్యాకులుండినట్లు.... ఏనుగులు వేయి, బొందిలీ లెంచిచూడలక్ష. పెండారులొలక్ష లక్ష తురక లిచటిబలము....' (కృష్ణరా 3-55) అని కృష్ణ రాయ విజయము. నేడు విశాఖ మండల పరిసరముల బొందిలీజాతి వారెక్కు వగాఁగలరఁట: < మరాఠీబుందేల్ వింధ్య పర్వత పరిసరములందలి ఒక దేశము.

72. మసీదు : ముస్లిముల ప్రార్థన మందిరము. "కర్తారుఁడుండు తుర్కల మసీదు" (క్రీ. డా. 149) యయాతి చరిత్రాద్యర్వాచీన కృతులలో ఈ పదము విరివిగాఁ బ్రయుక్తము. < పారసి. మస్‌జిద్ = ప్రార్థన మందిరము; మసాజిద్ = మసీదులు ప్రణిపాతము నందలి సప్తావయవములు. చేతులు, కాళ్ళు, మోకాళ్ళు, నుదురు, సుజూద్ = శోణితలంబు నెన్నుదురు సోఁక మ్రొక్కుట; సజ్జాద్ = ఉపాసకుఁడు; సజ్జాద = పూజా సమయమున ముస్లిములు సాష్టాంగ పడుటకుపకరించు తివాసి లేక చాప; సాజిద్ = పూజ; ఉపాసన; సుజ్జద్ = భక్తులు; సిజ్‌ద = ఉపాసన; అరబ్బీ. మస్‌జిద్ = పూజా స్థలము, సుజూద్ = సర్వాంగాలింగిత నమస్కారము.

73. మాలిమి : ఓడ నడపు శాస్త్రము నెఱిఁగినవాఁడు. నావికుడు. 'ఏలికయాత్మ బుద్ధిఁదనకించుకదోఁపని కార్యమాప్తుఁడై చాల వివేకియైన ఘను సన్నిధినూహ యొనర్పనేర్చినన్ బోలఁగ నెల్లభంగులను బొందగుచుండు విఘాత దూరతన్ మాలిమి చేతనోడ జతనంబుగఁ దీరముచేరుచందమై' (నా. పంచ. సంధివి. 61). "అలర శ్రీ వెంకటేశుఁడనియేటి మాలిమి నలుదిక్కులకు నోడనడపఁగాను ములిగెశర్మార్ధకామ మోక్షధనము గడించి పలుమాఱు జీవుఁడనే మరకాఁడు" (తాళ్ళ. అధ్యాత్మ. xi, 99), "శీలంబు నడపించు మాలిమి సంచలింపని మానసంబది బరువుగాగ....మురారి చరణ రాజీవగౌరవంబను పేరోడగలిగెనేమి (వరాహ. 5-76) < మరాఠీ. మాలీమ = కర్ణధారుఁడు: నావికుఁడు; గుజరాతీ. మాలమ = కర్ణధారి; తోడి నావికుఁడు, పారసి. మల్లాహీనావికా సంబంధి : మిలాహత్ = నౌకా యానము; ము; అల్లిమీ = బోధకుడు; కర్ణధారిత; ము, అల్లిమ్. కర్ణధారి; అరబ్బీ. ము, ఆల్లీమ్ = నావికా శాస్త్రము; మల్లాహ్ = నావికుఁడు; మల్లాహీ = నౌకాయానము; తమిళము. మాలిమి, మాలుమి = కర్ణధారి: మాలుమి చాస్తిరమ్ = నావికాశాస్త్రము.

ముఖమల్లు : చూ. ముఖమాలు. 'అంతట కింకరులతివేగముననుౘ.... ముఖమల్లు గుడ్డలు మునుకొని తెచ్చి పరచి పీఠముమీద బాగైన దిండ్లు-ఉంచిన గనుగొని....' (పల్నాటి. పు. 17).

74. ముఖమాలు : రూ. ముఖమల్లు. ఒత్తుగా మెత్తగానుండు ఒక తరహా పట్టుగుడ్డ : దేశాంతర వస్త్ర విశేషము. వెల్వెట్. 'ముఖమాలు పట్టలు మొగములగట్టి-అందెలు పదముల నాయత్తపరచి.... సకల జాత్యశ్వాల సవరణ చేయ' (పల్నాటి. పు. 29).— కూర్చినగంతలు కుదురుగా వెన్ను-పైగప్పి ముఖమాలు పరపులువేసి....' (పైడి. పు. 30)< పారసి, మఖ్‌మల్, మిఖ్ మల్ = వెల్వెట్; ముఖ్‌మల్ = బొచ్చుదుస్తులు; మఖ్‌మలీ = వెల్వెట్‌తో చేసిన; వెల్వెట్‌వంటి.

75. మేకు : గూటము, చీల. '.... మేకులుగా మెఱయుచు ....' (వరాహ. 6-84)< మరాఠీ. మేఖ = గుంజ, గూటము; పారసి మేఖ్ = గూటము; మేకు, డేరాగూటము; సూది; గుల్‌మేఖ్ = రోజా పూవునుబోలిన బొడిపె గలమేకు; తెలుగున' ఏకై వచ్చి మేకై కూర్చున్నాడు' అనుపలుకుబడి అర్వాచీనము. దేశ్యమని బ్రౌణ్యము పు. 804 అన్యదేశ్యమని మిశ్రబ్రౌణ్యము. పు. 98.

76. మైజారు : ఆడుదాని కట్టుకొంగు, చీర మొదటికొంగు; పైట కొంగు అనునర్థము (సూ. ని. vi. 581) చింత్యము. 'పూజారివారి కోడలు తాజాలుగ బిందెజాఱి దబ్బునబడియెన్ మైజారుకొంగు దడిసిన బాజారే తిరిగి చూచి పక్కుననవ్వెన్ (శ్రీనా. చాటువు)< పారసి. మి' జర్ = ఇజారు; మొనకుకట్టుకొను వస్త్రము; మై ( = మేను) + జాఱు = ఒడలినుండి జాఱెడు నది కాఁబోలను భ్రాంతితో మన నిఘంటుకారులు చేసినవిఱుపు, చెప్పిన అర్థము నిరాధారము. ఇట్లే పాదరక్షయను నర్థముకల పారసి 'పైజారు' పద మును పై + జాఱు అని విడదీయుటయు నిర్మూలకము పైజారు, మైజారు-లను శకటరేఫ ఘటితములుగా పఠించి, వీని ఉత్తరభాగమును 'జాఱు' అను క్రియతో ముడిపెట్టుట భ్రాంతి మూలకము.

77. మోజా : మునివైపు వంకగల మలఁకచెప్పు, ముచ్చె, 'చరణములు లేఁత చిగురు మోజాలు దొడిగి' (పి. శకుం. 3-41)< పారసి, మూజ =

పాదరక్ష; కాలి తొడుగు; మోజహ్ = ముచ్చెలు: పష్లావి ( = ప్రాచీన పారసీకము). మౌచక్ = పాదరక్ష,

78. మోళము : వెండి, బంగారము లోనగువాని పై పూఁత, ములామ. 'జముని నాలుకతో నెకసక్కెమాడఁ దమకపడు క్రొత్తపైడి మోళముగటారి భీమ న్యపుఁడిచ్చె గారాపుఁబెద్ద పెండ్లి కొడుకుఁ గుఱ్ఱకు నైషధ క్షోణిపతికి' (నైష. 8_94); 54 'పసిఁడి ముల్లాము గుబ్బల కవాటములు' (ద్వి. పరమ. తృతీయా. పు. 146) 'చికిడిపైఁడి ములామ, చిక్కటారి' (సత్యభామా సాంత్వనము ప్రథమా) అని అర్వాచీన ప్రయోగములు < మరాఠీ. ములామా = ధాతువుల పై పూఁత; ముళమ్మా = పై పూఁత; పారసీ. ములమ్మా = మెలామ; మల్. అమ్ = పూఁత: లమ్మా = ప్రకాశించుట; అరబ్బీ, ములమ్మ అ.

79. రమణా : బర్మాలోని ఇరావతీనదీ ముఖద్వారమునగల ప్రాంతము 'రమన్యా' యని ప్రాచీన వ్యవహారము_ 'తడుణాసీరి తవాయి గోవ రమణా స్తానంబులన్....' (హర. పీఠిక. 28).

80. రావు : నాఁటి వెలమదొరల పట్టపు పేరు; పేరు చివరఁజేర్చు గౌరవ సూచక మగుపదము. నేఁడు సర్వవర్ణములవారి నామముల చివర చేర్పఁబడుచున్నది. 'రావుసింగ మహీపాలు ధీవిశాలు' (శ్రీనా. చాటువు). 'రావుసింగజనపాలునకే' (శ్రీనా. చాటువు), 'రమణమించిన మేదినీరావు బిరుద...' (శ్రీనా చాటువు). 'తక్కక రావు సింగ వసుధావరుఁడు...' (శ్రీనా.

---

54. 'యమేన జిహ్వా ప్రహితేవయా నిజా తమాత్మజాం యాచితుమర్థినా భృశమ్ సతాం దదేఽస్మై పరివార శోభినీం కరగ్రహార్హామసి పుత్రికా మపి' –(శ్లో. 21. షోడశస్సర్గః, నైషధ మహాకావ్యమ్, చౌఖంబాప్రతి) అని మూలము 'జముని నాలుకతో నెకసక్యమాడి దమకపడు క్రొత్త మెళము కతారి' (శ్రీం. నై. ఆం. వి. గ్రం. తాళపత్ర ప్రతి నెం. 29672. 79 వ ఆకు మొదటివైపు, మొదటి పంక్తి);
'జముని నాలికెతో నెకసక్యమాడం దమకపడు క్రొత్త పైండి ములామ కతారి' (పైది. ఆం. వి. గ్రం. తాళపత్ర ప్రతి నెం. 28800 95 వ ఆకు 2వ వైపు; 4 వ పంక్తి); 'పైఁడిమోళము కడారి' యని భువనగిరివారి ముద్రిత ప్రతి; 'పైఁడిమోడము కటారి' యని కొండపల్లివారి ప్రతి.

చాటువు). '....హిందూరావు సురధాణి... తిమ్మారెడ్డింగారు....' A. R. No. 469 of 1915; 3వ పంక్తి; (క్రీ. శ. 1496)< మరాఠీ. రాఓ, రావో = ప్రభువు, రాజు; రాహుత్త శబ్ద భవముగా పేర్కొనవి అశ్వారోహకుఁడను నర్థమిచ్చినది. ఆంధ్ర పద పారిజాతము (చూ. పు. 686); ప్రాకృత- రాయ; సంస్కృత. రాజ-

81 రోజు : దినము. 'ఆ మాట మీదట నమ్మరోసీవు - ముట్టడివేసితి మూర్ఖతతోడ- అయిదు రోజులదాక నంతమామాము....' (పల్నాటి పు 42); 'పగటిగానింబు దప్పక యుండ దినరోజుమాదిరి నొంటరి జోదు మూఁక' (రాజవా. 5-13), 'అగడతంబడి మునింగి దరిఁజేరి పారి రోఁజు దినరోజు రాహుత్తులును...' (పైది. 5-33)- అని అర్వాచీన ప్రయోగములు < మరాఠీ రోజ; పారసి-రోజ్ = దినము, పగలు; సూర్యుఁడు రోజన్ = రోజులు; రోజన = ప్రతిదినము; రోజ్ రోజు = దిన దినము; ప్రాచీన పారసి. రౌచ = ఒకరోజు.

82. లాలు : ఎఱుపు. 'లాలు గంధి' (రత్నపరీక్ష. 11), 'లాలు' (పైది. 12)< మరాఠీ, లాల = ఎఱుపు; పారసి, లాల్ = ఎఱుపు; లాలీ = ఎఱ్ఱఁదనము.

83. లాహిరి : మాదక ద్రవ్య సేవనము వలనఁగలుగుమత్తు. మైకము. 'లాహిరి పట్టినభాతి మదంబెక్కినమాడ్కి' (కాశీ. 2-138)< పారసి. లహార్. లహార్ = సారాయి మొదలైన నిషావస్తువులు అమ్మెడికొట్టు; సానికొంప; లహ్ = ద్రాక్ష సారాయము.

84. లుంగ : వస్త్రభారము; బట్టల మోపు. 'జగొన్న వెలిపట్టు జన్నిదంబుల లుంగ యంటుఱవాయంగ నఱుత వైచి...' (కీడా 42)<మరాఠీ, లుంగి = మొలను కట్టుకొను వస్త్రము; పారసి, లుఁగ, లుంగీ = గళ్ళ గళ్ళ వస్త్రము; లుంగ్ = వస్త్రపు మడత.

85. లూటి : బాధ, ఉపద్రవము 'రమణఁగంసాది యసురులు లూటీ సేయఁగాఁగా-తమిఁగృష్ణావతార మిందరికైతివి' (తాళ్ళ. అధ్యాత్మ. vi 60); దోపిడి. 'మమ్ము లూటి సేయరాకు' (వరాహ. 3-92) < మరాఠీ. లూట్, లూటి = కొల్ల, దోపిడి; లుటణేఁ = కొల్లపెట్టు; దొంగిలించు.

86. వలికా : సరకుల రవాణాకు ఉపకరించెడి ఒక దినుసు విలాతి పడవ. '....కస్తూరికాద్రవ్యముల్ శరధిం గప్పలి జోగు వల్లివలికాసమ్మాన్లఁ దెప్పించునేర్పరియై....' (హర. పీఠిక, 28).

87. వల్లి : సరకుల రవాణాకు ఉపకరించెడి ఒక దినుసు విలాతిపడవ. '....కస్తూరికా ద్రవ్యముల్ శరధింగప్పలి జోఁగువల్లివలికా సమ్మాన్లఁదెప్పించు నేర్పరియై....' (హర. పీఠిక, 28).

88. వహి : లెక్క ; లెక్క వ్రాయు పుస్తకము. 'కడమజీత వహియు' (సకల నీతి సమ్మతము, 299), వహి వారణాసి యనఁగా....' (ద్వా. 11-97) 'వహి కెక్కఁదెలియు వారలు లేరా....' (తాళ్ళ. అధ్యాత్మ V, 317); 'కరణము వహి ప్రమాణానం జెల్లి...' (A. R. No. 792 of 1922; 7 వ పంక్తి; క్రీ. శ. 1448), 'దినవహి' యనునది 'రోజువారీ లెక్క' వ్రాయు ఉద్యోగము వలన సిద్ధించిన ఇంటి పేరు. వై లెక్క (వై + లెక్క; వై < వయి < వహి) అని జానపద వ్యవహారము < మరాఠీ. వహీ = లెక్క పుస్తకము; హిందీ. బహీ; దేశీయ ప్రాకృతమున 'వహియా' = లెక్క పుస్తకము. Account Book.

89. విలాతి : దేశము, సీమ. '... మాఱు విలాతి కేఁగుచున్....' (వే. పంచ. 1-479)[55] < మరాఠీ. విలాయత = పరదేశము; యూరపు ఖండము: పారసి. విలాయత్ = దేశము; మండలము. దేశభాగము: అరబ్బీ. విలాయత్ = సీమ; రాష్ట్రము.

90. శాలువ : ఉత్తరీయముగా కప్పుకొను సకలాతి. 'ఉదికిన శాలువ నొనర ధరించి' (నవనా. పు. 260) < మరాఠీ, శాలూ; పారసి, షాల్ = టిబెట్టుజాతి గొఱ్ఱెల ఉన్నితో తయారయిన మేలిరకము శాలువ; దర్వేషీలు కప్పుకొను ముదుక గొంగడి; తెల్లని ఉన్నితో నేసిన కంబళి.

55. 'పసుపున కిచ్చెనంత వృషపర్వుఁడు కొన్ని విలాతు లింతికిన్' (యయా. 4-122) ఇట సీమలని అర్థము. 'విలాతి సకలాతి హౌదాల సామజములు' (రంగా, 1-156) ఇట పరదేశమని అర్థము.

91. సంగడి : జెట్టిసాధనకు ఉపయోగపడు ఇనుపగుండు. '...సాము చేయుచు దివస్పతి కుమారుఁడు భుజార్గళినెత్తు కెంపు సంగడియనంగ' (వరాహ. 4-145) [56] < మరాఠీ, సంఘాడి.

92. సన్నాయి ; నాగసరము. 'శంఖ సమూహంబు సహ్నాయిజోళ్ళు' (పల్నాటి. పు. 4) < పారసి, షాహ్‌నాయ్ = జయకాహళ; యుద్ధకాహళ ; షాహ్‌నామ్ = ఒకవిధమైన వాద్యము : సంగీత సాధనము.

93. సమ్మాను : చీనాదేశీయుల పద్ధతిలో నిర్మించిన ముక్కోయ్యపడవ. 'తరుణా సీరితవాయి గోవరమణాస్థానంబులన్ జందనా గరు కర్పూర హిమాంబు కుంకుమరజః కస్తూరికా ద్రవ్యముల్ శరధింగప్పలి జోఁగువల్లి పలికా సమ్మాన్లఁ దెప్పించు నేర్పరియై వైశ్యకులోత్తముండవచితిస్పండల్పుడే యిమ్మహిన్. (హర. పీఠిక. 28) < మలయా. సమ్మన్ = మూఁడు పలకల పడవ : చీనీ, సంపన్ = మూఁడు పలకలతో అమర్చిన పడవ, పెద్ద ఓడను అంటి పెట్టుకొనియుండు చిన్న పడవ; సన్ = మూఁడు; పన్ = పలక; వూ-పన్ = ఐదుపలకల పడవ; వూ = ఐదు (Chinese - English Dictionary, Harward University Press, Massachusetts, 1956); 'సంపన్' అనునది సమీకరణమునంది 'సమ్మన్' అయి 'సమ్మాను'గా పరిణమించినది. తమిళమున 'చిన్నపడవ' యను నర్థముగల 'చంపాన్' పదము చీనీ భాషనుండి ఎరువు తెచ్చినదని ఉల్లేఖ్యము (తమిళ లెక్సికన్. పు. 1285). సింటో, బార్బోజా, వర్తెమా మొదలగు విదేశ పర్యటకుల కథనముల 'చయంపన'ను రూపము సంగ్రథితము. (See : Hobson Jobson, p. 789). '...సమ్మాన్లఁ దెప్పించు....' అను వేటూరివారి పాఠమునకు సుప్రసిద్ధ చరిత్రకారులు మల్లంపల్లివారి ఆమోద ముద్రకలదు (History of the Reddi Kingdoms, P. 406) '....శరధిం గప్పలి జోఁగులన్ విరివిగా సామాన్లఁ దెప్పించు నేర్పరియై....' అను పాఠము కవ్యభిప్రేతముగాఁ దోఁచదు. '....చందనాగరు కర్పూరహిమాంబు కుంకుమరజః కస్తూరికా ద్రవ్యముల్ శరధిం గప్పలి జోఁగు వల్లివలికా సమ్మాన్లఁదెప్పించు....' ట యుక్తము. '....విరివిగా సామాన్లు...' అనుట పునరుక్తి. ఒకవేళ '...విరివిగా సామాన్లు దెప్పించు...' పాఠమే కావలె

56. 'సంగడము' అని మనుచరిత్ర (3-59) ప్రయోగము.

నని పట్టుబట్టినచోఁ సామానుఁ కూడ అన్యదేశ్యము. మరాఠీ. సామాన = పరికరములు, పనిముట్లు < పారసి. సామాన్ = వస్తువు ; సాధనము.

94. సరిహద్దు ; పరిమితి, మేర; పొలిమేర, సీమ. 'చక్కఁగా మిరి యాల సరిహద్దు దాటి – ప్రజల మేలిమి చింతపల్లెయుదాటి' (పల్నాటి. పు. 33) <మరాఠీ, సర్‌హద్ద = మేర: పొలిమేర; పారసి. సర్‌హద్ = అవధి. మేర; సీమ.

95. సవా : ఒకటింబావు. 'సవాలక్ష' ( = లక్షపాతికవేలు. అపరి మితము) (ద్వి. హరిశ్చ. పూ. పు. 66) <మరాఠీ. సవా, సవ్వా = ఒకటింబావు: ప్రాకృత. సవాయ; సంస్కృత. సపాద.

96. సహా : చక్రవర్తి, సార్వభౌముఁడు 'హరహరరాయ ఫేరోజసహా సురథాణ గజాధిపాది భూవరులు....' (హర. పీఠిక. 24) <మరాఠీ, శహా = రాజు, సుల్తాను; పారసి, షహ్, షాహ్ = అధిపతి, ప్రభువు; షాహీ = రాజ సంబంధి; రాజ్యము; రాచ ఠీవి.

సాంబ్రాణి : చూ. సామ్రాణి. 'సాంబ్రాణి తేజీలు' (ద్వి. హరిశ్చ. ఉ. పు. 283); 'పసిఁడిపక్కెర తేజి సాంబ్రాణి నెక్కి' అని రామాభ్యుదయ ప్రయోగము.

97. సామ్రాణి : రూ. సాంబ్రాణి. ఉత్తమాశ్వము. సామ్రాణిదేశపు గుఱ్ఱము. 'సామ్రాణి తేజులును' (నవనా. పు. 185), 'మదవారణముల సామ్రాణి తేజులను' (పైడి. పు. 236), '....తంత్రాధిపు నీ సామ్రాణి యెవరిదనవిని నమ్రుఁడగుచు లీలఁగదలి నకులక్ష్మాజుడున్' (జై. 7-146) < మరాఠీ. సమరాణ. తుర్కిస్తాన్‌లోని ఒక నగరము. సమర్‌కండినగరము నేటి ఉజ్‌బెక్‌స్తాన్‌లోనిది; గుఱ్ఱములకు ప్రసిద్ధి.

98. సుపాణి : రూ. సుప్పాణి. శుభ్రమయిన నీరు గల ముత్యము. 'సుపాణి ముత్యములు' (నవనా. పు. 56), 'తళుకు సుపాణి ముత్యాల మేల్కట్లు' (పైడి. పు. 259), 'అట్టి ముక్తాఫలంబులకు నాణియు' సుతారం బును' సుపాణియు నను గుణంబులు మూఁడు....' (రత్నపరీక్ష, 49), 'తళుకు సుపాణిముత్యాల మించుల....' (శ్రీరంగ మహత్త్వము, 2-46) < మరాఠీ.

సుపాణీ = తేజస్వి; వైకృతమని శ. ర; కాని, వైకృతదీపికలో ఈ పదమే లేదు. సుపానీయ శబ్దభవమని పురుషోత్తమ కవియము, పు. 135.

సుప్పాణి : చూ. సుపాణి. 'నెఱయును సుప్పాణి యెప్పడు నిర్మలకాంతిన్' (రత్న పరీక్ష, 50).

సురతాణ : చూ. సురతాను. 'ధారా సురతాణదర్ప ధరణీధ్రపవీ' (కాశీ, 6-309)

సురతాణి : చూ. సురతాను. వై. వి. ఇంద్రుఁడు; ఇంద్రాణి అని శ.ర. (చూ. పు. 1095). 'పండువా సురతాణి పావడంబిచ్చిన భద్రేభములు వీథిఁబాలె ముందు' (భీమ. 1-38), 'నీకుఁగల ప్రసిద్ధి ఢిల్లి సురతాణికిని లేదు' (క్రీడా. 185), 'చండిబిరుదుల సురతాణి గుండెదిగుల' (శ్రీనా. చాటువు), 'సురతాణి ముద్రబోలెను' (సకలనీతి సమ్మతము, 19) '....అలావదీను సురతాణి చేతను ఎఱకేశ్వరదేవర ఉపహతి అయితేని....' (7, 8 పంక్తులు, పిల్లలమఱ్ఱి శాసనము; క్రీ. శ. 1357).

99. సురతాను : రూ. సురతాణ, సురతాణి, సురత్రాణ సురథాణి, సురథాణు, సురదాణి, సురధాణ, సురధాణి, సురధాని. ఈ రూపాంతరములన్నియు వాస్తవముగా నాఁటి వ్యవహారానుగుణములో లేక, లేఖక ముద్రాపక కల్పితములో నిర్ధారించుట దుస్సాధము. పాలకుఁడు, ఏలిక. 'దురములో దక్షిణ సురతాను నెదిరించి' (జై. పీఠిక, 32) < పారసి. సుల్తాన్ = సార్వభౌముఁడు. చక్రవర్తి ; సర్వాధికారి ; సుల్తాన = చక్రవర్తిని, రాణి; సుల్తానీ = సామ్రాజ్యము; చక్రవర్తికి సంబంధించిన < అరబ్బీ, సుల్‌తాన్; తెలుగునందలి 'సురతాని' సురత్రాణ శబ్దభవముగా కవిసంశయ విచ్ఛేదము (చూ. పు. 65) నిరూపించుట ప్రతిలోమ పద్ధతి.

సురత్రాణ ; చూ, సురతాను, 'ధారాసురత్రా'ణ ఘాటీ సమారంభ గర్వాపోధోరాశి కలశజులకు' (భీమ. 1-29). 'దాని చన్నుదోయి ధారాసురత్రాణ కటక కుంభి కుంభకలహకారి' (క్రీడా. 243). 'ప్రబలధారా సురత్రాణ భద్రజాతి కరిఘటా సైన్య....' (కాశీ. పీఠిక, 58), 'ధారాసురత్రాణుఁబోర నిర్జితుఁజేసి' (కొమ్మనశివలీలావిలాసపీఠిక), 'మధురా సురత్రాణు మడియించి పరపక్షి

సాళువబిరుదంబు జగతినెరపె' (జై. పీఠిక, 32), ధారానగరము రాజధానిగా మాల్వాను పాలించిన హూషంగ్ సుల్తాన్ (క్రీ శ 1405_1435) ఇంచిలి ధారాసురత్రాణుఁడు. చిత్రభారత కృతికర్తయగు చరికొండ ధర్మన్న శతఘంట సురత్రాణ బిరుద విభ్రాజితుఁడు.

సురథాణీ : చూ. సురతాను, '....హిందూరావు సురధాణీ........తిమ్మా రెడ్డింగారు........' A. R. No 469 of 1915; 3 వ పంక్తి క్రీ. శ. 1496).

సురథాణు : చూ. సురతాను '్రపయాగ ఉపాధ్యాయుల కొడుకు కళింగవ్యాపారి ఇద్దె సురథాణు తమ్ముఁడు' (శ్రీకూర్మశాసనము, A. R. No. 299 of 1896; 4. 5 పంక్తులు; క్రీ. శ. 1402).

సురదాణి : చూ. సురతాను. 'భావజ సురదాణి' (నవనా. పు. 10).

సురధాణ : చూ. సురతాను, 'హరిహర రాయ ఫేరోజసహా సురధాణ గజాధిపాది భూవరుణ...' (హర. పీఠిక, 24)-ఇందలి హరిహరరాయలు విజయ నగర చక్రవర్తియగు రెండవ హరిహరరాయలు (క్రీ. శ. 1377_1404), ఫేరోజసహా - బహమనీ సుల్తానులలో అతి ప్రసిద్ధుఁడును, బహుభాషా వేత్తయును, కావ్యగీతి ప్రియుఁడును అగు సుల్తాన్. తాజ్_ఉద్_దీన్ ఫీరూజ్‌షా (క్రీ. శ. 1397_1422); 'ధారాపట్టణ సార్వభౌమ సురధాణదర్పాపహార క్రియా ధౌరంధర్య....' (కాశీ. 5_337).

సురధాణి : చూ. సురతాను. 'ఖుసిమీఱన్ 57 సురధాణి నిండుకొలువై కూర్చున్నచో....' (హర. పీఠిక, 22) 'గజపతి సురధాణి గడిదుర్గములకెల్ల నేరాజు వజ్రంపు జోరుతల్పు' (ప్రబోధ. 1_96)

సురధాని : చూ. సురతాను. 'పండువా సురధాని 58 పావడంబంపిన భద్రేభములు వీటఁబాళెముండు' (కాశీ. 1_35).

---

57. 'ఖుసిమీఁదన్...' అని వేటూరివారి పాఠము.

58. 'పండువాసురతాని' అని ఆం. వి. బొబ్బిలి తాళపత్రప్రతి, 7వ ఆకు 2వ వైపు 4 వ పంక్తి.

100. సేబాసు : మెచ్చికోలును తెలుపు మాట. '....సంగ్రామాంచలమునఁనిదె నను మెచ్చించెదవేనప్పుడు నిన్ను సేబాసందున్' (హర. 7_54). [59] (విక్ర. 8_66). > మరాఠీ. శాబాస = ప్రశంసార్థకపదము; పారసీ. షహ్_బాష్ = స్తుతి; మేలుమేలని ఎలుగెత్తికొనియాడుట.

సొక్కటాలు : చూ. సొగటాలు, విన్న నాడిసోలి సత్యభామకు మ్రొక్కితివి నేఁడు నాకు మ్రొక్కవలెఁగా (తాళ్ళ. శృంగార సంకీర్తనలు. iv, 163).

101. సొగటాలు : రూ. సొక్కటాలు పగడసాలాట. 'సరిలేనియుంజీసొగటాలరు దగుజూదంబు....' (భోజరా. 5_16). 'తిగుటన్ సొగటాల నేసతి ప్రౌఢుండన్' (ద్వా. 10-91); జూదమాడెడు సారెలు, 'గచ్చకాయలు కొన్నికలిగినయట్టి. తిత్తులు చిరుతలు త్రైవగొడెలు- జూద మాడుట కయి సొగటాలుకొన్ని... ఆటలసాధానాలవి వెంటరాగ' (పల్నాటి. పు. 45) < మరాఠీ సొగడీ. సాగడా = శకట సంబంధమయిన.

102. సోళాదొప్పి : దూత్యవిశేషము. 'సోళాదొప్పియు నెత్తమున్ మొదలుగా జూదంబునీవాడు నావేళంగాదని బాంధవుల్ శకుని దుర్వృత్తం బెఱింగింపరే'' (జై. 3_42) దీనికి ''సోషాదొప్పి'' యను రూపాంతరమున్నట్లు బాచేపల్లివారి శబ్దార్థదీపిక (చూ. పు. 1390) ఏ మండలమునందైన వ్యవహారము కలదేమో ? < ? మరాఠీ. సోళా = పదునాఱు; పదునాఱవ్వః థోపా = దెబ్బ: కత్తి; హిం. సోలహ్. సోరహ్.

103. హజారము; అస్థానము; మొగసాల. ''...పొడుపుఁగొండపయిన్ రవియొప్పెఁజూడగా సుమధికలీలనింద్రుని హజారపు మేడకు బైఁడికుండయోఁ (కాశీ 1_125). తనరు ముంగిళుల దరి హజారముల'' (ద్వి. హరిశ్చ. ఉ. పు. 320), ''నిరాఘాటమగు హజారంబుకడకు'' (వరాహ. 2_4). 'ఈ రీతి వెడలి వజ్రహజారఁబుననిలచి (పైది. 3_39) ''హజారంబు దాయంబోయి'' (పైది. 6_90). ''వాఁడును హజారఁబు వాకిటనిలిచి'' (పైది. 11_57) <

59. మెచ్చించెదయేనమ్మ గోలనేసిన పిదపన్' అని వేటూరివారు పరిష్కరించిన ప్రతి యందలి అధోజ్ఞాపికలోని పాఠాంతరము.

పారసి. హాజిరాన్ = సభాస్తారులు; హాజిర్ = సన్నిధినుండు; సేవకు సిద్ధముగానుండు; హాజిరీ = సభ్యులు; ఓలగమువాడు: హుజ్రా = కొలువుకూటము, సభాస్థానము; హాజారము, ఆజారము అని తెలుగున అర్వాచీన ప్రయోగములు. శకట రేఫ ఘటితముగా కొందఱు దీనిని పఠించుట ప్రమాదము. సామజాగారము ( = ఏనుగులసాల) సజ్జాగారము. హజ్జారము, హజారము అను నిట్టి క్రమ పరిణామములను పొంది హజారముగా రూపొందినదని కొందఱు వ్రాయుట అశాస్త్రీయము.

104. హద్దు: అవధి. మేర. చక్కగా మిరియాల సరిహద్దుదాటి' (పల్నాటి పు. 33); 'తూరుపుదిక్కుకు తుది మేరసుమ్ము దక్షిణ దిశహద్దు తగ వివరింతు' (పైది. పు. 87,) 'పడమటికివి హద్దుబాలచంద్రుండ కొదమ గుండ్లయనెడి గురి గ్రామమొకటి' (పైది. పు. 87), ఉభయపక్షంబుల ఉప్పైన బలము నివసించియున్నది. నిశ్చల మతిని హద్దులు చెప్పెదనవి చిత్తగింపు, (పైది. పు. 87) < మరాఠీ, హద్ద = అవధి, మేర; పారసి. హద్ = మేర, పొలిమేర; అవధి: అంచు; వేర్పాటు; అరబ్బీ హద్ = మితిమేర.

105. హుమాయి : వాహనము. 'కాయ జారాతిగిబ్బ హుమాయినెక్కి' (పరతత్త్వ రసాయనము.1-111) < మరాఠీ హుమా = గరుడపక్షి; పారసి. హుమా = గరుడపక్షి; స్వర్గలోకపు పక్షి; ఇది యెవని తలమీఁద నెగురునో వాఁడు చక్రవర్తి యగునని ఇరానీల నమ్మకము. దేశ్యముల తుది దీర్ఘమునకు హ్రస్వము లేదనుటకు కవిజనాంజన కర్తపాదశా, నవలా, హుమా-లను ఉదాహరించినాడు (చూ. విశాఖపట్టణము, పరవస్తువారి గ్రంథాలయమునందలి కవిజనాంజన తాళపత్ర ప్రతి, 80వ ఆకు, రెండవవైపు)

106. హురుముంజి : పారసీక జలసంధి చేరువ తీరమునఁగల పెద్ద రేవు పట్టణము. క్రీస్తుపూర్వము నాలుగవు శతాబ్ది నుండియు ముత్యముల, గుఱ్ఱముల ఎగుమతికి ప్రసిద్ధి. క్రిందటిదినములలోపల వాణిజ్య విషయముల ప్రాచ్య పాశ్చాత్య ప్రపంచములకుకూడలి. 'చీని సింహళ తవాయి హురుముంజి చోణంగి ప్రభృతి నానాద్వీపనగరాకరంబులగు ధన కనక వస్తువాహన మాణిక్య గాణిక్యంబులు తెప్పించియు...' (హర. పీఠిక, 7), సింహళంబున గంధ

సింధురంబులు దెచ్చె హురుముంజి బలుతేజి హరులుదెచ్చె' (పైది. పీఠిక, 26)' 'ముత్కాన హురిముంజి ముత్యాలముంగర' (శ్రీనా. చాటువు), 'గురుతైన హురుముంజి గొప్పముత్తెపు సత్తు మోవిపై నొకవింతముద్దు గుల్కా'' (శ్రీనా. చాటువు) < పారసి. హుర్ముజ్ = ఒక రేవు పట్టణము, 'అహూర్ + మజ్‌తా' అని జెంద్ అవెస్తా భాష; ఉర్మజ్ = ప్రతిపద్దివసాధిష్ఠానదేవత; బృహస్పతి గ్రహము.

# తెలుగులో బుడతకీచు పదములు

## ప్ర వే శి క

తెలుగుపై స్వీయప్రభావమును కొంతలో కొంత ప్రసరింపజేసిన ఆధునికములగు యూరపియను భాషలలో 'బుడతకీచు'[1] మొదటిది. ప్రాక్ప్రతీచీసీమలకు క్రీ. పూ. పదియవ శతాబ్దము నాటికే సంబంధబాంధవము లుండినవని చరిత్రకారుల యూహము. కాని క్రీ. పూ. నాలుగవ శతాబ్దాంతమున జరిగిన శికందరు (అలెగ్జాండరు) దండయాత్రలు ఈ సీమలకు సమీప సంబంధములను సమకూర్చినవి. ఆనాటి యీ సంబంధములును ఆర్యభాషావ్యవహార మండలమగు ఉత్తర భారతమునకే పరిమితము. రోమకాది మధ్యధరా తీర మండలములతో దక్షిణ భారతమున కుండిన ప్రాచీన వాణిజ్యవ్యవహారము అరబ్బుల ముఖమున నిర్వాహమగుటచే ఆ సంబంధమును పరోక్షమేకాని ప్రత్యక్షము కాదని అనుమేయము. ఆ విస్మృత రహదారి పదునేనిమిది శతాబ్దుల తరువాతనే ఫరంగుల–యూరపియనుల–తో ప్రత్యక్ష సంబంధములు ఏర్పడినవి.

క్రీ శ. 1498 లో బుడతకీచులు భారత దేశపు పశ్చిమతీరమున అడుగిడుట ఈ సన్నిహిత సంబంధములకు నాంది యయినది. వీరు క్రమక్రమముగా ప్రబలులై, దేశీయ ప్రభువుల ఆస్థానముల పెక్కింట ప్రవేశము సంపాదించి, దయ్యూ, దామన్, సాల్సెట్టి, బొంబాయి, గోవా, మంగళూరు, కోజికోడు, కన్ననూరు, బత్కల్లు, ఓనావరు, కొచ్చి, తూత్తుకుడి, నాగపట్టణము, శాంతోము,

1. ఈవ్యాసమున 'పోర్చుగీసు' అను మాటకు పర్యాయార్థమున 'బుడతకీచు' ఉపయుక్తము. మూలపదము 'పొర్తుగేజ్', 'పొ' లోని 'ఒ' సంవృతోచ్చారము కలది. 'పోర్చుగీసు' అని నేటి పలుకుబడి; ఇది ఆంగ్లోచ్చారణకు దగ్గర. పురతకీసు, పురతకేసు, బుడతకీసు అని సాహిత్య ప్రయోగములు; 'బుడతకీచు' వీని వికృతి ఇందలి 'డ' శిథిలోచ్చార్యము; ఒరియా–ఒడియా, కుర్తా–కుడ్తా, ఖిడ్కీ–ఖిర్కీ, పర్దా–పడ్దా–లలోవలె ర, డ–లు పరస్పర వినిమయ వర్ణములు.

హూగ్లీ మొదలగుచోట్ల గిడ్డంగులను, క్రయ విక్రయ శాలలను నెలకొల్పిరి. విజయనగర చక్రవర్తులతోడను, వారి సామంతులతోడను దాదాపు రెండు శతాబ్దములపాటు బుడతకీచులకు వాణిజ్య రాజకీయ సంబంధము లుండినవి. బుడతకీచు పాదిరీలు రాయబారులుగను, మతబోధకులుగను సలిపిన కృషియును అల్పముగాదు. చారిత్రక విషయ పర్యాలోకన సందర్భమున ఈ యా యంశములు సోపపత్తికముగా నిరూపితములు. సమీప వర్తిత్వము ననుసరించియు, పాలక పాలిత సంబంధములను బట్టియు, మత వాణిజ్యాది సాహచర్యముల ననువర్తించియు రెండు భాషలకు సంసర్గ మేర్పడినప్పుడు పరస్పరము భాషా విషయకములయిన ఆదాన ప్రదానములు సంభవించుటయు, సంసర్గ ప్రభావమున కనుగుణములగు నుడులే వినిమయము లగుటయు సర్వ సామాన్యము. తెలుగు బుడతకీచు వ్యవహర్తల ప్రత్యక్ష పరోక్ష సంసర్గము కారణముగా తెలుగున ప్రవేశించిన బుడతకీచు నుడుల సమాలోకన ఫలమే ఈ వ్యాసము. యథాస్థితములగు భాషా విషయముల సత్య స్వరూప నిరూపణమే ఈ పరామర్శలోని పరమార్థము. ఈ నుడులలో చాలపాలు మూర్తపదార్థ బోధకములు; అమూర్త పదార్థ బోధకములు మిక్కిలి అరుదు. అనగా భావప్రధానములకంటె వస్తుప్రధానములకు ప్రాచుర్యమధికమని తాత్పర్యము. భాషల సంసర్గమునందలి ప్రాథమిక దశలో ఇట్టి లక్షణము సార్వత్రికము. సమాజ వ్యవస్థలో ఆయా వస్తువుల ఆవశ్యకతను బట్టియు, ఆయా భావముల ప్రాబల్యమును బట్టియు తత్తద్బోధకములగు పదముల వ్యవహార యోగ్యత ఆధారపడి యుండును. వీని ప్రాధాన్యము క్షీణించినను, ఏతద్బోధకములుగా శక్తిమత్తరములగు పదములు మఱొక భాషనుండి సంక్రమించినను పూర్వ వ్యవహారమున నుండినవి వ్యవహార విదూరము లగుట చారిత్రక సత్యము. దేశ్యములు, అన్యదేశ్యములు అను విచక్షణతో నిమిత్తములేక, వ్యవహార దశమున గల పదసామస్త్యమునకంతకు ఈ పరిణామము సర్వవ్యాపకసూత్రము. భారతదేశములో బుడతకీచుల రాచఱికము వలని బాగోగులను గూర్చి వితర్కించుట ఇట అప్రస్తావికము.

## పొర్తుగాలు చరిత్ర

ప్రధాన విచారణీయాంశమును గూర్చి వివేచించుటకు పూర్వము బుడతకీచుల అట్టుపుట్టానవాళ్లు నెఱుగుట అత్యంతావశ్యకము యూరపు ఖండము

నైరృతిదిశను ఐబీరియా ద్వీపకల్పము పశ్చిమ భాగమున అట్లాంటిక్ మహాసము ద్రమున కభిముఖముగా ముప్పదియైదువేల చదరపు మైళ్ల వైశాల్యముతో 2 ఐదు వందల మైళ్ల సముద్రతీరముతో విస్తరించిన దేశము పోర్తుగాలు 3. ఎనిమిది శతాబ్దములకు మునుపు పోర్తుగాలు అను దేశము కాని, బుడతకీచు అను జాతి కాని రూపొంది యుండలేదు. నేటి పోర్తుగాలు ప్రాంతము కాస్తీలియను రాజ్యములో పశ్చిమరాష్ట్రముగా నుండినది. ఐబీరియా ద్వీపకల్పములోని ఈ పశ్చిమ ప్రాంతమునకు ఐతిహాసికయుగమున 'లూసితేనియా' యని వాడుక. ఐతిహాసిక దృష్టిలోతప్ప సామాన్యవ్యవహారమున నేడీ వాడుక అంతరించినది. ప్రాచీన యుగమున 'లూసితేనియా' 'కెల్టు-బాస్కు' భాషీయులగు ఆదిమ వాసుల వాస స్థానము.

క్రీస్తునకు చాలా పూర్వమే 'లూసితేనియా' కు ఫోనిషియను వర్తకులయు, గ్రీకు యాత్రికులయు రాకపోక లుండినను వీరి భాషాదిక ప్రభావము అనాగరులగు ఆదిమ వాసులపై అంతగా ముద్రితము కాలేదు. ఆ సిమ్మట జరిగిన కార్థీజియను దండయాత్రలు 'లూసితేనియా' దక్షిణ భాగములలో కార్థీజియను పరిపాలనను నెలకొను జేసినవి. క్రీ. పూ. మూడవు శతాబ్దాంతము (218-202)న నడచిన రోమకసూయాణముల మూలమున కార్థీజియను పాలన అంతమొంది, 'లూసితేనియా'తో పాటు మొత్తము ఐబీరియా సీమ లన్నియు రోమనుల-లాటిన్ భాషీయుల-హస్తంగతము లైనవి. రోమనులనేకులు తండములు తండములుగా వలస వచ్చి 'లూసితేనియా'లో స్థిరపడిరి. రోమక పరిపాలన రీతులు, రోమక సాహితీ సంస్కృతులు 'లూసితేనియా' సర్వవ్యవస్థలలోను సంపూర్ణ పరిణామములను కొని వచ్చినవి. రోమనుల క్రైస్తవమత గ్రహణముతో 'లూసితేనియా' యును రాజానుమతముగా బాప్తిస్మమును స్వీకరించినది.

---

2. అనగా ఆంధ్రప్రదేశ వైశాల్యము-110 వేల చదరపు మైళ్లు-లో రమారమి మూడవవంతు.

3. ఐదంయుగీనాంధ్రవ్యవహారములో 'పోర్చుగల్'; ఇది ఆంగ్లోచ్చారమునకు సమీపము. పోర్తుగా లనుట బుడతకీచు బాసకు సదృశోచ్చారము, స్వరభక్తి సూత్రానుగుణముగా 'పోర్తుగాల'ను రూపము 'పోరతగాలు' గా పరిణతము; అదే 'పురతకాలు', పురతకాలు, బురతకాళి, బురతకాలు అనునవి ఆంధ్రసాహిత్య ప్రయుక్త రూపములు.

క్రీ.శ. 410 తరువాత రోమక సామ్రాజ్యమునకు క్షీణదశ పట్టినది. ఆ వెనుక 'లూసితేనియా'లో గోథికు జైత్రయాత్రలు ప్రవర్తిల్లి గోథికు పాలన ప్రారంభ మయినది. ఇస్లాము మత విజృంభణముతో క్రీ శ ఎనిమిదవు శతాబ్దిని సాగిన అరబ్బుల దాడుల వలన గోథికు పాలన అంతరాన మయినది. మధ్య ప్రాచ్యము నుండియు, ఆఫ్రికా ఉత్తర పార్శ్వములనుండియు ఇస్లాము మతానుయాయులగు అరబ్బులు గుంపులు గుంపులుగా వచ్చి 'లూసితేనియా'లోని అరబ్బుల పెత్తన మునకు అండగా నిలిచిరి. దాదాపు నాలుగు శతాబ్దులపాటు అవిచ్ఛిన్నముగా చెల్లిన అరబ్బుల అధికారము—అరబ్బు పాలకులకును స్వాతంత్ర్యాభిలాషులగు ఐబీరియను స్థానిక ప్రభువులకును జరిగిన పెక్కుపోరాటముల వలన—పండ్రెం డవు శతాబ్దము ప్రథమపాదమున కడముట్టినది. బొర్గోనా (బర్గండి) మండలే శ్వరుని సోదరుడగు హెన్రీ (1087_1112) ఈ తిరుగుబాటు పోరాటములలో ఐబీరియనుల పక్షము వహించి' ఎస్పనోలా—స్పెయిను—పరిపాలకుని మెప్పు నకు పాత్రుడయి' అతని తనయయగు 'తెరెసా'ను పెండ్లాడి, 'పొర్తుకాలెన్సు' మండలేశ్వరుడు (Count of portocalensis) గా కుదురు కొనినాడు. పొర్తుగాలు వాయవ్యమున 'దోరు' (Douro) నదము ఉభయకూలముల వ్యాపిం చిన సీమకు ఆనాడు 'తెర్రా పొర్తుకాలెన్సు' అని వ్యవహారము. 'దోరు' నదము ముఖద్వారము నందలి రేవుపట్టణము 'ఓ పొర్తు' ఈ వ్యవహారమునకు ప్రాతిపది కగా సంభావ్యము. బుడతకీచు బాసలో 'కల్లి' యనగా మార్గము. 'పొర్తుకల్లి' యనగా 'బుడతకీచుల రేవు' అని యర్థము. 'ఓ పొర్తు' నగరము ప్రవేశ మార్గ ముగా ప్రపంచితమయిన ప్రాంతము గావున, దోరు నదము ప్రవాహమండలము నకు 'పొర్తుకాలెన్సు' అను వాడుక సిద్ధించినదని ఒక సిద్ధాంతము. 'లూసితేనియా' లో ఏకదేశమగు ఈ ప్రాంతమునకు ఆ నాడు ఉద్దిష్టమయిన వ్యవహారనామము కాలక్రమమున 'పొర్తుకాలెన్సు' సీమావిస్తరణముతో 'లూసితేనియా' సమస్తము నకును సంక్రమించినదని ఈ సిద్ధాంత ప్రవచనము. 'పొర్తుకాలెన్సు' అను పద బంధము వలననే 'లూసితేనియాకు' పొర్తుగాలు' అనియు, తద్వాస్తవ్యులకును వారి వాగ్వ్యవహారమునకును 'పొర్తుగీజు' అనియు వాడుక. తొలినాళ్లలో ఈ 'తెర్రాపొర్తుకాలెన్సు' మండలేశ్వరుడయిన హెన్రీ అరబ్బులను పూర్తిగా ఓడించి దేశమును పరదాస్యమునుండి తప్పించినాడు. 'తెరెసా' వలన ఇతనికి కలిగిన కుమారుడు 'అఫొన్సు హెన్రీక్సు'(1109_1185) 1128 లో మండలేశ్వరుడుగా

అధికారము చేపట్టి, అంచె లంచెలుగా రాజ్యమును విస్తరింపజేసి క్రీ శ. 1143 లో 'పోర్చుగాలు' ను స్వతంత్ర రాజ్యముగా ప్రకటించినాడు. స్వతంత్ర ప్రతిపత్తిగల ప్రత్యేక దేశముగా క్రైస్తవ జగద్గురువగు పోపు అంగీకారమును, ఆశీర్వాదమును క్రీ.శ. 1179 లో 'పోర్తుగాలు' కు లభించినవి. నాఁటి నుండి బర్గండి వంశీయులు (1143–1385)ను, అవిజ్ వంశీయులు (1385–1580) ను స్పెయిను చక్రవర్తులు (1580-1640) ను బ్రగాంజా వంశీయులు (1640–1910) ను 'పోర్తుగాలును'ను పాలించినారు. క్రీ. శ. 1910 లో రాచఱికము నశించి అధ్యక్షపాలన ఆరంభమయినది. 1925 నాఁటి ఎన్నికలనుండి అంతోని దీ ఓలివైరా సాలాజార్ నియంతృత్వము చెల్లుచున్నది. ఇదీ బుడతకీచు పురాణము.

వాస్తవముగా స్పెయిను-పోర్తుగాలు దేశములకు భౌగోళికమయిన సరిహద్దు లేవియు పరిగణింపఁదగినవి లేవు. బుడతకీచుల అల్ప ప్రకృతియును, సంకుచిత ప్రవృత్తియును, తదనురూపముగా రేఖాంచితమయిన వారి పురాచరిత్రమును పోర్తుగాలు అవతరణమున పురాణించిన మూలకారణములని చరిత్రకారుల నిర్ధారణము. అరబ్బుల మంకుపట్టును, గోథిక విజేతల కొల్లపెట్టు బుద్ధియును, బాస్క్ జాతీయుల ఒంటెత్తు తనమును, రోమను భాషీయుల బడాయికోరు తనమును బుడతకీచు జాతికి పురుడుపోసిన పైతృకలక్షణములు. ఎట్టి అవరోధములు తటస్థపడినను స్వీయ విశిష్టతను స్థాపించి, స్థిరపరచుకొన నుద్యోగించు తీవ్ర స్వభావము బుడతకీచులది. పరంపరీణమగు వీరి ఈ నిసర్గ లక్షణమే పోర్తుగాలు ఉనికికి, మనుగడకు జీవగఱ్ఱ.

## బుడతకీచు భాషాచరిత్ర

బుడతకీచు భాష స్పానిషు భాషకు చాల దగ్గఱది. ద్రావిడ భాషలగు తమిళ, మళయాళముల కెట్టి సమీప సాజాత్య సంబంధము కలదో, స్పానిషు బుడతకీచు భాషలకును అట్టి సామీప్య సాజాత్య సంబంధమే కలదు. కర్ణాటాంధ్ర భాషలు తమిళమళయాళములకు వలె, ఫ్రెంచి, ఇటాలియను భాషలు స్పానిషు బుడతకీచులకు సద్దెతోఁబుట్టువులు ఇటాలియను, ఫ్రెంచి, బుడతకీచు, స్పానిషు భాషలు ఇందో–యూరపియను భాషా కుటుంబగతమగు లాటిన్‌భాషా శాఖాజన్యములు. వీనికి 'ఇటాలిక్' లేక 'రొమాన్సు భాషలు' అనీ, 'లాటిన్ మాంద

లికములు' అని సమాహార వ్యవహారము. ప్రాక్తన యుగముల రోమక సామ్రాజ్య సీమలలో వ్యవహారమున నుండిన లాటిన్ భాషకు 'రొమాన్సు' భాష అని పేరు. లాటిన్ భాషా పుత్రికలగు స్పానిషు బుడతకీచు భాషలకు దక్షిణ అమెరికాలోని సమస్త రాజ్యములలోఁగల ప్రచుర వ్యవహారము హేతువుగా ఆ ఖండమునకు 'లాటిన్ అమెరికా' అను అన్వర్థనామము రూఢము. ఇంగ్లీషు, డచ్చి, జర్మను స్కాండినేవియను భాషలకు సమీప మాతృకయగు జర్మానిక్ (ట్యూటానిక్) భాషా శాఖ లాటిన్ శాఖకు సగోత్రకము. రోమక యుగము (క్రీ. పూ. 218 క్రీ. త. 410) న 'లూసితేనియా' భూభాగమున వ్యవహృత మయిన లాటిన్ భాషా మాండలిక రూపము మాతృకగా, కెల్టు బాస్కు భాషావ శేషముల సమ్మిశ్రణముతో క్రమవికాసము నంది, పదమూఁడవ శతాబ్దము నాఁటికి బుడతకీచు పృథగ్భాషగా రూపొంది పెంపొందినది. రోమక యుగా నంతరము (క్రీ. శ. 710—1200) బలీయమయిన అరబ్బీభాషా సంసర్గమును, మధ్యయుగములనాఁటి ఫ్రెంచి భాషా సాహితీ సాహచర్యమును బుడతకీచు భాషను ఇతోధిక పరిపుష్టముగా, స్పానిషు భాషా విశిష్టముగా వికసింపఁజేసినవి. ఫొనీషియను, కార్థేజియను, గోథికు వాసనలును బుడతకీచు భాషావతారమున ఒకపాటి నేపథ్యమును నిర్వహింపక పోలేదు, పోర్చుగాలు, స్వతంత్ర దేశ మయినను పదమూఁడవ శతాబ్దము దాఁక లాటిన్ భాషయే రాజకీయ భాషగా నుండినది. కాని, బుడతకీచు చక్రవర్తులలో అయిదవ వాఁడయిన మూఁడవ అఫొన్సొకాలము (1248—1279) న లోకయాత్రా నిర్వాహ మాత్రముగా నుండిన బుడతకీచును రాజభాషగా రూపొందింపవలెనను ఉద్దేశ మంకురించినది. ఆఱవ వాఁడగు డినీజ్ చక్రవర్తి (1279—1325) పాలన కాలమున బుడతకీచు రాజభాషయయి, తన్మూలమున కవిపండిత పరిషదవలంబనమునందె, సాహిత్య స్థాయిని సంపాదించి సర్వతోముఖముగా వర్ధిల్లినది. కాని, తాత్త్విక చింతనముల లోను, తార్కిక విచారములలోను లాటిన్‌భాష తన అధికారమును యథా పూర్వముగా నెఱపుచునే యుండినది. బుడతకీచునకు లాటిన్ కేవలము మాతృ కయే కాదు, బుడతకీచు మూలశాఖనుండి పార్థక్యము నెంది ప్రవృద్ధమగు చుండిన నాఁడు కూడ మతధర్మ వాహకముగా, ప్రాచీన సంస్కృతి దర్శకముగా లాటిన్, బుడతకీచుపై తన ప్రభావమును ప్రసరింపఁజేసినది. వైదిక మత ధర్మ ప్రబోధమునను ఆర్ష విజ్ఞాన ప్రకాశమునను గీర్వాణవాణివోలె, క్రైస్తవ

మతధర్మస్థాపనమునను ప్రతీచీ విజ్ఞాన వ్యాపనమునను లాటిన్ వాణి ప్రముఖ భూమికను నిర్వహించినది. లాటిన్‌భాషా పుత్రికయగు బుడతకీచును మొదట అట్టి వ్యాపారమునే కొనసాగించినది. బుడతకీచుల ప్రాచీన సాహితీ వ్యవసాయము లోకగాథపారమ్యము; శృంగారరసప్రచురము; ఆఖ్యానరూపము. మధ్యయుగము నాఁటి సాహితీ సమారాధనము, దేశభక్తి ప్రబోధ సాధనము; వీరరస పరిప్లావితము; వర్ణన ప్రధానము. ఆధునిక యుగము ఆంగ్ల పరాను సాహితీ వైభవప్రభావితము. వివిధ సాహితీ ప్రయోగ విభూషితము; అక్షర రమ్యతా పరాయణము. వస్కోడిగామా ప్రాచ్యసీమా యాత్రా చరిత్రమును బుడతకీచుల మహేతిహాసము (Dusiads) గా రూపొందించిన బుడతకీచుల జాతీయకవి కామోన్సు (1524—1580), రొమాంటిక్ యుగ ప్రవర్తకుఁడు బర్భోజా బొకాజి (1765—1805), బుడతకీచు నాటక పితామహుఁడు జోజీ అల్మీదా గారీ (1799—1854), నవయుగ వైతాళికుఁడు జ్వావోన్ దీద్యూన్ (1830—1896) బుడతకీచు సాహితీ చరిత్రలో యుగపురుషులు; ఆంగ్లమువలె బుడత కీచును ప్రపంచ వ్యాప్తమయిన భాష. ఒక్క ఆస్ట్రేలియా ఖండములో తప్ప తక్కిన ప్రపంచము నాలుగంచులను చెదరు చెదరుగా ఇది మాతృభాషగనో, రాజభాషగనో వ్యవహృతము. ఇట్టి బుడతకీచు భాషా వ్యవహర్తల సంఖ్య ఇంచుమించుగా ఏడు కోట్లు! నేఁటి పోర్చుగాలు జనసంఖ్య కోటికి లోపలిమాట! మిగిలిన యారుకోట్ల పైచిలుకు అంగోలా, గినియా, గోవా, బ్రెజిలు, మకావో, మొజాంబిక్ మొదలగు బుడతకీచు వలసరాజ్యములలోనివారు. వక్ష్యమాణ విషయ పురస్కారమున కిది పూర్వరంగము.

పదునైదవు శతాబ్దమునాఁటికి పట్టుమని పదిలక్షల జనసంఖ్యలేని బుడత కీచు జాతి నూతన సీమాన్వేషణలో ప్రదర్శించిన సాహసము ఆశ్చర్యకరము. భౌగోళికముగా పోర్చుగాలు వ్యాపించిన భాగము మిగుల ప్రాముఖ్యము కలది. బాల్టిక్, మధ్యధరాసాగర తీరదేశముల తోడి పోర్చుగాలు వర్తకము చాలపాలు సముద్రము ద్వారముననే సాఁగుచుండినది. ప్రాగిస్లామిక యుగము నుండియు ప్రాక్ప్రతీచీ ఖండముల వాణిజ్యము అరబ్బుల చేతులలో నుండినది. అరబ్బు వర్తకులు గడించిన ధనరాసులు, ప్రాచ్యసీమల ఐశ్వర్యమును గూర్చి అరబ్బుల వలన వినిన గాథలు బుడతకీచులను ప్రలోభపఱచినవి. మఱియొక విశేషము, అన్వేషిత సీమలలో కాథలిక్ క్రైస్తవమును వ్యాప్తిపఱచు నిబంధన మీఁద

నూతన సీమల సార్వభౌమాధికారము ఆ సీమలను మొదట కనుగొనిన రాజ్యములవారికి సర్వస్వత్వములతో సంక్రమించునని పోపు శాసనము. బుడతకీచులు రోమనుకాతలిక్కులు; అనగా మత పరముగా పోపు అనుయాయులు. ప్రభువు పవిత్ర వాక్యమును ప్రాచ్యభూములలో ప్రచార మొనర్పవలెనను ప్రబల వాంఛ యొకటి తోడయినది. తీరప్రాంతమును, విశాలసాగర తీరములలో సబురులు సేయు తమ వాణిజ్యనావలను సముద్రపు దొంగల బాదినుండి రక్షించు నిమిత్తము పోర్చుగాలుకు శక్తిమంతమయిన నావికాదళ నిర్మాణ నిర్వహణము అత్యంతావశ్యకము లయినవి. 1453 లో కాంస్టాంటినోపులు తురుష్కుల వశమగుటచే మధ్యధరాజలముల ద్వారమున సాగుచుండిన ప్రాచ్యసీమలతోడి వాణిజ్యమున కాటంకము కలిగినది. వేరుదారుల వెదకుట కిది మొదలు. ఈ వెదకుటలో స్పెయిను చక్రవర్తుల ప్రోత్సాహముతో కొలంబసు పోయి పోయి అమెరికాను కనుగొనుట యాదృచ్ఛికము. సాహసులును, ఉత్సాహపరులును నగు దేశీయులకు అన్వేషితసీమల పాలనాధికారములు వాగ్దత్తమొనర్చియు, ఆర్థికసాహాయ్యము సేసియు, ఉత్తమ బిరుదములు ప్రసాదించియు, ఎగుమతి దిగుమతి సుంకములను పరిహరించియు, ఓడల నిర్మాణమున కావశ్యకమగు కలపను ప్రభుత్వపు టడవులనుండి ధర్మార్థముగా నొసంగియు బుడతకీచు చక్రవర్తులు నూతన దేశాన్వేషణమును మిక్కిలిగా ప్రోత్సహించిరి. ఈ ప్రయత్నములు పారము ముట్టి, గుడ్‌హోప్ అగ్రము (Cobo de Buena Esperanza) ను చుట్టి బుడతకీచులు వష్కోడ గామా నాయకత్వమున క్రీ. శ. 1498 లో భారతదేశము పశ్చిమ తీరము నందలి కోజికోడులో అడుగిడిరి. 'కోవిల్యామ్' అను మఱియొక బుడతకీచు వాడు భూమార్గమున పయనించి 1487లో లోనే కోజికోడును చేరియుండెనట! తుళువ నరసరాయలు సంరక్షకుడుగా సాళువ నరసింగరాయల తనయుడు (1493–1503) విజయనగర సామ్రాజ్యమును, వీర రుద్రగజపతి సాగరాంబ్రముతోపాటు కళింగసీమను, కోజికోడు రాజధానిగా 84 వ జామొరిన్ మలబారు తీరమును, యూసఫ్ ఆదిల్‌షా బీజాపురమును, ఉమ్మత్తూరు రాజధానిగా చన్న నంజరాజు మైసూరు దక్షిణ ప్రాంతమును, భూతల శ్రీవీర ఉదయమార్తాండవర్మ (1494–1535) తిరువాడి (తిరువాన్కూరు) సీమను, జటిలవర్మకులశేఖర పాండ్యుడు తిరునల్వేలి ప్రాంతమును, ఉన్నిగోదవర్మ కొచ్చి ప్రాంతమును, లోడీ వంశీయులు

(1470_1516) ఢిల్లీని పాలించుచుండిన కాలమది; విజయనగర సామంతులగు తిమ్మోజా ప్రభృతులు పశ్చిమ తీరము నందలి ఓనావరు, బంకాపురము, బత్కల్లు మొదలగు నాడులకు మండలేశ్వరులుగా నుండిన సమయమది.

ఇఁక బుడతకీచులతో తెలుఁగు నాడునకును, తెలుగువారికిని ఉండిన ప్రత్యక్ష పరోక్ష సంబంధములను వ్యక్తీకరించు కొన్ని చారిత్రక సన్నివేశములను గుఱించి ప్రస్తావించుట అప్రస్తుతము కాదు. బర్బోజా (1500_1517), పేయిజ్ (1520_1522), న్యూనీజ్ (1537), సౌజా (1674_1675) మొదలగు బుడతకీచు చరిత్రకారులును, బుడతకీచుల జాతీయకవి కామొన్సు (1553_1570) ను, కోతిన్యో (1598_1611), సీమోను (1600_1611) మొదలగు బుడతకీచు పాదిరీలును విజయనగర సామ్రాజ్యమున పర్యటించి వ్రాసిన వ్రాఁతలు ప్రత్యక్ష కథనములు. బుడతకీచుల వ్రాఁత లన్నింటను విజయనగర సామ్రాజ్య ప్రశస్తి పలుతావుల ప్రస్తావితము. విజయనగర సామ్రాజ్యము 'నర్సింగ' రాజ్యమనియు, రాజధానియైన విజయనగరము 'బిస్నగ' అనియు ఈ లేఖనముల వ్యవహృతము. బుడతకీచుల రాకకు పూర్వము సాళువ నరసింగరాయలు (1487_1493) విజయనగర చక్రవర్తి. అల్ప వయస్కులగు నీతని తనయులు తుళువ నరస రాయల సంరక్షణలో పదేండ్లపాటు నామమాత్రపు పాలకులు. (1493_1503); 1505 దాఁక నరసరాయల పాలన. నరసరాయల పిమ్మట అతని కుమారుఁడును, కృష్ణదేవరాయల సవతి సోదరుఁడును అగు వీర నరసింహరాయలు (1505_1509) పాలకుఁడు. బుడతకీచులు కాలికోడులో దిగినది 1498లో. అనఁగా వీరి రాక కటునిటు పది పదేండ్లుగా విజయనగర సామ్రాజ్యమును పాలించిన వారు నరస, నరసింగ, నరసింహ నామధేయులు. ఇందుచేత విజయనగర సామ్రాజ్యమును 'నర్సింగ' రాజ్యమను వాడుక బుడతకీచుల వ్యవహారములో స్థిరపడినది. విజయనగర చక్రవర్తులు హిందూధర్మ రక్షణ దీక్షా కంకణ బద్ధులు; ఉత్తరమునుండి వచ్చు ముస్లిము దాడులను అరికట్టుటలో వీరు ప్రధాన పాత్రను నిర్వహించిరి. బుడతకీచులకును, ఇస్లాము మతానుయాయులు అందును అరబ్బులు ప్రబల విరోధులు. బుడతకీచులు కోలికోడులో అడుగిడుసరికి అగర్భ శత్రువులయిన అరబ్బులు ప్రత్యక్షమయిరి. జామొరిన్ నెచ్చెలులగు ఈ అరబ్బులు బుడతకీచులపై స్పర్ధవహించి జామొరిన్‌కును, బుడతకీచులకును మైత్రి పొసగకుండ చేసిరి. ప్రతీకార వాంఛాపూరితులయిన బుడతకీచు పాలకులు

వస్కో ద గామా, కేబ్రల్ (1500_1505), అల్మీదా (1505_1509), అల్బూకర్కు (1509_1515) మొదలగువారు అరబ్బులపై ఎదురుదెబ్బ తీసిరి. ఇస్లాము మతానుయాయుల ఉద్ధతి నణచుటలో సమశీలవ్రతయుతులగు విజయనగర చక్రవర్తుల తోడి సఖ్యము బుడతకీచులకు ఉభయతారకముగా తోఁచినది. 1500_1650 ల మధ్య బుడతకీచులకును, విజయనగర చక్రవర్తులకును పలువారములు రాయబారములు నడచినవి. మొదటి బుడతకీచు గవర్నరగు అల్మీదా 1506 లో పశ్చిమ తీరమునఁగల బత్కల్లులో ఒక గిడ్డంగిని నిర్మించుకొనుటకు అనుమతిని కోరుచు విజయనగరముతో నెరపిన రాయబారములు ఫలింపలేదు 4. 1510 జనవరిలో అల్బూకర్కు, లూయిజ్ అను బుడతకీచు పాదిరీని రాయబారిగా కృష్ణదేవరాయల (1509_1530) కొలువునకు పంపెను. ఉభయ పక్షములకును సాధారణ విరోధులయిన మూరు (తురక) రాజులను అణఁగ ద్రొక్కుటలో పరస్పర సాహాయ్యమావశ్యక మనియు, బిజాపురము సులతానగు ఆదిల్‌షా యధీనమున నున్న గోవాను తిరిగి జయించి స్వాధీనపఱుచుకొనుటలోను, వలయునంత అశ్వబలమును సమకూర్చుకొనుటలోను తాము విజయనగరమునకు తోడ్పడగల మనియు, మంగళూరు బత్కల్లుల నడుమ గిడ్డంగిని స్థాపించుటకు అనువగు తావును తమకీవలెననియు ఈ రాయబారము 5. ఈ ప్రతిపాదనలయెడ తాను ఔత్సుక్యము నగపఱిచినట్లు బుడతకీచు లెఱిఁగినచో వారికి పట్టపగ్గము లుండవని దూరదర్శియగు రాయలు వేచి చూచు నీతిని అవలంబించినాఁడు. పది మాటల కొక మాటగా రాయల రాయబారములు సాగినవి 6. రాయలు పట్టాభిషేకము (1509 నవంబరు) జరిగి నాఁటికి రెండేరెండు నెలలు గడచియుండినవి. అన్ని దిక్కుల శత్రువులు; అంతః కలహములు, అందువలన రాయలు స్పష్టమగు సమాధాన మీక బుడతకీచు రాయబారిని తన కొలువున చాలాకాలము నిలిపి

1. Robert Sewell, Forgotten Empire, p 117
5. Commentaries of Afonso Dalboquerque Vol. II, pp. 74 . 77.
6. Fr. Heras, Early Relations Between Vijayanagara and the Portuguese, Quarterly Journal of the Mythic Society Vol. XVI, p. 65.

యుంచెనని కొందఱి వ్యాఖ్యానము 7. ఈలోగా అల్బ్యాకర్కు విజయనగర సామంతుడును, అపర చాళుక్యుఁడును నగు తిమ్మోజు అండదండలతో గోవాను జయించి స్వాధీనపఱుచుకొనినాఁడు. ఆయేటఁ ఒకటి రెండు మాఱులు చేతులు మాఱినను నాఁటి నుండియు నేటిదాఁక గోవా బుడతకీచుల ప్రధానకేంద్రము 8. ఇమ్మడి హరిహరరాయల కాలము (1375–1404) నుండియు గోవా విజయనగర చక్రవర్తుల యేలుబడిలో నుండినది. అంతకుపూర్వ మది బహమనీ సామ్రాజ్యములోని బిజాపురము భాగమునందలిది. ఇమ్మడి హరిహరరాయల మహామాత్యుఁడగు మాధవమంత్రి గోవాను బహమనీ సులతానులనుండి జయించి యుండెను. అసమర్థుఁడగు విరూపాక్షరాయల పాలనకాలము (1466–1485)న 1468 లో గోవా మరల బహమనీ అధికారము క్రిందికిపోయినది. పశ్చిమ సముద్రతీరమునందలి సహజ నౌకాశ్రయమగుట చేత పాశ్చాత్య సీమలతోడి భారతీయ వ్యాపారము అధిక భాగము ఈ రేవు ద్వారమున జరుగు చుండెడిది. బాహ్లీక పారసీక శకధారా రట్ట ఘోట్టాణములయిన మేలిదినుసు గుఱ్ఱము లన్నియును గోవా రేవునకు వచ్చుచుండెడివి. నాఁటి యుద్ధ పద్ధతులలో అశ్వదళమునకు అత్యంత ప్రాధాన్య ముండెడిది. అప్పటికి అరేబియా సముద్రతీరము నంటియున్న కీలక స్థానములగు రేవు పట్టణము లన్నియును బుడతకీచులకు వశీకారము లయి యుండినవి. ఇందుమూలమున గోవాకును, తద్విజేతఁగు బుడతకీచులకును భారతరాజకీయములలో ప్రాముఖ్యము హెచ్చినది. గిడ్డంగులు స్థాపించిన తావులం దెల్లను అల్బ్యాకర్కు బలిష్ఠమైన దుర్గములను నిర్మించి సాయుధులును సుశిక్షితులును నగు సైనికులను కాఁపుగా నుంచెను. దేశీయ పాలకులను పోర్తుగాలు చక్రవర్తికి అరిగాపులనుగాఁ జేసి తన్మూలమున ప్రాచ్యసీమలలో బుడతకీచు సామ్రాజ్యమును స్థాపింపవలెనను తీవ్రకాంక్ష

7. Prof. G. Venkata Rao, Krishnadevaraya and the Portuguese, Journal of the Andhra Historical Research Society, Vol. X pp. 74–85, 1937.

8. ఈ వ్యాసరచన నాఁటికి గోవాపై మన బావుటా ఎగురలేదు.

9. Commentaries, Vol. IV, pp. 74, 75 అల్బ్యాకర్కు వ్యాఖ్యానములలో ఈ పట్టున నుట్టంకితమయిన పాదిరీ లూయీజ్ లేఖాభాగమును చదువుటలో డా. ఓరుగంటి రామచంద్రయ్యగారి వివరణము మిగులు నుపకరించినది.

అల్బూకర్కు కుండినది. 1510 నవంబరులో బత్కల్లులో గిడ్డంగిని నిర్మించు కొన ననుమతించుచు కృష్ణదేవరాయలు పంపిన విజయనగరము రాయబారి పాదిరీలూయిజ్ వ్రాసియిచ్చిన పరిచయ లేఖతో గోవా వెడలినట్లాధారములు కలవు 9. రహస్య భంగము సేయుట కారణముగా పాదిరీ లూయిజ్‌ను 1511 లో రాయలు హత్య సేయించెనట 10; "మంత్ర వేత్తకు నాజ్ఞ మఱచియుంట.... వలదు పతికి" అను రాజనీతి కిది 11 లక్ష్యము కాఁబోలు! ఈ హత్యాదోషము బిజాపురము సులతానుల కారోపిత మగుట రాయల రాజనీతి చతురత ! 1512 లో విజయనగరము నుండి మఱియొక రాయబారి గోవా వెడలినట్లును, రాయల ప్రతిపాదనల నంగీకరించుచు అల్బూకర్కు పంపిన బుడతకీచు రాయబారి విజయనగరము వచ్చినట్లును తెలియుచున్నది 12. 1513 లో అల్బూకర్కు నిర్వ హించిన ఏడెన్ దండయాత్రలో పదునేడు వందల బుడతకీచు సైనికులతోపాటు ఎనిమిదివందల మంది దేశీయులగు సిపాయిలును పాల్గొనినట్లు అల్బూకర్కు వ్యాఖ్యానములు 13. 1514 నవంబరులో గోవాకు వెడలిన విజయనగర రాయబారి (Retelim Chetim) కి ఉచితరీతిని సత్కారములు జరిగినట్లును, ఈ సుహృద్భావమును దృఢపఱుచు నిమిత్తము అదే యేఁడు అంతోనీ డీ సౌజా అను బుడతకీచు రాయబారి గోవానుండి విజయనగరము వచ్చినట్లును పూర్వోక్త వ్యాఖ్యానములలో ప్రస్తావితము 14.

"సింధుర మహాశ్వ ముఖ్యముల్ చేర్చు దొల
దీవి వణిజుల కూళ్ల సద్గృహములు పురిఁ
గొలువుఁ దేజంబు వెలమేలు గలుగఁ బ్రాత
వారిగాఁ జేయు మరినవి చేరకుండ" 15 ఇది రాయల రాజనీతి!

---

(9 వ ఫుట్‌నోట్ 224 వ పేజీలో)

10. Dr. O. Ramchandrayya, Studies on Krishnadevaraya, A. U. Publication.
11. ఆముక్తమాల్యద, 4-252
12. Fr. H. Heras, Aravidu dynasty pp. 58, 59
13. Commentaries, Vol. IV, p. 1..
14. Commentaries, Vol. V. pp. 121. 124.
15. ఆముక్తమాల్యద, 4-258.

ఇందలి దొరలదీవి వణిజులు ముఖ్యముగా బుడతకీచులనుటలో విప్రతిపత్తిలేదు. రాయలీ నీతిని ప్రత్యక్షరమును పాటించిన వ్యవహార దర్శి యనుటకు ప్రమాణములు కోకొల్లలు [16]. Christovam de Figueiredo అను నొక బుడతకీచు వాఁడు 1515 లో రాచోలును వశపఱుచుకొనుటలో కొన్ని బుడతకీచు పటాలములతో రాయలకు తోడ్పడినట్లు తెలియవచ్చుచున్నది [17]. బుడతకీచుల తోడ్పాటునకు సంతసించి కృష్ణదేవరాయలు తాని జైత్రయాత్రలో సాధించిన రాచోలు ప్రాంతమును ఆ మఱునటియేఁడు బుడతకీచు వైస్రాయికి బహుమతిగా నొసంగెనఁట [18]. Christavao be Figueiredo అను నొక బుడతకీచు ప్రముఖునకును అతని పరివారమునకును కృష్ణరాయల పేరోలగమున ఘనమయిన సన్మానము జరిగినట్లు ఆ పరివారములో నుండిన బుడతకీచు చరిత్రకారుఁడగు పేయీజ్ వ్రాతలు [19]. అన్యభూప్రజల రాజాయాయి జాత్యుచితిన్ బ్రోవందగు... [20] సనికదా రాయల రాజనీతి. 1520 లో జరిగిన రాయల రాయచూరు దండయాత్రలలో విజయనగరములో విడిసియుండిన Christopher de Figueiredo అను నొక బుడతకీచు అశ్వవర్తకుడు రాయలకు సాయపడెనఁట [21]. పూర్వోక్తములయిన మూఁడు సంఘటనలలోని పేర్లు మూఁడును ఏక వ్యక్త్యుద్దిష్టములో భిన్న వ్యక్త్యుద్దిష్టములో నిర్ణయించుట చారిత్రకుల పని. 1520 లో విజయనగరములోని ఒక తటాక నిర్మాణము సందర్భమున కృష్ణదేవరాయల కోరిక మేరకు గోవాలోని బుడతకీచు గవర్నరు పంపిన జువోన్ దెలా పొంతి (Joan della

---

16. 'గడిన్నృపుల రాయబారుల మెడఁ గొలువున సరస సల్లాపములు రాజు సలుప వలయు' అముక్తమాల్యద, 4_259.
17. F- C. Danvers, Portuguese in India. Vol. I. P. 347; also Fr. Heras Aravidu dynasty, p. 59.
18. 'Rachol lies to the east of province of Salsette...Wrested from the king of Bijapur in 1520 (?) by Krishna Rao of Vijayanagar, it was shortly ceded by the latter to the Portuguese' (History of Goa.)
19. Sewell, Forgotten Empire, pp, 251,252.
20. అముక్తమాల్యద, 4_245.
21. Sewell, Historical Inscriptions of Southern India, p. 242.

ponte) అను బుడతకీచు ఇంజినీయరొకండు విజయనగరమువచ్చి తోడ్పడి నట్లు తెలియుచున్నది[22]. సదాశివరాయల కాలమున 1543 లో విజయనగర సామ్రాజ్యములోని తిరుమల తిరుపతి దేవస్థానమును దోచుకొనవలెనని చోళ మండల తీరమున బుడతకీచుసేనాని యగు మర్తిన్ అఫొన్సు దీ సౌజా తల పెట్టిన ఉద్యమము విజయనగర చక్రవర్తుల ప్రతిఘటన సన్నాహముల వినికితో విరమింపఁబడినట్లు తిరుపతి చరిత్రలో ప్రసక్తము[23]. జువోన్ దీ కష్త్రో (Joao de Castro; 1545_1548) గోవాలో బుడతకీచు వైస్రాయిగా నుండి అళియ రామరాయలతో సఖ్యము వహించి తూర్పుతీరమున వర్తకమును వృద్ధి పఱచినాఁడు. 1546_1549 ల మధ్య సుహృద్భావ సూచకముగా నాలుగైదు పర్యాయములు గోవా విజయనగరముల రాయబారములు ప్రవర్తిల్లినవి. శత్రువులతోడి యుద్ధములలో పరస్పర సాహాయ్య మొసర్చుకొనుటకును, శాంతియుతమైన సహజీవన విధానము ననుసరించుటకును, గోవా రేవులో దిగుమతి యయిన అరబ్బీ. పారసి గుఱ్ఱముల నన్నిటినీ విజయనగరమునకే విక్రయించుటకును, విజయనగర సామ్రాజ్య సీమలోని కోస్తా వర్తకు లందరును ఓనావరు, బార్సిలూరు మొదలగు రేవులకు తమ సరుకులను విధిగా పంపుటకును, విజయనగర సామ్రాజ్యములో తయారగు బట్టలు, పెట్లుప్పు, ఇనుము మొదలగు వానిని బుడతకీచు వర్తకులకు మాత్రమే అమ్ముటకును, బుడతకీచు వర్తకులు వీనిని సకాలములో సలీసు వెలలకు కొనుటకును పైన పేర్కొనిన రాయబారములు ఒప్పందములను కుదిర్చినవి[24] అళియరామరాయలు విదేశీయుల పట్ల విశేషౌదార్యమును ప్రదర్శించెడివాఁడనియు, శాంతోములో గిడ్డంగిని నిర్మించుకొని వర్తకము సేసికొనుటకు బుడతకీచుల ననుమతించుచు అయన బంగారు తగడుల మీద వ్రాయించి ప్రసాదించిన దానశాసనము బుడతకీచులయొద్ద నుండినట్లు ప్రత్యక్షముగా

22. Prof. G. V. Rao, op. Cit.

23. Dr. S.K. Aiyangar, History of Tirupati, Vol. II, pp. 294-298; also Fr. H. Heras, Aravidu dynasty pp. 60. 61, 'శత్రు సంహార వేంకటాచల విహార' యను మకుటము గల శతకములోని 'సాముడిగ్గియ నీటిచల్లు లాటలు గావు, పాశ్చాత్య భటుల తుపాకి గుండ్లు' అనుట ఈ సంఘటనకు సంబంధించినది కాదేమో?

24. Fr. H. Heras, Aravidu dynasty, pp. 61-64.

చూచిన వెనీషియను వర్తకుడగు నికోలాయ్ మనూచి(1653–1708)వ్రాతలు[25]. శాంతోములో నూటికిపైగా బుడతకీచు కుటుంబము లుండినట్లు 1545 లో ఈ ప్రాంతమును దర్శించిన సెయింట్ ఫ్రాన్సిస్ గ్జేవియరు లేఖల వలన స్పష్టము[26]. సెయింట్ తామస్ సమాధి యున్న తావును 1517 లోనే గుర్తించితిమని బుడతకీచులు ప్రకటించుచుండిరట[27]. ఇచట 1547 లో బుడతకీచు లొకగిడ్డంగిని నిర్మించి తామస్ స్మృతి చిహ్నముగా ఆ తావును 'శాంతోము' అని వ్యవహరించిరి[28]. పదునెనిమిదవు శతాబ్దము దాఁక తూర్పు కోస్తాలో బుడితకీచుల కిది ముఖ్య స్థావరముగా నుండినది. కాని, నేఁడు దాని గుఱుతులును కన్పట్టవు. మైలాపురములోని బుడతకీచు పాదిరీలు దుండగములు సేయుచున్నారని ప్రజలు మొఱలిడగా 1558లో అళియరామరాయలు స్వయముగా గొప్ప సేనతో మైలాపురము విచ్చేసినట్లు సూయెల్ వ్రాతలు[29] తల్లికోట యుద్ధము వరకు గోవా విజయనగరముల మధ్య భారీ ఎత్తున వ్యాపారము జరగుచుండినది. గోవా విజయనగరముల రహదారులు వర్తకుల బిడారులతో తీర్థప్రజగా కిటకిట లాడెడివట! శాంతోము నుండి గోవాకు గల 150 లీగుల (ఇంచుమించు ఐదువందల మైళ్లు) భూమార్గ మంతయు విజయనగర సామ్రాజ్యాంతర్గతము విజయనగర చక్రవర్తులకును, గోవాలోని బుడతకీచు పాలకులకును గల సఖ్యభావము కారణముగా గోవా శాంతోముల మధ్య రాకపోకలు నిరాటంకముగా, నిశ్చయముగా సాఁగుచుండెడివి[30]. 1532లో బుడతకీచు పాదిరీలు తిరునల్వేలి కోస్తా ప్రాంతములోని ఇరువదివేల మంది జాలరులను క్రైస్తవ మతములో చేర్పించిరి. 1532–1542 పరిసరముల తూర్పు తీరములోని 'తూత్తుకుడి' బుడతకీచులకు ప్రముఖ స్థావరమయినది. ఆనాఁటికి విజయనగర సార్వభౌమాధికారము దూర దాక్షిణాత్య సీమల యందును నిరాఘాటముగా చెల్లుచుండినది. చోళమండలము

25. Niccolao Manucci, Storia Do Mogor, Vol. III p. 97
26. Heras, op cit. p. 67.
27. Ibid, p. 64. fn.
28. Manual of Administration of the Madras Presidency (MAMP) Vol. III, f 447.
29. Sewell, Forgotten Empire, p. 193: also Heras, pp. 67-69.
30. Heras, op. cit. pp. 71, 72.

విజయనగర సామ్రాజ్యములోని భాగమని బుడతకీచులే వ్రాసిరి. మధుర, తంజాపుర పాలకులు ఆంధ్రవచోనాధులు; తిరుచ్చిరాపల్లి, తిరునల్వేలి మండలములోని పాళియగాండ్రందఱును తెలుఁగువారు. వీరి ప్రతినిధులును, స్థానాపతులును సామ్రాజ్య కేంద్రమగు విజయనగరములో నుండెడివారు. బుడతకీచు పాదిరీయగు సెయింట్ గ్జేవియరు లేఖలలోను ఇతర లేఖ్యములలోను పలుతడవలు 'బడగె, వడగ' యని పేర్కొనఁబడినవారు విజయనగర సామంతులగు ఈ తెలుఁగు నాయకులే। తమిళములో 'వడుగర్' అనఁగా వెంగడమునకు ఉత్తర సీమవారయిన తెలుఁగువారని ప్రాచీన కాలమునుండియు వ్యవహార మున్నట్లు తమిళ సాహిత్యము ప్రమాణము [31]. అళియరామరాయల సోదర పుత్రుఁడగు రామరాజ విఠలదేవ మహారాయలు విజయనగర సర్వసేనానిగను, రాజప్రతినిధి (1543-1558) గను దాక్షిణాత్య సీమలలో సామంతుల ఉద్ధతి నణఁచి విజయనగర సార్వభౌమాధికారమును స్థిరపఱుచుటకును, బుడతకీచులను అదుపులో నుంచుటకును తిరుచ్చిరాపల్లి, తూత్తుకుడి పట్టణములు విడిదలలుగా గొప్ప సేనతో పండ్రెండేండ్లపాటు విడిసి యుండెనట [32]। స్వార్థపరాయణులగు బుడతకీచులతో అప్పటప్పట కొన్ని ఘర్షణలు, చిటిపొటి కయ్యములు సాఁగుచునే యుండినవి. విజయనగర చక్రవర్తియగు ఇమ్మడి వెంకటపతి రాయల (1586-1614) యొద్ద కిరువురు ఏసియ పాదిరీలు (Jesuit fathers) గోవా నుండి 1598 లో వచ్చి రాయల ఆస్థానమున పండ్రెండేండ్లు ఉండిరట [33]। విజ్ఞాన జిజ్ఞాసువగు రాయలు వీరికి మడులు మాన్యములిచ్చి, గుడులు, గోపురములు కట్టుకొన సాయపడెనఁట। చంద్రగిరి, రాయవేలూరులలో రెండు పాదిరి గుడులును ఈ ఉద్యమ ఫలముగా వెలసినవి. కాని, ఇందువలన క్రైస్తవమత వ్యాప్తి సాఁగినట్లు కన్పట్టదు. దీనికి ఈ పాదిరీల అశక్తత కాని, ప్రయత్నలోపము కాని కారణములు కావు. నాఁటి ప్రజల సంస్కారబలము కడు దొడ్డది. పరిపాలకుల ప్రాజ్ఞతయు మేరలు లేనిది. పరమత సహనము వారి ఉదారత కొక చిహ్నము. హైందవము నెడ వారికిగల అచంచల భక్తి విశ్వాసముల బలిమి క్రైస్తవము పట్ల ప్రదర్శించిన ఔదాసీన్య

31. 'కదనాయ్ వడుగర్' (శీఘ్ర గమనముగల కుక్కలు గలిగిన తెలుగువారు) నర్రిణై, 212.

32. Heras, op. cit. ff. 140.

33. ibid, pp. 435-437.

బుడతకీచుల నోడించి జాఫ్నా పాలకుని గద్దె నెక్కించి నేపాల నృపాల స్థాపనా చణ బిరుదాంకితుం డయ్యె ననుటకు సాహిత్యము సాక్ష్యము 36. రామభద్రాంబ (1600-1630) కృతమగు రఘునాథాభ్యుదయము నందును, యజ్ఞనారాయణ దీక్షితుని (1580-1630) సాహిత్యరత్నాకరము నందును ప్రస్తావితులగు 'ఫరంగి' వంశ్యులు బుడతకీచు లనుట స్థితిస్థాపకాంశము. ఆ పిమ్మట బుడతకీచులు తంజావూరుపై పట్టిన సఖ్యముతో మెలఁగినట్లు స్పష్టమగుచున్నది 37. పులికాటు రేవునుండి ఒలందా (డచ్చి) కుంఫిణీవారిని తఱిమి వేయుటకుగాను గోవాలోని బుడతకీచు వైస్రాయి అభ్యర్థన మీఁద, బుడతకీచులకును, విజయనగర చక్రవర్తి యగు మూఁడవ వెంకటపతిరాయల (1630-1642) కును 1635 లో ఒక ఒడంబడిక కుదిరినది. చెన్నపట్టణమున కుత్తరముగా పదికోసుల దూరములోఁ గల రేవుపట్టణము పులికాటు. ఒలందా వారిచ్చట 1609 లో తొలి గిడంగి (Geldria) ని నిర్మించియుండిరి. ఈ ఒడంబడికను ఆచరణలో అనువదించుటకై గోవా రాయవేలూరుల నడుమ బహువారములు రాయబారములు చెల్లినవి. కాని విజయనగరము వారి యసడ్డవలన బుడతకీచుల ఎత్తికోలు తుది దాఁకా లేదు 38. గోలకొండ వజీరగు మీర్‌జుమ్లా 1652లో గండికోటను మోసగించి, బుడతకీచుల సద్దతుతో ఆక్రమించుకొని, కోటలోని దేవతా విగ్రహములను గరఁగించి ఫిరంగులు చేయవలసినదని 'మైలే' యను బుడతకీచు వానిని కోరినట్లు సురవరము ప్రతాపరెడ్డిగారి వ్రాఁతలలో సూచితము 39. కాని 'మైలే' ('మైయే'

36. విజయవిలాసము, పీఠిక, 62; 'నేపాల భూపాల స్థాపనాచార్య' రఘునాథ నాయకుని రామాయణము, అశ్వాసాంత గద్యము.

కదనంబులో చోళగని గెల్చినట్టి
పొదలికల్ నేపాళ భూపాలకునకు
దొరతనం బిచ్చిన దోర్విలాసములు...' విజయ రాఘవ కృతమగు రఘునాథ నాయకాభ్యుదయము, పు. 19.

37. Letter to the King of Portugal from Conde de Linhares, then Portuguese Vice-roy in India, dated 30th Nov. 1635.

38. Danvers, Portuguese in India, Vol. II, pp. 249, 250.

39. ఆంధ్రుల సాంఘిక చరిత్ర, ద్వితీయ ముద్రణము, పుటలు, 320, 321.

అని సాధూచ్ఛారము) బుడతకీచువాఁడు కాఁడు. ఫ్రెంచి జాతీయుడు 40. అయినను, పరంగుల-ఇటాలియనులు, ఒళందాలు, పరాసులు, బుడతకీచులు-పలువురు తుపాకులు, ఫిరంగుల నిర్మాణము నందును తత్సంబంధి ప్రయోగములయందును స్థానికులగు పాళియగాండ్రకును, సామంతులకును తోడ్పడుచుండిన మాట వాస్తవము 41. నికోలాయి మనూచి (1653-1708) కథనములో గోవా, చెన్నపట్టణము, నాగపట్టణము, శాంతోము మొదలగు ప్రాంతములలో నివసించుచుండిన బుడతకీచులవ్యక్తిగతజీవితములకు సంబంధించిన బహూపాఖ్యానములును, క్రైస్తవమతధర్మపరీక్ష (inquisition) పేర సాగుచుండిన అత్యాచారములును బుడతకీచుపాలనలోని అవకతవకలును ప్రత్యక్షవ్యాఖ్యానములుగా సంగ్రథితములు 42. విజయనగరసామ్రాజ్యములోని శాంతోము, మైలాపురము, నాగపట్టణములు బుడతకీచులకు ప్రముఖ స్థావరములుగా నుండినట్లు విల్లియము ఫించ్ (1608) స్పష్టపరచినాడు 43. చెన్నపట్టణములో బుడతకీచు లనేకులు మంచి మంచి బవంతులలో నివసించు చుండినట్లును, శాంతోములోని కొండమీఁద ఒక చిన్న పాదిరి గుడి (చర్చి) యును, ఇరువురు బుడతకీచు పాదిరీలును ఉండినట్లును జాన్ మార్షల్ (1668) వ్రాతలు 44. జయరామపండితుని సంస్కృత రాధామాధవ విలాస చంపు అవతారికలో కర్ణాటక సీమలో బిజాపురము సులతానుల గవర్న

---

40. vide. Tavernier, Book I, p. 228. '.... It was from them we heard that there was a Freneh gunner then in town named Claude Maille of Bourges and that he was engaged in casting some cannon which the Nawab wished to leave in the fort.'

41. ibid, p. 228:
K. V. Krishna Ayyar, The Zamorins of Calicut.
'...పోఁత పిరంగిలోన...పరాగపుమందు నించి....
...కంతుఁడనేఁటి పరంగిభామ గుబ్బ లనెడు దుర్గము,
ల్బగిలి పార గుభల్లున నేవి యార్చినన్.' (హంస, 1-231)

42. Niccolao Manucci, op. cit., pp. 112-24; pp. 428-480.

43. Early Travels in India. p. 182.

44. John Marshall in India, pp. 50, 51.

రగు షహాజీ (1661–1684) ఫరంగులపై జరిపిన దండయాత్రలు ప్రస్తావితము. ఈ ఫరంగులు బుడతకీచులే యని చరిత్రకారుల యూహము 45. మొగలు చక్రవర్తుల దండయాత్రలకు బిజాపురము సులతానులు చేసిన ప్రతిఘటనోద్యమములో బుడతకీచుల చేయి యుండినది 46. 1670 లో మచిలీపట్టణములో కాతలిక్ శాఖకు చెందిన ఒక పాదిరి గుడియును, సెయింట్ అగస్టిన్ అనుయాయి యగు నొక పాదిరియును, కొందరు బుడతకీచులును ఉండినట్లు 'ఫెర్నాండి నవరే' యను క్రీస్తుమత ప్రచారకుడు వ్రాసెనఁట 47. ఆ కాలమున ఆరబ్బులు, ఆర్మీనియనులు, ఇంగిలీసులు, ఒళందాలు, డినమార్కులు (డేను జాతీయులు), పరాసులు, పారసీకులు, బుడతకీచులు మొదలగు వివిధ దేశ వేష భాషా మతములకు చెందిన అరదేసి పరదేసి సెట్లు ఎందరో మచిలీపట్టణమున గిడ్డంగులు కట్టుకొని, 'పైగోపరకంగు మలాక తరుణాసీరితవాయి యాదాముల'తో ఓడ బేరములు సేయుచుండిరి. గుంటూరు మండలము బాపట్ల తాలూకాలోని పెదగంజాము సమీపమునఁగల 'ఫిరంగి దిబ్బ' లేక 'ఫిరంగుల దిన్నె' ఒకప్పుడు బుడతకీచుల వాసస్థానముగా నుండినదఁట 48. ఇంగ్లీషు కుంఫిణీ డైరెక్టరువారు చెన్నపట్టణములో ఏర్పఱిచిన మేయరు కోర్టుల కనుబంధముగ నగరపాలక సమితి (1687–1726) లోని పంద్రెండుగురు సభ్యులలో ముగ్గురు తెలుఁగు వర్తకులతోపాటు ఇరువురు బుడతకీచు వర్తకులను సభ్యులుగా నియమించుట ఆచారముగా నుండినది 49. వాణిజ్యరంగమున ఇంగిలీసులును, ఒళందాలును పరాసు (ఫ్రెంచి) వారికి ప్రతిస్పర్థులు. ఇంగిలీసులకు, ఒళందాలకు బద్ధ విరోధులయిన బుడతకీచులు పరాసులకు పరమ మిత్రులయిరి. పరాసువారి ప్రాభవ మెలిగిన నాళ్ళలో వారికి మిత్రులుగా నుండిన బుడతకీచుల రాకపోకలు కోర మండల తీరమున అధికముగా నుండినవి. చంద్రనగర్,

45. Patwardhan and Rawlinson, A Source Book of Maratha History, p. 22.
46. English Factories in India (1630–36), pp. 59, 60.
47. Henry Morris, Godavery District, p. 182.
48. MAMP, Vol. III, p. 77.
49. Despatch of Court of Directors dated the 28th Sep. 1687, MAMP, Vol. I, p. 220, fn.

మాహీ, మచిలీపట్టణము మొదలగు రేవుపట్టణములకు సరకులను, టప్పాలును, పంపుటకుగాను పరాసువారు బుడతక్రీచుల నౌకలను తఱచుగా వినియోగించు చుండిరి 50. పరాసులు ఉచ్చదశలో నుండిన నాటికి బుడతక్రీచుల వెలుఁగు కొడిగట్టి యుండినది. బలహీనులతో చెలిమిచేసి, బలవంతులతో పంతమాడుట పరాసు గవర్నరయిన డూప్లే (1742_1754) రాజనీతి. పరాసుల నెచ్చెలి యును, కర్ణాటక నవాబును నగు చందాసాహేబు (1734_1752) మఱుగు పడుచున్న బుడతక్రీచు ప్రాభవమును పునరుద్ధరించు తలంపుతో డూప్లే సూచనల మేరకు మైలాపురములోని 'అంతోనీ' యను బుడతక్రీచు పాదిరీని మైలాపురము నకు అమల్దారుగా నియమించినట్లును, పూరేండ్ల నుండి చెన్నపట్టణములో స్థిరపడిన ఇంగిలీసు కుంఫినీ అధికారులకు ఈ నియామకము నచ్చక 1749లో 'అంతోనీ' ని వెలపట్టినట్లును ఆనందరంగపిళ్లె దినచర్యా గ్రంథావళిలో ఉట్టంకితము 51. రామచంద్ర పెరుమాళ్ల తిరుణాళ్ల వేడుకలఁ జూడవచ్చిన వారితో 'పరంగు లింగులీసులు పరాసులు కొండ' యున్నట్టు 'హంసవింశతి' కథనము 52. ఇచటి 'పరంగులు' బుడితక్రీచులని ఊహించుట సత్యదూరము గాదు. 'సాధారణముగా విదేశీయులు అను నర్థమున చాలకాలము వాడుకలో నున్న 'ఫరంగి' అనుమాట మొట్టమొదట పోర్చుగీసువారికి ప్రయోగింపబడి కాలక్రమమున మిగిలిన పాశ్చాత్యులకందఱికివి సామూహికార్థమున ప్రయోగింప బడినది' 53. చంద్రగిరి, రాయవేలూరులలో క్రైస్తవమత ప్రచార కులుగా నుండిన కోతిన్యు, సీమోను మొదలగు బుడతక్రీచు పాదిరీలు (1598_1611) తిరుపతి మొదలగు క్షేత్రముల జరుగు రథోత్సవాదులను స్వయముగా దర్శించి వ్రాసిన వ్రాఁతలు పై యూహకు ప్రోద్బలకము 54. చెన్నపట్టణము లోని రాబర్ట్సన్ పేట నివేశన స్థలము ఇరువదెకరములును ఇంగిలీసు కుంఫిణీ దొరతనమువారిచే దానముగా ఈఁబడినదఁట। ఈ స్థలమంతయు 1804 లో

50. ఆనందరంగపిళ్లె దినచర్యా గ్రంథావళి. Vol. III, P. 315; 1747 A. D.

51. Ibid, Vol. VI, pp. 219, 225.

52. హంసవింశతి. 3_28.

53. డా కొత్తపల్లి వీరభద్రరావుగారు : "తెలుగుసాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము" పు. 17.

54. Heras, op cit. pp. 315, 316.

D'Frouze అను బుడతక్కీచు జాతీయుని స్వాధీనములో నుండినది 55. రోమను కాతలిక్కుల ఆంధ్ర ప్రాంత కేంద్రములలో కొన్ని వందల మంది బుడతకీచు భాషీయు లున్నట్లు 1880 నుండి తీసిన జనాభా లెక్కల నివేదికలు స్పష్టపఱుచు చున్నవి. పూర్వోక్తములగు చారిత్రకాంశము లన్నియును విజయనగర చక్రవర్తుల తోడను, తత్సామంత మండలేశ్వరులతోడను బుడతకీచుల కుండిన సంబంధములను, ఆంధ్ర ప్రాంతములో బుడతకీచు భాషీయుల ఉనికిని ఆవిష్కరించునట్టివి.

## బుడతకీచు భాషా వ్యాప్తి

పదునాఱవు శతాబ్ది నుండియు దక్షిణ భారత రాజకీయములలో బుడత కీచు లాక్రమించిన కీలకస్థానము ననుసరించి, వారితో రాజకీయాదికముల సుహృద్భావ సంబంధములను స్థాపింపవలయుచో పరిసర సీమల రాజకీయోద్యోగు లందఱును బుడతకీచు బాసను విధిగా అధ్యయనము చేయవలసి యుండినది. స్వామికార్య నిర్వహణ ప్రవీణులు పరదేశ భాషలను నేర్చుట బుడతకీచుల రాకతో పుట్టలేదు. ఇది సర్వ దేశకాల సంబంధి. ఆ నాఁటి ఏలికలు 'అశేష నృపసేవం దత్తద్భాష లెఱిఁగి' 56 'ఎల్ల నృపుల గొలువ బాసాడ' 57 నేర్చిన వారు. 'పరదేశభాషలు ప్రభువుకు వినిపింప నేర్పు గల్గిన మంత్రులు పీఠి పరులుగా 58 పరిగణింపఁబడిరి. 'సకల భాషలు మాటాడఁ జదువ, వ్రాయ నిపుణత వహించి' 59 తమ ప్రభువులను మెప్పింప వారు పాటుపడెడివారు. స్వామి కార్యాభిరక్షాక్రియాదక్షులగు వారి కిది శ్రీరామరక్ష. 'పారసీకోక్తుల ప్రఖ్యాతి కెక్కిన నాడు''అరబీ, పారసి, కన్నడము, రుమీ, కన్నోజి, తెనుఁగు మొదలగు బాసల్ పరికించి' 60 నియోగము నెఱపినవారెందరో కలరు. రెడ్డి రాజులు వీరభద్రేశ వేమ పృథ్వీధవుల యనుఁగు మంత్రియగు బెండపూఁడి

55. MAMP, Vol. III, P. 448.
56. ఆముక్తమాల్యద, పీఠిక, 18.
57. Ibid, పీఠిక.
58. చాటువు.
59. కస్తూరి రంగకవి, ఆనందరంగరాట్ ఛందము, పీఠిక. 59.
60. పొన్నిగంటి తెలగన్న, యయాతి చరిత్రము, 1-58.

దేవయ్యన్న మంత్రివరుండు (1423–1447) 'అరబీ భాష తురుష్క భాష గజ కర్ణాటాంధ్ర గాంధార ఘూర్జర భాషల్ మళయాళ భాష శకభాషా సింధు సౌవీర బర్బర భాషల్ కరహాట భాష మఱియుం భాషా విశేషంబులు' 61 గోష్ఠి సంప్రయోగంబుల నియోగింప నేర్చిన వ్యవహారవేత్త. ఈ 'అన్వయ మంత్రి శేఖరుం డహమ్మదుసేను వదాన్యభూమి భృత్సన్నిధికిన్ మదిం సముచితంబుగ వేమ మహీసురేంద్ర రాజ్యోన్నతి సంతతాభ్యుదయ మొందంగ పారసి భాష' 62 లో కాకితములు వ్రాసెడివాఁడు. గోలకొండ సులతానుల కాలము (1512–1687) న ప్రముఖ రాజకీయోద్యోగులు 'అరబి పారసి గుజరాతి యాదెమొచ్చ తెనుఁగు కన్నోజి మొదలుగా దెలిసి వ్రాయ దారి గన్నట్టి' 63 వారు. బుడతకీచుల ప్రాముఖ్యము హెచ్చిననాఁడు తద్వ్యవహార భాషను నేర్పుట ఆవశ్యక మయినది. బుడతకీచు నేర్చిన దేశీయ క్రైస్తవులకు 'దుబాసి' పదవు లీయఁబడినదని పోర్తుగాలు చక్రవర్తి నుండి 1571 లో గోవాలోని బుడతకీచు అధికారులకు ఆజ్ఞాపత్రిక వచ్చియుండినది 64. దుబాసీలకు ఆనాఁడు రెండు పర్దాలు—అనఁగా సుమారు రెండురూపాయలు—నెలసరి జీతము 65. దేశీయులు పెక్కుండ్రు దుబాసీలుగా పనిచేయు నిమిత్తము బుడతకీచును నేర్చుచుండిరనుట దాని విపుల ప్రచారమునకు ప్రబల ప్రమాణము 66. 1602 నాఁటి ఒక ఏసీయ పాదిరి ఉత్తరములో వెంకటపతిరాయల (1586–1614) ఆస్థానమున నుండిన బుడతకీచు దుబాసిని గూర్చిన ప్రసక్తి కలదు 67. చెన్నపట్టణములో ఇంగిలీసు కుంఫిణీ దొరతనము నెలకొనిన క్రొత్తలో కుంఫిణీ పాలకులు స్థాపించిన కొత్వాలు చావడుల—తొలి న్యాయస్థానముల—(1678–1726) లో బుడతకీచు

---

61. శ్రీనాథుని భీమేశ్వర పురాణము, 1–73.
62. Ibid, 1–74.
63. యయాతి చరిత్రము, 1–47.
64. S. R. Dalgado, p 348; fn.
65. 'To a lingua of the factory at Goa two pardaus monthly...' Simao Botelho, Tombo do Estado da India, p. 63: quoted by Dalgado , p 63, fn.
66. Dr. Robert Caldwell, History of Tinnevelley. p. 233.
67. Heras, op. cit., p. 437.

భాషయే వ్యవహారమున నుండినది 68. దినసరి వక్కాణలు, వాది ప్రతివాదుల అభియోగములు, ధర్మాసనము వారి తీర్పులు బుడతకీచు భాషలో లిఖితములగుచుండినవి. ఆస్తిపాస్తుల క్రయవిక్రయములును, అన్యాక్రాంతములును, దానధర్మాదుల వివరములును తెలుఁగు, బుడతకీచు బాసలలో సంగ్రథితములగుచుండినట్లు (1670–1681) నాఁటి ఇంగిలీసు కుంఫిణీ రికార్డులును సాక్ష్య మిచ్చుచున్నవి 69. బానిసల వ్యాపారమును నిషేధించుచు కుంఫిణీ దొరతనమువారు 1682 లో చేసిన శాసనము ఇంగ్లీషు, తెలుఁగు బుడతకీచు భాషలలో ప్రకటితమయినది 70. 1687 లో సీమనుండి ఇంగిలీసు కుంఫిణీ నిర్వాహకులు చెన్నపట్టణములోని ఫోర్టు అధికారులకు పంపిన ఆజ్ఞాపత్రిక మేరకు మేయరుకోర్టు చెన్నపట్టణములో స్థాపితమయినది. ఈ కోర్టులోని ప్రధాన లేఖకుడు (Town-clerk) ను నగర వ్యవహారదర్శి (Recorder) యును ఇంగ్లీషు జాతీయులయి, తెలుఁగు బుడతకీచు భాషాజ్ఞానము కలవారయి యుండవలయునని విధించిన నిబంధన నిర్వాహమగుటచే బుడతకీచు భాషకు గల వ్యవహార బలము సుప్రతిష్ఠితము 71. పెరంబూరి ఆనందరంగపిళ్లై (1700–1750) తండ్రియగు తిరువెంగడప్రభుకిరీటి "ఫ్రాంసు భాషను కథల్పులుక్కా ముద్దు" 72 గలిగి జాతి దొరల మెప్పు అందిన వాఁడే కాక 'ఫ్రాంసు హింగ్లీజు దిన మార్గ యొలందా యంపరుదొరు పురతకేశు —' మొదలయిన జాతి భాషా విశేషంబులఁ ప్రవీణతఁ గాంచి యాయా జాతి పాదరులకుం దెలియని గూఢార్థంబులఁ దెలియఁజేసి వారిచే మేలుమేలని పొగడికలు గాంచి యితర మతంబుల మర్మ కర్మంబు లన్నియుం బరిశీలించిన' 73 ప్రౌఢయునఁట! ఆనందరంగపిళ్లై సహజన్ముఁడగు తిరువెంగళేంద్రుఁడును 'ఫ్రాంసు పుడతకీసు హారబి పార్సి తెనుఁగు నరవమును మొదలయిన భాషాంతరముల మాటలాడఁ జదువ

68. MAMP, Vol. I, p. 265, fn.
69. Notes and Extracts from the Govt. Records in Fort. St George (1670-1681), Part III, 33 ; Sept- 9, 1680.
70. Pringle, the Diary of the Agent, 1682.
71. MAMP. Vol. I, p. 220, fn.
72. ఆనందరంగరాట్ ఛందము, పీఠిక,
73. ibid. పీఠిక, 58,

ప్రాయ మేటియగుచు—' 74 మెప్పు లందినవాఁడు. 'సీమలో నుండి ఫ్రాంసు రాచ్ఛేభరుండు—కుంపిని దుబాసి తన మీయ సొంపుమీఱి' 75 న ఆనందరంగ పిళ్లెయును 'ఫ్రాంసు మహారాజేంద్ర హృదయానుగత చరత్కుంపినీ ప్రభువర్య సర్వకార్య నిర్వహణ చణ మనీషా విశేషుఁడు' 76 అగుటకు బుడత కీచును సైతము నేర్చియుండెనని ఊహించుట కవకాశము కలదు. పులికాటులో ఒళందా కుంఫిణీవారి దుబాసి—ధరణి దేవుల రామయామాత్య కృత దశావతార చరిత్ర కృతిభర్త—యగు మగదల కృష్ణ మంత్రియును, మచిలీపట్టణములో వరాసుకుంఫిణీ వారి దివాను—మంగళగిరి ఆనంద కవి రచిత వేదాంతరసాయన కృతిపతి—అగు నిడుమామిళ్ల దాసయా మాత్యుఁడును, పుదుచ్చేరిలో వరాసుకుంఫిణీ వారి కార్యస్థులు—దాసయామాత్యా సోదరుఁడు—అగు నిడుమామిళ్ల రాజప్ప (1740—1790) యును 'మూసా బూసీ వారి దుబాసీ లక్ష్మణ సమాఖ్యుఁబరగు నతఁడు' 77 (1750) ను ఆనందరంగపిళ్లె వలె బుడతకీచును నేర్చియుండవనగును. బుడత కీచులకు పిమ్మట వచ్చిన పాశ్చాత్య వాణిజ్య సంఘ ప్రతినిధులు స్థానికా భాషా సాహచర్యముచే వికృతి నందిన బుడతకీచును నేర్చియు 78 దీని నెఱిఁగిన వారిని దుబాసీలుగా నియమించుకొనియు 79 వ్యవహరించుట మీఁది ప్రతిపాదనమునకు ఉపబలకముగాకపోదు.

---

74. ibid. పీఠిక, 81.
75. ibid. పీఠిక. 76.
76. ibid. పీఠిక, 15.
77. రంగారాయ చరిత్రము, 2—61.
78. Captain Alexander Hamilton (1650 A. D.), A New Account of the East Indies. Preface p. XII.
79. 'The Portuguese language contributed many words to the vocabularies of Indian languages, and a bastard form of it was for a long time a lingua Franca in the sea-ports and European settlements along the coast. Both the Dutch and the English in the Seven-teenth century had to employ Portuguese interpreters.' ('The Impact of European civilisations' by L.S S.O' Malley. in the book 'Modern India and the West' Oxfoad, 1941, p. 47. quoted by Dr. K. V. Rao),

## పాదిరీల కృషి

ఏసీయ పాదిరీలు (Jesuit fathers) గోవాలో విద్యాలయములను స్థాపించి, బోధన కావశ్యకములగు గ్రంథముల ప్రచురణ నిమిత్తము రాచోలు, సెయింట్ పాల్ మొదలగు స్థలముల అచ్చు కూటములను నెలకొల్పిరి. 1557 నాఁటికి క్రైస్తవ మత పారమ్యములగు అనేక గ్రంథములను బుడతకీచు భాషలోను, దేశీయ భాషలలోను అచ్చొత్తించిరి. ఈ యచ్చు కూటములు పదునేడవ శతాబ్దాంతము దాఁక నిలిచియుండినవి. గోవా రాజధానియగు 'పంజిమ్' పట్టణములోని ప్రభుత్వ గ్రంథాలయమునందు తమిళ మలయాళ కొంకణి బుడతకీచు భాషామయములగు ప్రాచీన ముద్రితాముద్రిత గ్రంథము లనేకము లున్నట్లు తెలియుచున్నది 80. ఏసీయ పాదిరీలు గోవాలో స్థాపించిన విద్యాలయములలో గోవా వాసులే కాక, తక్కిన ప్రాచ్య దేశముల వారును పాశ్చాత్య భాషలను నేర్చుచుండిరఁట 81. ఉత్తరోత్తర కాలముల భారతదేశమున కరుదెంచిన విదేశీయులు—వర్తకులు, మతప్రచారకులు—ఇండో—బుడతకీచు భాషను నేర్చుచుండిరనియును, వివిధ భాషా జాతులకు చెందిన క్రైస్తవ మతబోధకులు భారతదేశీయ భాషలను అభ్యసించుటలో బుడతకీచు అనుసంధాన భాషగా నుండినట్లును, తన్మూలమున నది ప్రథమ పాఠ్యముగా నుండినట్లును విదేశ యాత్రికులును, పరిశీలకులును వ్రాసిరి 82. మైలాపురములోని సెయింట్ ఫ్రాన్సిస్ శాఖీయుఁడును, ఫ్రెంచి జాతియుఁడును, బహు భాషావేత్తయునగు ఎఫ్రాయిమ్ (1642–1651) అను పాదిరి క్రొత్త నిబంధన గ్రంథములోని గూఢార్థ గ్రథితములగు ఘట్టములను ఏరి, వానికి భాష్యముగా ప్రశ్నోత్తర రూపమున బుడతకీచు భాషలో వ్రాసినట్లును, అతని అనుయాయులు వానిని కంఠస్థము సేసి ప్రచారము సలుపుచుండినట్లును సమకాలికులగు క్రైస్తవ మతాధికారుల లేఖనముల నుట్టంకితము 83 నిర్ణీతములయిన ప్రచారక మండలములలోని వ్యవహార భాషలలో కొంత పరి

80. History of Goa p. 102.

81. ibid, pp. 56-58.

82. Maturin Veyssiere La Croze, Histoire du Christianisme des Indes, tome ii, ff. 384.

83. Manucci, op. cit, p. 471.

చయము సంపాదించిన తరువాత గాని క్రైస్తవమత ప్రచారకులు గోవా నుండి ప్రచార ప్రాంతములకు పంపబడిడెవారు కారు [84]. క్రీ. శ. 1600 ప్రాంతముల రోమన్ కాతలిక్ పాదిరీలు తెలుఁగు నేర్చి, పూర్వ వేదము_బైబిలు ప్రాతనిబంధన గ్రంథమును_తెలిఁగించి, తెనుఁగులోనే మతప్రచారము గావించుచుండిరనుట ఆలోచింపఁదగిన యంశము [85]. డచ్చి మిషనరీలు (1600) ను తూత్తుకుడి, నాగపట్టణము ప్రాంతములలో బుడతకీచు భాషయందే తమ మత ప్రచారమును సాగించుచుండిరఁట [86]. పదునెనిమిదవ శతాబ్దాదిని క్రైస్తవమత ప్రచారము చేసిన లూథరన్ తెగ పాదిరీలు బుడతకీచు భాషను అభ్యసించుచుండిరఁట. వారు అడప దడప బుడతకీచునందే తమ ప్రచారము సలుపుచుండినట్లు వారి దినచర్యా గ్రంథములలో ఉల్లేఖ్యము [87]. పదునెనిమిదవు శతాబ్దాదిని డెనమార్క (డెన్మార్క్_) మత సంస్థ తరఫున తమిళనాడులో పనిచేసిన 'ట్సీగెన్‌బర్గ్' (Bartholo-mew ziegendalg, 1683_1739) ను, అతని సహచరుఁడగు 'ప్లుట్‌షౌ' (Plutschau) యును బుడతకీచు భాషాముఖమున తమిళ భాషను నేర్చుటలో పడిన పంచకర పాట్లు ఫ్రెంచి పరిశోధకుఁడగు లక్రోజ్ (1661_1739) వ్రాఁతలలో వివృతములయినవి [88].

"As the portuguese language has a strong hold in India for more than two centuries, they considered it appropriate to learn it first. With the aid of the portuguese they applied themselves to the study of Tamil, but found the books in this

---

84. Dr. R. Caldwell. op. cit, p. 102.

85. C. P. Brown, A Review of Mss. of Purvavedamu and Rajulacharitra Madras Journal of literature and Science' No 28, July, 1840, quoted in the Introduction to the 'Bible History, Part I. Nellore. 1942.

86. Dr. Caldwell, op. cit, p.238

87. Hobson Jobson, 1903, Introductory Remarks p. XVIII

88. La Croze, op. cit, ఈ ఫ్రెంచి రచనలోని ఆవశ్యక భాగములను అనువదించి యిచ్చిన శ్రీ జె. ఎస్. ఆర్ ఎల్. నారాయణమూర్తి_ఆంధ్ర విశ్వకళా పరిషత్కళాశాలలో తత్త్వశాస్త్రోపన్యాసకులు _ గారికి కృతజ్ఞత.

language on palm leaves. It was all the help they were able to reckon, understanding by it the living voice of some country people... They made little progress so they engaged a Tamil school master, who brought his school of small children with him, and the two missionaries began to write like them the Malabari Tamil, letters on sand with the fingers and Join them as the school master dictated them. Unfortunately the master knew no portuguese, so they were left in the dark as to the meanings of most ot the words they learned to write and pronounce But eventually they found a Tamilian who knew portuguese, Danish, Dutch and German! This man had rendered them a great help..."

పూర్వ ప్రచారకులగు బుడతకీచు పాదిరీల ప్రచారరీతుల మూలముగా ప్రచురవ్యవహారము సంపాదించిన మాటలను, విషయ సుబోధకమునకును దేశీయుల విశ్వాసమును చూఱగొనుటకును అర్వాచీన ప్రచారకులు తమ ప్రచార సందర్భములలో వాడుచుండుటచేత మత పరమయిన ఆయా మాటలు అటులే స్థిరపడినవి. చెన్నపట్టణములోని పరంగులపేటలో బుడతకీచు పిల్లల కొరకు ఒక పాఠశాలను స్థాపించుటకు 1717 లో కుంఫిణీ దొరతనమువారు మత సంస్థలకనుమతి నిచ్చినట్లు ఆధారము లున్నవి. 89. దేశీయుల పిల్లల నిమిత్తము కడలూరులో కుంఫిణీ దొరతనమువారి గ్రాంటుల తోడను, అనుచరుల తోడ్పాటు తోడను 'ట్సీగెన్ బల్గ్' ప్రారంభించిన పాఠశాలయందు Radewitz (1680—1732) అను నతఁడు బుడతకీచును బోధించిన ఉపాధ్యాయుఁడు. చెన్నపట్టణము ఫోర్టులో 'ట్సీగెన్ బర్గ్' స్థాపించిన బుడతకీచు పాఠశాలలో ఇతడు చిరకాలము పనిచేసినవాఁడు 90 అనంతపురము మండలములోని ఆలమూరు, పడమటి యాలేరు, మడిగుబ్బలు రోమన్ కాతలిక్కులకు ప్రధాన కేంద్రములుగా నుండినవి. అనంతపురము పాళెయగాఁడగు హండే ప్రసన్నప్పనాయని (1680–1719)

89. Proceedings Book of the Madras Govt, Monday the 27 th May, 1717; MAMP. Vol, I. p. 566, fn

90 MAMP: Vol. I, p. 66. fn.

సాయము వీరి కుండినదఁట 91. ఆంధ్ర క్రైస్తవులచే అధికనాథస్వామి92 యను పేర వ్యవహృతుఁడయిన గోవా వాస్తవ్యుఁడు రెవరెండు జో ఆకిమ్ దీసౌజా (Joachim D'souza (1775-1829) యను పాదిరి 1784 లో బళ్లారికి వచ్చి, కడప, బళ్లారి, అనంతపురము మండలములలో కాథలిక్ క్రైస్తవమును ప్రచారము చేసి, పలు తావుల పాదిరిగుడులు నిర్మించినట్లు జిల్లా గెజెటీర్ల కథనము 93. ఆ యూఁళ్లలో ఆదోని బళ్లారి, ముద్దణగేరి, రామదుర్గము, సత్యాపురములలో పలువురు బాప్తిస్మము స్వీకరించుటచే అవి కాథలిక్ క్రైస్తవమునకు ముఖ్య కేంద్రము లయినవి 94 రోమన్ కాథలిక్ శాఖానుయాయులయి, ఇంగిలీసు కుంఫిణీకి చెందిన సైనికుల ప్రార్థనాదికముల నిమిత్తము ఆర్చిబిషప్పు పర్యవేక్షణమున 1828 లో రెవరెండు పెద్రోజా (1828-1844) బళ్లారిలో పాదిరిగా నియమితుఁడయి యుండెను 95 1887 లో ఈ కాథలిక్ కేంద్రములపై గోవా యాజమాన్య మంతరించినది. పదునేడు పదునెనిమిది శతాబ్దములలో క్రైస్తవ మత ప్రచారము సలిపిన పాదిరీలు పెక్కురు కేవలము వాగ్రూప ప్రచారముతో తృప్తిపడక ఇండో-బుడతకీచు కోశవ్యాకరణాదులను రచించి భాషా విషయక కృషిని సైతము కావించుట బుడతకీచు భాషా ప్రభావమునకు పరమ ప్రమాణము ప్రధానముగా సాగరతీర ప్రాంతములే వారి ముఖ్య ప్రచారసీమ లగుట వలన తత్తద్వ్యవహార భాషా పరముగా వారి కృషి సాఁగినది పారసీ-హిందూ

91. W. Francis, Gazetteer of Anantapur District, P. 27.
92. 'ఆదికనాథ' యని లిప్యంతీకరణము, తెలుగు భాషా సమితి వారి విజ్ఞాన సర్వస్వము, సంపుటము, III పు. 578.
93. W. Francis, Gazetteer of Bellary District, Vol. I, p. 57; C. F. Brackenbury, Gazetteer Cuddapah District, Vol.I, p. 55.
94. గోవాలోని ఆర్చిబిషప్పు అధికారమునకు లోఁబడిన రోమను కాథలిక్ ప్రచారకులు ఆంధ్ర ప్రాంతములో ఆ నాఁడు 21 మంది ఉండిరట: (MAMP, Vol I, p 629 )
95. 1500 లో మొట్టమొదట పోర్తుగాలు నుండి రోమను కాథలిక్ ప్రచారసంస్థవారు భారతదేశమునకు వచ్చిరి. దు ఆర్తి న్యూనీజ్ (1514-17) మొదటి బిషప్పు. జువోన్ దీ అల్బూకర్కు (1539-1551) గోవాలో మొదటి ఆర్చిబిషప్పు. సెయింట్ గ్జేవియర్ యాజమాన్యమున 1542 నుండి ఈ పాదిరీల ప్రచారము చురుకుగా సాగినది.

స్పాని-ఇంగిలీసు-బుడతకీచు భాషలలోని సమానార్థక పదజాలము కలిగి రోమక లిపిలో 1630 (?) సంగ్రథితమయినదను ప్రతీతికల సూరతు 96 నిఘంటువును, 1679 లో కొచ్చినులో అచ్చయినట్లు అర్వాచీనములగు పాదిరీ వ్రాఁతల వలన తెలియుచున్న పాదిరీ అంతిమ్ దీ ప్రోయెన్కా (Antem de Proenca) రచిత మగు తమిళ_బుడతకీచు నిఘంటువును 97, 1743 లో బుడతకీచు బాసలో రోమకలిపిలో సంధానితమయిన బంగాళీ_బుడతకీచు వ్యాకరణ (పుటలు -1-40) బంగాలీ_బుడతకీచు (పుటలు 47-306), బుడతకీచు_బంగాళీ (పుటలు 307-577) నిఘంటు సంపుటమును 98, వీరపల్లిలోని బుడతకీచు పాదిరీలు 1746 లో అచ్చువేసిన మలయాళ_బుడతకీచు, బుడతకీచు_మలయాళ నిఘంటు సంపుట ములను 99, బార్నబైటు (Italian Barnabite) పాదిరీల తెగకు చెంది బర్మాలో ప్రచారము సేసిన Johannes Maria Percoto (1761-1776)అను పాదిరీ రచించిన బర్మ్మ_లాటిన్_బుడతకీచు నిఘంటువును 100, గుంటూరు మండల పరిసరములలో ఏసీయ పాదిరీలు పదునెనిమిదవ శతాబ్దమున కూర్చిన తెలుగు నిఘంటువును 101 అక్షరరూప మెత్తిన పాదిరీల కృషికి నిదర్శనములు. ముద్రితా ముద్రితములయిన ఇట్టి కోశవ్యాకరణములును, వీనికి పూర్వరంగమున

---

96 G A Grierson Linguistic Survey of India. Vol IX. part i, pp 4-11

97. Introduction to the Tamil lexicon, p xxxvi.

98. G A Grierson, op. cit., Vol. V, Part i, p 23.

99. MAMP Vol. I, p 550; also Rev H Gundert, A Malayalam and English Dictonary, Mangalore, 1872, Preface, p. iv.

100. E Luce, A short note on the Alphabetum Barmanorum, Journal of the Burmah Research Society, August, 1914, p 144; quoted by J. R Firth in his 'Papers in Linguistics', p 57.

101. A.D. Campbell, Advertisement to his Dictionery of Telugu language, commonly termed the Gentoo, College Press, Madras, 1821.

సాగిన కృషి ఫలితముగా రూపొందిన అముద్రిత రచనలు పరిశీలకుల దృష్టికి అందక ఎన్ని అంతరించినవో? ప్రాచీన క్రైస్తవమత ప్రచారకుల భాషా విషయకములైన అముద్రిత రచనలు అర్వాచీన కోశవ్యాకరణ నిర్మాతల చేతులలో పడి, వీరి రచనా సంప్రదాయమునకు మాతృకలయి యుండునని ఆచార్యఫర్త్ గారి ఆశంక 102.

## గోవా ప్రభావము

భారత దేశములో బుడతకీచు స్థావరముల వైశాల్యము పదునైదు వందల చదరపుమైళ్లు. జనసంఖ్య తొమ్మిది లక్షలు. ఈ ప్రాంతములోని ముఖ్యపట్టణముల యందలి పరంగులును, మిశ్రజాతీయులును, క్రైస్తవమతస్వీకర్తలును, విద్యాధికులైన దేశీయులును బుడత కీచును మాట్లాడుదురు. దేశీయులలో బుడతకీచుల వివాహములను అల్బూకర్కు ప్రోత్సహించుటచే 103 ఈ సంబంధముల వలన నొక మిశ్రజాతి ఉద్భవించినది. ఈ మిశ్రజాతీయులు అటు బుడత కీచునందును, ఇటు దేశీయ భాషలయందును మంచి ప్రవేశము కలవారుగా నుండిరి. బుడతకీచులకు పిమ్మట భారత దేశమునకు వచ్చిన ఇతర పాశ్చాత్య జాతుల వారికిని, దేశీయులకును వీరు 'తొపాసులు' 104 (ద్విభాషులు) గా పనిచేయుచుండిరి. అందువలననే ఈ మిశ్రజాతీయులకు 'తొపాసి' అను పేరు కలిగినది. గోవాలో నాఁటికి నేఁటికి నాలుగున్నర శతాబ్దులుగా బుడతకీచు రాజకీయ భాష. బుడతకీచు సేనలలోని సైనికులు, బారకాసులలోని బానిసలు, ప్రభుత్వకార్యాలయములలోని కార్కూనులు, బంట్రోతులు, ఆస్పత్రులలోని ఆయాలు, నౌకరులు,

---

102. J. R. Firth, 'Papers in Linguistics', p. 57.

103 Commentaries, Vol. III, p. 41.

104. ప్రభువు అను నర్థమున ఈ 'తొపాసి' యను మాట ఆంధ్ర పద్య నిఘంటువుల కెక్కినది. చూ. వేంకటేశాంధ్రము (1658) మానవర్గు; సాంబ నిఘంటువు (1750)మానవర్గు; ఈ నిఘంటు కర్తల కాలమునను,వారికి కొంత పూర్వమునను పరంగుల కుంఫిణీలలో తొపాసులు-దుబాసులుగా పనిచేసిన దేశీయులను ప్రజల దృష్టిలో-అందును క్రైవారపు కవుల సృష్టిలో ప్రభువులుగా పరిగణితులగుటలో వింత లేదు.

సరకుల గిడ్డంగులలోని సిబ్బంది, కప్పలిజోగులలోని కళాసులు, సరంగులు[105] పాదిరిగుడులలోని ప్రచారకులు, పరిచారకులు, ఉన్నతోద్యోగుల చాకరులు, శ్రీమంతుల సేవకులు అందఱును ఆ నాఁడు బుడతకీచులు కారు. తొలుత వీరి సంఖ్య అధికముగా నుండినను క్రమక్రమముగా దేశీయులును, మిశ్రజాతీయులును ఈ యీ కొలువులలో విరివిగా నియోజితులైనట్లు ఊహించుట కాధారములు కలవు. మతప్రచార సంస్థలలోను, ఇతర ధనవంతుల ఇండ్లలోను పరిచారకులు కావలసి వచ్చినపుడు పోర్తుగాలునుండి భారతదేశమునకు సబురులు చేసెడి నావలలో ఏడెనిమిదేఁడుల యీడుగల బాలురను ఆయా నావికాధికారులు వెంటఁగొని తెచ్చి, వీరి కప్పగించి, ప్రతిఫలముగా కొంత ధనమును స్వీకరించెడివారు ఆ నాఁడు గోవాలోని మత సంస్థలు మిక్కిలి ధనవంతములు. నెలసరి జీతములు సరిగా అందనందునను, అందిన జీతములు సుఖజీవితమునకు చాలనందునను బుడతకీచు సైనికులు పలువురు మతప్రచార సంస్థలలో చేరుచుండిరి. తమతో చేరుఁడని కూడ మతాధికారులు సైనికులను ప్రోత్సహించెడివారు. తిండి, తిప్పలు సరిగా లేక, ప్రాణములను అరచేతఁబెట్టుకొని సైనికుడుగా బ్రతుకుట కంటె, చీకు చింత లేని మత సంస్థలలో చేరి కాలము గడుపుట వారికి హాయిగా కన్పట్టినది. 1635 లో గోవాలో తీసిన లెక్కల ప్రకారము సైనికుల, సాధారణ పౌరుల మొత్తము కంటె మత ప్రచార సంస్థలలోని సిబ్బంది ఎక్కువని తేలినది[106]. పెద్ద పాదిరీలు మత ప్రచార పర్యటనకు బయలుదేరునపుడు వారి పరివారములో ఈ సజ్జంతయు చేరుచుండెడిది ఇఁక, గిడ్డంగుల ప్రాంగణములలో కన్పట్టెడి కోపుదారులు, మాలుబేరగాఁడ్రు, ఓడలు రేవులో నుండగా సరకులెత్తి దించు బత్తాయిలు, అమాలీలు, రేవులలోని ఇసుకమేటలు త్రవ్వు ఉప్పరులు, వడ్డరులు

105. ibid. Vol. IV, p. 1; also vide: 'The Portuguese make a marvellous profit all over India. Where they are well received they associate with the natives of the country, who in their turn accompany them in theri voyages, so much so, that even all the crews of their ships and pilots are Indians...... Pyrad Francisco de Laval. Viagem, Vol. I, p. 438.

106. F. C. Danvers, op. cit., Portuguese in India, pp; 252-254.

అంటుటను అచ్చముగా దేశీయులు. మే, జూన్, జూలై, ఆగస్టులు సబురులకు సరిపడని ముసురు నెలలు. ఈ నాలుగు నెలలును ఓడల మరమ్మత్తులు 107, క్రొత్త పడవల, తెప్పల కట్టుబడులు, సిబ్బంది ఉడుపుల తయారీలు, ఇట్టి సర్దుబాటులకు సరిపోయెడివి. ఇటిక పనివారు, ఓడ బలిజెలు, కమ్మరులు, కాసె పనివారు, దర్జీలు, ముచ్చిపనివారు, వడ్రంగులు 108 _ఇట్లైనోన్న వృత్తులవారు పలునాడులనుండి పరంగి వాడలకు వలస వచ్చెడివారు. ఈ నాల్గు నెలలును వీరికి చేతినిండ పని. తమ కిచ్చెడి జీతబత్తెములు చాలమిని, బారకాసులయందే నివసింపవలెనను నియమము లేమిని బుడతకీచు సోల్దాదులు (Soldiers) చౌకబారు పూటకూటిండ్లలో అద్దెల కుండెడివారు. బ్రదుకుఁదెరువు చూచుకొన వచ్చిన పరిసరసీమల వృత్తివిద్యల వారికిని ఈపూటకూటిండ్లే ఆహార విహారముల కాశ్రయములుగా నుండినవి. జూదసాలలు, పూటకూటిండ్లు, లాహిరి దుకాణములు అన్నివాడలలో నుండినవి. ఇవి యన్నియు ముప్పూటలును కిటకిట లాడెడివి. ఈ వాడలలో 'బొట్లేరు బుడతకీచు' పుట్టినది. ఇంటి కంటె గుడి పదిలమని దిగఁబడిపోయినవారు పోఁగా, మిగిలినవారు 'సుగ్గి' చూచుకొని తక్కిన ఋతువులలో తమ తమ వీడులకు తరలి పోయెడివారు. ఈ రాకపోకలు ఏఁటేఁట జరిగెడివి. ఈ రాకపోకల వలనను కొన్ని బుడతకీచు నుడులు ఇరుగు పొరుగు నాడుల బాసలలో వాడుక కెక్కి యుండనగును. 1878 లో జరిగిన ఆంగ్లో_బుడతకీచు గోవా ఒడంబడికలోని ఆఱవు నిబంధన ప్రకారము రెండు ప్రాంతములను కలుపుచు, బళ్లారి, హుబ్బళ్లి పట్టణముల ద్వారమున మార్మగోవా దాఁక ఇనుపదారిని నిర్మింపవలసి యుండినది. 1882 లో ఈ ఇనుపదారి పని మొదలయి 1887 లో రాకపోకలకు తెఱవఁబడినది. మార్మగోవానుండి కొల్లాం, కాజిల్ రాక్,

---

107. 1497_1612 ల మధ్య పోర్తుగాలు నుండి భారతదేశమునకు వచ్చిన నౌకలు 806 అనీ, వీని కపితానులు 107 అనీ లెక్కలు. వీనిలో 425 నౌకలు పోర్తుగాలుకు తిరిగి పోయినవి. 285 నౌకలు భారతదేశములోని బుడతకీచు స్థావరములలో ఉండిపోయినవి. తక్కిన 96 ను ప్రమాదములకు గుఱియయి మునిగి పోయినవి. (History of Goa, p. 37.)

108. బయలాబట_వీధి నాటకములలో పంచాణము వారి ప్రసక్తి కల ఘట్టములలో మా మండలమున కొంకణ దేశీయులను ప్రవేశపెట్టుట సంప్రదాయము కొంకణము పోయి కంకణము తెచ్చిన కొంకణాచార్యులని వీరు ప్రశంసితులు.

ధార్వాడ, హుబ్బళ్లి, గదగు, హొసపేట, బళ్ళారి పట్టణముల ద్వారమున ఈ దారి గుంతకల్లు చేరుచున్నది. 1885 నాటికే బళ్ళారి గుంతకల్లు ఇనుపదారి తయారయి యుండినది. బళ్ళారి–హొసపేటల మధ్య నలుబది మైళ్ళ ఇనుప దారియును 1877–1878 లో కఱవు పనిగా మొదలయి 1884 నాటికి పూర్తయి యుండినది. గుంతకల్లు–బెజవాడ దారియును 1882 మొదలయి 1883 లో సిద్ధమయినది. గుంతకల్లు నుండి బయలుదేరి, ద్రోణాచలము, నంద్యాల, కంభము, మార్కాపురము, దొనకొండ, గుంటూరుల మీఁదుగా బెజవాడను చేరి, అపిమ్మట గుడివాడ మీఁదుగా మచిలీపట్టణము వరకు సాఁగి ప్రాక్పశ్చిమ సముద్రములను కలిపిన ఈ ఇనుపదారి ఆంధ్ర ప్రాంతమునకును, బుడతకీచు ప్రాంతమునకును గల సంబంధమును ఇనుమిక్కిలిగా పెంపొందించినది.

## బుడతకీచులు కొని తెచ్చిన మొక్కలు, చెట్లు

అరబ్బులు, బుడతకీచులు విచిత్రస్వభావము కలవారు. వీరు అడుగు పెట్టని సీమలు లేవు కాలూనినచోట కన్పట్టిన క్రొత్త వస్తువులను సేకరించి తదభావకములగు సీమలకు గొంపోయెడివారు 109 పదునారవ శతాబ్దాంతము నాటికి బ్రెజిలులో బుడతకీచుల అధికారము స్థిరపడినది. ఆఫ్రికా, పనామా, పెరూ, బ్రెజిల్, మలయా, మెక్సికో మొదలగు సీమల నుండి తరుగుల్మలతాదులను పెక్కింటిని బుడతకీచులు మన దేశమునకు కొనితెచ్చిరి. అనాస, గొయ్యా (జామి), గోబి (క్యాబేజి), చిలగడదుంప, జీడిమామిడి, పొగాకు, బంగాళాదుంప (ఉరలగడ్డ), బొప్పాయి (పరంగికాయ), మిరెప, మొక్కజొన్న, రామములగ (టొమాటో, ఆవగూదుకాయ), రామాఫలము, వంకాయ, వేరుసెనగ, సీతాఫలము మొదలగునవి బుడతకీచులు తెచ్చిన వానిలో కొన్ని. ఇవన్నియు మన సీమలకు క్రొత్తలు. ఇంచుమించు దక్షిణ అమెరికా ఖండమునకు నిసర్గములయినవి. 1500–1850 మధ్య నివి మన దేశమునకు తేఁబడినవి. వీనిలో కొన్నింటిని బుడతకీచు మాటలతో పెంచితిమి; కొన్నింటికి క్రొత్త పేర్లు పెట్టితిమి. అనాస, గొయ్యా, గోబి, బొప్పాయలు మూర్తితో పాటు తద్బోధక పదమును ఎరవు తెచ్చిన కోవ లోనివి. వానివాని స్వరూప స్వభావ సహవాసములను బట్టి మిగిలిన వానికి నామకరణము జరిగినది. ఇవి విదేశీయుల భావనాశక్తికి మచ్చు

109. Tavernier, Travels in India, Book II, p. 130.

పునకలు, వీనిలో జీడిమామిడి, పొగాకు, మిరెప, వేరుసెనగ పంటలకు గల ఆర్థిక ప్రాధాన్యమును వేరుగా వివరింప నక్కరలేదు విదేశీయము లగుట మూలమున కాటోలు వీనిలో చాల పాలు శ్రాద్ధాదికముల నిషిద్ధములు బంగాళా దుంప ఇప్పుడిప్పుడు గదా అందరకు ఆహారయోగ్యముగా అంగీకార్యమగుట. వచ్చిన క్రొత్తలో నిది మ్లేఛ్ఛ సాంగిత్యము కలదని యెఱిగి కాటోలు అభోజ్య వస్తువుగా పరిగణితము. బంగాళా రాష్ట్రమున తొలుత దిగుమతి యయ్యె. ఆ సీమలో బాగుగా వేరూని, ఆ పిమ్మటనే ఈ మొక్క తక్కిన రాష్ట్రములకు వ్యాపించినది. ప్రథమ సహవాసమువలన దీనికి 'బంగళాదుంప' యను పేరు అన్వర్థము. 'ఉరలగడ్డ' యన్నది దీని ఆకారము (గుండ్రదనము) ను బట్టి కన్నడిగలు కల్పించిన పేరు. రాయలసీమలో దీనిని 'ఉరలగడ్డ' యని వాడుట కన్నడ ప్రభావము వలన. తెలంగాణమునను, సాగరాంధ్ర మండలముల కొన్నింటను కల 'ఆలుగడ్డ' యను వ్యవహారము ఉర్దూ ప్రభావద్యోతకము మామిడిపండ్లు మనకు సొంతములే యనినను, వానికి అంట్లు గట్టుట మొదలగు నూతన దోహద క్రియల మూలముగా వానిలో క్రొత్త దినుసులను సృష్టించినది బుడతకీచులు[110]. గోవా మామిడిపండ్లు మిగుల ప్రసిద్ధములు. బుడతకీచు బాసలో ఈ యీ తరుగుల్మలతాదిబోధకములగు పదములు నిసర్గములు కాక పోయినను, ఇతరభాషలతో బుడతకీచునకు గల సంసర్గ సంబంధమువలన నివి బుడతకీచునకు సంక్రమించినవి. బుడతకీచుల ద్వారమున మనము స్వీకరించితిమి కావున వీనిని సైతము బుడతకీచు నుడులనుట నిర్బాధము. ఇన్ని మార్గముల బుడతకీచు నుడులు తెలుగు నుడికడలిని జేరినవి. ఇట్టి పొడి నుడుల ఉనికి తప్ప, బుడతకీచు సాహిత్య ప్రభావము మనపై పడలేదు.

## పూర్వకృషి: విహంగావలోకనము

తెలుగులోని బుడతకీచు నుడులనుగురించి ఇంతకు మునుపు ప్రస్తావించి అంతో యింతో చెప్పినవారు ఈ వ్యాసకర్త యెఱిగినంతవరకు ఛార్లెస్ ఫిలిప్ బ్రౌను (1798–1884)[111], డక్టర్ సేబష్టియాన్ రోదల్ఫొ దల్గాదు (1855–

110. Manucci, op. cit., Vol. III, pp. 180, 181.

111. C. P. Boown, Dictionary of Mixed Telugu, Christian knowledge Society Press, Madras, 1854.

1922), గాలెటి (1935)[112], డాక్టర్ చిలుకూరి నారాయణరావు (1937)[113], ఆచార్య గంటి జోగి సోమాజి (1947), డాక్టర్ కొత్తపల్లి వీరభద్రరావు (1960, ఈ యేడుగురు మాత్రమే. వీరి పరిశీలన వివరణము వక్ష్యమాణము. బ్రౌను దొర తన మిశ్ర భాషా నిఘంటువున అమారు, ఏలము (యేలం), చెవి(-తాళముచెవి), మరియాన్ను (ఆట), మాదా-పదములను బుడతకీచ నిష్పన్నములుగా పేర్కొని నాడు. చెవికి రూపాంతరముగా చూపిన 'శావి'ని ఇటాలియను, బుడతకీచు భాషా సంబంధిగా ప్రదర్శించినాడు. I'గమేళా' 'బాతు'-పదములను బుడతకీచు జన్యములుగా నుదాహరించి, వీని చరిత్ర సందేహాస్పదమని కాబోలు ప్రశ్నార్థక చిహ్న ముంచినాడు 'అల్మారి' శబ్దము నొద్ద ఫ్రెంచి, స్పానిషు, బుడతకీచు భాషాగతములగు జ్ఞాతి, శబ్దముల నిచ్చుటచే దీని మాతృక యిదమిత్థమని నిర్ణయము కాలేదు, మేస్తరి, మేస్త్రి పదములకు ఫ్రెంచి, బుడతకీచులు మూల భాషలుగా చూపబడినవి. న్యాయముగా బుడతకీచు జన్యములుగా పేర్కొనదగిన పదము లనేకములు బ్రౌను వివరణమున ఆంగ్ల పరాసు భాషా భవములుగా నిరూపితము లయినవి. కొన్ని ఆరోపముల (entries) యొద్ద ఉర్దూలిపిలో మూలరూపములు కాబోలు ప్రదర్శితము లయినవి. మఱి యీ లిపిలోని మాటలు అరబ్బీ, ఉర్దూ, తుర్కీ, పారసి. హిందూస్థానీలలో ఏ భాషకు చెందినవో నిర్ణాయకములు కాలేదు కొన్నిటి అర్థనిర్ణయము అసంపూర్ణము. ఆయా ఆరోపముల క్రింది ఉదాహరణములు చూడనగును ఈ వ్యాసమున కనుబంధమగు పద పట్టికలో నుట్టంకితములయిన అనేక పదములకు మిశ్ర బ్రౌణ్యమే ముఖ్యమగు ఆకరము. కాని వీని మూలరూపములను బ్రౌను దొర చూపలేదు. బ్రౌను దొర రచించిన ఇంగ్లీషు-తెలుగు నిఘంటువులో[114] ఆరోప పదముల అర్థనిర్ణయ సందర్భమున ప్రయోక్తములయిన తెలుగు వాక్యములలో దొరలిన బుడతకీచు మాటలు కొన్ని యీ వ్యాసకర్తచే ప్రత్యభిజ్ఞాతము లయినవి. గోవా, సింహ

112. Galletti's Telugu-English Dictionary, Oxford University Press, London, 1935.

113. Dr. C Narayrna Rao, History of Telugu Language, 2 Vols, Andhra University publication, 1937

114. C. P. Brown, English-Telugu Dictionary, Revised by M. Venkataratnam, 1895.

శములలో క్రైస్తవ మతాధిపతి (1884-1906) గను, లిజ్బాను విశ్వ విద్యాలయములో సంస్కృతాచార్యుడు (1906-1922) గను ప్రసిద్ధి నందిన డాక్టర్ దల్గాదు బుడతకీచు బాసలో రచించిన 'ఆసియా భాషలలోని బుడతకీచు పదముల ప్రభావము' (Influencia do Vocabulario portugues em Linguas Asiaticas) అను ఉత్తమ పరిశోధక గ్రంథము పోర్తుగాలులోని కోయింబ్రా విశ్వవిద్యాలయమున ముద్రితమయి లిజ్బాను నగరములోని వైజ్ఞానిక పరిషత్ (Academy of Sciences) పక్షమున 1913 లో ప్రచురితమయినది. 'Influence of Portuguese Vocables in Asiatic Languages" అను పేర దీని ఆంగ్లానువాదము గైక్వాడు ప్రాచ్యగ్రంథమాలలో 1936 లో వెలువడినది115. డాక్టర్ దల్గాదు పూర్వులు కొంకణ దేశీయులయి, దేశాయి కుటుంబమునకు చెందిన బ్రాహ్మణులు; బుడతకీచుల రాకతో క్రైస్తవమును స్వీకరించినవారు. దల్గాదు కొంకణి, మరాఠి, గ్రీకు, లాటిన్, ఫ్రెంచి, హిబ్రూ, సంస్కృత భాషలలో మహాపండితుడు. బుడతకీచు మూలములుగను తత్ప్రభావితములుగను దల్గాదు గ్రంథమున ఆంధ్రభాషా గతములుగా డెబ్బదియేడు పదము లుదాహృతములయినవి. వీనిలో పదునొకండింటి చరిత్ర వివాదగ్రస్తమని సూచితము. తక్కినవానిలో అస్పత్రి, కనాలి, పోలీసు, రసీదు మొదలగు వానిని ఆంగ్లమూలము లనుట యుక్తము. ఆయా (= దాది), కాప్పిరి (= కాఫర్), తురంజా (= దూదినిమ్మ), నిమ్మ, పాపాసు, పింగాణి మొదలగునవి బుడతకీచు మాటలు కానేకావు. గలన్ (= gold lace), సపాత్ (= పాదుక)-వీనికి ఆకరములు చిక్కలేదు. తెలుగునాట మాండలికములుగా ఏప్రాంతమునందైన వీనికి వ్యవహారముకలదేమో? 'బాతు' విషయములో శంకకు కొంత తావుకలదు. ఇయ్యదాముక్తమాల్యదలో ప్రయోక్తము. డా. దల్గాదు పట్టికలలోని అనాస, అమారు, అల్మారు, అన, ఇస్త్రిరి, ఏలము, కలపతి, కాతరుసు, కాతలిక్, కామరా, కుమాందన్, కుంబాద్రి, కుసిని, కోపా, కోమాను, చెవి, జన్నలు, తారము, తువాలు, నొవేనా, పయాలు, పరంజా, పాదిరి, పాపు, పాన్కా, పీత (= నాడా), పీపా, పురోయి, పేనా, బంకటి, బత్తేరి, బసి, బాల్ది, బిస్కోతు, బురుమా, బొత్తాము, బోడమన్నా, మయోరు, మరియాన్ను (ఆట), మాదిరి (= ఒక దినుసు పేకు),

115. Translated into English with notes, additions and comments by Prof. Anthony Xavier Soares.

మెలామ, మేజా, మే (జోడు), పైను, సక్రీస్తు సగ్గు, స్ప్రీరితుసాంతు_లను బుడతకీచు నుడులుగా అంగీకరింపనగును. 'బుడతకీచులలో భారత దేశమునకు చిరకాల సంబంధ ముండినను 'కమీజు', 'కుశిని' (_వంటయిల్లు) ఈ రెండే రెండు బుడతకీచు పదములు తెలుగున నిలచిన వని గాలెటి నిర్ణయము 116. డాక్టరు చిలుకూరి నారాయణరావుగారు తమ ఆంధ్రభాషా చరిత్రము మొదటి సంపుటము 618_619 పుటలలో తెలుగులో 34 బుడతకీచు పదము లున్నట్లుగా చూపిరి ఇందులో కటారి, కాఫి, చదర, తపేలా, మలక (= మచ్చ) యీ యైదును బుడతకీచు మాటలు కావు. ఈ పట్టికలో బుడతకీచు పదములుగా పేర్కొనబడిన అనాస, ఆమారు (త్రాడు), అల్మారా, ఇస్త్రిరి, కమీజు, కాఫి, గోదాము, తపేలా, తురుపు, తువాలు, పాదిరి, బిస్కోతు, బొత్తాము, బొప్పాయి, సగ్గు_ఈ పదునైదింటికి అదే సంపుటమున వేర్వేరు పుటలలో వేర్వేరు మూలములు ప్రదర్శితము లయినవి. అవి ఇవి.

| | | |
|---|---|---|
| 1. | అనాస | బుడతకీచు (పుట. 618) |
| | | హిందీ (పుటలు. 592, 594), |
| | | పారసి (పుట. 592). |
| 2. | ఆమారు (త్రాడు) | బుడత (పుట. 618). |
| | | హిందీ (పుట. 593), |
| 3. | అల్మారా | బుడత (పుట. 618). |
| | | హిందీ (పుట. 595). |
| 4 | ఇస్త్రిరి | బుడత (పు. 618), |
| | | హిందీ (పు 595). |
| 5. | కమీజు | బుడత (పు. 618). |
| | | అరబ్బీ (పు. 580), |
| 6. | కాఫి | ఇంగ్లీషు (పు 605, 617) |
| | | బుడత (పు 618). |
| 7. | గోదాము | బుడత (పు. 618), |
| | | ఇంగ్లీషు (పుటలు. 612, 616). |

116 Galletti, op. cit., pp. 55, 59.

8. తపేలా హిందీ (పు. 595),
బుడత (పు. 618),
9. తురుపు బుడత (పు. 619),
ఇంగ్లీషు (పు. 617),
10. తువాలు బుడత (పు. 618),
ఇంగ్లీషు (పు. 616),
11. పాదిరి బుడత (పు. 618),
ఇంగ్లీషు (పు. 617),
12. బిస్కోతు బుడత (పు. 618, పుట అడుగున నుండి రెండవ పంక్తి)
ఇంగ్లీషు (పు. 618, పుటమీఁది నుండి ఎనిమిదవపంక్తి)
13. బొత్తాము బుడత (పు. 618),
ఇంగ్లీషు (పు. 616),
14. బొప్పాయి బుడత (పు. 618),
హిందీ (పు. 592, 594),
15. సగ్గు (బియ్యము) బుడత (పు. 618),
హిందీ (పు. 581).

'కాఫీ'ని ఆంగ్ల సమముగను 'కటారి', 'తపేలా' లను హిందీ భవములుగను చూపుట యుక్తము. చదర సంస్కృతమునందలి 'చతురస్ర' శబ్ద సంబంధియేని, 'చత్వర' శబ్ద సంబంధియేని కానగు మచ్చ మఱకలు శుద్ధ ద్రావిడ పిండములు. మసక, మసి, మాపు, మాయు, మాసిన పదవర్గమునకు మూలమగు ప్రాచీన ద్రావిడ మచ్ ధాతు నిష్పన్నము మచ్చ. మఱచు, మఱపు, మఱుగు, మఱువు—మొదలగు పదముల కోవకు చెందినది మఱక. తక్కినవి బుడతకీచు పదములు. బుడతకీచు బాసలోని గుణింతపు సంప్రదాయములు మనకు క్రొత్తలగుటచే లిప్యంతీకరణము శ్రీ నారాయణరావుగారి వ్రాఁతలలో కొన్ని చోట్ల తబ్బిబ్బు కలిగినది. ఇవి అచ్చు తప్పులో, అసలు తప్పులో చెప్పలేము కోవె, గ్రాదె, చావె, పాద్రె, బాల్దె—ఇట్టి ఎదంతోచ్చారణముగాని, కనా, బిస్కోతుతో ఇట్టి ఒదంతోచ్చారణముగాని బుడతకీచులో లేదు వీనిని కోవి, గ్రాది, షావి, పాద్రి బాల్ది, కాను, బిషోక్తు—అని క్రమముగా ఇదుదంతములుగా ఉచ్చరించుట బుడతకీచు భాషాసంప్రదాయము. 'కమీజు' కు 'చమీస' అనియు 'చదర' కు

'చదెయ్ర' అనియు మఱక ( = మచ్చ)కు 'మార్చ' యనియు మూలరూపములు ప్రదర్శితములు. బుడతకీచులో వీనిని (Camisa, cadeira, marca) అని ఇట్లు రోమక లిపిలో వ్రాయుట వాడుక. బుడతకీచులోని ఉచ్చారణ మర్యాదల ప్రకాలము 'C' అను లిపిచిహ్నము ఆంగ్లములోవలె 'క', 'స' అని రెండు ప్రత్యేక వర్ణములకు పరస్పరపరిపూరక (Complementary) సంకేతము. అనగా ఈ రెండువర్ణములను పరస్పర వ్యావృత్తిగా 'C' అను లిపిచిహ్నముచే ఉచ్చారితములు. తాలవ్యేతరస్వరములు పరముగా నున్నచో 'క' వర్ణముగను తాలవ్యస్వరూపములు పరముగా నున్నచో 'స' వర్ణముగను ఈ 'C' ఉచ్చరితము కావున పూర్వోక్తపదములను కమీజా, కదేరా, మర్కా అని ఉచ్చరించుట శాస్త్రపద్ధతి. స్త్రీల పడక ఉడుపు, లోకాంగు, మొలగుడ్డ అను నర్థములుకల షమీజ్ (Chemise) అను ఆంగ్లపదవాసన వలన 'చమీస' యని పొరపడియుందురని యూహించుట నిరవకాశము. Caderia ను 'చదెయ్రా' గా చదువుట శబ్దమాత్రసారూప్య భ్రాంతి తమిళములో కుర్చి యను నర్థములో కల 'కదిరై' యనుమాట బుడతకీచునుండి వచ్చినది 117. ఇంగ్లీషు భాషలో ఆచార్యపీఠము అనునర్థముకల 'కెథీడ్ర' శబ్దమునకు మూలమగు గ్రీకు 'కైథీడ్ర', బుడతకీచు Cadeira కును అసలు మూలము. బుడతకీచులోని diccanario (dictionary), direccao (direction) పదములలోని 'C' అను లిపిచిహ్నమునకు 'కు' కారోచ్చారణము మాండలిక భేదముల ననుసరించి వికల్పవిధి. తెలుగులోని 'చెవి' ( = తాళపుచెవి) కి బుడతకీచులోని (chave) మూలరూపము. దీనిని 'చావె' అని పఠించుట తప్పు; బుడతకీచులో 'చ' వర్ణమేలేదు. 'షావి' అని పఠించుట ఒప్పు. తపేలా, తువాల, వెసలులకు వరుసగా తాల్హ, తొఅల్హా, వసిల అని బుడతకీచు రూపములు చూపిరి. బుడతకీచులోని 'lh' అను లేఖనచిహ్నము 'l', 'h' అను రెండు లేఖన చిహ్నముల కలయికకు గుఱుతుకాదు. 'l', 'h' ల కంటెను, వీని సంయోజనము కంటెను భిన్నమయిన వర్ణమున కిది సంకేతము. ఆంగ్లభాషలోని 'million' పదమునందలి 'lli' భాగపు సదృశోచ్చారణ మిట వివక్షితము. ఒలాందులు (డచ్చివారు) అను పదమునకు బుడతకీచు మూలముగా 'హొల్లెన్దెజ్'

---

117. Tamil Lexicon, Vol. II, 714.

ప్రదర్శితము. కాని, బుడతకీచులో 'h' పలుకఁబడదు. ఆచార్య శ్రీ గంటి జోగి సోమయాజిగారు తమ ఆంధ్రభాషా వికాసము 'తెనుఁగునందలి పదజాలము' అను నధ్యాయమున 'పాశ్చాత్య భాషాపదములు' అను ఉపశీర్షిక క్రింద 'పోర్చుగీసు వారే మొదట భారతదేశమునందలి పడమటి తీరమును గాలూనిన వారయ్యును వారి నాగరికతా ప్రభావము గాని, భాషా విశేషముగాని నిలువలేదు. తెలుఁగు, అరవము, కన్నడము, అను మూఁడు భాషలయందును అల్పసంఖ్యాకములయిన పదములు నిలిచినవి' అని ప్రతిపాదించి, అమారు, అలమారు, కక్కూసు, కమీజు, జన్నల్, పాదిరి, బాల్చి, బొత్తాము—ఈ ఎనిమిదింటిని బుడతకీచు మాటలుగా పేర్కొనిరి. వీటిలో, ఒక్క 'కక్కూసు' ( = మఱుగు పెరడు, పాయిఖానా) తప్ప తక్కిన వన్నియు బుడతకీచుమాటలు. ఇది 'కఖుస్' అను ఒళందా (డచ్చి) భాషాపద నిష్పన్నము. కక్కసు(అనంత; చిత్తూరు), కక్కూసు (బళ్ళారి), కక్కోసు (గుంటూరు), అని దీని మాండలిక రూపములు— 'తెలుఁగునగల ఒకేఒక డచ్చి పదమని, ఆంధ్రలోని దక్షిణమండలములో దీనికి విశేష వ్యాప్తిగలదనీ' గాలెటీ వ్యాఖ్యానము 118. తమిళ మలయాళ కన్నడ నిఘంటువులయందును నిది డచ్చి పదముగా ఉట్టంకితము 119. ఈ మాట దక్షిణ భారతమునకే పరిమితము, ఉత్తరహిందూస్తానభాషలో మృగ్యము. డచ్చిభాషలో కక్ (kak = మలము) + హుయిస్ (huis = ఇల్లు, స్థానము) అను పదములచే నేర్పడిన సమస్త పదమిది. ఇట్లే పక్ (pak = బంగీ, మూట) + హుయిస్ = పఖుస్ = పార్సిల్ ఆఫీసు, బఖుస్ (bakhuis = bake house) మొదలగు సమస్త పదములు ఒళందా (డచ్చి) భాషలో ఏర్పడినవి 120. డాక్టర్ కొత్తపల్లి వీరభద్రరావుగారు తమ తెలుగు సాహిత్యము పై ఇంగ్లీషు ప్రభావము అను పరిశోధక వ్యాసమున మిశ్రబ్రౌణ్యము నాధారముగాఁగొని, గమేళా, ¹ చెవి, బాతు, మరియాన్ను (ఆట), మేస్త్రి పదములను బుడతకీచు మాటలుగా ఉదాహరించి బ్రౌను అభిప్రాయములను ఆమ్రేడించిరి. బుడతకీచులకును భారతీయులకును గల చారిత్రక సంబంధములను శ్రీ వీరభద్రరావుగారు విస్తరించి వ్రాసిరి.

---

118. Galletti, op. cit, pp. 51, 79.

119. తమిళ. కక్కూసు (సు); డచ్చి—కఖుస్. (Tamil Lexicon Vol. II, p. 634) మల. డచ్చి. కఖుస్; కన్నడ. కక్కూసు; కక్కోసు; డచ్చి లేక డేనిష్.

120. తెలుగులోని డచ్చి పదులను గూర్చి మరియొక వ్యాసమున.

ఇండో-బుడతకీచు భాషను గురించి మొదట ప్రస్తావించిన తెనుగులలో శ్రీ రావుగారే ప్రథములు [121]. ఇంతే వీరి కృషి.

ప్రస్తుత పరిశీలనమునందలి మొత్తము పదములు : 150

వీని రూపాంతరములు : 152.

అనాస, అలమారు, ఇస్త్రీ, ఏలము, కాజా, కంపిణి, క్రీస్తు, పరంజు, పాదిరి, పిరంగి, పీపా, పేనా, మే (జోడు), మేస్త్రీ, మోస్తరు మొదలగునవి సర్వాంధ్ర వ్యవహారములు. అల్పి, కమీజు, కానా, గుదామ్, బాల్చి, బొత్తాయి, సోల్దాదు మొదలగునవి విశాఖ, శ్రీకాకుళములకు వ్యావర్తకములు. ఆన. ఒళందా, కమాను, కోస్తా, గమేళ 2, గోదాము, తురుపు, బంకు, బాల్దీ, బొత్తాము, బొప్పాయి మొదలగునవి సాగరాంధ్రమున ప్రచుర వ్యవహారము కలవి. అనారస, గడంగు, గొయ్యా చప్పాతి (కళ్లి) జొన్నలు, బిస్కత్తు, సోడిదేవు మొదలగునవి రాయలసీమకు విశిష్టములు.

## పదస్వభావ విభజనము

సైనిక సంబంధములు : ఆర్మదా, ఓకు, కపితాను, కమాను, కుసుందను, పటాలము, బత్తేరి, బారకాసు, బొంబాసు, మయూరు(లు), సార్జంతు, సోల్దాదు మొ.

నావికపదములు : అమారు, అర్యా, (చేయు), కామరా, కంపాసు, కూర్వ, గమాతు, గమేళా 1, గావాయి, బుడుదు, బొంబా, బోడిద, బోయా, ముర్ర, రంబ్రాలు, మొ.

క్రైస్తవ మతపరములు : అపొస్తలు, ఏనోబు, కాతోలికు, కిరూబు, కుంబాద్రి, కోపా, క్రీస్తు, క్రీస్తువు, నొవెనా, పాదిరి, పాపు, మరియ మాదా (గుడి), సబ్బాతు, స్పిరుతు సాంతు, మొ.

121. Dr. K. Veerabhadrarao, Influence of English on Telugu Literature, pp. 5,20.

గృహనిర్మాణ సంబంధములు : కానా, గమేళా, 2. చెవి, జన్నలు, పయాలు, పరంజు, బొరిగ, మాదిరి, మేస్త్రీ. రీపా (లు). మొ.

ఉడుపులు : ఇస్త్రిరి, కబాయి, కమీజు, కాజా, తువ్వాలు, పొప్పళి, బుర్గతకాళి, బొత్తాము, మే (జోడు), మొ.

వర్తకము : ఏలము, కుంపిణి, కోస్తా, గిడ్డంగి, గోదాము. తారము, బంకు, రతులు, మొ.

ప్రాంతకోంతలు : అలపనాళి, అల్పి, కాతరసు, పురోయి, పేనా, మొ.

మొక్కలు, చెట్లు : అనాస, గొయ్యా, గోబి, బిబిలి, మెలామ, సాంత్రా (నారింజ), మొ.

గృహూపకరములు : పీపా, బసి, బాల్డీ, బొంబాయి, మేజా, వెసల, సబ్బు. మొ.

చరిత్ర ప్రసిద్ధములు : జామొరిన్, జెంతు, పరంగి, పురతకాలు, కాంతోము, మొ.

**ఆటలు :** కుదేలు, బేస్తు, మరియాన్ను, (ఆట). మొ.

## పద పట్టిక

1. **అగతమ్మ** : రూ. ఏగాత్తా, యాగాత (గాలెటి, 137) చెన్నపట్టణము పరిసరముల క్రిందితెగల కులదైవ మగు ఒక గ్రామదేవత; St. Agatha.

2. **అగస్తు** : రోమక పంచాగములో ఎనిమిదవు మాసమగు 'ఆగస్టు <బు. ఆగొస్తు స్పా. ఆగోస్తు—ఇం. ఆగస్టు (టన్ను, టాప్, టిన్, టేప్, టోల్, ష్టన్, ష్టేషన్, ష్టోరు, టెంట్, కోట్, లేట్, ఫష్ట్ (తారీఖు). పోష్టు—ఇట్లు ఇంగ్లీషు పదములను దాదాపు మూర్ధన్య వర్ణ ఘటితములుగా ఉచ్చరింతుము; బుడతకీచులోని 't' వర్ణోచ్చారణము మన దంత్యవర్ణోచ్చారణమునకు దగ్గఱ; అందుకే 'అగస్తు'ను బుడతకీచు సంబంధిగా పేర్కొనుట ఉచితము. 'పదునెనిమిది వందల తొంబది

యెనిమిది క్రీస్తుశకము మాసమగస్త్రిర్వదిమూడు తేది.........
అను వసురాయల చాటువులోని 'అగస్తు'ను 'అగస్తి'గా చదివి శ్రీ
వెంకటరావుగారు రిద్దానిని ఆశ్వయుజ మాసమను నర్థములో సంస్కృత
పదముగా ప్రదర్శించిరి. (చూ. శ. ర. అను., పు. 2)

3. అంకారించు : క్రి. ఓడదావయెత్తిపోవు < బు. అంకోరా; కోస్పా. అంరా; ఫ్రె. అఁక్ర్; డచ్చి. అంకర్ (హిం.శ.ర.)

అనప (సూది) : చూ. అలపనాతి (బ్రౌ.ఇం.తె, 904) గుండుసూది (ఇట_ 'ల'_'న' గా మాఱినది; ఈ రెండు వర్ణములును దంతమూలీయములు; 'న' స్పర్శానునాసికము, 'ల' పార్శ్వికాంతస్థము).

అనానాసు ; చూ. అనాస (మిశ్ర బ్రౌ).

అనారస : చూ అనాస (అనంత). బెంగాలి. అనారసి. విఙ. అనాస రూపుగా నుండు; అనరస అనియు కొందఱు.

4 అనాస : రూ. అనానాసు, అనారస, అనాసపనస, అనాసపనాస, అనాసు, (కృ., గుం., గో.) మొగలిపనస: Ananas sativus (Flora of Madras, III, P. 1046). (యయాతి. 1_36: హంస. 4_134) < బు అననాష్; స్పా. అననా, అననాస్, ఫ్రె అననా; డచ్చి. అననస్; పెరూవియన్_ననస్; బ్రెజిలియన్-ననస్; అరబ్బీభాషాముఖమున తెలుఁగును జేరిన బ్రెజిలియన్ పదమని MAMP, Vol III p. 28;- పారసి (ఆంభాచ, 592);- దే.వి (శ.ర; బ్రౌ రి.); హిం. (బ్రౌ); మెక్సికో, పనామా, బ్రెజిల్ మొదలగు ఉష్ణమండల ప్రాంతములలో ఎక్కువపంట; అక్బరు కాలమున బుడతకీచులు దీనిని మలక్కా దీవుల నుండి తెచ్చి మొదట బంగాళమున ప్రవేశపెట్టిరఁట. (MAMP, Vol. III, p. 28); 1594లో బుడతకీచులు బంగాళరాష్ట్రమునకు తెచ్చిరని జార్జివాట్ (George Watt, The Economic products of India Vol. I, P 236): దక్షిణ భారతమునను, బంగాళమునను విరివిగా పైరు చేయబడుచుండినట్లు వెనిషియను వర్తకుడు నికోలాయ్ మనూచి (1653_1708) వ్రాఁతలు (Storia Do Mogor,

Vol. III-p. 183); అనాస ఆకులనుండి తీసిన తెల్లనినార చేపల వలలకు, గాలము త్రాళ్లకు ఉపయోగించును. నీటిపై తేలును; తడి అంటదు; త్వరగా తెగదు; పండు(అం. వాచ., కాంబెల్., మిశ్రబ్రౌ.)

అనాసపనస : చూ. అనాస (అం. వాచ., గో.) అక్కాపచ్చని చిలుకవచ్చె, కొందామా? తిందామా? అంగట్లో పెట్టుకొని అమ్మదామా' — అనాసపనసపండు'. గోదావరి మండలములో వాడుకలోని ఈ 'పొడుపుకథ' అర్వాచీనమని స్పష్టము.

అనాసపనాస : చూ అనాస (కోరాపుట్టి).

అనాసు : చూ. అనాస (మిశ్రబ్రౌ).

5. అపొస్తలు (ఱ) : రూ. అపోస్తులుఁడు. క్రీస్తు ముఖ్యశిష్యుఁడు; దేవదూత. <బు. అపొస్తోలు; స్పా: అపోస్తోలు; అపొస్తలుఁడు అనఁగా పంపఁబడినవాడు' (యోహాను, అధ్యా. 13); 'ఆ పన్నెండుమంది అపొస్తలుల పేళ్లు ఏవనగా....' (మత్తయి, అధ్యా. 10) 'యేసుక్రీస్తు అపొస్తలుడైన పేతురు...' (పేతురు. అధ్యా. 1) అపొస్తలత్వము' (అపొస్తలుల కార్యములు, అధ్యా. 1)

అపోస్తులుఁడు : చూ. అపొస్తలు (కర్నూ.)....'అపోస్తులు లోకమునకు వెలుతురు వలె నున్నారు', 'అపోస్తుల చర్యలు'—అని బైబిలు నెల్లూరి ప్రతిలో 'అపోస్తులు' అనుమాట, 'లు' వర్ణాంతమగుటచే అది బహువచన ప్రత్యయముగా భ్రాంతిపడుట జరిగినది.

6. అమారు : ఓడలంగరుమోకు, 'నావ లంగరులో నున్నప్పుడు కదలకుండ నుంచు పెద్ద బలమైన త్రాడు' (అంభాచ 624) <బు. అమర్రు మోకు; స్పా. అమర్రు; దే. వి. (శ. ర., అం. వాచ.)– హిం. (అంభాచ. 593); త్రాడు (మిశ్రబ్రౌ); చూ. అమారు త్రాడు (అంభాచ. 618. చూ. ఆమారు.

అరమర : చూ. అలమారు (శ్రీకా.)

అరమార : చూ. అలమారు (గుం)—బు. అర్మారి.

అరమాలు : చూ. ఆలమారు ('దుల్సా' అను ఆరోపముక్రింద మిశ్రబ్రౌ. పు. 54, చూ.).

7. అరుగోలా (బు) : ఇనుపకడియము (లు) నావకు రెండు ప్రక్కలను పైకి వచ్చునట్లు అమర్చఁబడిన స్థలములు; వీనిలో బెజ్జములు పొడిచి 'నేజా' పటాలు ఉంతురు. (అంభాచ., 624) < బు. అర్గోలా—పెద్ద ఇనుప కడియము; స్పా. అర్గోలా

8. అర్యా (చేయు) : క్రి ఓడతెరచాపలుదించు (అంభాచ. 624) < బు. అఱ్ఱియార్—తెరచాపలుదించు; స్పా అఱ్ఱియార్; (బు. లో—అర్, ఈర్—ఏర్ లు క్రియాధాతు సూచక ప్రత్యయములు. బు. షూవా—వర్షము, షోవేర్—వర్షించు); చూ. ఇస్తిరి.

9. అలపనాతి : రూ ఆనప (సూది). అల్పి. గుండుసూది (బ్రౌ.ఇం.తె. 904)—బు అల్ఫినేతి—గుండుసూది; స్పా. ఆల్ఫిలేర్.

అలమర : చూ. ఆలమారు (గుం.).

అలమార : చూ. అలమారు; బీరువలు—ఇం. అల్మైరాబీరో—అలమర యుండే బీరువాలు (శ. ర. అను.)

10. అలమారు : రూ. అరమర, అరమార, అరమాలు. అలమర, ఆలమార, ఆల్మార, అల్మారా, అల్మారు (అనంత., చెంగల్పట్టు). సామగ్రుల నుంచుటకై గోడలో ఏర్పఱిచిన బీరువా, గోడబీరువా < బు. అల్మారి అర్మారి; స్పా. అల్మారియో; ఫ్రె. అర్మ్వార్—ఇం. శ. ర. అను. పు. III; భారతీయ భాషలనుండి 1878లో ఇంగ్లీషునజేరిన పదమని శ్రీ జి. వి. సుబ్బారావుగారు (Indian words in English, p. 123)

అల్పి : చూ. ఆలపనాతి (కోరాపుట్టి. విశా., శ్రీకా.) గుండుసూది; ంపిన్ను చూ. అల్పి. రూపనిర్మాణములో ఈ 'అల్పి పిన్ను' అనునది అగ్గి నిప్పు, గేటువాకిలి, స్లేట్ పలక మొ వానితో సదృశ్యము.?—హిం. ఆల్పిన్, అల్పిన్.

11. అల్మాని : (మిశ్రబౌ.) ఒకానొక జర్మను దేశీయునిచే పోఁత పోయఁబడిన దని ఊహింపబడిన రూపాయి నాణెము, మునుపటి రూపాయి.— బు. అలేమానా, అలేమాన్—జర్మను దేశీయము; ఇర్మాను (King Duarte's Leal Conselheiro) జర్మనుదేశ సంబంధి; స్పా. అలేమానా—జర్మనుదేశ సంబంధి; అలేమానీయా — జర్మను దేశము; ఫ్రె. అల్‌మఞ్; కన్నడ. అలేమాని: ఉర్దూ. అల్మానియ—జర్మనీ దేశము; బెంగాలి. ఏలేమాన్.

అల్మార : చూ. అలమారు (మిశ్రబ్రౌ.) ఈడ్పులుగల పెద్ద పెట్టె; 'కోనేరు' నాలుగుపక్కల మెట్లుగల దిగుడుబావి, తిరుకొళము.

అల్మారా : చూ. అలమారు (కృ., గో., శ.ర., మిశ్రబ్రౌ., MAMP. III, 20) సొరుగులుగల యెత్తయిన కఱ్ఱపెట్టె; హిం. (శ.ర. 'అంభాచ.' దిగవల్లి వేంకటశివరావుగారి వ్యవహారకోశము. పు. 240)

అల్మారు : చూ. అలమారు; హిం. (శ. ర., గాలెటి, ది. వేం. శివరావుగారి వ్యవహారకోశము).

12. ఆన : (కృ., గుం., గాలెటి, మిశ్రబ్రౌ.) క్రీస్తుశక సూచమగు పదము— బు. అను (క్రీస్తు) ప్రభువు స్మృతి సూచకమగు శకపరిగణనము. సంవత్సరము; బుడతకీచుల శకపరిగణనములో ఈమాట విరివిగా వాడుక (చూ. గోవా శాసనములు. History of Goa): ఆఞు; ఫ్రె. అనే-ఏఁడు; లాటిన్ anno కు వికృతియని బ్రౌను (బ్రౌ.రి., 115); అన్యదే. అని (ఆం. వాచ., 256; శ.ర. అను., 98).

13. అరిమాని : ఉ. ఆర్మాణి (అనంత). పియ్యానిపెట్టె, హార్మోనియము—బు. ఆర్మోనీ, స్పా. ఆర్మోనియో, ఫ్రె. ఆర్మోనీ.

14. అర్మదా ; (టౌట్, బ్రిటీషు చరిత్రము, ఆంధ్రానువాదము) యుద్ధనావ.— బు. అర్మాదా; స్పా. అర్మాదా—సేన, నౌకాదళము; అర్మా—ఆయుధము; డచ్చి. అర్మద—నౌకాదళము; బెంగాలి. హారామద్—బుడత కీచులదోఁపిడి ఓడ; —బు. అర్మాదా—అరబ్బీ 'అల్—మదీ—య' అని Hobson Jobson. p. 15.

15. ఇస్త్రిరి : రూ. ఇస్త్రిరీ, ఇస్త్రీ (అనంత., కృ., గుం., గో.) బట్టలను నిప్పుల పెట్టెతో నునుపు చేయుట.—బు. ఎష్తిరాల్, క్రి. విస్తరించు; వ్యాపించు; చాచు; స్పా. ఎస్తీరాల్; స. క్రి. లాగు; విస్తరించు; బట్టలను నునుపుచేయు; ఎస్తిరోన్, వి. లాగుట; ఫ్రె. ఎతీరే, స. క్రి. లాగు, గుంజు;—హిం. (శ.ర., బ్రౌ.రి., గాలెటి, ది. వేం. శివరావుగారి వ్యవహారకోశము); మల. ఇస్త్రి—హిం. (గుండర్టు, 115); కన్నడ. ఇస్త్రరి, ఇస్త్రీ—హిం., మరా. (కిట్టెల్, 202) తమిళ. ఇస్తిరి—ఉర్దూ (TL, 373)? సం. స్తృధాతుసంబంధి.

ఇస్త్రిరీ : చూ. ఇస్త్రిరి (దేశ్యమని., శ. ర. అను.,).

ఇస్త్రీ : చూ. ఇస్త్రిరి (ఆం వాచ.)

ఏగాత్తా : చూ. అగతమ్మ. 'చెన్నపట్టణములో ఏగత్తా అనే దేవత..........' (బ్రౌ. ఇం. తె., 444).

16. ఏలము : రూ. యాలం, వేలము. వేలాం. అమ్మకటలో నొక విధము; పేకాటలోని ఒకఆట (Auction bridge) (పలనాడు)—బు. లేయ్‌లాం,—హిం. శ.ర., అం.భాచ; ఆం.వాచ., సూ. ని., ది. వేం. శివరావుగారి వ్యవహారకోశము; దేశ్యమని బ్రౌ.రి., 201; తమిళ., మల. ఏలం—బు ; కాని, దీనిని బుడతకీచుమాట అనుటకు ఉపపత్తులు చాలవు తక్కిన రోమాన్సు భాషలలోగాని, బుడతకీచునకు సమీపమాతృకయగు 'లాటిన్' లోగాని ఈమాటగాని, ఏతత్సంబంధి పదసముదాయముగాని కానరాదు; అరబ్బీ లీలాం—ఏలము, ఇల్—ఇ—లామ్ = ప్రకటన—దీనికి మూలము కానగునని బ్రౌను (మిశ్రబ్రౌ., 101).

17 ఏసోబు : రూ. హిసోప్పు (బై) యూదీయుల సోమలత; —బు. ఇసోపి; స్పా ఈసోపు; 1841లో కలకత్తాలో అచ్చయిన పరిశుద్ధ గ్రంథము—సంస్కృతానువాదమునందును 'ఏసోబు' అనియే కలదు.

18 ఒలందా : రూ. ఒలాందా. ఒళాందా, వలందు (బాజు), వలందేజు, వళంద—దచ్చి (జాతి,—దేశము,—భాష) (రంగరాట్, పీఠిక 58);—బు ఒలందా,

ఒలందేష్; స్పా. ఒలందా; ఫ్రె. హొలందె; ఁడిబ్బ (గాలెటి 130); °పాలెము మచిలీపట్టణములో రజకులెక్కువగా నివసించుపేట.

ఒలాందా : చూ. ఒలఁదా (మిశ్రబ్రౌ):–ఇం. హాలండ్ (శ. ర. అను 112); °కమలము డచ్చి పద్ధతిలో చెక్కబడిన వజ్రము; వజ్రములసానకు 'ఒలందా' దేశము ప్రసిద్ధి; ఁమల్లె ఒకదినుసుపువ్వు; °వాండ్లు బ. వి. డచ్చివారు (మిశ్రబ్రౌ.)

ఒళాందా : చూ. ఒలందా.

19. ఓకు: దుర్బిణియద్దము (శ ర. ఆం. వాచ., మిశ్ర బ్రౌ). – బు ఓకు ఉష్–కంటియద్దములజోడు; ఓకు–వివరము; పుటాకారము; స్పా. ఓకూలాస్ - కంటి యద్దము ఫ్రె. ఆకూలెర్ 'ఓకలు' లోని 'లు'ను బహువచన ప్రత్యయముగా భావించుటచే 'ఓకు' సిద్ధించియుండనగు. చూ. రతులు.

20. కంత్రాటు : పనిచేయుటకు ఒడంబడిక (అనంత) –బు. కంత్రాతు; స్పా. కంత్రాతా-ఒడంబడిక, ఒప్పందము; ఫ్రె. కాంత్రా; ఇం. కంట్రాక్–ఇం. వి. (శ. ర. 190).

21. కాతోలికు : పోపు అనుయాయులగు క్రైస్తవులశాఖ (బ్రౌ, ఇం. తె.) -బు. కతోలీకు; దల్గాదు (పు. 88) 'కథోలికు' అను తెలుఁగు నుడిని ఉదాహరించినారు; ఆ పక్షమున నది ఆంగ్లభవము.

22. కందీలు : రూ. కానదీయలు. దీపము, ప్రమిద (నిజామాబాదు) – బు. కందీల్–దీపము; స్పా కందేలా; కందీల్–చమురుదీపము; ప్రమిద; ఫ్రె. షాఁదెల్–పాదిరి గుడి దీపము; డచ్చి. కందెలార్–క్రొవ్వు వత్తి.

23. కపాతు : రూ. కబాతు విత్తులు తీసినకోడె; కచ్చితీసినకోడె (మిశ్ర బ్రౌ.)– బు కపాదు–కచ్చి (విత్తు) తీయుట : కపార్–కచ్చితీయు; స్పా. కాపాదోర్; కాపాదురా–కచ్చితీయుట (బుడతకీచులోని 'p' ఇంగ్లీషులో కంటే న్యూనస్ఫోటనముకలది).

కపాయి : చూ. కబాయి. (మిశ్రబ్రౌ.)

24. కపితాను : రూ, కప్తాను. సేనాని; అధికారి; వ్యవహర్త (రంగరాట్. పీఠిక. 59 : రంగా. 2-5\ ను—దళవాయి, పడవాలు; స్పా. కాపీతాన్—దళవాయి: కాపీతానీయా — దళవాయి తనము; ఫ్రె. కపీతన్—ముఖ్యుఁడు; ఏలిక, యజమాని; డచ్చి. కప్టేన్; మల. కప్పితాన్—బు. (గుండర్టు 204); పరాసుభాషా పదమని కొందఱి తలంపు. పదనాఱవు శతాబ్దము నాఁటికే తూర్పిండియా దీవులలో ఈ పదమునకు వ్యాప్తియున్నట్లు ఆధారము లున్నవి. పదునేడవు శతక మునగాని పరాసువారు రాలేదు. కావున, నిది పరాసు భాషనుండి వచ్చినదనుటకు బలముచాలదు. చారిత్రకముగను, ధ్వనిపరిణామ సూత్రము ప్రకారముగను ఈ పదము బుడతకీచు భాషాజన్యమనుట సయుక్తికము.

కప్పా : చూ. కమీజ (కదిరితాలూకా, అనంత.)
కప్తాను : చూ. కపితాను. ఓడకప్తాను (బ్రౌ. ఇం. తె. 147) : (ఆం భాచ. 618),

25. కప్పు : ఒకదినుసు పాదిరి ఉడుపు (క్రైస్తవజన వ్యవహారము)—బు. కాపా—పాదిరి అంగీ : స్పా. కాపా—దుప్పటి, పచ్చడము.

కబచ : చూ. కమీజు (హోసూరు తాలూకా, సేలము).

కబాతు : చూ. కపాతు (మిశ్రబ్రౌ) ° కోడి—విత్తులుతీసినకోడి.—హిం. (బ్రౌ. ౨., 245).

26. : కబాయి : రూ. కపాయి, కబాయీ, కబ్బా, కబ్బాయి, ఖబ్బాయి—తురకలు తొడిగే ఒకచొక్కా ; శృంగారార్థము అన్నిటిపైన వేసికొనుచొక్కా (మిశ్రబ్రౌ;) దే. వి. అంగీ (శ. ర., కళా. 5—179; దశా. పీఠిక 42) బు. కబైయ — ప్రాచ్యసీమలలోవాడు నిలువుటంగీ (హిం. బ్రౌ. ౨, 245; ఆంభాచ., 592).

కబాయీ : చూ కబాయి (హంస, 5—360).

కబ్బా : చూ. కబాయి. 'చేతులులేని పొట్టికోటు ?' — అరబ్బీ (అంభా. చ., 591).

కబ్బాయి : చూ. కబాయి. (ద్వి, పరమ., పు. 482).

27. కమాను: అన్యదే. వి. ప్రయాణము (శ. ర., 211; ఆం. వాచ) °పోవు- ప్రయాణముచేయు (బ్రౌ. రి. 247)-బు. కమిన్యార్ — పయనించు: స్పా. కమినో — ప్రయాణము; మార్గము; ఫ్రె. కామా( — దండయాత్ర;— ఫ్రె. (మిశ్రబ్రౌ., బ్రౌ రి., ఆం. భా. వి.)

28. కమిస్సెరి : సైనికోద్యోగి. 'కమ్మిస్సెరీ దొరలు' (చెన్నపురీ., పు. 75 'కమిస్సెరీజెనరలు' (పైది. 7) — బు కమిస్సారి; స్పా. కమీసారీ- పోలీసు అధికారి; న్యాయాధిపతి.

29. కమీజు : రూ. కప్పా, కబచ, కవిసె. లోనధరించుచొక్కా; చొక్కా: (విశా., శ్రీ కా.)—బు. కమీజా (Portu. camisa.) బుడతకీచులో అజ్మధ్యము (inter vocalic) గా 's' అనులిపి చిహ్నము 'Present' లోని 's' వంటి ఉచ్చారణము కలది); స్పా. కమీసా —చొక్కా; కామీసేరియా-చొక్కాలమ్ము దుకాణము; ఫ్రె. కమీజాల్ — రైక; డచ్చి. క్రమీజోల్ — స్త్రీల కూర్పాసము; - ఇం. (శ. ర., — ఆం. వాచ.)—బు. (గాలెటి); అరబ్బీ ద్వారమున వచ్చిన బుడతకీచు. పదము (MAMP, Vol. III, p. 121); టర్నర్ నేపాలీ నిఘంటువున 'కమిజ్' శబ్దమునొద్ద బుడతకీచు మూలముగా ప్రదర్శితము (చూ. పు. 75;) మరా. ఖమిస్ — బు.

కమేల : చూ. గమేళా (మిశ్రబ్రౌ.).

30. కర్మాయి : కుంకుమ వర్ణము (మిశ్రబ్రౌ);— బు. కర్మి: స్పా. కర్మేసీ, కర్మిన్;— రక్తవర్ణము; ఫ్రె. కార్మై ('మై' లోని 'ఎ' మామూలు 'ఎ' కంటే వివృత స్వరము; open or lowel) డచ్చి. కార్మొజీ యన్.

31. కలపతి : లప్పము, 'జనపనారను, పీచును కీలులో తడిపి ఓడసందులలో పొదుగుట'; (బ్రౌ. ఇం. తె. 156) —బు. కలాఫాతి; స్పా..

కలాఫాతి: అరబ్బీలోని 'కాలాఫన్' బుడతకీచుద్వారమున భారతీయభాషలో ప్రవేశించినదవి Hobson-Jobson, pp. 149.

కవిసె : చూ. కమీజు (కదిరి తాలూకా, అనంత).

32. కాకాతువ్వా : పసుపుపచ్చని జుత్తుగల పెద్దతెల్లచిలుక (ఆంభాచ. 619)_ బు.కాకాతూ స్పా. కాకాతూ ఆ; ఫ్రె. కకతాఎస్; డచ్చి. కకెతొ; 'కాకాతూవా' యను మలయా భాషాపదము లన్నిటికి అసలు మూల మని వేత్తల మతము.

33.కాజా (లు) : బొత్తాము (గుండీ)లు తగిలించుటకు చొక్కా మొ. వాని ఎదపట్టి మొ. చోట్లనుండు కన్నము (లు) (అన్నిమండలముల)- బు. కాజా; స్పా. కాహా-కన్నము; పెట్టె; మరా. కాజే(_బు కాజా.

34. కాతరుసు: ముదుకకాగితము(మిశ్రబ్రౌ.) _బు కర్తూషు_ముదుకకాగితము; కర్తాజ్___అనుమతి పత్రము; కాకితము: స్పా. కర్తూచో; ఫ్రె. కర్తూష్: అరబ్బీ. కిర్తాస్___కాకితము; ఒడంబడిక పత్రము.

కానా : చూ. కాను ('కానా గట్టుమీద....' 'మూడుస్థలాల్లో' అను శ్రీ రాచ కొండ విశ్వనాథశాస్త్రిగారి కథ; విశాఖ లో ప్రచురవ్యవహారము.) వంతెన క్రింద నీరు పోవుట కేర్పడిన గొట్టము లేక తూము: వంతెన.

35. కాను : రూ. కానా. 'ఓడతట్టుమీద చేరిననీరు మరల బయటకుపోవుట కేర్పఱిచినదారి' (ఆంభాచ. 627) _బు. కాను_గొట్టము; తూము; జలదారి; స్పా కాఞు_ పొడుగైన గొట్టము: చిమ్మన గొట్టము; గరాటి

కానుదీయులు : చూ. కందీలు (అనంత) 'కందీలు' 'దీయలు' ( = దీవియలు) అను సమానార్థకశబ్దముల కలయికవలన 'కానుదీయులు' అను రూప మేర్పడి యుండనగు.

36 కామరా : రూ. కామిరీ. మాలీము, సరంగులు పరుండు గది; ఇది అమరము (ఓడవెనుక భాగము) దగ్గరనుండును (ఆంభాచ, 627)_బు. కామరా- గది; అర; స్పా. కామూరా - ఓడలోని గది; గది; ఫ్రె. షాంబ్ర్ - గది. భాగము; డచ్చి. కమెర్; ఇటా. కామెర; ఇం. ఛేంబర్.

కామిరీ : చూ. కామరా (ఆంభాచ)

కిరస్తానము : చూ. కిరస్తాను (అనంత). క్రైస్తవ ప్రజాసమూహము; ఇట్లే తురకల సమూహము 'తురకాణ్యము'

కిరస్తానీ : చూ. కిరస్తాను - ఇం. (ఆంభాచ, 617)౦ చదువుల - పాశ్చాత్య విద్యలు; °పిల్ల-క్రైస్తవులబాలిక; °పోకిళ్లు - సనాతనాచార పరాయణులకు సరిపడని పోకడలు; °వేషాలు-పాశ్చాత్యవేషములు, పాశ్చాత్యరీతులు.

37.కిరస్తాను : రూ. కిరస్తానము, కిరస్తానీ, కిరస్తు. విణ. క్రైస్తవమత సంబంధి; కిరస్తానులు; క్రైస్తవులు. బు. క్రిస్తాను: ఫ్రె క్రేచ్యేఁ: దల్గాదు గ్రంథమున 'క్రిస్తన్ను', 'కిరస్తువను' అనునవి తెలుఁగు రూపములుగా ఉదాహృతములు (చూ. పు. 128)

కిరస్తు : చూ. కిరస్తాను (మిశ్రబ్రౌ)

38 కిరూబు : దేవదూత (బ్రౌ. ఇం, తె. 169). - బు కెరూబిమ్—దేవదూత; స్పా. కేరూబిన్; ఇం. చెరబ్; హీబ్రూ కెరూబ్; అరబ్బీ. కిరుబ్; పారసీ. కరూబి: క్రైస్తవమునకే పరిమితముగావున అరబ్బీ, పారసీ మాటలను మూలముగా చూపుటపొసఁగదు.

39.కుదీలు : రూ కుదేలు. 'కాకితముల ఆట (పేకాట)లో అయిదుపట్లు పట్టు తాననిచేసే ప్రతిజ్ఞ' (మిశ్రబ్రౌ.)–బు. కొదీల్యు, కొదీలి—పేకాట లోని ఒక పరిభాషా పదము: 'ఓంబ్రి' అను ఆటలో ఆటగానికి ప్రతికూలముగా గెలుపు కలుగుట

కుదేలు : చూ కుదీలు (బౌ. రి. 294) 'ఆదెబ్బతో వాఁడు కుందేలయిపోయాడు'.

40 కుమందవన్ : దళవాయి; సైనికోద్యోగి—బు. కొమందంతి; ఫ్రె. కోమాఁడాఁ;—ఫ్రె (మిశ్రబ్రౌ): కుముందము ఫ్రెంచి పదమని వీరభద్రరావుగారు;

41.కుంపాసు : దిక్సూచి (బ్రౌ. ఇం. తె. 205)–బు. కుంపస్సు; ఇం. కంపాస్.

కుంపిణి: చూ. కుంపిని–ఇం. (ఆంభాచ., 615).

**42.** **కుంపిని** : రూ. కంపిణి, కుంఫిణి, కుంఫిణీ, కుంభిణీ; పాశ్చాత్య వర్తక సంఘము; ఆంగ్లేయ ప్రభుత్వమువారు; 'పుదుచ్చేరి కుంపిని' (రంగరాట్ పీఠిక 101). — బు. కుంపన్యి; స్పా. కొంపనీయా; ఫ్రెకోంపేంఞ; మల. కుప్పిణ్ణి, కుంబణ్ణి — ఇం. కంపెనీ (గుండర్టు, పుటలు, 265, 266).

**కుంఫిణి** : చూ. కుంపని (మిశ్రబ్రౌ.)

**కుంఫిణి** : చూ. కుంపిని (Annals of Hande Anantapuram, p. 99)

**43.** **కుంబాద్రి** : జ్ఞానపిత; శిశువు పెరిగి పెద్దయయి క్రైస్తవమత ధర్మానుసారముగా ప్రవర్తించుటకుగాను నామకరణ సందర్భమున పూటపడువాఁడు: 'జ్ఞానతండ్రి' యని కర్నూలు మండలము వాడుక — బు. కంపాద్రి; స్పా. కుంపాద్రే — జ్ఞానపిత; మిత్రుడు; ఇరుగుపొరుగువాఁడు.

**కుంభిణి** ; చూ. కుంపిని (మిశ్రబ్రౌ.)

**కుశిని** ; చూ. కుసిని (గారెటీ, MAMP, III, 223) °వాడు—వంటవాడు (మిశ్రబ్రౌ)

**44.** **కుసిని** : రూ. కుశిని, వంటయిల్లు; °వాఁడు. అన్యదే. వి. హీనజాతులకు వంటచేయువాఁడు (ఆం. వాచ.) — బు. కుజిన్యా; కోజిదు—వండఁబడిన: స్పా. కోసేనా — వంటయిల్లు; కోసేనిల్లా — చిన్న వంటగది; ఫ్రె. క్వీ జీన్ — వంటయిల్లు; క్వీజీనే—వంటవాఁడు; ఇటా. కుసినా — వంటయిల్లు; ఫ్రె. (మిశ్రబ్రౌ. MAMP, III, 223; ఆం. భా. వి; ఆం. భాచ). అన్యదే. (ఆం. వాచ.); తమిళ. కుసిని—వంటవాఁడు — బు.

**45.** **కూర్వ** : వాడ (ఓడ) కూర్పుకు వేసే వంకర కొయ్య; వంకరకొయ్య (మిశ్రబ్రౌ.)—బు. కుర్వా—ఓడవంపుకొయ్య; స్పా. కూర్వా—వంకర; వంకరగల; కోర్వ—మోకాలివంపు; వంకరైన; ఓడపక్కల బిగించు వంపుబద్ద; ఫ్రె. కూర్వ్—వంకర; వంకరయిన: ఇం. కర్వ్.

46.కాన్సేలు : మంత్రాంగసభ; సభాస్థలము; 'జాతికాన్సేలు' (రంగరాట్. పీఠిక 58)—బు. కొన్సేల్యు- మంత్రాంగము; స్పా. కాన్సీలియో—పాదిరి గుడికి సంబంధించిన సంఘము; ఫ్రె. కోన్సెయ్యే; బుడతకీచుల వలసయగు 'తైమర్' దీవిలో 'కౌన్సేలు' శబ్దము ప్రచురముగా నున్నది. (Port - Voc - p. 116),

కోప : చూ. కోపా. 'కోప' ఇది ఇంగ్లీషుమాట (బ్రౌ. ఇం. తె. 262).

47.కోపా : చూ. కోప. పాదిరిగుడులలో వాడుగిన్నె (మిశ్రబ్రౌ); - బు కోపు —పంచపాత్ర. గళాసు; స్పా. కోపా—సారాయపు గిన్నె; ద్రవద్రవ్యము కొలుచు ఒక పరిమాణము; ఫ్రె. కూప్; మల. కోప్ప;-బు. (గండర్డు)

48 కోబీ : చూ. కోసు, గోబి. క్యాబేజి (ఆంభాచ.)—బు. కోవి.

49.కోమాను : ఆజ్ఞ, ఉత్తరువు—బు. కోమందు; ఫ్రె. కోమాంద్;

50.?కోర్జ : ఇరువది గుడ్డముక్కలు; జవళీ అంగడులలోని పరిభాష (మిశ్ర బ్రౌ.)—బు కొర్జా-'ఇరువది' యనుటకు వర్తకుల పరిభాష.

కోసు (గడ్డ) : చూ. కోబీ. (అనంత, చిత్తూ., నెల్లూ.) — ఇం. Cabbage (బ్రౌ. రి.) తమిళ, కన్నడ. కోసు.

51 కోస్తా : సముద్రతీర ప్రాంతదేశము; 'ప్రఖ్యాతంపు కోస్తాల' (చెన్నపురీ. పు 25) -జిల్లాలు, వర్తకము—బు. కొస్తా - సముద్రతీరము; స్పా. కోస్తా- తీరము, ఒడ్డు;—ఇం. (శ ర, ఆంభాచ)

52 క్రిస్మ : జ్ఞానస్నానము —బాప్తిస్మము — న వాడు పవిత్రతైలము. 'ఒక తరహా తైలము; దీనిని రోమన్ కతోలికు వాండ్రు అవసానకాలమందు ఆయా అవయవములలో చరుముదురు' (బౌ ఇం తె 173) —బు. క్రీజ్మా; ఇం క్రిజమ్; చర్చికి సంబంధించిన పదజాలములలో చాలపాలు బుడతకీచు భాషనుండి సంక్రమించినదని సిద్ధాంతీకరించుట కారణముగా దీనిని బు గా పేర్కొన నయినది ధ్వని పరిణామ సూత్రముల ప్రకారము ఆంగ్ల భవమనియు అననగు.

53. క్రీస్తనుడు : కిరస్తువాఁడు, క్రీస్తుమతస్థుఁడు (మిశ్ర బ్రౌ.) చూ. కిరస్తాను.

54. క్రీస్తు : కిరస్తానీ మత ప్రవక్త; 'క్రీస్తు శబ్దమునకు అభిషిక్తుఁడని యర్థము,' 'క్రీస్తు అనబడిన యేసు పుట్టెను' (మత్తయి. అధ్యా. 1); మమ్మును రక్షింప్పేకతన్ అయిన యేసుక్రీస్తు యొక్క శుభ సమాచారము' (దేవునియొక్క సమస్తమైన వాక్యము, 1812 లో శ్రీరామపురములో క్రైస్తవమత ప్రచారకులు ప్రచురించిన బైబిలు); 'లూకా చేత వ్రాయబడిన యేసుక్రీస్తు శుభసమాచారం' సి. పి. బ్రౌను 1838;...'యీగ్రంథము....యేసు క్రీస్తుయొక్క నూతన నిర్ణయమైయున్నది మొ....' (British and Foreign Bible Society/ Madras, 1818); క్రిస్తుసంబంధమైన' (మిశ్రబ్రౌ.); °జయంతి—ఏసుక్రీస్తు పుట్టిన పండుగు; °శకము—హూణశకము; — బు. క్రీస్తు; ఫ్రె. క్రీస్; ఇం. (ఆంభాచ.);—గ్రీక్ (బ్రౌ. ౨. ౩౩౪).

క్రీస్తువు : క్రీస్తుమతానుయాయి; రోమన్ కాతలిక్ శాఖీయులు క్రీస్తువులు, ప్రొటెస్టాంట్ శాఖీయులు క్రైస్తవులు — అను విభాగము వ్యవహారములో కలదు (కర్నూ., నెల్లూ.); 'ఆరంభక్రీస్తువులు' క్రీస్తు మతానుయాయులలో మొదటివారు 'సత్య క్రీస్తువులు' నిజమయిన క్రైస్తవులు.

క్రైస్తవులు : క్రీస్తుమతానుయాయులు (నానా. 232) (బ్రౌ. ౨., శ. ర అను) —ఇం. (ఆంభాచ)

ఖబ్బాయి : చూ. కబాయి 'ఖబ్బాయి ఉట్టీలు...' పెమ్మసాని తిమ్మానాయనిపై చాటువు.

గడంగు : చూ. గిడంగి..(ఆంంల). సరకులు నిలువయు చెడి పెద్దకొట్టు: సారా నిలువయుంచెడి కొట్టు; కన్నడ. గడంగ (గు)—మదిరాగృహము (కిట్టెల్ 519).

గబేళా : చూ గమేళా (గుం).

గమాతు : చూ గామత్తు (మిశ్ర బ్రౌ)

55.గమేళా 1 : 'ఓడ స్తంభములో మనిషి నిలిచేట్టుగా కట్టియుండే అంతస్తు' (మిశ్రబ్రౌ)—బు. కమేరా-ఓడగది, అర; స్పా. కామారా.

56.గమేళా 2 : ఉ. గంవేళా; రూ. గబేళా, బేల్దారి పనివారు వాడు ఇనుపగంప; ఇనుప పళ్ళెరము. (గో., విశా, శ్రీకా.)-బు గమేలా - కొయ్య తొట్టి, కొయ్యసానిక; స్పా. గామేల - పెద్దకొయ్యగాబు; ఫ్రె. గమెల్—భోజన పాత్రము.

57.గామత్తు : రూ. గమాతు. ఓడు, చిల్లి ఊట (మిశ్రబ్రౌ.)—బు. గామోతి—చిల్లిపడుట, కాఱుట; స్పా. గోతియో; ఫ్రె. ఫీత్; మల. కమ్మత్—చిల్లి, ఊట—బు. (గుండర్టు 206).

58.గావాయి ; ఓడకొన స్తంభము; సైతాంగావాయి — పేకొండముగా చేయబడిన ఓడ స్తంభము (మిశ్రబ్రౌ.)—బు. గావియా; స్పా. గావీయా; గుజ. హిం. గావీ; అరబ్బీ. గబియ; మల. కప్పప్పాయి; — కప్పల్‌పాయి (గుండర్టు, పు. 204).

59.గిడ్డంగి :రూ. గడంగు, గుదాం; గోదాం, చెఱసాల. 'గిడ్డంగిన వేయించి' (రంగరాట్. పీఠిక. 58: మిశ్రబ్రౌ; శ. ర., కాంబెల్) కొట్టు, గది, సరకులుంచి అమ్మేడియిల్లు—బు. గుదామ్—అన్యదే. (శ ర ); దేశ్యమని కాంబెల్ (చూ. పు 203): జావానుండి వచ్చి వారిచే కొని తేఁబడిన మలయా భాషాపదమని గాలెట్టి, పు. 130; మల. కిడఙ్ఙు—చెఱసాల; సరకులు నిలువ యుంచెడికొట్టు, కొటారు—బు (గుండర్టు, పు. 247) కన్నడ. గిడంగి, గిడ్డంగడి, గిడ్డంగి.

గుదాం : చూ. గోదాం (శ్రీకా )

60.గుళాపు (లు) : అలంకారార్థము కట్టు రంగురంగు గాజు గోలీలు (అనంత)—బు. గ్లోబు; స్పా. గ్లోబో; ఇం. గ్లోబ్

గొయ్య (పండు) : చూ. గొయ్యా (పండు) (గాలెటి )

61.గొయ్యా (పండు) : రూ. గొయ్య (పండు), గోవ, గోవా (పండు) (చిత్తూ, చెంగల్పట్టు): జామపండు; గొయ్యాచెట్టు జామ (MAMP-

III, 333)—బు. గొయాబ; స్పా. గూయాబా (మెక్సికో దేశపు పండు); ఫ్రె. గొయావ్ ; ఇది అమెరికా ఖండమునకు నిసర్గమయిన పండ్ల మొక్క; 'గుయావ' అని బ్రజిలు దేశీయులవాడుక. జామ ఫలములు 'హంసవింశతి' నాఁటికే కలవు (హంస 4_134) బుడతకీచులచే ఇండియాకు కొని తేఁబడి విస్తారముగా పెంచుచున్న పండ్ల మొక్క (MAMP. III, 333); 'మెక్సికో' దేశమందలి 'గొయ్యా' పండు స్పానిషుద్వారా తెనుఁగునఁజేరినది' (ఆంభాచ. 618) అను వ్రాఁతకు బ్రౌను ఆధారము (బ్రౌ. రి. 388); కన్నడ. కొయ్యా, గొవ — స్పానిష్ — మెక్సికన్ (కిట్టెల్, 488); మల. కొయ్యా; తమిళ. కొయ్యాప్పళమ్ — జామపండు — బ్రెజిల్ (TL, 1155); చిత్తూ. చెంగల్పట్టులలో ఈమాట ఉనికికి హేతువు తమిళభాషా ప్రభావము.

గోవా : చూ. గోదాం కార్యరంగము; వివాదము; పోట్లాట (కృ. గో.).

62. గోదాం : రూ. గుదాం, గోదా. చూ. గిడ్డంగి సరకులు నిలువయుంచెడి కొటారు (కృ. గో.)—మలయా (బ్రౌ. ఇం. తె. 534).

గోబి : చూ కోబీ (మహబూబ్ నగరము)

గోవ (చెట్టు) : చూ. గొయ్యా (పండు) (MAMP. III. 333) కన్నడ. గోవ, గోవగిడ.

గోవ (పండు) ; చూ గొయ్యా (పండు) (మిశ్ర బ్రౌ )

63. గ్రాది ; కిటికి కమ్మిలు; ఇనుపకటకటాలు, కటాంజనము (మిశ్ర బ్రౌ.); ఇనుపగ్రాది. ఇనుపకటాంజనము (బ్రౌ. ఇం. తె. 451)-బు. గ్రాది—ఇనుప చువ్వలవరుస; స్పా. గ్రాదా, గ్రాదో—మెట్లు; బంగాళీ నుండియని మిశ్రబ్రౌ. 31. (ఆంభాచ. 620)

చపాతు ; చూ చప్పాతి (కళ్ళి) (బ్రౌ. రి. 405).

64. చప్పాతి (కళ్ళి) : రూ. చపాతు. నాగజెముడు, Opuntia dillenii (అనంత); చపాతీవలె ఉండెడి కళ్ళియని కొందరి వ్యుత్పత్తి. కాలి

ఫోర్నియా ద్వీపకల్పము (ఉత్తర అమెరికా) నుండి 1786 ప్రాంతములు తెచ్చిన ముండ్లకంచెమొక్క (Flora of Madras I. 387)- బు. సపాతు-పాదుక; చెప్పు; ఫ్రె. సబో-కొయ్య పాదుక.

——చెఱ్ : చూ. చెవి: తాళంచెఱ్ (కృ., గుం., గో.) అను సమస్తపదములోనే ప్రయుక్తము.

——చెయి : చూ. చెవి. తాళపుచెయి; బీగము: బ్రౌ. 354),

——చెయ్యి : చూ. చెవి, బీగము; 'తాళపుచెయ్యి' (బ్రౌ. రి. 429)

65. చెవి : రూ.—చెఱ్,—చెయి. చెయ్యి, చేయి—, శావి బీగము. వైకృతమని శ. ర., 'పరలోక రాజ్యము యొక్క తాళపుచెవులు నీకిచ్చెదను' (మత్తయి. అధ్యా 16;) 'జ్ఞానమను తాళపుచెవిని ఎత్తికొని పోతిరి' (లూకా. అధ్యా.11): తాళపుచెవి (బ్రౌ. 410); తాళముచెవి; A key is more usually called బీగపుచెవి (బ్రౌ. 616): బీగము చెవి (బ్రౌరి., 344); బీగము చెవులగుత్తి (పైది; 132): చెవిమార్కునూనె; తాళం చెవులు;—బు. షావి; ఫ్రె. క్లే.

——చేయి : చూ. చెవి 'బీగంబు చేయిచే బీగముల్ దెఱచి' (ద్వి. పరమ. పు. 319); తాళంచేతులు — బహువ. (కృ., గుం., గో.)

జనలు : చూ. జన్నలు (చెంగల్పట్టు) 'బహుంశః—జిల్మిల్ కిటికలు' (మిశ్ర బ్రౌ.)

జనార్లు : చూ. జన్నలు. జనార్లగూడు (అనంత.)

జనాలు : చూ. జన్నలు (బళ్ళారి).

66. జన్నలు : రూ. జనలు, జనార్లు, జనాలు, 'జన్నల్' (ఆం. భా. వి., 608)— బు. జన్నెల—చిన్నతలుపు; జనెల—కిటికి; తక్కిన రోమాన్సు భాషలలో నిది మృగ్యము గవాక్ష గృహాక్ష జాలక వాతాయనములు సంస్కృత పదములు సోరణములు, సోరణ (గండ్లు) సం. సౌరాయన (= సూర్యపథము),—ప్రా. సోరాయణ, సోరాణ, తె. సోరణ (ము) కావచ్చు; (సం. భోజన—ప్రా. భోయణ, భోణ—తె. బోనము—వలె); కిటికి (కీ) హిందీ 'ఖిడ్కీ' పదజన్యము; 'విండో'

ఇంగ్లీషుమాట; 'జస్నీలు' బుడతకీచులది. మరి ప్రాఁదెలుగుఁలకు కిటికలు (కిటుకులు?) తెలియనట్లే కదా:

67. జామొరిన్ : కోళికోడు పాలకుని పట్టపుపేరు. 'సాముద్రిన్' శబ్దము 'జామొరిన్' అయినదని గుండర్టు; (గుండర్టు; also, MAMP. Vol. III p. 1042); 'స్వామిశ్రీ' — సామితిరి, సామూతిరి; 'నంబూదిరి', 'అక్కితిరి', 'సోర్నత్తిరి' మొదలగు ఉన్నతకులముల పేరులలోని చివరిభాగము 'శ్రీ' శబ్దభవమగు 'తిరు'కు సంబంధించినది. (J. A. Thorne, Royal Titles in Malabar, Appendix II (c) to 'Book of Duarte Barbosa). 'స్వామిశ్రీ' యనఁగా రాజాధిరాజు అని యర్థము. 'సామూరి', 'సామూతిరి'కి వికృతి. 'సామూరి' యే బుడతకీచుల నోటఁబడి 'జామొరిమ్' అయినది; అదే 'జామొరిన్'గా మనకు పరిచితము.

68. జాలపు (గుండ) :— విరేచనకారియగు మందు (ఆంధ్రవా.)—బు. జలాప. మెక్సికోలోని 'Xalapa' అను పట్టణమునుండి ఈ పేరు సిద్ధించినదని ఊహ దచ్చి. జల్ప్—పై సూఁతమందు.

69. జెంతు:— తెలుఁగువాఁడు. తెలుఁగుభాష—బు. జెంతియ; —క్రైస్తవేతరుఁడు; అవిశ్వాసి; స్పా. జెంతీల్— క్రైస్తవేతరుఁడు బుడతకీచుల వ్రాఁతలలో 'జెంతు' పదము హిందువులు అను నర్థమున ప్రయోక్తము. తెలుఁగను పరిమితార్థమున ప్రయోక్తమగుట ఇంగ్లీషు రికార్డులయందే విలియం బ్రౌను తన నిఘంటువునకు వ్రాసిన ఉపోద్ఘాతములో తెలుఁగుభాష అను నర్థములో 'జెంతు' మాటను పలుతడవలు వాడినాఁడు.

70. తంబాకు :— రాగి, తుత్తినాగము కలిసిన ఒక మిశ్రలోహము, సొగుసా (మిశ్రబ్రౌ).—బు. తంబాకా—ఇండోచైనాలో తయారగు రాగి తుత్తినాగము కలిసిన మిశ్రలోహము; మలయా. తంబగం; ? సం. తామ్రక శబ్దభవము. 'అథ తామ్రకమ్ శుల్బం మ్లేచ్ఛముఖం...' అనిఅమరము చెం.—, చెన్ను, చెంబు ( = రాగిపాత్ర) లకు సంబంధించినదో?

71. తారము —'కట్టలు తూచడములో గోనె, దారము మొదలైన వాటికి గాను తోసిపుచ్చేటిది. (మిశ్రబ్రౌ) — బు. తారా — తూనికల్లో పుడు; స్పా. తారా; ఫ్రె. టర్; ఇం. టేర్; డచ్చి. టర్ర; అరబ్బీ. టర్హ్

తురుపు — గుర్రపుదండు — బు. త్రూప్ — సైనిక దళము.

తువాల(— లా-లు) : ఉ. తువాలు. చూ. తువ్వాల ( — లా-లు), తుండుగుడ్డ (మిశ్రబ్రౌ); '....యేసు.... ఒక తువాలు తీసికొని నడుమునకు కట్టుకొనెను—'(యోహాను, అధ్యా. 13); '—తువాలుతో తుడుమటకును —'(పైది): తుండువస్త్రమని నెల్లూరి ప్రతి.— బు తోవాల్య; స్పా. తోవల్ల; ఫ్రె. తువ్వాయ్యె; ఇటా. తొవాలియోలో; కన్నడ. తువాల్ — ఫ్రె. (కిట్టెల్ —785); తమిళ. తువాలై — బు. (TL. 1996); సింహళీలోని 'తువాయ' ఫ్రెంచి 'తువ్వాయ్యె' శబ్దభవము; Port. Voc. లో తువాలా గుట్ట (పు. 346), తువాలాగుత్త (పు. 505) యని తప్పుగా అచ్చుపడినది.

తువ్వాల (— లా; లు ): చూ. తువాల (కృ.) టువ్వాలు (-ఇం.) అనంతపురము.

74. దినమార్గ ; దేనుజాతి; వారి మాతృభూమి 'ప్రాంసు హింగ్లీజు దినమార్గ యొలందా—' (రంగరాట్ — పీఠిక. 68): డెన్ మ్యారు (ఏనుగుల వీరస్వామయ్య (క్రీ. శ. 1780—1836) (కాశీయాత్రా చరిత్ర. పు. 268)— బు దినమార్కా — డెన్మార్కు; దినమార్కేష్ — దేనులు; స్పా— దీనమర్కా — డెన్మార్కు: ఫ్రె. డెన్‌మార్క్; బెంగాలి దినెమార్.

75. నావేనా:— తొమ్మిది రోజులపూజ (క్రైస్తవ పరిభాష) — బు. నోవేనా' నోవి— తొమ్మిది; నోవెంతా— తొంబది. నోను—తొమ్మిదగు; స్పా. నోవేనా.

76. పటాలము:— రూ. పటాళము, పతాను. సైనిక దళము, దండు(మిశ్రబ్రౌ). ('........ఇటలీ పటాలము....') (అపొస్తలుల. అధ్యా. 10)— బు. బతాల్లియం; స్పా. బాతల్లోన్; ఫ్రె. బత యాం; వైకృతమని శ. ర. మూల రూపమేదో శ. ర. కారులు చూపలేదు. వైకృత

దీపికయందీ పదమే లేదు:—ఇం. (మిశ్రబ్రౌ...... ఆంధ్రవాచ);—హిం. దిగవల్లి వేంకటశివరావుగారి వ్యవహార కోశము. పు. 254.

పటాళము:— చూ. పటాలము '.......పటాళముల్....(చెన్నపురీ. పు. 26 )

77. పంట్లాము:— ఉ. పంట్లాం. బిగుతయిన ఇజారు (కృ. గో. విశా)—బు. పంతలోనా; స్పా. పంతాలోమ్;. ఫ్రె. పాంతలో; ఇం. పాంటలూన్—ఇం. (ఆంధ్రవాచ).

పతాను:— చూ. పటాలము (బందరు).

పపయ:— చూ. బొప్పాయి (మిశ్రబ్రౌ.)

పప్పళము:— చూ. పొప్పళి (మిశ్రబ్రౌ.)

పప్పళి:— చూ. పొప్పళి. వస్త్రమునందలి చిత్రవర్ణ విశేషము; చిత్రవర్ణ వస్త్రవిశేషము. (శుక. 1—148. అంధ్రా. 2—154); °పచ్చడము (పాంచాలీ—3—77); దేశ్యమని శ. ర., ఆం వాచ.

పప్పాయ (పండు)—చూ. బొప్పాయి (మిశ్రబ్రౌ., గాలెటి).

పప్పిళి;—చూ. పొప్పళి; ంచీరె (మిశ్రబ్రౌ); °బట్ట (బ్రౌ. ఇం. తె,)

78. పయాలు : అరుగు, తిన్నె; వేదిక (మిశ్రబ్రౌ.)—బు పొయాల్ — వంచటరంగు; తిన్నె: స్పా. పోయో—రాతి అరంగు; ఇం. ప్యాల్ (1873)— పంచటరంగు (దక్షిణ భారత దేశభాషలు—బు. (G. V. Subbarao. Indian words in English p. 130); ఆంగ్లో ఇండియానులోని 'పయల్'—బు, పొయాల్. (Hobson - Jobson, p. 703); పయల్ (pial; Anglo-Indian, గాలెటి, పు 20.).

79. ? పరంగి:—పాశ్చాత్యజాతి (హంస. 1—231); ముఖ్యముగా బుడతకీచు జాతి; °కత్తులు (హంస. 5—360); °కాయ—బొప్పాయికాయ (అనంత), పర్యా బొప్పాయి: °కొండ—శాంతోముకొండ (చెన్నపురీ, పు. 11.): °పీట (కువల 5—91); °పేట, °పేట వరహా. °మనిషి, °ముడాసు (హంస, 4—427); °వరహా — ఒక నాణెము: °పరాంగులు—పరంగి స్త్రీలు (చెన్నపురీ. పు; 59); °వాడు—సంకర

జాతీయుడు; (Asiatic Journal, p 445. 1823) °పెధవ-ఒకతిట్టు సోమరి (విశా—శ్రీకా.); పరంగీలాగి: పరంగుల్ (చెన్నపురీ పు 59): 'పరంగులతోడి నెయ్యమున' (శుక. 1—196); పరంగులు (చెన్నపురీ; పు. 53); 'పరంగి' శబ్దము తొలుత 'బుడతకీచులు' అను పరిమితార్థముననే ప్రయుక్తము.

'And when he heard this he said that such man could be no other than the Frances, for by this name they call us in these parts' (Roteiro da Viagemde, p. 99, 1838;)

'Pointing out that since the Portuguese-Frangues, as they call them-were so powerful it would be no wonder if they enter this port...('Duarte Barbosa, Livro, p. 248.)

మల. పరంగిమావు, పొర్తుకిమావు — జీడి మామిడి; తుళు. పెరెంగి పెలకాయి—బొప్పాయికాయ; కన్నడ. పరంగిహణ్ణు — బొప్పాయి కాయ;—మొదలగునవి 'పరంగి' శబ్దమునకు బుడకీచులతోగల అవినాభావ సంబంధమును వెలార్చునవి;—హిం. (ఆంభాచ); వై. వి. (శ. ర., ఆంవాచ); వైకృతదీపికలో లేదు.

80. పరంజ:—రూ. పరంజా, పరంజు, ఇల్లు కట్టునపుడు పనివారల కొఱకు కొయ్యలతోఁ గట్టిన కట్టడము, సారువ—బ. ప్రాంష్—సారువ; కొంకణి, గుజ పరాంచ్; మరా. పరాంచి; తుళు. పరెంజి; వై. వి (శ. ర, ఆం. వాచ); కాని వైకృత దీపికలో ఈ పదము కానరాదు; —హిం. (ఆంభాచ.)

పరంజా;— చూ. పరంజి (కృ. గో) °గూడు, °బొక్క— (ఆం. వాచ) సారువ; కొయ్యలుంచెడి గోడ కన్నము.

పరంజు:—చూ. పరంజ (గుం)

ప్రధానారోప పదమునకు తప్ప ఏ తద్రూపాంతరములకు వరుస సంఖ్య వేయలేదు.

పదపట్టికయందలి ఆరోపరచనా రీతికి డాక్టరు భద్రిరాజు కృష్ణమూర్తి—తెలుఁగు రీడరు. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము, తిరుపతి—గారి సంపాదకత్వమున ఆంధ్రప్రదేశ సాహిత్యఅకాడమీ, హైదరాబాదు వారిచే ప్రచురితము కానున్న 'వ్యవహాయ వృత్తిపదకోశము'న డా. కృష్ణమూర్తిగారు రూపొందించిన విధానము ప్రధానాధారము. డా. కృష్ణమూర్తిగారికి కృతజ్ఞతాభివందనములు.

పదపట్టికలో వ్యవహృతములయిన సంకేతముల వివరణము.

## కోశాదికములు

ఆం. భా. ఆంధ్రభాషార్ణవము; ఆం. భాచ. ఆంధ్రభాషాచరిత్రము; ఆం, భా. వి. ఆంధ్రభాషావికాసము; ఆం. వాచ. ఆంధ్రవాచస్పత్యము; కాంబెల్—ఎ. డి. కాంబెల్, తెలుగు—ఇంగ్లీషు నిఘంటువు, 1821; కిట్టెల్—డా. కిట్టెల్. కన్నడ—ఇంగ్లీషు నిఘంటువు 1894: గుండర్టు—డా. గుండర్టు, మలయాళ—ఇంగ్లీషు నిఘంటువు 1872; బ్రౌ. బ్రౌను: A. Dictionary of Telugu and English, బ్రౌ: ఇం. తె—బ్రౌను, ఇంగ్లీషు—తెలుఁగు నిఘంటువు, 1895; బ్రౌ. రి—బ్రౌను, తెలుగు—ఇంగ్లీషు నిఘంటువు, రివైజ్డ్, 1903: మిశ్రబ్రౌ—బ్రౌను, మిశ్రభాషా నిఘంటువు, 1854: వి బ్రౌ.—విల్లియంబ్రౌను, తెలుగు—ఇంగ్లీషు నిఘంటువు, సంస్కృతి ప్రచురణ, 1953; శ. ర.—శబ్ద-రత్నాకరము 1912; శ. ర. అను. శబ్దరత్నాకరము. అనుబంధము (అనుబంధకర్త:—శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు); సూ. ని. —సూర్యరాయాంధ్ర నిఘంటువు; MAMP–Manual of Administration of the Madras Presidency, 1885; Port. Voc,–Influence of Portuguese Vocables in Asiatic Languages; TL. Tamil Lezicon.

## సాహిత్యము

ఆముక్త. ఆముక్తమాల్యద; ఉ. రా. ఉత్తరరామాయణము; కళా. కళాపూర్ణోదయము; కువల. కువలయాశ్వ చరిత్రము; చెన్నపురీ. చెన్నపురీ విలాసము: దశా. దశావతార చరిత్రము; ద్వి. పరమ. ద్విపద పరమయోగి విలాసము; నానా. నానరాజసందర్శనము: బేరీజు. బేరీజు పద్యములు: బై. తెలుఁగు బైబిలు

(1810_1960) మధ్య వెలువడిన అనేక ముద్రణములు; భీమ. భీమేశ్వర పురాణము; యయాతి; యయాతిచరిత్రము; రంగరాట్. రంగరాట్ ఛందము; రంగా. రంగారాయచరిత్రము; విజయ. విజయవిలాసము: శుక; శుకసప్తతి; హంస, హంసవింశతి.

## భాషలు

ఇం. ఇంగ్లీషు; ఇటా. ఇటాలియను; కన్నడ. కన్నడము; గుజ. గుజరాతి; తమిళ. తమిళము; తె. తెలుగు; ప్రా. ప్రాకృతము; ఫ్రె. ఫ్రెంచి; బు బుడతకీచు; మరా, మరాఠి; మల. మలయాళము; సం. సంస్కృతము; స్పా. స్పానిషు; హిం. హింది.

## మండలములు

అనంత. అనంతపురము; కర్నూ. కర్నూలు; కృ. కృష్ణా; గుం. గుంటూరు; గో. గోదావరి; చిత్తూ. చిత్తూరు; నెల్లూ. నెల్లూరు; విశా. విశాఖపట్టణము; శ్రీకా. శ్రీకాకుళము.

## ఇతరములు

అన్యదే. అన్యదేశ్యము; ఉ. ఉచ్చారణ భేదము (లు); క్రి. క్రియావాచకము; చూ. చూడు; దే. దేశ్యము; పర్యా. పర్యాయపదము; పు. పుట: మొ. మొదలగు; రూ. రూపాంతరము (లు); వి. విశేష్యము; విణ. విశేషణము వై. వైకృతము: fn. foot note; p. pp. Pages; — దీనికి పరమునఁగల దానినుండి అనుటకు గుర్తు;— దీనికి పూర్వమునఁగల దానినుండి అనుటకు గుఱుతు; ° ప్రధానారోపపదమును దీనికి పూర్వభాగమున కలిపి చదువుకొనవలయును ]

81. పస్కా ; రూ పస్ఖా, పాస్క, పాస్కా. ఐగుప్తచక్రవర్తుల దాస్యము నుండి విముక్తులయి ఇశ్రాయేలీయులు తరలివచ్చిన ముహూర్తము సంస్మరణార్థము చేసెడి ఏడురోజులపండుగు, మేషసంక్రాంతి పౌర్ణమ నాఁడు మొదలయి వరుసగా ఏడుదినములు ఈ పండుగ జరుగును. '... రెండుదినములైన పిమ్మట పస్కాపండుగ, అనగా పులియని రొట్టెల పండుగవచ్చెను' (మార్కు. అధ్యా. 14); 'అది యోహా

వాకు పస్కాబలి' (నిర్గమ. అధ్యా. 12); 'పస్కాపశువును వధించుడి' (ప్రైది); 'మొదటినెల (అబీబునెల) పదునాలుగవదినము యెహోవాకు పస్కాపండుగ' (సంఖ్యా. అధ్యా. 28); 'పస్కాపండుగలోని బలిసంబంధమైన మాంసమును ఉదయకాలమువరకు ఉంచకూడదు' (నిర్గమ. అధ్యా. 34); 'యూదుల పస్కాపండుగ సమీపింపఁగా' (యోహాను. అధ్యా. 2); 'ఇది పస్కాపండుగను గూర్చిన కట్టడ... అన్యుఁడెవఁడును దానిని తినకూడదు....పరదేశీయుఁడును కూలికి వచ్చిన దాసుడును దానిని తినకూడదు' (నిర్గమ. అధ్యా. 12);—బు. పష్కోఅ; స్పా. పాస్కూఅ = క్రిస్మసు పండుగు, క్రీస్తు పునరుత్థాన చిహ్నముగా జరుపఁబడు పండుగు. పస్కాపండుగువారమునందే ఏసు సిలువ వేయఁబడుట; ఆ వారమునందే ఆయన పునరుత్థానము. కావున పస్కా, ఈష్టరులు సమానార్థకములయినవి; ఫ్రె. పేక్ (పే లోని 'ఏ' మామూలు 'ఏ' కంటే వివృతము); తెలుఁగులోని ఈ 'పస్కా'లాటిన్ భాషా పదమని బ్రౌ. (A few Latin words are used as... Pascha, Baptisma etc...' C P Brown, Madras Journal of Literature and Science, No. 28, July 1840).

పస్థా : చూ. పస్కా (బ్రౌ. ఇం. తె., 877).

పావరి : చూ. పాదిరి (బ్రౌ. ఇం తె.) '....పాదరులున్....' (చెన్నపురీ పు. 14); పాదరీలు (బ్రౌ. ఇం. తె.).

82. పాదిరి : రూ. పాదరి. క్రీస్తు మతబోధకుఁడగు గురువు; ౦గుళ్ళు (చెన్నపురీ పు. 58); ౦రనము ౦వారు, ౦వృత్తి, పాదిరులు, పాదిర్లు (బ్రౌ. ఇం. తె.); గ్రామపాదిరి, చిన్నపాదిరి, పెద్దపాదిరి ఇత్యాదులు ప్రచుర వ్యవహారము కలవి.—బు. పాద్రి.; స్పా. పాద్రె; ఇటా. పాద్రె; ఫ్రె. పెర్ ('ఎ''ఎ' కంటే వివృతము). బుడతకీచులకంటెను భిన్నులయిన క్రైస్తవమతబోధకులకును 'పాద్రి' యను వ్యవహారముండినట్లు ఎడ్వర్డుటెర్రీ (1616—1619) అను ఆంగ్లమత ప్రచారకుని వ్రాఁతలు (Early Travels in India, p. 331).

ఇటాలియను 'పాద్రె' ఇంగ్లీషు ద్వారమున తెలుఁగున జేరినదని గాలెటి, (283). గాలెటి ఇటాలియను జాతీయుఁడగుటయు, ఆ భాషలో 'పాద్రే'యను పద ముండుటయు ఈ నిర్ణయమునకు హేతువులు. ఇది చరిత్రను మఱచి చెప్పినమాట: ఫ్రె లేక ఇం (బ్రౌ. ౨., 743)–బు. MAMP. ఆంభాచ. (అం. భా. వి.); కన్నడ. పాదరి, పాద్రి–బు. (కిట్టెల్ 971); మల. పాదిరి–బు. (గుండర్టు, 644); పాదిరి మాపు, పొరుకిమాపు = జీడిమామిడి (MAMP); తమిళం. పాతిరి–బు. (TL, 2608).

83. పాపు (గారు) : కాతలిక్ క్రైస్తవ జగద్గురువగు పోపు. (కొత్త నిబంధన. నెల్లూరిప్రతి; కర్నూ; నెల్లూ)–బు. పాపా = పోపు; స్పా. పాపా.

పాస్కా : చూ. పస్కా; ంగొర్రెపిల్ల, °పండుగ, °బలి, °యజ్ఞము, °యాగము, °వ్రతము, పాస్కోత్సవదినము (పూర్వనిబంధన)

పాస్కా : చూ. పస్కా; °మహోత్సవము (పూర్వనిబంధన).

84. ?పిరంగి : రూ. పిరంగీ, పీరంగి, ఫిరంగి. 'సిపాయలు యుద్ధమప్పుడు మందుగుండు వేసి గట్టించి కాల్చెడి ఇనుపక్రోవి' (శ. ర); పిరంగి (శుక. 2–410, హంస, 5–59), పిరంగుల బారులు (చెన్నపురీ. పు. 26), పిరంగులు (శుక. 1–222)–ఫ్రె (గాలెటి, అం. భా వి); గ్రామ్యమనీ పరంగుల సంబంధము కలదికావున పిరంగి అనీ కాంబెల్ (చూ. 387).

పిరంగీ : చూ. పిరంగి దే. వి, (శ. ర.).

85. పీత : వాడా, బద్దె (మిశ్రబ్రౌ.)–బు ఫీతా = నాడా; స్పా. పీతా; ?పెరూ వియను పదము; ఒకదినుసు కలబంద (agave) మొక్కనుండి తీసిన నారతో వేసిన త్రాడు.

86. పీపా : రూ. పీపాయ, పీపాయి. కొయ్యచెక్కలకూర్పుతో, ఉక్కురేకు బిగింపుతో పెద్ద మద్దెలరూపుగా నిర్మించిన భాజన విశేషము;

°కట్టు = మూఁత పలకల నడుమ వేసెడి ఇనుపబద్ద; ఇట్టి బిగింపు (కృ.,); °రేకు = సరంబీ బిల్లకూర్పులో బిల్లలనడుమ అడుకుగా వేసెడి ఉక్కు-రేకు; బేలుకట్టు (విశా.)-బు. పీపా; స్పా. పీపా; కన్నడ. పీప. పీపాయి, పీపు-బు (కిట్టెల్ 988); మల. పీప్ప-బు. (గుండర్టు '670); తమిళం. పీప్పా, పీప్పాయ్-బు (TL, 2735); మరా, పీప-బు. (మరాఠీ వ్యుత్పత్తి పదకోశము, 502); గుజ. పీప-బు. (బెల్సారె, గుజరాతీ వ్యుత్పత్తి పదకోశము, 488); హిందీ పదమని ది. వేం. శివరావుగారి వ్యవహారకోశము, పు. 255.

పీపాయ : చూ. పీపా, పీపాయలు (బ్రౌ. ఇం. తె.).

పీపాయి : చూ. పీపా; °కట్టు, °గిండి, ‌ంనోరు,° బిరడా, పీపాయిలు (బ్రౌ. ఇం. తె.)

87. పీపీ ; రబ్బరు బూరా (అనంత)-బు. పీపా.

పీరంగి : చూ. పిరంగి (ఆం. భా. 2-218).

పుడతకీసు : చూ. బుడతకీచు; 'ప్రాన్సు పుడతకీసు హరబి పార్సి తెనుఁగు-నరవమును మొదలయిన భాషాంతరముల-మాటలాడఁజదువ వ్రాయ మేటియగుచు....తిరువేంగ డేంద్రుఁడమరె' (రంగరాట్. పీఠిక,81).

88. పురతకాలు : రూ. బురతకాళి, బురతకాలు. విఞ. పోర్తుగాలు దేశీయము, పోర్తుగాలులో తయారయిన (-పట్టు మొదలయినవి): ఒక రకము పట్టుగుడ్డ. ధరణీస్వరునకు గుందనపుఁ బీఠమునఁ బరపుగాఁబురత కాల్పులపు ఘటించి' (తంజాపుర విజయరాఘవ (1633-1673) కృతమగు రఘునాథనాయకాభ్యుదయము, పు. 54), 'పురతకాల్ పట్టు పావోసులుతెచ్చి-మురువుగా నొక యింతి మునివేళ్ళఁజేర్చ' (పైది; పు. 74), 'మృదుహంసతూలికా మిళితంబులైన-పురతకాల్ తలగిడల్....' (పైది. పు. 80), 'పురతకల్వా పతిమలుపట్టు చాపలు....' (కామేశ్వరకవి (1670) కృతమగు సత్యాభామాసాంత్వనము, 3-4).- బు. పోర్తుగాల్; ఇటా. పోర్తుగాల్లో; పోర్తుగాలు నారింజ; మల. పోర్తుగాల్, ప్రతుగాల్; మరా. పూర్తగాల్ =

పోర్తుగాలు దేశము; పారసి_పుర్తుఘాల్. నారింజలో ఒక దినుసు: తుర్కీ_, పోర్తుగాల్; నారింజలో ఒక దినుసు.

పురతకీసు (లు) : చూ. బుడతకీచు;_ఇం (శ, ర. అను).

పురతకేసు (లు) : చూ. బుడతకీచు 'ఫ్రాంసు హింగ్లీజు దినమార్గ యొలందా యంపరు దొరు పురతకేసు మొదలయిన జాతిభాషా విశేషంబులు....' (రంగరాట్, పీఠిక. 81)

89. పురోయి : ఒడంబడిక పత్రము; ధ్రువపత్రము (మిత్రబ్రౌ.)_బు. ప్రోవా: ప్రమాణము, దృష్టాంతము; స్పా. ప్రూయేబా = నిదర్శనము; రుజువు; గుఱుతు; తార్కాణము; ఫ్రె. ప్రైవ్ = రుజువు; మరా. పురావా = సాక్ష్యము; గుజ. పురోవో; కన్నడ. పురావె; తార్కాణము, రుజువు.

90. పేనా : ఊటకలము. రావిపాటి గురుమూర్తి శాస్త్రిగారి (1770_1837) తెనుఁగు వ్యాకరణమున అన్యదేశ్యముల పట్టికలో 'పేనా' పేర్కొనబడినది. (పు. 69. వావిళ్ళవారి ప్రతి, 1951. _బు. పేనా; _ఇం. (మిత్రబ్రౌ., బ్రౌ. రి , శ. ర., ఆం. వాచ , ఆంభాచ., గాలెటి);

పొప్పడ : ఉ. పొప్పడి చూ. బొప్పాయి 'పొప్పడికాయ మన దేశానిదికాదు. దక్షిణ అమెరికానుంచి 17వ శతాబ్దమందు మనదేశానికి వచ్చెను....' (సు. ప్ర. రెడ్డిగారు, ఆంధ్రుల సాంఘికచరిత్ర, ద్వి. ముద్రణ. పు. 486).

91. పొప్పళి : రూ. పప్పళము. పప్పళి, పప్పిళి, పొప్పిళి. స్త్రీలుధరించు గళ్ళు గల సన్నని వస్త్రవిశేషము (సూ. ని), చచ్చౌకపు టిండ్లగుడ్డ; 'ఎరుపుతెలుపు మళ్ళుమళ్ళుగా వుండేచీర' (మిత్రబ్రౌ): 'చిఱుత పొప్పళి' (శుక. 1_237), పసరుపొప్పళి' (పైది); 'ముయ్యంచుల పొప్పళ్ళు' (హంస. 5_3·9);_బు. పొపిలీనా; స్పా. పోపెలీనా; ఫ్రె. పోపేలేఁ; డచ్చి. పొపెలిన్; ఇం. పాప్లిన్; కన్నడ. పప్పళి, పొప్పళి, పొళ్ళి_ఇం. (కిట్టల్, 940).

పొప్పాయి (పండు) : చూ. బొప్పాయి (మిశ్రబ్రౌ.)

పొప్పళి : చూ. పొప్పళి (అనంత)

92. ప్రాంచీ (లు) : బహువ, పరాసువారు, ఫ్రెంచిజాతీయులు;–బు. ఫ్రంసేష్ = పరాసువ్యక్తి; స్పా. ఫ్రాంచేస్ = ఫ్రెంచివ్యక్తి : ఫ్రె. ఫ్రాంసె. మల. పరందిరియస్సు–బు francez (గుండర్టు, 617).

ఫత్తేరి : చూ. బత్తేరి (మిశ్రబ్రౌ.)

బంకడీ : చూ. బంకు (మిశ్రబ్రౌ). 'బంకతీ' యని (Port. Voc., p. 37).

93. బంకు : రూ. బంకడీ. హజారము, మొగసాల (రంగరాట్. పీఠిక, 116); కక్ష్య, ఇంటిలోపలిభాగము 'కొదుకక బంకు బంకులు దాఁటి చనుచు, (తిమ్మకవి ద్వి. సారంగ. పు. 129); 'బంకంవాకిలిగుండా....' (Annals of Hande Anantapuram, p. 23); సందువీథి (శ. ర.); 'తలవాకిటి పహారా' (మిశ్రబ్రౌ); కిళ్ళి. బీడీకొట్టు (విశా.); జూదసాల (కృ, గుం); పెట్రోలుబంకు; –బు. బంకు = కొయ్యపీఁట, బెంచి; ఖజానా; స్పా. బంకొ = బెంచి, బ్యాంకు; ఇటా. బంక; డచ్చి. బంక్ = బెంచి; కిళ్ళీకొట్టు: తమలపాకులంగడి; మరాఠీ పదమగు 'బంకా' నుండియని–(శ. ర. అను. 108); మరా. బంక = పహారా, చోకీ, గస్తు; పారసి. బంకి.
బత్తాసు : చూ. బొత్తాము (బ్రౌ. ఇం. తె.).

94. బత్తేరి : రూ. ఫత్తేరి, బత్రి. ముట్టడిదిబ్బ; 'ఫిరంగులు పెట్టి కాల్చడమునకు యెత్తుగా వేసిన దిబ్బ' (మిశ్రబ్రౌ); అరగడి బత్తేరి.–బు. బతేరియా. స్పా. బాతేరియా డచ్చి. బత్తెరిఙ్.

బత్రి : చూ. బత్తేరి (మిశ్రబ్రౌ):–? ఫ్రె. బెత్రీ.

బంబాస : చూ. బొంబాసు (మిశ్రబ్రౌ).

95. ?బరమా : రూ. బర్మా, బురమా, బురమ, బురుమా. పిడిసాన, తొలపణము, కండాణము: 'వజ్రంగిమున్నగువారు కొయ్యలు మొదలగువానికిని, జాలపనివారు రత్నములకును బెజ్జమువేసెడు సాధనము'

(సూ. ని.)—. వెజ్జుమా = తొరపడము; స్పా. బజ్జేనో, బెజ్జీమా; —పారసి. హిం. (కాంబెల్ 409);— హిం. (బౌ. రి., ఆం. భాచ.); దేశ్యము (శ. ర., ఆం. వాచ), ? సం. భ్రమర.

బర్మా : చూ. బరమా (మిశ్ర బ్రౌ.).

బసి : చూ. వెసర (మిశ్ర బ్రౌ). బు. బసీయ, బాసి = భోజనపాత్రము; స్పా. బాసీయ = పళ్లెరము, సానిక; ? సం. భాజన.

96. ? బాతు : జలపక్షివిశేషము. బాతువులు (ఆముక్త. 1—65); బాతులున్ (చెన్నపురీ. పు. 37); °కలంబు (బేరీజు. పు 31) °కోడి=బాతు (సేలము); గూడబాతు (హంస. 3—12); చింకుబాతు (మిశ్ర బ్రౌ); పెద్దబాతు (గాలెటి); పొట్టిబాతు, బాపనబాతు = చక్రవాకము (MAMP, III, 337);—బు. పాతు; స్పా. పాతొ, పాతా = బాతు; పాతీకా = చిన్నబాతు; కన్నడ బాతు, బాతె; తుళు బాతు; తమిళ. వాత్తు; హిం. బతఖ్, బదక్; గుజ. బతక్; మరా. బదక్; పారసి. బతక్; అరబ్బీ. బత్; దేశ్యము (కాంబెల్, శ. ర., ఆం. వాచ., —హిం. (MAMP, బ్రౌ. రి., గాలెటి, ఆంభాచ.).

బాద్లీ ; చూ. బాల్దీ:—బెంగాలి (మిశ్ర బ్రౌ );

బార (కచేరీ) : చూ. బారకాసు. సైనికులుండు వసారాయిండ్లు (డి. వేం. శివ రావుగారి వ్యవహారకోశము. పు 258); 'బారకాసు'తో 'కచేరీ. చేరుటచే'.—కాసు' జాఱిపోయి 'బార (కచేరి)' అను క్రొత్తమాట సృష్టి యయినది.

97. బారకాసు : ఉ. బార్కాసు, బార్కాసు, బార్కుచు; రూ. బారకీసు, బ్యార కుసు (లు); పర్యా. బార (కచేరీ) = సైనికులుండు నివాసములు; 'సిపాయిలువుండేశాల' (మిశ్ర బ్రౌ.); °లంజ = దండులంజ (మిశ్ర బ్రౌ.).—బు. బర్రాకాష్ = గుడిసె; గుడారము; డేరా; స్పా. బారా కాస్ = పాక, కుటీరము; పందిరి; బర్రాకా = కుటీరము; బారాకోస్ = గిడ్డంగి; బానిసల నివాసములు; ఫ్రె. బెరెక్ = పాక; సంత

గుడారము; డచ్చి. బరక్ = పాక; —ఇం. (మిశ్రబ్రౌ., శ. ర., ఆం ఛాచ); కాని 1686 కు పూర్వ మీమాట ఆంగ్లమున వాడుకలో నున్నట్లు సాక్ష్యములేదు; రోమాన్సు భాషలనుండి పదునేడవు శతాబ్దాంత మున ఆంగ్లమునఁ జేరినదని పరిశీలకులసిద్ధాంతము.

బారకీసు ; చూ. బారకాసు, 'బుడతకీసులు సోల్జరుల్ పొదలుచుండ—బార కీసుల గదుల పెంపారునందు' (చెన్నపురీ. పు. 24) 'సోజర్లవి బార కీసులు' (పైది)

బాలిత : చూ. బాల్ది (మిశ్రబ్రౌ.).

బాలిది : చూ. బాల్ది (మిశ్రబ్రౌ.).

బాల్చీ : చూ. బాల్ది (గో., విశా., శ్రీకా., ఆంఛాచ., ఆం. ఛా. వి.).

బాల్టీ : చూ- బాల్ది (తూర్పుగో., విశా., శ్రీకా., కోరాపుట్టి ఖర్గపూరు, రాయ పూరు).

98. బాల్ది : రూ. బాల్దీ, బానిత, బాలిది, బాల్చీ, బాల్టీ. బొక్కెన – బు. బల్ది = బొక్కెన; స్పా. బాల్ది = బొక్కెన; కొయ్యతొట్టి; గుజ. బాలదీ = తోలుబొక్కెన:—బెంగాలి (మిశ్రబ్రౌ.).

99. బిలిబిలి : ఊరగాయకు పనికివచ్చు పుల్లనికాయల చెట్టు, పులుసుకాయచెట్టు (MAMP, III. 98), — బు. బిలింబిమ్ = బిలింబి చెట్టు పండు; కన్నడ. బిలింబి; తుళు. బింబులి; కొంకణి. బిలంబి; మలయా. బ్లిమ్ బ్లింగ్; Averrhoa bilimbi, Linn; బుడతకీచులు మలయానుండి తెచ్చియుందురు. దీని జన్మదేశమేదో తెలియదఁట. (Flora of Madras, Vol. I, p. 95).

బిస్కత్తు ; ఉ. బిసకత్తు; చూ. బిస్కోతు (అనంత., కృ., గో.).

100. బిస్కోతు : రూ. బిస్కత్తు, బిస్కోతు (బ్రౌ. ఇం. తె.)—బు. బిష్కొ ఉతు; స్పా బిథ్కోచో (ఇందలి 'థ్', ఇంగ్లీషు thank, think-లలోని 'th-'ను పోలిన ఉచ్చారణముకలది; దంత్యోష్మము, శ్వాసము, మహాప్రాణము): ఫ్రె. బీస్క్వి: బుడతకీచులరాకతో 'బిస్కత్తులు'

ను వచ్చినవి. 'పరంగులు' అప్రాచ్యులు కావున వారు తెచ్చిన ఈ 'బిస్కోతు'ను బంగాళీలు (విషకూటము) గా భావించి, వీనిని 'బిష్ కూట్' అని వ్యవహరించిరఁట!; బిస్కట్—ఇం.

బిస్కోతు : చూ. బిస్కోతు (ఆంభాచ. 618).

101. బుడతకీచు రూ. పుడతకీసు, పురతకీశు, పురతకేశు పోర్తుగాలు దేశ సంబంధి; పోర్తుగాలు దేశపుభాష: బుడతకీచుజాతి. 'బుడతకీసులు సోల్జరుల్ పోదలుచుండ' (చెన్నపురీ. పు. 24); —బు. పోర్తుగీజ; ఫ్రె. పోర్త్యుగె; ఇటా. పోర్తొఘీస్; డచ్చి. పోర్తుగీస్; అరబీ. బుర్తూకాన్ = తీయని నారింజ; హిం. పుర్తగీస్; = 'బుడతకీచు—భారతీయ' సంసర్గముచే కలిగిన మిశ్రజాతి; మరా. పూర్తకేశ = బుడితకీచు; మల. పోర్తుకి (మావు) పడుమటి ఇండియా దీవులనుండి బుడతకీచులు తెచ్చిన జీడిమామిడిచెట్టు. బుడతకీచులను 'పోర్తుంగలేస్' అని నికోలస్ విథింగ్‌టన్ (1612—1616, Early Travels in India, p. 203). బుడతకీచులో 'త' 'ద'లకు పూర్వముననుండి రేఫము భారతీయ భాషలో 'డ' 'డ'లుగా మాఱినది.

బుడిదీ : చూ. బుడుదు; 'బుడిదీ వేయుట'—సీసపు ముక్కను నీటిలో వదలి లోతు కనుగొనుట (ఆంభాచ., 638).

102. బుడుదు రూ. బుడిదీ; నీటిలోతును కనుగొనుటకు నావికులు వాడు సీసపుగుండు. '...ఓడవారు...బుడుదు వేసి చూచి యిరువది బారలలోతని తెలిసికొనిరి' (అపొస్తలుల. అధ్యా. 28); 'నెళవుసూత్రము' అని బైబిలు నెల్లూరిప్రతి:—బు. బొర్దు; స్పా. బోర్దో.

బుతాము : చూ. బొత్తాము (మిశ్రబ్రౌ.)

బురతకాళి[1] : చూ. పురతకాలు. వస్త్రవిశేషము; [పోర్తుగాలు దేశపుపట్టుగుడ్డ.

---

1. ఒక తాళపత్ర ప్రతిలో 'పురుతకాళలు' అని కలదు.
"...పురుతకాళలు మహాముదులు నిలాకీలు
సరిసేయరాని హంసావళులు లాకీలు

'బురతకాళిలు మహామూదులు నిలాచీలు—సరిసేయరాని హంసావళులు లాకీలు' (హంస. 5—360, శృంగార కావ్యగ్రంథమండలి వారిప్రతి); బుడతకాసీలు మహముదులు నిరాసీలు—సరిసేయరాని హంసావళులు లాకీలు...' (వావిళ్లవారిప్రతి 1920); 'బుడతకాసీలు మహముదులు నిరాసీలు—సరిసేయరాని హంసావళులు లాకీలు....' అని వావిళ్లప్రతి ననుసరించి సూ. ని. పాఠము. ఈ పాఠమున ప్రాసభంగమును సూ. ని. కారులును గమనించినట్లులేదు. (చూ. సూ. ని. లో 'బుతడకాసీలు' అను ఆరోపముక్రింద), 'బుడతకాళిలు క్రొత్తప్రతిపాఠము అని సూ. ని.

బురమా : చూ. బరమా (ఆం. వాచ.)

బురుతకాలు 2 : చూ. పురతకాలు; 'కొమరొందునేకరంగు మెఱుంగు తలగడల్ బలితంబు బురుతకాల్పట్టు బటువులమరు మగజాలపని చప్పరము....' (ఉ. రా. 6—160, క్రీ. శ, 1650.); 'బలితంపు బురుకకాల్పట్టె బటువులమరు....'అని రాయలువారి ప్రతి (చూ. పు. 245):'....బలితంబు బురుక కాల్పట్టి బటువులమరు...' అని సూ. ని. పాఠము. పోర్చుగాలు దేశసంబంధియగుపట్టు 'బుడుతకాలు' మనవారి చేతుల

---

మాదళములు..." (హంస వింశతి, ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ, హైదరాబాదు, వారి గ్రంథాలయమునందలి తాళపత్ర ప్రతి, నెం. 70; 130 వ పత్రము, రెండవవైపు, చివరి పంక్తి.)

2. పెక్కు తాళపత్ర ప్రతులలో నిట 'బురుత కాల్పట్టు' అనియే కలదు.

"...కొమరొందునే కరంగి మెరుంగు దల్గడల్ బలితంపు బురుత కాల్పట్టు బటువులమరు మగరాతి పని చప్పరము..." (ఉత్తర రామాయణము, ఆంధ్ర విశ్వకళా పరిష ద్గ్రంథాలయములోని తాళపత్ర ప్రతి, Acc. No. 29204; పత్రములు, 202, 203.)

"...కొమరుందు నేకరంగి మెరుంగు తలగడ బలితంపు బురుత కాల్పట్టు బటువులమరు మగరాతి పనిచప్పరము..." (ఉత్త. రా. , ఆం. వి. క గ్రంథాలయము నందలి తాళపత్ర ప్రతి, Acc. No 29702; పత్రములు 208, 209.)

"...కొమరొందు నెకరంగు మెరుంగు తలగడ బలితంపు కాల్పట్టు పటువులమరు మగరాతి పని చప్పరము" (ఉ. రా., ఆం. వి. క. గ్రంథాలయము నందలి తాళపత్ర ప్రతి, Acc. No 29413; పత్రము; 199, మొదటివైపు).

లోఁబడి బుడక ( = చిన్న), కాల్ ( = కాలు) అగుట లేఖక ప్రమాదమునను; ముద్రారాక్షసమును.

బురుమ : చూ. బరమా (మిశ్ర బ్రౌ.).

బురుమా : చూ. బరమా (కాంబెల్, బ్రౌ. రి., శ. ర., సూని., ఆం. వాచ.)

103. బురుసు : కుంచె, తూలిక; 'ఒళ్లుతోముకొనే బురుసు' (బ్రౌ. ఇం. తె.); —బు; బ్రూస = గుడ్డలమీఁది దుమ్ము ధూళి తుడుచు పనిముట్టు; స్పా. బ్రోచా = తూలిక; —ఇం. (ఆం. భాచ.); Port. Voc. లో తె, 'బరుసు' ప్రదర్శితము. ఇది ఇంగ్లీషు 'brush' కు వికృతి.

104. బేస్తు : పేక, జూదము లోనగువాని యందలి కొద్దిగెలుపు, బొటాబొటి గెలుపు. బేస్తుకంటె తగ్గిన కుందేలు, బేసుకంటె హెచ్చిన ఆట. చిన్నబేస్తు, పెద్దబేస్తు, పైబేస్తు అనివాడుక.—బు. బస్తు = చీట్లాట లోని పరిభాష; స్పా. బాస్తో = చీట్లాటలోని పరిభాష; కాకితములలో కళావరు; బాస్తోస్ = కళావరుకాకితము అపోస్తర్ = పందెము వేయు.

బొంగు : చూ. బొంబు. ఎండిన లావుబోలు వెదురు (శ. ర.): 'కీచకసంజ్ఞయైతోఁచు బొంగన....' (ఆం. భా. 2–74); ఓడ బేహారియగు విష్ణుదాసుఁడు 'జాతి విలాయతీ' దీవులనుండి తెచ్చిన సామానులలో ....'పొలుపొందు సందలపు బొంగులును....' (హంస. 5—360) ఉండినవి. దేరాబొంగు, పాలకీబొంగు (వి. బ్రౌ, 247).

బొత్త : చూ. బొత్తాము, బెజ్జము (బ్రౌ. ఇం. తె,).

బొత్తాను : చూ. బొత్తాము (మిశ్రబ్రౌ., శ. ర.)

---

"...కొమకొందు నెకరంగి మెరుంగు తలగడల్ బలిదంపు పురత కాల్పట్టు బటువులమరు..." (ఉ, రా., ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ, హైదరాబాదు, వారి గ్రంథాలయమునందలి తాళపత్ర ప్రతి, నెం. 42, పత్రము, 254, మొదటివైపు, 1, 2 పంక్తులు).

(అకాడమీ ప్రతులను పరిశీలింప ననుమతించిన శ్రీ దేవులపల్లి రామానుజరావు గారికి కృతజ్ఞతాభివందనములు).

105. బొత్తాము : రూ. బత్తాసు, బుతాము, బొత్త, బొత్తాను, బొత్తాయి, బొత్తాసు గుండి. (తూర్పుగో, శ. ర., మిశ్రబొ., ఆంఖావి., అం. వాచ.); కాను బొత్తా=చుక్కాణి ఉండుబెజ్జము (ఆంఖావ);-బు బొత్తాము (ను); స్పా. బోతోన్; ఫ్రె. బూతాఁ; —ఇం. బటన్ ఇం; (శ. ర., గాలెటి); - ఫ్రె (మిశ్రబొ.); గుజ. బుతాన— ఇం. (బెల్వారి, 547); బొత్తాము, ఏతద్రూపాంతరములు బుడత కీచు జన్యములు; 'బటన్' ఇంగ్లీషుల నుండి ఎరువుతెచ్చినది. 'గుండీ' హిందీనుండి దిగుమతి యయినది. గుఁడీని వైకృతముగా శ. ర. (పు. 332) చూపినది; కాని వైకృత దీపికలో దీని అడపొడ లేదు. 'గుండ్రముగానుండు వస్తువుకాన గుండీ' యని వ్యుత్పత్తి చెప్పి దీనిని దేశ్యముగా నిరూపింప యత్నించినవారు. గాలెటి (చూ. పు. 48.);- పూర్వము బందుల చొక్కాలు అనఁగా తాళ్ళతో ముడి వైచుకొనునవి—ఉండెడివి; బారాబందీ చొక్కాలు ప్రసిద్ధములు.

బొత్తాయి : చూ. బొత్తాము, బొత్తాయిలు (బహువ) (శ్రీకా).

బొత్తాసు : చూ. బొత్తాము (మిశ్రబొ., అం. వాచ.)

బొప్పర : చూ. బొప్పాయి. (నల్లగొండ).

బొప్పాయ : చూ. బొప్పాయి (మిశ్రబొ). °పండు=వై. వి. ఒకజాతి ఫలము (శ. ర).

106. బొప్పాయి : రూ. పపయ, పప్పాయ, పొప్పడ, పొప్పాయి, బొప్పర: బొప్పాసి, బొప్పాయ (పండు), బొబ్బాయి (కృ., గుం., నెల్లూ.); పర్యా. పరంగికాయ. ఒకజాతి ఫలము, మదనానప. కారు బొప్పాయి = బొప్పాయిలో ఒకదినుసు. 'అబ్బాయిగారి దొడ్లో బొప్పాయికాయ పడితే పరుగెత్తలేక పదిమందిచచ్చారు'—పిడుగు. ఈ పొడుపుకథ అర్వాచీనము.—బు. పపైయా (Carica Papaya, Linn.; Caricaceae కుటుంబములోని ఒకేఒకమొక్క - Flora of Madras, Vol, I. p. 371); దక్షిణ అమెరికా ఫలవృక్షము; కరీబ్ మాండలిక మీ పదము; కన్నడ. పప్పాయి; మల. పప్పా

యం; తుళు. ఒప్పంగాయి; కొంకణి. పొపాయి; మరా. పపతీ, పోపతీ; గుజ. పపవోం, బపాయో; వివరములకు చూ. 'బొప్పాయి' 'కల్పమహారాజు' పత్రిక, అనంతపురము 1938.

బొప్పాసి : చూ. బొప్పాయి (తూర్పుగో).

బొబ్బాయ (పండు) : చూ. బొప్పాయి (గాలెటి).

బొబ్బాయి : చూ బొప్పాయి. (ఆం వాచ.)

బొంబసు : చూ. బొంబాసు (మిశ్రబ్రౌ); °గుండు (మిశ్రబ్రౌ).

107. బొంబా : తంతా—ఓడలోపలి ప్రదేశము — లోని నీటిని వెలికితోడు- గొట్టము (ఆంభాచ.)—బు. బొంబా = నీటి కుళాయి

108. బొంబాయి : కిరసనాయిలుతోడు గొట్టము, చెవ్వంగము (అనంత); నీరు వెలువరించుగొట్టము. కుళాయి (ఆం. వాచ); —బు బొంబా = నీటికుళాయి. స్పా బొంబా = కుళాయి; ఫ్రె పోంప్ = కుళాయి; బోంబ్ = బాంబు;, డచ్చి.పోంప్; ఇం పంప్.

బొంబాస : చూ బొంబాసు (మిశ్రబ్రౌ ).

109. బొంబాసు : రూ. బంబాస, బొంబసు, బొంబాస, రొట్టెవంటిపిరంగి (మిశ్రబ్రౌ);— బు బొంబా = బాంబు, బొంబాష్; స్పా. బోంబాసి = పిరంగి—ఇం. బాంబ్ (బ్రౌరి).

110. బొంబు : రూ. బొంగు, వెదురు (సేలము, కన్నడ ప్రభావద్యోతకము); కాలునపుడగు ధ్వనిని అనుకరించి పుట్టిన శబ్దమట (MAMP III, 65,).—బు. బంబూ; స్పా బంబూ; ఫ్రె. బాంబా; ఇం. బేంబూ; మలయా. సమానం; కన్నడ. బంబు, బొంబు; మరా. బాంబూ = వెదురు—కన్నడ. బంబు; జావా. బాంబు (మరాఠీ వ్యుత్పత్తి పద కోశము 544).

111. ? బొరిగ = : రూ. బొరిగము, బొరిగె. గడ్డి త్రవ్వు చిన్న సాధనము (ఆంభాచ); గోకుడుపార, త్రవ్వుకోల; గడ్డి పెల్లగించెడు గుద్దలి

(శ. ర., సూ. ని., ఆం. వాచ)—బు బొరాగ (ఆ. భాచ., 619), కాని బుడతకీచు కోశములలో ఈ మాట మృగ్యము.

బొరిగము : చూ. బొరిగ (మిశ్రబ్రౌ)

బొరిగె : చూ బొరిగ (వి. బ్రౌ; కాంబెల్, మిశ్రబ్రౌ.)

బోడ : చూ. బోడిద; ఉజియబోడ = ఓడ కుడిపక్క; దాపు బోడ = ఓడ ఎడమపక్క (మిశ్రబ్రౌ).

112. బోడిద, : రూ. బోడ. ఓడ పక్కవైపు. జమ్నా బోడిద = ఓడ కుడి తట్టు, దావుబోడిద = ఓడ ఎడమతట్టు; మేబోడిద = గాలి వీచువైపు కాక రెండవవైపు ఉన్న పక్క (ఆంభాచ) — బు. బొర్డు = ఓడ పార్శ్వ భాగము; స్పా. బోర్డో = ఓడ పార్శ్వ భాగము; బోర్దే = అంచు, చివర. బుడతకీచులోని 'ర్త' 'ర్ద' లు భారతీయ భాషలలో 'ట్త' 'డ్ద' లుగా మారుట ధ్వని సూత్రము; మరా. బోడద్ = ఓడ పక్కవైపు.

113. బోము : చూ. బొంబు. జీబీలు (తెరచాపలు) తగిలించు పెద్ద కఱ్ఱ (ఆంభాచ).

114. బోయా : 'ఇది ఒక పెద్దపీపా, లేక కర్రదుక్క; దీనిని లంగరుకు కట్టుదురు. దీని స్థానమును బట్టి లంగరు నీటిలో ఎక్కడున్నదో తెలియును' (ఆంభాచ 639)—బు. బోయా = తరండము, స్పా. బోయా; °కట్టె : లంగరు గుఱుతు; 'లంగరు మొదలైనవి మునిగిపోయిన చోటు గురుతు తెలిసే నిమిత్తమై తేలికగా నుండే కొయ్య కొఱతలకు బరువుకట్టి నీళ్లలో వేసిన గురుతు' (బ్రౌ. ఇం. తె. 132); °చుట్టు: పడవమునుకలలోను, తక్కిన అక్కఱలలోను, ఆపదలలోను ఉపయోగించు ఈఁతకాయ, life - buoy.

బ్యారకుసులు : చూ. బారకాసు (ఏనుగు వీరాస్వామయ్య కాశీయాత్రచరిత్ర. పు. 64).

115. మణేలా : పేకాటలోని పరిభాష, ఏలము ఆటలో తొమ్మిది–బు మనిల్యా: పేకాటలోని పరిభాష; పేకాట పందెములోని ఏడు పాయి.ట్లు.

116. మనేలా : రత్నాల వర్తకుల జాతి. 'మనేల' యను ప్రాంతమునుండి వచ్చి వర్తకము చేసినవారు కాన ఈపేరు' అని బౌ్రన (మిశ్రబౌ్ర 88). – బు. మనిల్యా = కడియము; స్పా. మానిల్లా = కడియము; మానో = చేయి; మానోహో = పిడికెడు, °వాండ్లు = పైన పేర్కొనిన రత్నాలవర్తకులు (మిశ్రబౌ్ర.); బు. మనిల్యా + తె. వాండ్లు అని Hobson - Jobson p. 558.

117. మన్నా : క్రైస్తవమత పరిభాష, అమృతము, దివ్య ప్రసాదము, ఐగుప్త దాస్య విముక్తులయి ఇశ్రాయేలును గూర్చి వలస వెడలుచుండిన యూదులకు యెహోవా ప్రసాదించిన ఆహారము 'ఆహారమునకై ఆయన (యెహోవా) వారిమీద మన్నాను కురిపించెను.....' (కీర్తన, 78); 'ఇశ్రాయేలీయులు నివసింపవలసిన దేశమునకు తాము వచ్చు వరకు నలుబదియేండ్లు మన్నానే తినుచుండిరి ....(నిర్గమ. అధ్యా. 17); 'ఆ మన్నా కొత్తిమెర గింజలవలె నుండెను...జనులు తిరుగుచు దాని కూర్చుకొని తిరగట విసిరి లేక రోటదంచి పెనముమీద కాల్చి రొట్టెలు చేసిరి. దానిరుచి తైలభక్ష్యముల రుచివలె నుండెను' (సంఖ్యా. అధ్యా. 11); 'దాని (మన్నా) రుచి తేనెతో కలిపిన అపూపమువలె నుండెను....' (నిర్గమ. అధ్యా. 16); '....మీ పితరులు అరణ్యములో మన్నాను తినినను చనిపోయిరి...' (యోహాను అధ్యా. 6); °గింజలు, °పాత్రము, ౦భోజనము °సంకటి,; 1841 కలకత్తాలో అచ్చయిన క్రొత్తనిబంధన గ్రంథము—సంస్కృతానువాదమునందును 'మన్నా' ప్రయుక్తము; —బు. మానా = దివ్య ప్రసాదము; స్పా. మనా; హిబ్రూలోని 'మాన్' వీనికి మూలము.

118. మయూరు (లు) : ఒక సైనికోద్యోగి (రంగా. 1-145)–బు. మయోర్; స్పా. మయోర్ = ప్రధానాధికారి, ముఖ్యుడు; ఫ్రె మజెర్;– ఫ్రె. (మిశ్రబౌ్ర, కా. వీరభద్రరావుగారు); -ఇం. (శ. ర., అను )

34. తాట : భోజన పాత్రము, పళ్యెరము (జ్ఞా. 5_107, 6_2, 13_423); తాటభర = తట్టెడు (స్మృతిస్థళ[29]); తాటకేలేఁ (పైది).

<తె. తట్ట = పళ్యెరము, కంచము; తాట[30] = బల్లపరపు. కన్నడ తట్టె తమిళ. తట్టం, తట్టు; తుళు. తట్టుగ; కన్నడమునుండి యని కులకర్ణి, పు. 372; సంస్కృత 'తత' - నుండి యని తుల్పులే, పు. 209.

35. తాటీ కంచె, వెలుగు (జ్ఞా. 2_310); వెదురుబద్దల చట్రము (కులకర్ణి. 372).

<తె. తట్టి = దడి; తట్టిగోడ = ఊరి చేరువ పొలముచుట్టు కట్టెడి రాతి కంచె; కన్నడ. తట్టి, తడికె; తమిళ. తట్టి.

తుక : చూ. తూక. బరువు (జ్ఞా. 14_141; 18_640).

తుక (ణేఁ) : తూకముచేయు (కులకర్ణి, పు. 382) చూ. తూక.

36. తూక : రూ. తుక. బరువు. తూఁచి నిర్ణయింప వలసిన పరిమాణము (జ్ఞా. 9_261).

<తె తూకము = బరువు, భారము; తూకు = కొలఁది, ప్రమాణము. బరువు; తూకువ = భారము. తెలుఁగు నందలి తూకము మొ. వి. వ్యుత్పత్తి పరముగా సబిందుకములగుట శాస్త్రీయము; ఇవి తూఁగు ధాతుజన్యములు. కన్నడ. తూక, తూకు. తూంకు.

37. తేలగూ : ఒకానొక ద్రావిడ భాషా నామము (కులకర్ణి, పు. 387).

<తె. తెలుఁగు. ప్రాకృత. తేలంగ—.

38. దింద : బట్టలమూట (candy, పు. 67; కులకర్ణి, పు. 460)

<తె. దిండు; కన్నడ. దిండె: తమిళ, మలయాళ. తిఁటు.

---

29. స్మృతిస్థళ్, నరేంద్ర పరశురాములను జంటకవులచే రచితము, క్రీ. శ. 1309.

30. కోరాడ రామకృష్ణయ్య, Dravidian Cognates, Madras University Telugu Series No. 11. Madras, 1944. P. 111.

39 నాల : 'విటిదాండు' ఆటలో పరిగణన క్రమములో 'నాలుగు' (కుల కర్ణి, పు 596; ముజుందార్, పు. 85).

<తె. నాలుగు.

40. పైకా : డబ్బు, సంపద. '...నానాభక్తమాలి ఆఁదత్త పైకాచా వివరు...' ( = నానా భక్తులచే సమర్పితమయిన పైకము వివరము). (పంఢర పుర శిలాశాసనము, క్రీ. శ. 12-73).

<తె. పైకము = ధనము; ఒక నాణెము; పసిఁడి నాణెము లేఁత, పచ్చ అను అర్థములు కల పచ్చ పచ్చటి, పచ్చని, పచ్చి, పచ్చిక, పయిఁడి, పసరు, పసి, పసిఁడి, పసిమి. పసిరిక, పసుపు, పెయ్యపెసర, పెసలు, పైకము. పైఁడి, పైద, పైదలి, పైరు-ఈ పదరాశి సమస్తము *పచ్-/*పజ్-అను ద్రావిడమూలధాతు జన్యము, పసిఁడి యనఁగా పసుపు పచ్చని లోహము ( = బంగారు) దీనితో చేసిన నాణెముల రాసియేపైకము అని మౌలికార్థము, కన్నడ. పయ్క, పైక; తమిళ. పయిక్కం.

41. బురగుండా : బాలుఁడు (కులకర్ణి. పు. 653).

<తె. బురుకఁడు = స్తనపాయి, బిడ్డఁడు; బురుక = పసిపాపఁడు, పోర గాఁడు. తెలుఁగు 'బరగేఁ' నుండి యని కులకర్ణి.

కన్నడ. పోర, శిశువు; తుళు. పోర, పోరె = బాలుఁడు; పోరి = బాలిక.

42. మాందీ ; గుంపు, సమూహము (జ్ఞా. 7-104; 8-56, 'ఈశ్వర నిష్ఠాంచీఁ మాందియలీఁ' 18-1775).

<తె మంది = జనులు, జనుల గుంపు; సేనా భాగము; మంది మార్బ లము; మంద = గుంపు, ఆలమంద, పసులమంద; కన్నడ. మందె = జనులు, పశువులమంద; తుళు. మందె = జనులు, పత్తుమందె = పది మంది, తమిళ. మంతై = గుంపు, తెలుఁగున మను, మనికి, మనికిపట్టు, మన్నిక. మంద, మంది-మొదలగునవి ఏకధాతు జన్యములు.

(సంస్కృత-మండ్ ( = శోభాయామ్) నుండి యని కులకర్ణి, పు 588; సంస్కృత, మండలిక (=సమూహము, రాశి) నుండియని తుల్పశే, పు. 234)

43. ముండ : 'విటిదాండు' ఆటలో మూఁడు (కులకర్ణి. పు 596) (ముజుందార్ పు. 85).

<తె. మూండు, మూఁడు. పూర్ణబిందు ఘటితోచ్చారణము ప్రచురముగా నుండిన కాలమున మరాఠీలో ప్రతిదేయమనుట స్పష్టము. 'పోండిగ నగజ తప శ్శిఖి–మూండు జగంబులను దీవ్రముగఁబర్విన బ్రహ్మాండముగాఁచిన గాంచన–ఖాండము క్రియఁ దాల్చెఁ దత్ప్రభా భాసితమై' (కు. పం. 6–158) కన్నడ. మూరు; తుళు. మూజి. తమిళం. మూన్రు = మూఁడు; మలయాళ. మూన్ను.

44. ముదలు : రూ. ముద్దల. మూలధనము (జ్ఞా. 8–25 'తైసేం మన వణ ముదల జాయో' ( = తాదృశమయిన మనస్థితి మొదలుసంచి)(మూలధనము) అగుచున్నది. పైది 5–157).

<తె. మొదలు : మూలధనము. సంస్కృత. ముద్రా శబ్దభవము కావచ్చునేమో యని పాంసే. పు. 41.

ముద్దల : చూ. ముదలు, మూలధనము. బండవలము, సంస్కృత. మూలద (?), 'మూలదేయమ్' మూలము కానోపునని కులకర్ణి. పు. 596.

45. యలమ్మా : రేణుకాదేవి, ఒకానొక గ్రామదేవత (కులకర్ణి పు. 607).

<తె. ఎల్లమ్మ : ఒకానొక గ్రామదేవత, ఎల్లలయందుండు పొలిమేర దేవత (?). ఎల్లయందును ( = అంతటను) కలదేవత; కన్నడమునుండి యని కులకర్ణి.

46. లేండ : 'విటిదాండు' ఆటలో రెండు (కులకర్ణి, పు. 635. ముజుందార్, పు. 85). మరాఠీలో హ్రస్వమగు ఎకారములేదు గావున దీర్ఘస్వరాది.

<తె. రెండు : కన్నడ. ఎరడు; తుళు. రడ్డు; రడ్డనె = రెండవు; తమిళ. ఇరంటు; మలయాళ. రండు. తెలుఁగు 'రేండ్' నుండి యని పీఠిక పు. 100 లోను, రోండూ నుండి యని నిఘంటు భాగము (పు. 635) నను కులకర్ణి నిర్ణయము. ఇట దంతమూలీయ తాడిత (alveolar flap) మగు రేఫము దంతమూలీయపార్శ్విక (alveolar lateral) మగు లకారముగాపరిణతము. 'రసోర్లశౌ' మాగధీ ప్రాకృతములో ప్రసిద్ధమగు ధ్వని పరిణామము. గుణ్ణం–గుల్లం,

రాను–లాను, రాఘ - లాఘ, రాములు - లాములు ఇత్యాద్యుచ్చారణము పిల్లల వాడుకలో ప్రసిద్ధము.

47 వకట : 'విటిదాండు' ఆటలో ఒకటి (కులకర్ణి, పు. 637, ముజుందార్. పు 85).

<తె. ఒకటి; వ్యవహారరూపము 'వకటి'; కన్నడ. ఒందు; త. ఒన్ఱు; మ. ఒన్ను.

వరకల : చూ. ఓరకల (Candy, పు 889).

48. వాళ : బహిష్కారము, జాతిభ్రష్టత (కులకర్ణి, పు. 655).

<తె. వెలి = కులబహిష్కారము. వెలిచవి, వెలివాడ, వెలివేయు, వెలిసంత, వెలుపల, వెలువడు, వెలువరించు, సంస్కృత. వృ-, వార-లు దీనికి మూలమని కులకర్ణి.

49. వైద : 'విటిదాండు' ఆటలో ఆఱు (కులకర్ణి, పు. 671; ముజుందార్ పు. 85) 'ఆర' అనఁగా ఐదును. 'వైద' అనఁగా ఆఱును అను నర్థములు తబ్బిబ్బు వలన నేర్పడినవి.

<తె. ఐదు = నాలుగు నొకటి. అజాదిరూపము హలాదియగుటయు అర్థవిపరిణామము కలుగుటయు మరాఠీ 'వైద' విశిష్టత.

వోరకల : చూ. ఓరకల (జ్ఞా. 17-405)

50. సజగురా : ధాన్యవిశేషము (కులకర్ణి. పు. 701).

<తె. సజ్జ+కొఱ్ఱ. సజ్జలు, కొఱ్ఱలు అను ధాన్యములు. సజ్జ, కొఱ్ఱ రాయలసీమలో ప్రచురమగు పంటలు.

# తెలుఁగునందలి కృతక ప్రామాణిక రూపములు

"యద్య దాచరతి శ్రేష్ఠః తత్త దేవేతరో జనః
సయత్ప్రమాణం కురుతే లోకస్త దనువర్తతే"

స్వల్ప సంఖ్యాకులు కావచ్చును గాక ప్రాఁత సంప్రదాయములను పునరుజ్జీవింపఁ జేయవలయుననియు ప్రాచీన ప్రమాణములను పునః ప్రతిష్ఠ సేయవలయుననియు ప్రాఁకులాడు పశ్చిమ బుద్ధులు సర్వదేశకాలములకు సంబంధించినవారు. పూర్వౌన్నత్యమును యథార్థీకరించుననెడి కట్టుకథలను, పుక్కిటి పురాణములను బిఁడ్లకెత్తి 'జారిన జాతి గౌరవము చక్కన దిద్దుటకై' కవులు ప్రజలను ప్రబోధించుట కూడ పరిపాటి. ఆ రంగ మీ రంగ మను వివక్ష లేకుండ అన్ని రంగములలో నీ ప్రాచీన వ్యవస్థా సముద్ధరణ సముద్యమ ప్రభావము ప్రసరించుచుండుట సర్వ సామాన్యము.

పరిణామము ప్రకృతికి నైజగుణము. మార్పు తాకిడికి అందరును తట్టుకొనుట కష్టము. క్రొత్త వాతావరణములో కొందఱకు ప్రాణములు లేచివచ్చిన పగిదిగా నుండును; అందే కొందఱకు ఉక్కిరిబిక్కిరిగా నుండును. క్రొత్తకు కొలువు సింగారమొనర్చుట కొందఱకు పరమావధి; ప్రాఁతకు పట్టము గట్టుట మఱికొందఱకు పవిత్రవిధి. ఒకఁడు పురోగామి; వేఱొకఁడు తిరోగామి. పురోగామి నూతన వ్యగ్రబుద్ధి; తిరోగామి ప్రాచీన పక్షపాతి. ఇట్లిరువురును ఏదో యొక మార్పుపట్ల అభిముఖ్యము కలవారు. ఎవరికి వారు ఉత్తమ సంస్కరణాభిలాషులు. రుచిభేదమునుబట్టి మతభేదము. అన్నివర్గముల యందును, అన్ని మార్గములయందును సంస్కారదృష్టి ఏనాఁటి కానాఁడు నిత్యనూతనము.

తమ సాంఘికస్థాయి యొక్క బహిశ్చిహ్నములను మెఱుఁగుపఱచికొను నిమిత్తము వ్యక్తి నామములను, సంఘ నామములను, కులనామములను, గోత్ర

నామములను సంస్కరించికొనుటకై జనులు ఏమి వెఱ్ఱిగా నెగఁబడు విశిష్ట మనస్తత్త్వ మీ సంస్కరణము నందలి యొక భాగము. ఈపాటి మార్పులతో తమ దైన్యమును హైన్యమును తొలఁగిపోవునని అల్పసంతోషులగు నీయమాయికజనుల వెఱ్ఱినమ్మకము. తమ కంటె ఉత్తమ సంస్కారులననపేక్షతో పైయంతరువు వారిని అనుకరింప నుబలాటపడుటయు. తమ కంటె అల్పసంస్కారులను నుపేక్షతో క్రింది యంతరువు వారి నీసడించుటకు వెనుకాడకుండుటయు జనుల సహజ మనోధర్మము. పూర్వోట్టంకితమగు గీతావాక్యమీ సందర్భమున నూటికి నూఱు పాళ్ళు నిజము.

ఇటు లొక తెగగాని. వర్గముగాని సభ్యప్రపంచమున తత్తత్కాలోచితముగా సమర్థస్థానమును సంపాదింప నుద్యోగించుటలో తప్పులేదుగాని సారాసారముల వివేచింపనేరక గొఱ్ఱెదాటుగా అంధానుకరణ మొనర్చి పైపై వన్నెల్పచరించెడి సమాజము పరిహాస భాజనము కాక తప్పదు. సాధారణముగా వేషభాషాదికముల పట్టుల నగరవాసులను జానపదులు, పండితులను పామరులు, శిష్టులను నగటు మానిసులు, పురుషులను స్త్రీలు, పెద్దలను పిల్లలు యథామతిగా ననుసరింప వ్యామోహపడుట సైతము సర్వవ్యాపకమయిన చిత్తవృత్తి. జనులు తమ భాషా వ్యవహార వైఖరులను మహాజన వ్యవహారానుసారులుగా- మక్కికి మక్కిగా- మలఁచికొన మనసుపడుటయు స్వాభావికము.

వాస్తవముగా పై యంతస్తు నందికొనఁ గలిగిన పట్టుల ప్రశస్తములుగాఁ గన్పట్టుట సరియక్కాని, అంది కొనలేని తావుల 'శతాంధాః కూపంప్రవిశన్తి' అను నాభాణకము చొప్పున అవహేళనముతో పాటు అనర్థములను తప్పనిసరి. అనుకర్తల అధికారమును బట్టియు, అనుకార్యముల యందలి అంతస్సారమును బట్టియు ఈ అనుకరణ ఫలము భాసించునని వెరసి తాత్పర్యము. భాషా వ్యవహారమున మహా చమత్కారమయిన ఈ పునరుజ్జీవనోద్యమ ప్రభుతను యుక్తి నిదర్శనాదులతో ప్రకటించుట ప్రకృత సమీక్షా వ్యాపారము పరమార్థము.

పూర్వాచార పరాయణములగు కొన్ని బ్రాహ్మణ శాఖల భాషా వ్యవహారములలో విశిష్టమాండలిక భేదములుగా పేరూనిన వింత వింత ఉచ్చారణరీతులు వీనికి కొన్ని ఉదాహరణములు. 'వేమయ్యా, వింద్రయ్యా వేబుళం పొగాను వెంతకు విస్పావు'- అని యిట్లు అజాదిరూపములను వకారాదులుగా మార్చి

'వ్రాత్రి వ్రాత్రి' యుచ్చరించుట ఈ యున్నత వర్గములవారి యలవాటు, 'వైదీకుల యింటి పిల్లి గూడ మ్రావు మ్రావు మం టుం'దని జాభియుక్తులు కొందఱు చమత్కరించుట కద్దు. ఇట్లే షకార ప్రాబల్యమును అగ్రహారీకులగు వైదికుల పలుకుబడిలో వరిస్ఫుటమగు వైశిష్ట్యము * నిరంతర వైదికవాణీ భాషణప్రవణతయు, సనాతన సంప్రదాయ పరిరక్షణ వ్యగ్రతయు వీరి యీ'బాణీ'కి కారణము కానోపు. ప్రాయికముగా పదాంత టకారస్థానమున షకారమును వాడుట వీరి యుచ్చారణ మర్యాదయందలి వైశేష్యము.

అషుబడి' యిషుబడి. నమలరాదషవో, నేనెష్టైనా పోయి, శివరాత్రి పుణ్యకాలము కాదషవే, పంచనదీశ్వరుని గుళ్ళోనష శహజి మహారాజు వచ్చినాడష. యోగ్యం డవషరా, అదేంషిరా, యెషెషో, నీకు ఒక పాలువాల దషరా, వింటివోషే జందేం బుచ్చక్క, ఔనషె తిప్పా వరుఖ యెల్లమ్మా, ఔనషో వదినగారు. పెండ్లి చేస్తున్నారష, కట్న విస్తున్నారష,... వేస్తున్నాడు మనోభవుండషి షుగా వేమారు నీవున్ననన్ చూస్తుం దానవు నీకు ధర్మమషవే... ఇత్యాదులు తంజాపుర యక్షగానములలోని వైదిక బ్రాహ్మణ పాత్రముల పలుకుబడులు

అవునషే నను వివాహము గమ్మ విద్వాంసు
రాలవయ్యెదవు శీతాంశు వదన (శుక. 1-500)

వేదముల్గడుఁ జదివిననోరు నీమోవి
యానినఁ గాదషే యబ్జవదన (పైది 2-477)

మొగమిషు ద్రిప్పవే ముద్దుగాను....
(అహల్యా సంక్రందనము 1-68)

అషు యిషు బోవకే యిషువుల చేనిన్ను
కుసుమాస్త్రిఁ దేచీని కట్టుపడుచ—

వాజపేయ ఫలంబు వనదషే యోయోష
యింద్రుఁడే మిచ్చిని యిషునిలువవె—

* Dr. Mahadeva sastry, Historical grammar of Telugu, Page-66.

మేము ఖంతలి మషే మీరు నేర్చినపాటి
యెరుగ మషే వేదమెల్లఁ జదివి—

అనుచు ఛాందసులగు సోమయాజి వరులు (పైడి 1-69)

ఆస్పేచూసివషేవొష్పె ఓస్పావజ్ఝలవారి బుజ్జినష అవిస్పాయికిస్పా ఋషే నిస్పం దెంతటివాడె యేళ్ళు పదిషే....' అను దాసు శ్రీరాములుగారి పద్యములోని వైదిక బ్రాహ్మణభాషా ప్రయోగవిన్యాసము పైదాని కనుప్రాసము. యథార్థమగు ప్రాచీనోచ్చారణ రీతిని అక్షరాల పాటించి అతిస్వచ్ఛముగా ఉచ్చరించుచున్నామని వీరి యుద్దేశము. జగదీశ జనార్దన మధుసూదన మల్లికార్జున సుదేష్ణ - ఈ వ్యక్తి నామములను క్రమముగా జగధీశ జనార్ధన మధుసూధన మల్లిఖార్జున సుధేష్ణ- అని మహాప్రాణవర్ణ ఘటితములుగా వ్యవహరించు నభ్యాసము కూడ నీకోవకు చెందినదే.

ప్రతిభాషయందును కాలక్రమమున కొన్ని ధ్వని పరిణామములు ప్రవర్తిల్లుట సర్వసాధారణము. పదాది పకార హకారములు లోపించి అజాది రూపములేర్పడుట, పదాది సంయుక్తత యందలి ద్వితీయ వర్ణమగు రేఫములు లుప్తమగుట, శకట రేఫ ఘటితములు సాధు రేఫ ఘటితములుగా వాడుకపడుట, ఇయాంతము లెదంతము లగుట-మున్నగునవి తెలుఁగునందలి కొన్ని ధ్వని పరిణామములు. పరిణత రూపములకంటె వాని ప్రాచీన రూపములే పవిత్రములని, ప్రామాణికము లని కొందఱ ప్రగాఢ విశ్వాసము. అందువలన వారు పరిణతరూపముల స్థానమున వాని ప్రాచీన రూపములను ప్రయోగించుటకౌత్సుక్యమును ప్రదర్శింతురు. నియమము సంస్కారార్థమని లాక్షణికోక్తి. నియమములను కల్పించుకొనుటలో,వానిని పాటించుటలో దోషములేదు. కాని నియమము పేర, సంప్రదాయము పేర అప్రమాణ రీతులను ప్రమాణీకరించుట భ్రాంతిమూలకము. ఇట్టిది Overcorrection లేక Hyper-urbanisam అని శాస్త్రవేత్తల ప్రకథనము. ఈ మేరకు ప్రమాణీకరింపఁబడిన భాషాపదములు కృతక ప్రామాణికములని శాస్త్రవ్యవహారము. ఒక యథార్థ రూపముకంటె మిక్కిలి నిర్దుష్టమను మిథ్యా బుద్ధివలన యేతద్యథార్థ రూపమును త్రోసి రాజు సేయునిచ్ఛతో పునర్నిర్మించిన రూపము కృతక ప్రామాణికరూపము (Hyper Form or super - standardised form) అని భాషాశాస్త్ర కారుల నిర్వచనము*

* Mario A. Pei, Dictionary of Linguistics, P. 94.

ఇట్టి సంస్కారణాభిలాషుల యనుకరణ పారవశ్యములో, ఆయా రూపముల పౌర్వాపర్య నిర్ణయోపకరణావిడిలో ప్రాచీనమేదో అర్వాచీనమేదో, ప్రకృతిసిద్ధమేదో, పరిణతరూపమేదో పరమ సూక్ష్మముగా పర్యాలోచించినం గాని వస్తుతత్త్వము నిదమిత్థమ్మని నిష్కర్షించుట కష్టసాధ్యము. వీని స్వరూప స్వభావములను అర్యవ్యవహారముల(దెలియుట శ్రేయమను మితభాషవాచోయుక్తి కేవలసత్యముకాదు ; కారణమీ యార్యజనులు సర్వజ్ఞులు కాకపోవుట ; భ్రాంతి లోక సహజము, విశేషించి 'ప్రమాదో ధీమతామపి' యథోత్తరముగా, సోపపత్తికముగా నీ యంశము లీ క్రింద నిరూపితము.

వ్యాకర్తల అలసత, అనవధానత, శబ్దార్థ సుస్వరూపానభిజ్ఞులగు గ్రంథ పరిష్కర్తల మిథ్యా పాండిత్యము, లిఖిత ప్రతులలోని వ్రాతప్పులు, ముద్రిత ప్రతులలోని ముద్రా రాక్షసములు - మున్నగు అనేకానేక దోషముల మూలమున కూడ నీ తబ్బిబ్బు ప్రవర్తిత మగుచుండుట గమనింపదగినది. పూర్వ పూర్వయుగములలోని కవిపండితుల మీది ప్రమాణ బుద్ధివలన ఉత్తరోత్తర యుగములలోని కవిపండితులు ఆయా ప్రయోగరీతులను యథాశక్తముగా స్వీకరించి ప్రయోగించుటయు నీకృతక ప్రామాణిక రూపముల ఉనికికి ఒక ముఖ్య కారణము. కొన్నింటిని అచ్చుతప్పులో, అసలు తప్పులో నిశ్చయించుట దుశ్శకము. చాలమట్టుకు నిర్ధారకములును, ప్రామాణికములును నయిన సుపరీక్షిత రూపములే ప్రకృత సమీక్షలో ప్రదర్శింపబడినవి.

కృతక ప్రామాణిక రూపములను అచ్చముగా విద్వద్వేశ్యుల విశ్వామిత్ర సృష్టియని వివక్షించుట పాక్షిక సత్యము. వ్యాకర్తలమాట యటుంచి, భాషా వ్యవహర్తలలో అక్షరశిక్ష నెఱుగని పామరులు మొదలుగా ఊహాపోహ విచక్షణులగు పండితులదాక వీని సృష్టిలో భాగస్వామ్యము గలవారే. మూఢులతో పాటు ప్రౌఢులుకూడ నీ విషయమున పాలు పంచికొనినవారనుట స్పష్టము, విపుల శబ్దశాసనులును, సత్సూక్తి శేఖరులును నగు విద్వత్కవులును, పరిశోధనలో తలలు పండిన పెద్దలును శబ్దార్థముల విదుష్ట స్వరూపజ్ఞానము నెడల భ్రాంతికి లోనగుచుండగా, ఉపరిశోధనలో ఉద్దండులయిన చిన్నల సంగతి చెప్పనక్కఱ లేదు.

ఈ కృతక ప్రామాణిక రూపముల ప్రయోగ యోగ్యతను గూర్చిన సందేహము తలయెత్తుట సహజము. 'ప్రయోగ శరణం వ్యాకరణ' మ్మనునది

భాషా విజ్ఞానవేత్తల దృష్టికూడ. భావప్రకటనావగాహనములే భాషకు ప్రాథమిక ప్రయోజనములు గావున వ్యవహారహాని కలుగనంతవరకు ఎట్టి భాషాప్రయోగ శక్తి నయినను సాధువుగాయంగీకరించుట వీరికిని సమ్మతము వ్యవహారహాని కలిగినప్పుడు మాత్రమది ప్రయోగార్హతను కోల్పోవుననుట విస్పష్టము. కృతక ప్రామాణిక రూపములు చాలావరకు లోక వ్యవహారమున రూఢములయి యున్నవి. కావున వీనిని గ్రామ్యము లనియో, అనింద్య గ్రామ్యములనియో పరిగణించి పరిహరించుట యుక్తి సహముకాదు. ఇవి అవశ్యము సుపరి గ్రాహ్యములే. వీని పుట్టుక భ్రమ ప్రమాదముల మూలమున సంభవించినదని స్పష్టపఱుచుటయే ఈ వ్యాసము నుద్దేశము. ప్రసిద్ధములును, పండితలోక వ్యవహార నిబద్ధములును నగు కతిపయ కృతక ప్రామాణిక రూపముల దిఙ్నిదర్శన మిది.

## 1. పదాది రేఫ ఘటితములు :

పదాదిరేఫ ఘటిత సంయుక్త వర్ణ నిర్మాణము ఆంధ్ర భాషావికాసమున విశిష్టపరిణామము.

క్రొత్త-కొత్త, గ్రద్ద-గద్ద, త్రాడు-తాడు, ద్రొబ్బు-దొబ్బు, ప్రొద్దు-పొద్దు, బ్రతుకు-బతుకు, మ్రొక్కు-మొక్కు, వ్రేలు-వేలు అని యిట్లు పదాది సంయుక్తత యందలి ద్వితీయవర్ణమగు రేఫము లుప్తమగుట అర్వాచీనాంధ్ర భాషా లక్షణము, శ్లేషనిర్వహణ పారవశ్యమున ప్రయుక్తమయిన "మునలి మానుల్" (వసు ౧-౪౫) అను ప్రయోగము నందలి "మాను" "మ్రాను" నకు పరిణత రూపము. అంగుళియను నర్థముగల "వ్రేలు" శబ్దమునకు రూపాంతరముగా "వేలు" శబ్దముగూడ కొన్నినిఘంటువులు గ్రహించుట గమనింపదగినది. (చూ వేంకటేశాంధ్రము, మానవవర్గు-౩౭; సాంబనిఘంటువు మానవ వర్గు-౧౭). కాని క్రీడి, క్రోవి, ద్రోవది, ప్రతిన, వ్రేడు మున్నగు తద్భవముల యందును, త్రాసు మున్నగు అన్యదేశ్యముల యందును రేఫము లోపింపలేదు. 'వ్రణము' వ్రాయు వ్రేపల్లెలలోని తొలి వ్రాయి యగు వకారము లోపించి రవర్ణము శేషించుట విశిష్ట ధ్వని పరిణామము. పైన పేర్కొన్న పదముల జంటలలో రేఫరహిత రూపములకు రేఫఘటిత రూపములు మూల మాతృకలు. నిసర్గముగా రేఫఘటితములుకాని కొన్నిపదములను రేఫఘటిత

ములుగా భావించి సృష్టించిన కృతక ప్రామాణిక రూపములు పెక్కులు. శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారీ విషయముల చేసిన వ్యాఖ్యానము పేర్కొనఁదగినది.

'చిన్నయసూరి మొదలయిన దక్షిణాది తెలుఁగుపండితులు వ్రేల్చు (= హోమము చేయు), త్రోలు, త్రావు, వ్రేయు (= వైచు) అని లేనిరేఫము చేర్చి ప్రయోగించినారు. మహాకవులు 'వేల్చు' అనే శబ్దము 'వే' ప్రాసస్థానమందుంచి ప్రయోగించడము ఎరుగుదుము.

క॥ పావకునకు నభిమంత్రిత
మై వేల్వఁగఁబడిన హవ్యమధిక....

(హరివం. పు. ౮-౯౩)

క॥ కావున నిత్తను వనలము
లో వేల్చెదననిన విని యులూచివలికె....'

(జై. భా. ౯-౬౬)

నన్నయాది ప్రాచీనకవుల ప్రయోగములున్నవి; కాని ప్రాస స్థలమందు లేవు గనుక చూపించలేదు. చూ. శ. ర. వేలుచు, అట్టి స్థలమందీ 'వ్రే' గల శబ్దము కనబడేదాఁకా 'వ్రేల్చు' సాధువని అంగీకరించలేముగదా' (బాలకవి శరణ్యము, ద్వి. ము. ౧౯౫౮ పు. ౨౩౪)

పెక్కు లక్ష్యములు బహువారములు సావధానముగాఁ బరిశీలించిన చిన్నయసూరి వంటి లాక్షణిక చక్రవర్తియే యీ భ్రాంతిలో పడఁగా తక్కిన వారినిగూర్చి తడవనక్కఱలేదు. మచ్చునకు త్రావు, త్రుళ్ళు, త్రెగు, త్రోయు, ద్రిండు, ద్రుడ్డు, ప్రక్క, వ్రేల్చు, శ్రీ కుసుమ మున్నగు కృతక ప్రామాణిక ముల యనువర్ణన మీ దిగువ ప్రదర్శితము.

౧. త్రావు < తావు. స్థానమని యర్థము 'ఈ యెలుక యిక్కడ నొక లాఁగ త్రావుచేసికొని' (నీతిచంద్రిక, పు. ౨౭) 'ఈ త్రావు తాతముత్తాతలు సంపాదించిన కొణాచిగాదు' (వైది. పు. 30)[1]

1. < ఈ సంకేతము మొనవైపున నున్నది. జన్యరూపమనిగాని, పరిణత రూపమని గాని అర్థము.

౨. త్రుళ్ళు < తుళ్ళు. ఎగిరిపడు, గర్వించు; ఎగిరిపాటు, గర్వము. రేఫ ఘటిత మనుటకు నిర్ధారక ప్రయోగములు లేవు. సజాతీయ ద్రావిడ భాషలలోని జ్ఞాతిపదావళి (cognate words) యందును రేఫము కానరాదు. 2

౩. త్రెగు, త్రెంచు < తెగు, తెంచు. 'చిత్రాంగుని బంధనములు త్రెగఁ గొఱికి' (నీతిచంద్రిక పు. ౩౮) 'ఉచ్చు త్రెంచుకొని' (వైది. పు, ౪౨) 'ఇంచుకచ్ఛత్వగా గ మంబులు పరంబులగునపుడాగమాదేశ లోపంబులు పెక్కు దెఱంగులం గానంబడియెడి' (బాల వ్యా. క్రియా. సూ. ౮౮) సూత్రముక్రింద లక్ష్యములలో త్రెగు - త్రెంచు- త్రెంపు లుదాహృతములు. బాలవ్యాకరణ వ్యాఖ్యాత లందఱు గూడ నీ రూపముల నంగీకరించుట పరిశీలనార్హము. తెగు, తెంచులు క్రమముగా తెగు, త్రెంచులకు రూపాంతరములని శ. ర. పేర్కొనుట అవిచారిత రమణీయము. (చూ. శ. ర ప్రథమ ముద్రణము ౧౮౮౫, పుటలు ౪౮౦, ౪౯౨, ౫౯౯) అది సంయుక్త రేఫములు లోపించెననుటకు శ్రీ చిలుకూరి నారాయణరావుగారు తెగు తెంచుల నుదాహరించుట ప్రామాదికము (చూ. ఆంధ్ర భాషాచరిత్రము. ప్ర. సం. పు ౨౮౬) రేఫఘటితములనుటకు నిర్ధారక ప్రయోగములు మృగ్యము; వ్యుత్పత్తిపరముగా చూచినను రేఫము కన్పట్టదు.

౪. త్రోము < తోము మురికిపోవునట్లురుద్దు. 'చంద్రబింబముకాంతి సవరించి యా లేమ మోమును నునుపుగా ద్రోమిరొక్కొ' (భోజరా ౩-౨౪) ఈ పాఠము చిన్నయసూరి నిఘంటూట్టంకితమని సూ. ని సంపుటము ౪. పు. ౧౯౫ 'త్రోమిరొక్కొ' యని ముద్రితపాఠము. రేఫ ఘటితమనుటకిది నిర్ధారకముకాదు. 'అకవర్ణకంబు మాఱ్వాదులకగు (బాలవ్యా. కృదంత సూ. ౧౯. అను సూత్రము క్రింద 'త్రోము-త్రోమకము'లు లక్ష్యీకరింపబడుట శాస్త్ర విరుద్ధము. 'తోము-తోమకము అను సవరణములు సరికావు, అనివంతరాం వారి పత్రాసి (ఘంటాపథవ్యాఖ్య పు. 373) ఆయా పాఠముల సాధ్వసాధుతల నిర్ణయాధికారము వినా చిన్నయ సూరివి కాదుకదా ఏ కవి పాఠములను దిద్దుట కెవరికిని హక్కులేదు.

---

2. This is a clear case of hyper standardisation in Telugu by introducing an r in the form (Dr. Bh. Krishnamurthi, Telugu Verbal Bases P. 399).

చిన్నయసూరి ఉదాహరణములను సవరించుట తప్పు, ఈ రూపములు తప్పులని వివరించుటొప్పు. రేఫఘటిత మనుటకు బలము చాలదు, జ్ఞాతిభాషలలో ఇప్పట్టుల రేఫరూపము కానరాదు. దీనినిగూడ కృతక ప్రామాణిక రూపమనుట లెస్స. ఈ రేఫఘటితరూపమును శ. ర. కారుఁడు స్వీకరింపకుండుట గమనింపఁదగినది.

౫. ద్రిండు <దిండు = తలగడ. దట్టి, చుట్టు, పదాది రేఫఘటితమనుటకు నిర్ధారక ప్రయోగములు లభ్యము కాలేదు వ్యుత్పత్తి పరముగా 'దిండు' ప్రాథమిక రూపము.

౬. ద్రుడ్డు < దుడ్డు=ముద్గరము '....ఆ లెంకలినుప ద్రుడ్లుగుదియలఁ బిడికిళ్ళ రోకళులను' (అచ్చ. రా. యు ౨-౨౭). ఇచ్చట పదాది రేఫ నిర్వాహము నిరాధారము.

౭. ప్రక్క <పక్క = పార్శ్వము. వైపు. ప్రాకృత, పక్ఖ-; సంస్కృత, పక్ష - 'సిఖిల ప్రపంచంబు నిక్క మీతని డొక్క ప్రక్కకుమెతుకు మాత్రమ్మ సుమ్మ. (పాంచాలీ పరిణయము, ౨ - ౨౭,) శ. ర. (౧౮౮౫) లో పక్క, ప్రక్కలు రూపాంతరములుగా ప్రదర్శింపబడినవి. వైకృతదీపికలో పక్క (పు ౭౦) ప్రక్క (పు ౮౧)లు రెండును పక్షశబ్ద భవములుగా నిరూపితములు. శ్రీ చిలుకూరివారు: ప్రక్కయే ప్రాచీనమనియు 'పక్క' పరిణతరూపమనియు భావించుట సరికాదు. (చూ. పు. ౨౮౬) పక్కయనియే నీతి చంద్రికా ప్రయోగములు. 'ఒక పక్క కొదిగి నిలుచుండి' (పు ౬౩) 'పక్క వెనుకలు కలయం జూచి' (పు. ౭౯) 'చెఱియొక పక్క ముక్కొనంగరచికొని' (పు. ౯౭)

౮. ప్రేల్చు < వేల్చు = హోమముచేయు. వేలిమి వేల్పు మున్నగునవి. 'వేల్చు' ధాతు జన్యములు, 'ఇమివర్ణకఁబుకలుగ్వాదులకగు' (బాలవ్యా. కృదంత సూ. ౪.) సూత్రము క్రింద నీఁబడిన 'ప్రేలుచు-ప్రేలిమి, శబ్దములు కృతక ప్రామాణికములు వేలుచు-వేలిమి అని వజ్ఝల వారి బాలవ్యాకరణోద్ద్యోతపాఠము (చూ. పు. ౪౪౦) 'వేలుచు వేలిమి' అనియే యుండ దగునని వంతరాం వారి వ్యాఖ్యానము (చూ. పు ౪౬౭) సూ. ని - ప్రదర్శించిన రేఫఘటిత ప్రయో

గములు నిర్ధారకములు కావు. లేఖక ప్రమాదములు, ముద్రా రాక్షసములు, వస్తుతత్త్వమును తారుమారు చేయఁజాలవు. శబ్దాలంకార తత్పరత్వమున గూర్పబడిన 'శ్రీలిమ గలుగఁగముదముల శ్రీలిమి గుబసవల శ్రీలిమొనర్పన్' అను ముకుందవిలాసపద్య భాగము (౩-౨-౨౯౬) నిర్ధారకము; కృతక ప్రామాణికము (చూ. బాలకవి శరణ్యము, పు. ౨౩౪.)

౯. శ్రీ కుసుమ <సికుసుమ = (C—కుసుమ. వడ్లరకములలో నొకటి కుసుమ. కుసుమలతో నవాంతర భేదము C-కుసుమ MTU 19(మార్టేరు ౧౯వ నెంబరు కుసుమ) రకము పరిశీలకుల పరిగణనమున C- కుసుమ. శ్రీ కుసుమ. అని కోస్తామండలముల వాడుక (చూ. మాండలిక వృత్తిపదకోశం, సంపుటము ౧ పు ౩౦౯). C- కుసుమను శ్రీకుసుమగా వాడుట కృతకము సీరాము - శ్రీరామ, సివాలచ్మి, సీమాఁలచ్మి-శ్రీ మహాలక్ష్మి. సీనయ్య - శ్రీనివాసయ్య - ఈ జంటలలోని ధ్వని పరిణామమునందలి సాదృశ్యము ననుసరించి C—కుసుమకు శ్రీ కుసుమ కృతకముగా కల్పితము.

౧౦. ఇంకను ద్రయ, ద్రేహము, బ్రందిఖానా, బ్రెందుకు - మొదలయిన కృతక ప్రామాణిక రూపములు వాడుకలో నున్నవి. 'తమవంటివారి ద్రయ వల్లగురూ,' 'ద్రేహం గాజుకుప్పె' 'ద్రేహంలో వుండేది. పరమాఁత్మ', 'తెలిసినట్టి వారి ద్రేహంబులందును' ఇవి కన్యాశుల్క నాటకములో దుకాణదారుని వ్యవహారములు. 'బ్రెందునాకై నుంఛీనావో బ్రంధిఖానాలో' అను దాసరులపాట తెలుఁగునాట ప్రసిద్ధము. తెలుఁగునందలి మార్మిక తాత్త్విక గేయరచనములనిట్టి ప్రయోగము కోకొల్లలు.

## 2. ఎదంతము లియాంతములగుట :

తెలుఁగునందలి ఇయాంతములగు శబ్దములు చరిత్ర మిట ప్రసక్తము, కంటియ-కంటె, గడియ-గడె, చేడియ - చేడె' దీవియ-దీవె, పట్టియ - పట్టె బూమియ--బూమె, మల్లియ-మల్లె, వన్నియ-వన్నె, సాలియ-సాలె ఈ జంటలలో ఇయాంతములు ప్రాక్కాలికములు. ఎదంతములు ర్వాక్కాలికములు. మలిరూపములు తొలిరూపములకు పరిణత రూపములు, తొలి రూపములు

క్రమముగా ప్రాకృతములోని కంటి ఆ, ఘడిఆ, చేడిఆ, దీవిఆ, పట్టిఆ, భూమిఆ, మల్లిఆ, వణ్ణిఆ, సాలిఆ, లనుండి నిష్పన్నములు. సంస్కృతమునందలి కంఠికా, ఘటికా, చేటికా, దీపికా, పట్టికా, భూమికా, మల్లికా, వర్ణికా, శాలికా, – లు వీనికిమూల మాతృకలు ఇట్లు ఇయాంతములగు తద్భవ పదముల కన్నింటికిని తెలుఁగున నెదంత రూపములు గన్పట్టుచున్నవి. ఇట్లు ఎదంతము లన్నింటికి ఇయాంతము లుండుటను భ్రాంతివలన తెలుఁగున శుద్ధదేశ్యములును నిసర్గముగా నెదంతములును నగు. తేనె, నూనె, పదములకు కృతక ప్రామాణికములుగ తేనియనూనియ వంటి ఇయాంత రూపములు సృష్టింపబడినవి. ఈ దేశ్యపదములలో ఎదంతములే ప్రాచీనములు కావున జన్యపదములు (derivatives) వీనిమీఁదనే అత్యధికముగ రూపొంది పెంపొందినవి. 'తేనె' యను ఎదంతరూపము మీఁద సుమారు పాతిక జన్యపదములును, 'నూనె' యను పదముమీఁద ఆఱు జన్యపదములును కావ్యాదికముల గోచరించుచున్నవి అర్వాచీనములును, కృతక ప్రామాణికములును నగు తేనియ, నూనియల మీఁద ఒండు రెండు జన్యపదములు మాత్రమే కన్పట్టుచున్నవి.

కృతక ప్రామాణిక రూపములయిన తేనియ, నూనియలు పండ్రెండవ శతాబ్దినుండి లభ్యమగుచున్నవి. 'కామియ బోయుడు ఆచంద్రార్కంబు నూనియ నతిపంగలవారు' (ద. హిం. శా. సంపుటి ౫ సంఖ్య ౧౦౨౩. క్రీ. శ. ౧౧౧౮) 'తేనియ మునుకో యమృతపు వానయొ' (కు. సం. ౯-౩౬) 'అతఁడు త్రైలాక్యంగ మడిగినఁ బతి గమ్మ నూనియఁ దెప్పించిమేను శిరము నభ్యక్తములు సేయ —' (భారత - అను. ౨-౩౦౮) 'ఉన్నత. తరువెక్కి జున్ను సేకుఱఁ గొనితేనియ యాననివాని భంగి' (భారత, శాంతి ౧-౬౪) 'తేనియయుఁబచ్చి డివల' (విజ్ఞానే. ఆచార. ౮౯) 'తేనియఁబడ్డ యీఁగ గతి ధీరతఁ గోదడిక్కు. (దశకు. ౬-౩౦) 'తేనియ కాలువల్ తెరలిపాఱ' (విక్రమా. ౧-౮౯).

తేనె నూనెల మీఁద నేర్పడిన జన్యపదముల కాకరములను కావడింపవచ్చు. వ్యుత్పత్తిపరముగా సయితము తేనె-నూనెలు ప్రాచీనములని ధ్రువపడుచున్నది. తీ + నెయ్ = తీయని చమురనియు, నూ + నెయ్ = నూవులనుండి తీసిన చమురనియు అర్థము. ద్రావిడభాషలలో నెయ్ అనఁగా చమురు. తమిళ

మున తిమ్ = తీయని; తేమ్ తీవు = తీపి: తేన్, తేనెయ్ = తేనె, కన్నడమున జేను, తేను = తేనె; మళయాళమున తేన్: తుళు తీపెశీపె = తీపి; కోలామి నాయకి భాషంలో తేనె.

## ౩. తాలవ్య వ్యంజనముల మీఁది తాలవ్యేతర స్వరములు తాలవ్య స్వరములగుట

తెలుఁగునందలి చవర్గీయ ధ్వనులు తాలవ్య స్పృష్టోష్మములు. వీని మీఁద తాలవ్యేతర స్వరములు (అ, ఆ లు) వచ్చినప్పుడు అవి తాలవ్యస్వరములకు ఎ, ఏలుగా మాఱుచున్నవి.

౧. చేదస్తము < చాదస్తము < ఛాందసము. ఛాందసమనగా ఛందస్సంబంధి. ఛందస్సనఁగా వేదము. వేదము చదివినవారి గుణము ఛాందసము. దీని వ్యావహారిక రూపము చాదస్తము. వాస్తవముగా నొకవ్యక్తి నిశ్చఁదుఁడయినను సనాతనాచారపరాయణ ప్రవణత్వమున ఛాందసుఁడనీ ఛాదస్తుడనీలోకవ్యవహారము. మిశ్రబ్రౌణ్యమున ఛాదస్తమనఁగా వెఱ్ఱితనమనియు, జడత్వమనియు వివరింపఁబడినది '(చూ. పు. ౩౫) ఛాందసుఁడనఁగా బ్రహ్మయనియు' అమాయకుఁడనియుకావ్యప్రయోగములు. 'సారథి ఛాందసుండు బడిసాఁగదు. చక్రయుగంబు...' పాండు (౧-౧౧౫) ఇట ఛాందసుఁడనఁగా బ్రహ్మ మందుఁడనియు, జడుఁడనియు కవివ్యంగ్యోక్తి. ఈ తబ్బిబ్బుల కప్పల తక్కెడలో తాలవ్యస్వరములు తాలవ్యేతర స్వరములుగాను మాఱుట పరిశీలనార్హము. మౌలికముగా తాలవ్యస్వరఘటితములయిన చేట, చేత, చేఁప, చేయంగల వంటివి క్రమముగా చాట, చాత, చాప, చాయంగల-గా వాడుకపడినవి. (చూ. విలియం బ్రౌను నిఘంటువు, పుటలు ౮౩, ౮౫)

౨. చేరు < చారు = మిరియాలు మున్నగువాని పొడిచేర్చి కాఁచిన చింతపండి రసము. ఇది సంస్కృతము నందలి సారశబ్ద భవము తెలుఁగు నిఘంటువులలో చారు చేరు-లు రెండుకూడ స్వీకరింపఁబడినవి. కాని నిర్ధారక ప్రయోగములు మృగ్యము. తాలవ్యస్వరఘటిత రూపము యుక్తముగాఁదోఁపదని శ. ర. కారుల యభిప్రాయము. ఈ చేరు నెవరు తయారుచేసిరోకాని దీనిని

గూర్చిన రుచిభేదములు పండితలోకమున బహుధా విప్రతిపత్తిధీకలితములుగా వెలసినవి. (చూ. దీపాల పిచ్చయ్యశాస్త్రిగారి సాహిత్య సమీక్ష, పుటలు ౧౨, ౨౧ నిడదవోలు వేంకటరావు. శ. ర, సవరణలు : వివరణలు, పుటలు ౪౩౭, ౪౩౯).

౩. జెలగ < జలగ. '....జెలగలు గఱచుటయుఁ జావుఁ జేటొదవు....' (వ్యా. ౯-౩౨) ఇది ప్రాకృతము నందలి 'జలూగా' శబ్దభవము. సంస్కృతము నందలి జలూక - దీనికి మూల మాతృక, ఇట్లే తెలుఁగు నందలి చెత్త, చెరవము చెలగము సమీపమాతృకయగు ప్రాకృతమునందలి చెత్త సరావ, సలగ - శబ్దభవములు త్యక్త, శరావ, శలక యను సంస్కృతపదములు వీనికి మూల రూపములు.

## 4. సాధురేఫములు శకటరేఫములుగ పరిణమించుట :

ప్రాచీనాంధ్రము నందలి శకటరేఫఘటితరూపములు అర్వాచీనాంధ్రమున సాధురేఫ ఘటితములుగా మాఱుట ఒక ధ్వని పరిణామము. కొఱకు - కొరకు, జాఱు - జారు, మాఱు - మారు ఈ జంటలలో మొదటివి ప్రాచీనములు. తరువాతవి అర్వాచీనములు. ధ్వని పరిణామ పక్కనిబట్టి పై జంటలలోని మలిపదములు తొలిపదములకు పరిణత రూపములు. ఇట్టి ధ్వనిపరిణామము ప్రవర్తితమయిన తావుల మలిపదమునకు మూలరూపము శకటరేఫ ఘటితము. నిసర్గముగా సాధురేఫ యుక్తములగు పదములను శకటరేఫ ఘటితములుగా మార్చి వ్యవహరించుట కూడ తెలుఁగున కలదు. 'ఆంధ్ర వాక్యముల యందుఁ బాదుకొనిన దీర్ఘముల మీఁది బండిఱాల నుదాహరించుచో అప్పకవి పేర్కొన్న బాజాఱీ, ఱేవు, స్తొన్నాఱీ, కోటబుఱుజు, హజాఱము - (అప్పకవీయము. ౨౧౯౨)- మున్నగునవి వ్యుత్పత్తిపరముగా శకటరేఫయుక్తములు కావు. తత్త్వాసక్తుల పరిశీలనము కొఱకు కొన్ని మాదిరిపదము లీ క్రింద నిరూపితములు.

౧. అసివాఱు < అసివారు. సవారి, సవారీ మార్గము. 'అసివాఱు తిరుగు' (కాశీ. ౪-౧౯౪) 'అసివాఱుగా నేఁగునట్టి బయలు' (మను. ౧-౧౧) అసి ( = అల్పార్థకము) + పాఱు ( = పరుగెత్తు), అసివాఱు = మందగమ

నము అను నిఘంటుకారుల విలుపుగాని, వివరణముగాని శాస్త్ర[illegible] కోసెఁడు దూరము. (శ. ర. ౬౫; లక్ష్మీనారాయణీయము, [illegible] ౧-౩౬౧; వావిళ్ళ, ౧-౨౧౩) సవారి, సవారులు, స్వారి, స్వా[illegible] [illegible] నవి తెలుఁగున ప్రచురములు, పారసిభాషలో 'సౌర్' అను [illegible] 'అస్వార్' దీనికి మూలము, శకటరేఫ ఘటితమనుట [illegible] (చూ. శ్రీనాథయుగము-అన్యదేశ్యములు, ఆంధ్రప్రదేశ్ పత్రిక, [illegible] పుటలు ౬౦౬౧).

౨. పైజాలు < పైజారుపాదరక్షలు, 'పయిజాలు, దీని రూపాంతరముగా ప్రదర్శితము. పై + జాలు అని దీనిని అనుచిత విభాగ మొనర్చు[illegible] శకట రేఫము సందుచేసికొనినట్లున్నది. ఈ విలుపుకాని, [illegible] [illegible] కించుటగాని సరికావు. ఇది అన్యదేశ్యము. పారసిభాషలోని '[illegible]' దీనికి మూలరూపము. పాయ్ అనఁగా పారసిలో పాదము. పాయ్‌పోష్ అనఁగా పాదములను ఆచ్ఛాదించునవి.

౩. బాజాలు < బాజారు. అంగడి వీధి. 'బాజాటి [illegible]' (ఆప్ప. ౨-౧౬౭) శకటరేఫఘటిత మనుటకు నిర్ధారక ప్రయోగములు [illegible]. 'బజాను' దీని రూపాంతరము. విపణియను సర్థముకల పారసి [illegible]లోని 'బాజార్' దీనికి మూలము, ఉర్దూ, హిందీ భాషలలో కూడ ఇదే [illegible] 'బాజార్' వ్యవహృతము. మన నిఘంటుకారులిది ప్రచార / [illegible] శబ్దమని నిర్ణయించుట అశాస్త్రీయము. (చూ. వైకృతదీపిక, పు. [illegible], [illegible] కవీయము, పు. ౬౯ సూ. ని. ౫-౧౦౪౬)

౪. బురుజు < బురుజు, కోట కొత్తళము మూల దిబ్బ. కావ్య ప్రయోగములలో శకట రేఫము కానరాదు. ఇది అన్యదేశ్యము. [illegible] పారసీ భాషలలోని 'బుర్జా' దీనికి మూల మాతృక. 'బుర్జ్' అని ఉర్దూ, హిందీ భాషా రూపములు.

౫. మైజాలు < మైజారు. అఁడుదాని కట్టుకొంగు. శ్రీనా[illegible] చాటువు [illegible]లో తడిసినది మైజారు కొంగుకాని మైజాలు కొంగుకాదు. మై ( = మేను,

శరీరము)+జాలు; ఒడలినుండి జాలువస్త్రము. ఇది మన పరిశీలకుల కత్తిరింపు. కాని ఇదికూడ అన్యదేశ్యము. పారసిలో మొలకు కట్టుకొను వస్త్రము అను నర్థముకల 'మిజార్' దీనికి మాతృక,

౬. ఱేవు < రేవు. నద్యాదులలో దిగుట కేర్పఱిచిన దారి, ఘట్టము. 'ఱేవు దాఁటి చెంచుఱేని నచట' (అచ్చ. రా. అయో. ౧౦౧), 'ఱేవులుగా నతని తల గొఱిగి పోవిడిచెన్' (వి. పు. ౮-౬౩). ఈ నిర్ధారక ప్రయోగముల మూలమున 'ఱేవు' కృతకప్రామాణిక రూపము దీనికి మూలమగు 'రేవు' శుద్ధ దేశ్యము. తెలుఁగున విడిది, స్థానము, స్థిరము అను నర్థములుగల 'ఇరవు', 'రేవు' నకు పూర్వరూపము. 'ఇరవు' నందు వర్ణవ్యత్యయము కలుగఁగా 'రేవు' సిద్ధించినది. తక్కిన సోదర ద్రావిడ భాషలలోని సామగ్రి వలనను దీనిని స్పష్టపఱుపవచ్చు. తమిళమున 'ఇరు' అనఁగా ఉండుట, ఇరుప్పు అనఁగా స్థానము, నివాసము అని వ్యవహారము. కన్నడము నందును అస్తిత్వము, ఆశ్రయము- అను నర్థములతో 'ఇరవు' శబ్దము ప్రచురము. మలయాళము నందు ఇరిప్పు అనఁగా నివాస స్థలము.

౭. వఱకు < వరకు. మేర, హద్దు, దాఁక. ఇది శుద్ధాంధ్ర దేశ్యపదము. నిర్ధారక ప్రయోగములు మృగ్యము. ముద్రిత ప్రతులలోఁ గన్పట్టు శకట రేఫ ఘటిత పాఠములు ప్రామాదికములు.

క॥ దేవరకంటెను మించునొ
దేవరకు సమానుఁడగునొ తెలియఁబడదు మే
మీవర కావిభుఁ బోలిన
భూవరుఁగని యెఱుఁగమనిన బుద్ధి చలింపన్.

(ఉ. రా. ౩-౨౨౬)

క॥ కావరమునఁ గానవు నీ
కా వర మఱఁడిచ్చె ననుచు నది చెల్లెను నీ
కీవరకును విడువు మిఁకన్
నీ వరదర్పము నణంగ నేఁడు మృగాంకా.

(శశాం. ౨౬౧)

మీఁది పద్యములలో మూఁడవ పాదములోని ఈ వరకును అప్పకవి ద్విప్రాస చమత్కారముచే సాధురేఫ ఘటితమని విశ్వసించుట సుసంగతము దీనిని శకట రేఫ ఘటితముగ మార్చుట పరిష్కర్తల కొలమాలినపని. వ్యుత్పత్తిపరముగా 'వరకు' ప్రామాణికరూపము: 'వఱకు' కృతకము. ఈ సందర్భమున ఇతర ద్రావిడ భాషలలోని జ్ఞాతిపదములుకూడ పరిశీలనార్హములు. తమిళము, వరంపు. చేనిమేర, వరై, గట్టు, ఒడ్డు, వరైప్పు, మేర, సీమ, గోడ, కన్నడము, వరి, వరె, హద్దు, అవకాశము, దనుకి, మలయాళము. వరువర, చదరంగపుగడి: వరు, హద్దు, అంచు, ఈ 'వఱకు' తల్లి గండానబుట్టిన తనయ. తక్కిన కృతక ప్రామాణిక రూపములయెడ మాతృకలుకూడ పుత్రికలతోపాటు నిలచియుండగా ఇది పుట్టి మాతృకయగు 'వరకు'ను మ్రింగి వేయుట వింత. పట్టుదలగల పెద్దల వ్రాఁతలలో 'వఱకు' తప్ప వరకు చూపట్టదు. ఈ పెద్దల చూపులో 'వరకు' గ్రామ్యము అగ్రామ్యము

౮. సొన్నాటి <సొన్నారి. స్వర్ణకారుడు. బంగారు పనివాడు అప్పకవి దీనిని శకటరేఫఘటితమనుట కాధారము దురూహము. ఇది ప్రాకృత భవము. శకటరేఫము తత్సమ తద్భవములందు లేదను సూరిమతము మాకును సమ్మతము. ప్రాకృతమున సుణ్ణయార, సుణ్ణార, సొన్నయార, సొన్నార, సోణార – అను రూపములు కలవు. అపభ్రంశ అర్ధ మాగధీ ప్రాకృతములలో సొణ్ణార శబ్దము ప్రచురము. సువణ్ణకార శబ్దము పాలీ భాషలోని వాడుక. సంస్కృతము నందలి స్వర్ణకార శబ్దము వీనిన్నింటికి మూలము.

౯. హజాఱము <హజారము,ముఖశాల. అజారము, ఆజారము. హోజారము అనునవి రూపాంతరములు, ఇది అన్య దేశ్యము. శకటరేఫ ఘటితముగా స్వీక రించుట కృతక ప్రామాణికము. 'హజాఱంబులోన' (అప్ప. ౨-౧౯౩). ఆంధ్ర పద పారిజాతము (పు. ౭౯౦) నందును లక్ష్మీనారాయణీయము (పు ౮౨౦) నందును శకటరేఫఘటిత రూపమే ప్రదర్శింపఁబడినది. దీని మూల మాతృక పారసికభాషాపదము. పారసిలో 'హా జ ర్' = సన్నిధినుండు, సేవకుసిద్ధముగా నుండు; హాజిరాన్. హాజరీ = సభ్యులు సభాస్తారులు: హుజూరా = కొలువు కూటము

### 5. అజాది పదములు వకారాదులుగా మాఱుట.

పూర్వాంధ్రమునందలి వకారాది రూపములు అనంతరకాలమునను, అశక్తుల వ్యవహారమునందును అజాదులుగా మాఱిపోవుట కలదు. వాఁడు ఆడు, వీలు-ఈలు, వెద-ఎద, వెక్కిరించు-ఎక్కిరించు. వేడి-ఏడి మున్నగునవి మీఁది ప్రతిపాదనమున కుదాహరణములు. ఉఱు. ఉపతి. యిందాము. యేగ, యేదాలు మున్నగు వకారలుప్త రూపములు తన కాలమునాఁటి గ్రామ్యపదములని మూలఘటిక కేతన తన ఆంధ్రభాషా భూషణమున పేర్కొనుట గమనింపదగిన యంశము. (చూ. ఆంధ్రభాషా భూషణము. దివ్యప్రభాప్రకరణము పుటలు ౩-౨౩౪) పై యుదాహరణములలోను, కేతన వివరణములోను నిరూపింపబడిన అజాది రూపములకు వకారాదులు మూలమూర్తులు, ఈ సాదృశ్యమును దృష్టి యందిడికొని సహజముగా అజాదులగు రూపములకు కృతకముగా సృష్టింపబడిన వకారాదులు లోక వ్యవహారము నందును, కావ్యలోక వ్యవహారము నందును ప్రత్యక్షమగుచున్నవి

సామాన్య జనుల వాడుకలోనివిల్లు (ఇల్లు) వెంద (ఎండ), వెంత (ఎంత)లను, వైదిక బ్రాహ్మణ వ్యవహారములోని వింద్రయ్య. వేఱుకం, విస్సావు,-మున్నగు రూపములును కొన్ని ఉదాహరణములు. అజాది రూపములగు ఎలుగుగొడ్డు, ఎలుగుబంటి, మన నిఘంటువులలో వెలుగ్గొడ్డు (బ్రౌణ్యము. పు. ౯౭౨), వెలుగుబంటి (విలియం బ్రౌను నిఘంటువు, పు ౩౪౮, లక్ష్మీ నారాయణీయము పు. ౭౮౩; ఆంధ్ర వాచస్పత్యము పు. ౨౪౦౨.)వెలుగుమంటి (బ్రౌణ్యము: పు ౯౭౨) అని ఇట్లు వకారాదులుగా ప్రవర్తితమగుట మఱియొక నిదర్శనము. ఇచ్చట అజాది రూపమే ప్రాచీనము. తమిళమున ఎలు; తెలుఁగున ఎలుగు, ఎలువు, ఎల్గు, మధ్యద్రావిడ భాషలలో 'ఇలి'యను రూపములు ప్రసిద్ధములు. ఆడెలు - ఆడేలు, కుందెలు - కుందేలు, తోఁడెలు - తోడేలు, తాఁబెలు - తాబేలు, పొట్టెలు - పొట్టేలు మున్నగు జంతువాచక శబ్దములలోని ఉత్తర భాగములగు - ఎలు, -ఏలు అనునవి ఎలుగు శబ్దముతో వ్యుత్పత్తి సంబంధమును కలిగియున్నట్లూహించుట కవకాశము కలదు. కావున 'ఎలుగు,' 'ఎలుగుబంటి' అన్నరూపములే ప్రాథమికములని వెలుగుబంటి మున్నగు వకారాది రూపములు కృతక ప్రామాణికములని నిర్ణయించుట యుక్తియుక్తము.

మిశ్ర బ్రౌణ్యనిఘంటువున ఉట్టంకింపబడిన విరి పార్శ్వంబులు (< ఇరు పార్శ్వములు) వెంద్రకాయ (< ఎంద్రకాయ)లు కూడ కృతక ప్రామాణికములే.

## ఇఁక సాహిత్యవ్యవహారము నవలోకింతము

౧. వెకచెకాలు < ఎకసక్కెములు. పరిహాసపు మాటలు. 'కిరీటితో వెకచెకాలాడుటకు రంగనాథము పిలిచెను. ఇంతలో సుమాపతీ సాఽథులు వచ్చిరి. వెకచెకాలు పోయి ప్రత్యక్షముగా సారథిని లొచ్చుపఱుచుటకు దాను ప్రయత్నము చేసెను.' (విశ్వనాథ సత్యనారాయణ, తెఅచిరాజు పు. ౨౭౫) "వాడిపని పట్టిస్తాను. నాతో వెకాస్యాలా,... వైదీకపగుఁటడి వెకాశ్యాలు నిజం అనుకుంటా వేవిఁటి ?" (గురజాడ అప్పారావుగారి కన్యాశుల్కములో రామప్పంతుల సంజాయిషీ వెకిలి + హాస్యాలు వెకాశ్యాలు అను రీతిలో ఇది ప్రయోగింపబడినదా?) ఇక్కడ "ఎకసక్కెము" అనునదియే ప్రాచీన రూపము. తమిళములో ఎక్కచ్చెక్కమ్; మలయాళములో ఎక్కచ్చెక్కమ్, ఎక్కచ్చెక్కు; కన్నడమునందు ఎకసక్క, ఎక్కసక్కి ఎకిసక్కె; తుళుభాషలో ఎక్కచక్క అను వాడుకలు ప్రసిద్ధములు.

౨. వెడము < ఎడము. అవకాశము, సందు. ''వెడమువెట్టకరావె ప్రియుఁగూర్పుమని రంభకిచ్చకమ్ములు పల్కి తెచ్చు విటులు'' (శ్రీరంగ. ౧౦-౫౮) తెలుఁగు నందలి ఎడ (= చోటు) ఎడపక, ఎడసు, ఎడము, ఎడయు మున్నగునవి "ఎడయు" ధాతు సంబంధులు. ఎడము అనఁగా అవకాశము, స్థలము, సందర్భము. అవి యర్థములు. ఎడమచేయి అనఁగా ఎడముఁగా నుంచవలసిన చేయి. కుడిచేయి = కుడుచు (భోజనము చేయు) చేయి. తమిళములోని ఇటమ్, మలయాళములోని ఇటమ్, ఎటమ్, కన్నడములోని ఇడె, ఎడ, ఎడెరూపములు తెలుఁగునందలి 'ఎడము'నకు పరంపరా సంబంధులు. ఇక్కడ ఎడము ప్రామాణికము; వెడము కృతక ప్రామాణికము.

౩. వెన్ను < ఎన్ను. వరిమొదలగువాని కంకి. 'కమలగర్భంబు లింతిజంఘలకు నోడి వేగఁ దృణమూని తలవంచె వెన్నుఁజూపి' (రుక్మిణీపరిణయము ౪-) 'వెన్నుచూపి తృణంబూని యెన్నరాని' (రసిక పు. ౧౦౧) 'చెఱకువెన్ను

పుట్టి చెఱుపదా తీపెల్ల' (వేమన) 'చెఱకుతుదవెన్ను పుట్టిన చెఱకున తీపెల్ల చెఱుచు (సుమతి) 'జొన్న వెన్నువిడుస్తూ వున్నది' (విలియం బ్రౌను నిఘంటువు' పు. ౩౪౬) 'వరివెన్ను దీసినది' (బ్రౌణ్యము పు. ౮౨౧) 'మన్నువెళ్ళకుండా దున్నితే వెన్నువెళ్ళకుండా పండును' (గెలెటి పు ౩౮౨) మధ్య ద్రావిడ భాషలలో నీపదము చ/శ కారాదిగాఁగన్పట్టు చున్నది. కోలామి, పర్జి భాషలలో వరికంకి అను నర్థమున. 'చెన్' పదమును, గదబభాషలో నదే యర్థమున 'చెన్ను' అనుపదము, జొన్నకంకి అను నర్థమున గోండి నాయకీ భాషలలో 'శెన్' అను పదమును వాడుకలోనున్నవి. ప్రాచీన మూలద్రావిడ భాషలోని పదాది చకారము మధ్యద్రావిడ భాషలలో లోపింపలేదు. తెలుఁగునందును, తమిళ, కన్నడ మలయాళాది దక్షిణ ద్రావిడ భాషలందును మూలభాషలోని చకారము చెదరు చెదరుగా లోపించినది. ఇట్లు మూల ద్రావిడభాషలోని పదాది చకారము లోపింపఁగా నేర్పడిన రూపమే సస్యాదిమంజరియను నర్థముగల తెలుఁగునందలి 'ఎన్ను'. దీని కృతక ప్రామాణిక రూపమే మన చర్చలోని 'వెన్ను'. వీఁపు అను నర్థముగల 'వెన్ను' దీనికంటెభిన్నము. తెలుఁగునందలి ఆకలి ఇచ్చు, ఉప్పు మున్నగు దేశ్యపదములు పదాది చకారలోపము వలన రూపొందినవే.

౪. వెంపలి < ఎంపలి. చింతాకువంటి ఆకు గల చిన్న అడవిమొక్క, బాణపుంఖి. 'మద్దులు మునింగి పాఱ వెంపళ్ళు తమకెంత బంటియనుట' (ఉ. హరి. ౪౧-౨౪) జిడ్డు వెంపలి, పెద్దవెంపలి, ములు వెంపలి, వెలివెంపలి మొదలయిన వెంపలి భేదములు బ్రౌణ్యము (పు. ౮౬౫) లో ఉదాహృతములు. హంస వింశతి కావ్యమునందును 'జిల్లేడు వెంపలి జిడ్డు వెంపలి... ములు వెంపలి....' (౪౪౦) మొక్కలు పేర్కొనఁబడినవి. కాని 'ఎంపలి' యను అజాది రూపమే ప్రాచీనము. కన్నడమునందు ఎంపలియే కలదు. 'ఏనుఁగు చిక్కనేని మఱి యెంపలి చెట్టునఁగట్టి వచ్చునే'. (ద్వా. ౧౧-౨౭) 'లంపటఁ బడఁగఁదాళ్ళకుఁ దలబంటి యెంపటి చెట్లకు నికనెంతబంటి' (ద్విపద పరమయోగి విలాసము పం. ఆ. పు. ౩౬౧) ఈ నిర్ధారక ప్రయోగములనుబట్టి గూడ నిది అజాది రూపమని నిర్ణయించుట యుక్తి యుక్తము.

౫. వెసరు < ఎసరు. వంటకొఱకు కాచెడినీరు. 'దేశకాలపాత్రములు గుర్తించక పెద్ద కుండకు వెసరుపెట్టి....' (ఆర్. వెంకటేశ్వరరావు, పుట్టపర్తి

సాహిత్య విమర్శ, పు. ౭౮). 'తలకు మీఱిన పనికి పూనుకొనుట' అని ఇందలి జాతీయమున కర్థము. ఇచ్చట 'ఎసరు' అను అజాది రూపమే ప్రాథమికము. తెలుఁగున అత్తెసరు, ఎసటికుండలు, ఎసటిపోఁతలు అని వ్యవహారము. తమిళ మున 'ఎచర్' కన్నడమున ఎసర్, ఎసరు, కొలామి నాయకీభాషలలో ఎసర్ అనురూపము లుండుటచే అజాది రూపమే ప్రాచీనమని స్పష్టపడుచున్నది.

౬. వేట < ఏట. దేవతకు బలి యిచ్చుటకై, ఏర్పఱుపఁబడిన మేఁక పోతు. 'వెలయన్ వేటలు బోనముల్ సిదులుగావించెన్ సుతోత్పత్తికై' (హంస ౨-౯౨) 'వేటయనుమేషమ్మగయలు వెలయుచుండు' (ఆంధ్ర భాషార్ణవము. ౩-౫౮) నిఘంటువులలో వేటయను వకారాది రూపము కూడ గ్రథిత మొనర్పఁ బడినది. (చూ. విలియం బ్రౌను. పు. ౩౪౯; బ్రౌణ్యము ౯౭౯: శ. ర. ౧౦౨౨. లక్ష్మీనారాయణీయము. పు. ౭౮౫; ఆంధ్ర వాచస్పత్యము, పు. ౨౪౦౬; సూ. ని. ౬-౫౩౭) ఏట యను అజాది రూపమునకు ప్రాచీన ప్రామాణిక ప్రయోగములు గలవు. 'ఏట వెంట్రిక తన కీళ్వమందనుచు' (బసవ పు. ౪-౪౧౭) 'ఏట వెంట్రికయుఁదానిల లింగమయ్యె' (పండితా దీక్ష. పు. ౫౩) ఏటకు ఏడి, ఏడిక – యను రూపాంతరములును గలవు. 'శరభసింహ వ్యాఘ్ర సత్త్వచయంబుల నేడిక లెట్లట్లయెక్కియాడి' (భారత. ద్రోణ. ౨-౭౧౦) ఇఁక సోదర ద్రావిడ భాషలలోని జ్ఞాతి పదములను పరిశీలింతము. తమిళము. ఆటు, యాటు = గొఱ్ఱె; ఆట్టాళ్ = గొఱ్ఱెల కాఁపరి; మలయాళము. ఆటు = గొఱ్ఱె. ఆట్టుకారన్ = గొఱ్ఱెలకాపరి; కన్నడము, ఆడు; తుళు; ఏదు; ఈ వేట పదింపుక మనుట దుర్బలయుక్తి. వెంపలి. వేట–లు ప్రాథమిక రూపములనియు ఎంపలి. ఏట–లు పరిణత రూపము లనియు తెనుఁగు వ్యాకరణ వికాసము (ప్రథమ సంపుటము పు. ౧౨౫) నిర్ణయించుట చింత్యము.

## 6. అజాది పదములు హకారాదులగుట :

హకారాది పదముల తొలివర్ణము లోపించి (deaspiration) అజాది రూపములగుట తెలుఁగున సర్వ సాధారణమగు ధ్వని పరిణామము. హనుమఁడు- అనుమఁడు, హరుసము-అరుసము, హళది–అళది, హితవు – ఇతవు మున్నగు తద్భవములయందును, కన్నడనుండి తెలుఁగులో ఎరవు పదములుగా ప్రవే శించిన హజ్జ-అజ్జ, హత్తు-అత్తు, హదను-అదను, హసాదు-అసాదు, హాళక్కి-

—ఉక్కి, హెగ్గడె-ఎగ్గడి, హేరాళము—ఏరాళము, హొసపరి—ఒసపరి, హోళిగ—ఓళిగ ఇత్యాది పదయుగళములందును, అన్యదేశములయిన హకీము - అకీము, హజారము — అజారము, హుమ్ముంజి - ఉరుముంజి మున్నగువానియందును పూర్వోక్త ధ్వని పరిణామము ప్రవర్తితమగుట ప్రస్పష్టము. మీఁది జంట పదములలో అజాదులకు హకారాదులు ప్రాచీన రూపములు; సమీపమాతృకలుగూడ. ఇట్లు అనేక అజాది రూపములకు హకారాది రూపములుండు సాదృశ్యమును పురస్కరించికొని నిసర్గముగా హజాదులగు కొన్ని పదములకు కృదకముగా హకారాది రూపములు కల్పింపఁబడినవి.

హకారాదులగు నిట్టి కృతక ప్రామాణిక రూపములు ఇతర భారతీయ భాషలలోను లేకపోలేదు. మచ్చునకు కొన్నింటి ముచ్చటః అర్ధమాగధీ ప్రాకృతమున హొట్టాయనఁగా పెదవి. ఇది సంస్కృతమునందలి ఓష్ఠశబ్దమునకు వికృతి. విశిష్టమగు ఈ ధ్వని పరిణామరీతిని వరరుచి. హేమచంద్రుఁడు. క్రమదీశ్వరుఁడు మున్నగు ప్రాకృత భాషా వ్యాకర్తలు గుర్తించిరి. దీనిని హకారము యొక్క (Prothesis) వర్ణాదిత్వము - అని పిషెల్ మహాశయుని పరిగణనము. (*R. Pischel, Comparative grammar of Prakrit Languages, Para 338). మహారాష్ట్రి ప్రాకృతము నందును ఓష్ఠ శబ్దవికారముగా హోట్ట ప్రామాణికరచనములలో ఉపయుక్తము (చూ. పాఇఅ సద్ద మహణ్ణవో, పు ౧౧౯౯.)

తులసీదాసు, మాలిక్, మొహమ్మద్ జాయసీ. నూర్ మొహమ్మద్ మొదలయిన ప్రసిద్ధకవులు కావ్యరచనోపయోగిగా స్వీకరించిన అవధీ భాషలోఁ గూడ నీ ధ్వని పరిణామము ప్రవర్తితము. 'సుతహిరాజ్ రామహి. బనబాస్. దేహులేహు సబ్ సవతి హులాసూ' అని తులసీదాసు ప్రయోగము. 'తజమన చింత బడ్ హోవ. హులాసు' (త్యజించు చింతను పెంచు ఉల్లాసము) అని నూర్ మొహమ్మద్ అభిభాషణము. 'హులసీ లంక్ లంక్ సతమ్ లసీ'— పద్మావతీ కావ్యమున మాలిక్ మొహమ్మద్ జాయసీ ప్రయోగమిది. అవధీ భాషలో ఓష్ఠ శబ్ద భవముగా హోఁఠ్ అను పదమున్నట్లు పరిశీలకుల నిర్ధారణము- ( ** Baburam Saksena, Evolution of Awadhi, P, 109 )

మైథిలీ భాషలో సహితము హాక్రోస్ < ఆక్రోశ-,హులాస్ < ఉల్లాస రూపములు వ్యవహారములో నున్నట్లు తెలియుచున్నది. ( * Subhadra Jha, The Formation of Maithili Language, London. 1958, P. 192).

బంగాళీభాషయందును హాభిలాష్ < అభిలాష: హరితా < అరిష్టా; హాకులీ < ఆకుల; హుల్లాస్ < ఉల్లాసవంటి కృతక ప్రామాణికములు వాడుకలో నున్నవి

హిందీలో హులాస్ = ఉల్లాసము, ఆహ్లాదము, హులాసీ = ఉత్సాహి (శబ్ద సాగర్, పు. ౩౮౩౨) హోఁఠ్ = ఓష్ఠము (హైది, పు. ౩౮౪౧). మరాఠీ భాషలో ఓష్ఠ శబ్దభవమగు హోఁటా, హోఁటాళీలు వాడుకపడినవి. గుజరాతీలో హులాస ప్రయుక్తము. (M. B. Belsare, Gujarati - English Dictionary, P. 842).

తెలుఁగునకు సజాతీయభాషయగు కన్నడమునుండి ధ్వని పరిణామము లాక్షణిక సమ్మతిని బడయుట విశేషము. 'పదాదె యందలి అత్వమునకు .... హత్వమాపాదితమగు' నని కర్ణాట భాషాలాక్షణికుఁడగు కేశిరాజు తన శబ్దమణి దర్పణమున 'ఆదియొళిర్ద్దత్వక్కం...హత్వమాపాదితమక్కుం', (సూ. ౨౬౯); అని నిరూపించినాఁడు. ఈతఁడే తన కృతి యందలి అపభ్రంశ ప్రకరణమున అగ్నికి 'హగ్గి' యను తద్భవమును సూచించుట గమనింపఁదగినది. చీల్చు, విదారించు అను నర్థములుకల తెలుఁగునందలి 'ఒడియు' క్రియాధాతువునకు కన్నడమున జ్ఞాతిరూపమగు 'ఒడె' యను రూపమునకు 'హొడె' యను కృతక ప్రామాణికరూపము సలక్షణభాషలో ప్రయోగింపఁబడినది. కన్నడమున 'హడప' అనఁగా చిన్నసంచి, 'హడపగార' 'హడపిగ, అనఁగా అడపమువాఁడు. 'హడపవళ' 'హడపాళి' అనఁగా అడపగత్తె. ఈ పదములన్నియును కన్నడమున కృతక ప్రామాణిక రూపములు. ఇవి సహజముగా అజాదులు. కన్నడము అడకి, అడికె = పోకచెక్క; అడకొత్తు, అడకోతు అడగత్తి = అడకొత్తు, తమిళము అడైప్పై = తాంబూలపుతిత్తి; అడై = తమలపాకు; పై = తిత్తి, పొది; మలయాళము. అడప్ప = తాంబూలపుసంచి: తెలుఁగున అడప, అడపగత్తె, అడపము వాడు, అడకత్తెర, అడకొత్తులతోపాటు 'హడపము' కూడ ప్రచురము; ఇది కన్నడమునుండి ప్రతిదేయము. అర్ధమాగధీ ప్రాకృతమునందును, దేశీ ప్రాకృతమునందును తాంబూలపాత్ర, ఆభరణకరండము అను నర్థములతో వాడుకపడిన 'హడప', 'హడప్ప' రూపములు కర్ణాట భాషాప్రభావ సూచకములు (చూ. అభిదాన రాజేంద్రః, సప్తమభాగః, పు. 1173).

ఇఁక తెలుఁగువైపు చూచినచో తత్సమములు, తద్భవములు. దేశ్యములు, అన్యదేశ్యములు అను భేదములతో నిమిత్తములేక అన్నింట నీ కృతకప్రామాణికరీతి ప్రవర్తితము. ఇట్టి హకారాది పదములు అన్యత్ర[1] విపులముగా వివరింపఁబడి యుండుటచే ప్రకృత చర్చలో అందలి సారము మాత్రము సంగ్రహితము.

హఁశ (<అంశ), హంశము (<అంశము), హాశ్చర్యము (<ఆశ్చర్యము). హిద్ధమ్మున్[2]వు (<ఇద్ధమున్వు), హీర్ష్య (<ఈర్ష్య), హీస్వార వరప్రసాదుఁలు[3] (<ఈశ్వర వరప్రసాదులు) మున్నగునవి తత్సమముల మీఁద నేర్పడినవి. హక్కసు (<అక్కసు <ప్రాకృత. అక్కోస> సంస్కృత. ఆక్రోశ–). హారతి (<ఆరతి <ప్రాకృత. ఆరత్తియ <సంస్కృత, ఆరాత్రిక–) ఇవి తద్భవముల మీఁద రూపొందినవి. హడలు (<అడలు = బెదరు, భీతి) పులహోర(<[4](పులియోర, పులి + ఓరెము పులియోగిరము = పులుసు మొ॥ కలిపిచేసిన యన్నము; 'పులిహోర' కొందఱ కిష్టము). హిరువది[5] (<ఇరువది), హౌర (<ఔర)—ఇవి దేశ్యపదముల మీఁద కల్పింపఁబడినవి. హుడయరు[6] (<ఉడయర్) తమిళపదమునకు వికృతి. హెచ్చరిక (<కన్నడ. ఎచ్చరికె) అన్నది కన్నడపదము నాశ్రయించి అవతరించినది. శ్రీ చిలుకూరి నారాయణరావు గారు ఆదిహల్లోపమునకు లక్ష్యములుగా ఎచ్చరిక, ఎచ్చరికించు, ఎచ్చరించు లను ఉదాహరించుట. (ఆంధ్రభాషా చరిత్రము, సంపుటము 1, పు. ౨౮౬) అవిచారమూలకము. హెచ్చరిక, హెచ్చరికించు, హెచ్చరించు–లు

---

1. హకారాది పదములు, ఆంధ్రప్రదేశ్ పత్రిక, 1964 మే పుటలు 17–19.
2. దక్షిణ హిందూదేశ శాసనావళి సంపుటము 5, సంఖ్య 50.
3. పైది.
4. చక్కెర పొంగలితోపాటు తెలుగువారి పులిహోర కూడ హిందీవారి నోటికి హితవయినది. (చూ. హిందీ శబ్దసాగర్, పు, 2162)
5. దక్షిణ హిందూదేశ శాసనావళి, సంపుటము 5, సంఖ్య 50. పదిహేను (<పదియేను) పదిహైదు (<పదియైదు), పదహారు (<పదియారు), పదిహేడు (<పదియేడు) అను హకార ఘటిత రూపములు కూడ వాడుకలో ప్రచురములు.
6. పైది.

క్రమముగా వీనికి కృతక ప్రామాణిక రూపములేగాని యథార్థ రూపములు కావు. ఇంత రగడ చేసి 'పదాదిహల్లోవ హలాగమములలో నేది కలిగెనో యింకను విచారింపవలసి యున్నది.' (పై ది. పు. ౨౮౦) అని చిలుకూరివారు చివరి మాటలో తేలిపోవుట చింత్యము.

హంవీఁరుడు(< మారాఠీ. అమీర్ < పారసి.అమీర్) హస్తిఖారము(< పారసి. ఉస్తువార్ = పునాది) హిజారు (<పారసి ఇజార్ = చిన్నలాగు)హిరాకి (<పారసి, ఈరాక్ = దేశనామము) హిరాణీ (<పారసి. ఈరానీ = ఇరాన్ దేశసంబంధి) హూజుబెక్ (<పారసి. ఉజ్‌బెక్ = ఉజ్‌బెక్‌స్థాన్) — ఇవి అన్య దేశ్యములపై ఏర్పడినవి. 'హింగ్లీజు' అన్నది 'ఇంగ్లీషు' అనుమాటకు కృతక ప్రామాణికము.

సర్వజ్ఞులమని విఱ్ఱవీఁగు మన యేమఱపాటును దెలుపుట కివి చాలు. 'శేషంశిష్ట ప్రయోగిత్వాత్' అని తృప్తిపడకుండ జిజ్ఞాసువులు ధీరమతియుతుల తోడ విచారముసేసి తత్త్వము నెఱుఁగుట మేలు.

'అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చయత్ స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే.'

---